షవలనఁ గలిగిన దనుటకు వలనుపడదు. మాతృభాషాభిమాన మున్నంతమాత్ర మున నీయత్యద్భుత మైనప్రమోద ముద్భవ మగుట యసంభవము. మనభాష యందు సహజముగఁ గలసుగుణమఃశీగణమే దీనికిఁ గారణము. వివిధభాషాకోవి దుఁడును, విద్వాంసుఁడును, మహాకవియు నైన కృష్ణదేవరాయమహీపాలుఁడు "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని పొగడినాఁడు. శ్రీనాథకవిసార్వభౌమ కృత మని కొందఱచే నెన్నఁబడు క్రీడాభిరామమున నీక్రిందిపద్యము గలదు.

"ఆ. జనని సంస్కృతంబు సకలభాషలకును, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద, మెచ్చుటాఁడుబిడ్డ మేలు గాదె?"

పైనుదాహరింపఁబడిన విద్వత్కవుల యభిప్రాయము లాంధ్రభాషయొక్క యాధిక్యము నొకింత తెలుపుచున్నవి. ప్రాచ్యఖండమునందలి భాషలలో నెల్లఁ దెలుఁగు మిగుల శ్రావ్య మైన దని శ్లాఘింపఁబడి జగద్విఖ్యాత మైనది.

మన సత్కావ్యము లవశ్యపఠనీయములు. అవి యాంధ్రభాషామోష కమాల్యము లైనయలంకారములు. వీనిశైలి రసోచితమై ధారాశుద్ధి గలిగి వ్యర్థ పదరహిత మై శబ్దార్థాలంకారములతో శోభిల్లుచుండును. ఇవి యనల్పము లగు కల్పనలతో విలసిల్లును. స్వభావవర్ణనశోభితములు; వర్ణనలు సందర్భశుద్ధి గలవి. తెలుపవలసినభావ మంతయుఁ గొలఁదిపదములలో నిమిడియుండును. వర్ణనాంశ ము, కంటియెదుటఁ బటము గట్టినట్లు లుండి హృదయమున ముద్రిత మగును. రసము పొంగి పొరలుచుండును. చదువఁ జదువఁ జవు లూరుచు నెంతకును దనివి తీఱదు. అసాధారణకవితాసుధారసధారల మాధుర్యము మన యుల్లములఁ బల్ల వింపఁ జేయును. ఈయానంద మనుభవైకవేద్య మై యనిర్వచనీయ మైనది. ఈ పుస్తకములఁ జదువుటవలన మన కనేకలాభములు గలవు. ఇవి ప్రాపంచికవ్యవ హారములవలనఁ గలుగువిచారముల నింతక మఱపించుచు హృదయాహ్లాద మాపాదించును. విశ్వేశ్వరుని సృష్టియందలి చిత్రవిచిత్రములను జమత్కారముగాఁ జిత్రించును. జనసామాన్యమునకుఁ దేటతెల్లముగఁ దెలియనిమనుష్యస్వభావము లతో సంబంధించిన రహస్యవిశేషముల విశదపఱుచును. వివిధస్వభావములు గల మానవుల చిత్తవృత్తులు వేర్వేఱుపరిస్థితులయందు దేయేగతులఁ బరివర్తనముఁ జెం దునో యాయారీతుల వ్యక్తీకరించును. "రవి గాననిచోఁ గవి గాంచు" నను నా ర్యోక్తి సత్యము. ఇవి ప్రజలకుఁ బ్రయోజనకారు లనుటకు సందియము లేదు. సద్ధర్మబోధకము లై మనలను నీతిప్రవర్తకులుగఁ జేయుశక్తి వీనికిఁ గలదు. పరమ

పవిత్రము లైన మన యుపనిషత్తులు మొదలుగాఁ గల యుద్గ్రంథములయందలి వేదాంతవిద్యను విదితముచేసి మనలను విజ్ఞానవంతులుగఁ జేయ సమర్థములు. భగవద్భక్తితత్త్వమును మనచిత్తముల నత్తునట్లు మనోహరరీతిని వర్ణించి మనకు మహోపకారము నొనర్చును. ఇవి యైహికాముష్మికముల కత్యంతావశ్యకమైన యంశములు. ఇట్లు బహుభంగుల ఘనమైన లాభముల నొసంగు భాష గల మన భాగ్యమే భాగ్యము! ఇట్టి సర్వోత్తమము లైన ప్రబంధములను మనకుఁ బ్రసాదించిన కవివతంసులు సర్వదా వందనీయులు. సర్వేశ్వరానుగ్రహమున మన సారస్వతము దినదినాభివృద్ధి నొంది భాసిల్లుఁగాత! ఆంధ్రసాహిత్యపరిషత్తు తగిన ప్రోత్సాహము నొసంగి కృతకృత్య యగుఁ గాత!

---

# నేఁటి తెలుఁగు.

— మహారాజా శ్రీ విక్రమదేవవర్మబహద్దరుగారు, విశాఖపట్టణము. —

---

తెలుఁగుబాసయందుఁ బొత్తములును బత్త్రికలును హెచ్చుగాఁ బెరుఁగుచుండుటవలనఁ దెలుఁగుఁబలుకుఁజెలియొడలు బలియుచున్న దనక తప్పదు. కాని- యాబలుపునకుఁ గారణ మారోగ్యము గాక, శోఫరోగ మగుట గడు శోచనీయము.

సజీవనిర్జీవయుక్తం బగుజగంబు నియమయుతం బయి విలసిల్లుచుండుటవలన నియమ మత్యావశ్యక మనుట యతిశయోక్తి గాదు. అట్లుండ విజ్ఞులు నియమమును విడనాడుట యసమంజసము.

ప్రవర్తననియమమును స్మృతి విధించునట్లు భాషానియమమును వ్యాకరణము శాసించెడిని. కనుక వ్యాకరణవిరుద్ధపదములతో వెలయుకైత గర్హితమ యగును. నాణెము లగుబాసలయందు మిన్న యని యెన్నంబడు తెలుఁగుబాసకు సమగ్ర మగువ్యాకరణము నేఁటికిని లేకుండుట మిక్కిలి శోచ్యము. వ్యాకరణ మసమగ్ర మనునెపముచేత నున్న నియమములను మీఱుట యుక్తము గాదు. తగుకొంప లేనివాఁడు దానిని బాగుసేయ యత్నించును. అట్లొనర్చుటకు వలను పడదేని, యుండె నెట్లో వసియించును. అంతేకాని సన్న్యసించి వెళ్లఁడు గదా.

పూర్వకవులపుస్తకములందుఁ గొన్నిస్ఖాలిత్యము లక్కడక్కడఁ జూపట్టును. అట్టివానిని సంస్కృతభాషలో మహాకవిప్రయోగము లందురు. అవి యనుసర్తృఁ బ్రయోగానర్హములు.

ఇప్పటికవులలోఁ గొందఱు పట్టుపట్టి యున్ననియమముల నతిక్రమించి భాషను బాడుసేయుచున్నవారు. మఱికొందఱు వచించునట్లు వ్రాయవలె ననుచున్నవారు. అట్లనుట దగదు. " తాటాకు " మొదలగుమాటలను బరికింపుఁడు. ఇంకఁ గొందఱు వాడుకమాటలు గ్రాహ్యము లనుచున్నవారు. అవి యొకతీరుగా నుండవు. చేశాడప, చేశాడట, చేయటం, చేయడం ; చేస్తున్న, చేస్తూన్న, చేస్తోన్న ; చేస్తాడు, చేస్తడు ; చెయ్యాలే, చెయ్యాల ; మొదలగుమాటలను గమనింపుఁడు. శత్రర్థకమునకు " ఉన్న " ప్రత్యయము సేర్పంబడుట వర్తమానార్థకనియమము. అట్లగుటవలన " చేయుచున్న " యని యేర్పడినపదమును " చేస్తున్న " యనియు నూఁది పలుకునపుడు " చేస్తూన్న " యనియు సాధారణ

జనులు వచింతురు. "చేస్తోన్న" యని యేల పలుకఁబడునో తత్కారణము మృగ్యము. మఱియు నిప్పటివ్రాఁతలందు "ప్రతివాడు, దృఢనమ్మకము, నిజానిజములు" మొదలగు ననేకదుష్టసమాసములును, వివరణమునకు మాఱుగా "వివరము" బాగుగా లేక లెస్సగా లేక యుక్తముగా ననుటకు బదులుగా "జయప్రదముగా" మొదలగువిరుద్ధార్థబోధకశబ్దములును గననగును. కొందఱు వ్యావహారికభాషనే మేము వాడువార మనుచు "వాడు ఉన్నాడు" "వాడు వున్నాడు" అని వ్రాయుదురు. కాని- వారు వ్రాయునట్లు వ్యవహరించువా రేరును లేరు. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నింటిని మాత్రమె యి ట్లుదాహరించితిని. ఇట్టి వెన్నియో యిప్పటివారివ్రాఁతలందుఁ గనుఁగొనఁనగును. అవి గ్రాంథికములు కాని వ్యావహారికములు కాని కాక, వికారరూపములె యగును.

అశ్లీలములు దూష్యము లనుచుఁ జాటువారివ్రాఁతలందును, నాట్యస్థానములందును "సినీమా" లందును నాలింగనచుంబనాదులు గనన య్యెడిని. అట్టిప్రదర్శనములు నింద్యము లగునుగదా.

"వాఁడు" యొక్కయు "అవి" యొక్కయు ద్వితీయావిభక్తిరూపము "వానిని". కనుక విభేదము కొఱకు "అవి" యొక్క ద్వితీయావిభక్తి "వాటిని" అని వ్యవహరించుట యుక్తము. "అయితే" "కూఁతురును" మొదలగుకొన్నిరూపములు గ్రాహ్యము లని నాయాశయము. భాషాభిమానము గలపండితులు ద్వేషశూన్యులయి యొకచోటఁ గూడి గ్రహింపఁదగు రూపములను నిర్ణయింపవలెను; మఱి యవ్వియె వాడఁబడవలెను. అట్లు కానిచోఁ దెలుఁగుబాస కోదుబాసకంటె నీచతర మగును.

---

# ఆంధ్రాంకములు.

— శ్రీరాజా పానుగంటి పార్థసారథిరాయనింగారు, బి. ఏ. పానగల్. —

మహాశయులారా! ఆంధ్రభాషాభిమానులారా! మాతృభాషాసేవకులారా! ఆంధ్రాక్షరములను గుఱించి యింతకుముందు వ్రాసియుంటిని. ఇప్పు డాంధ్రాంకములను గుఱించి కొన్నియంశములను నాకుఁ దోఁచినభావములను నభిప్రాయములను దెలుప నుద్యమించుచున్నాను. సావధానముగ వానిని జిత్తగింప మిమ్ములను సవినయముగఁ బ్రార్థించుచున్నాను.

పరమాత్మ యొక్కటి తప్ప మఱొక్కటెక్కడఁ గానియెప్పుడు కాని లేదనియు నాబ్రహ్మస్తంబపర్యంతము సర్వము నాపరమాత్మస్వరూపమే యనియు నెటుక చాలమి మనకు వేఱువేఱుగా నగపడున వెల్లయు నాపరమాత్మాంశములే యని యద్వైతసిద్ధాంతము బోధించుచున్నది. లతాదులకును మనుజులకువలెనే స్పర్శాదులబాధల ననుభవించుగుణము గల దని బోసుగారు స్థాపించుచున్నారు. బాధల ననుభవింపఁగలిగినప్పుడు సుఖములను మాత్ర మేల యనుభవింపలేవు? ఈవాదము నింకఁ గొంత పెంచినఁ బ్రతిపరమాణువునందును జీవాంశము గలదనుటకుఁ గారణ మగుచున్నది. ఐనను మన కీలోకమున నానావిధములఁ గాన్పించు సర్వవస్తు సంచయమునందు ననేక తారతమ్యము లున్నవి. అందుఁ గొన్నికొన్ని గుణసామ్యములచేతను గొన్ని గుణభావములచేతను బ్రత్యేకగణములుగ భావింపఁదగియున్నవి.

ఇట్లు ప్రత్యక్షవృద్ధి గాని స్థానికచలన మైన లేని పాషాణాదిస్థావరములకును నాగుణములు గల లతాగుల్మాది యుద్భిజ్జములకును జాలఁ దారతమ్యము గలదు. అట్లే యుద్భిజ్జములకన్నఁ గ్రిమికీటాదు లెక్కు వైనవి. వానికన్న నుత్తమ గుణములు గలవి పశుపక్ష్యాదులు. ఇట్లన్నిటికన్న నుత్తమగుణములు గలిగినది మానవగణము.

మానవులకుఁ గలకొన్నియుత్తమగుణములును శక్తులును నీలోకమునందు మఱి యేవ్యక్తులకును లేవు. మనుజులకుఁ గలభావములును నూహలును వానిని మేళగించి యుపయోగించుకొను బుద్ధిపాటవమును శక్తియును మఱి వేనికిని నిట్లు లేవు. వానిని మఱిమఱి వృద్ధిపఱచుకొనుకొలఁది మనుష్యుఁడు క్రమక్రమముగ

మఱింత యుత్కృష్టపదవి కెక్కుచున్నాఁడు. ఇట్లభివృద్ధిఁ జెందుమానవులు మొదటినుండి తమభావములను నూహలను నభిలాషలను నొరుల కెఱుకపఱుపఁ బ్రయత్నింప నుంకించిరి.

మానవజాతి యీస్థితికి వచ్చినయప్పుడు వారియెదుట నున్న వస్తువులను నొకరొకరు చూపుకొనుచు వానిని గుఱించిన లోనిభావములను సంజ్ఞలచే నెఱుకపఱుప నుంకించుచు నవి తేటపడనితరుణమున నాప్రయత్నములో నవశము గ బయల్వెడలు కంఠధ్వనులసహాయమున వానిని వ్యక్తపఱచుచుండిరి. ఈకంఠధ్వనులే భాషాంకురములు. ఇవియే వస్తువులకును జర్యలకును నామము లయ్యె. ఇవి యెంతయు వృద్ధిఁబొంది కాలక్రమమున భాషగాఁ బరిణమించె.

ఇట్లేర్పడిన భాష యనేకవిధముల నభివృద్ధిఁ జెందను జెందను ననేకవస్తువులును భావములును నాభాషావ్యాప్తికి లో నగుటచేత వానిని లెక్కించుటయు నవసర మాయెను.

మొట్టమొదట వస్తువుల నిర్దేశించుటకు నెదుట నున్నవస్తువులనే చూపుచుండిరి. వస్తువుల జూపి వ్రేళ్లతో వానిసంఖ్యను దెలుపుచుండిరి. ఇట్లు చెట్టును జూపి యొక్క వ్రేలిని జాఁచి తక్కినవ్రేళ్లను ముడిచి యెదుటఁ బెట్టినంతట నది యొకచెట్టనుభావమునకు ద్యోతక మాయెను. ఇతరవస్తుసహాయము లేకయే వ్రేళ్లతోఁ జూపఁగలుగుటచేతనే వ్రేళ్లకును లెక్కకును నీస్వభావసిద్ధమును సహజము నైన సంబంధము ననాదిగాఁ గలిగి యున్నది. ఇప్పటికిని మన మొక్కొక్కతఱి లెక్కించునప్పుడు వ్రేళ్ల నుపయోగింతుము. అంకెల నాంగ్లభాష యందు 'డిజిట్స్' అందురు. 'డిజిట్' అనఁగా వ్రేలు. లెక్కించుటకును వ్రేళ్లకును ననాదిసంబంధము గల దనుటకు సందేహము లేదు.

కాలానుగుణముగ భాష యభివృద్ధి యై లిఖితరూపమును బొందఁజొచ్చినప్పుడు సంఖ్యలకును నామరూపము లేర్పఱుపవలసివచ్చెను. లిఖితరూప మైన భాషలో సంఖ్యల నిర్దేశింపవలసినప్పు డుపయోగించుటకుఁ గాను బలుమాఱు తటస్థించుచుండు సంఖ్యలకుఁ బ్రత్యేకసంకేతములఁ గావించుకొనిరి.

ఇందును వ్రేళ్లకును లెక్కకును గలసంబంధము ముందుకు వచ్చినది. ఒకటి యనుటకు వ్రేలినిబోలు నొకనిలువుగీఱను (1) నిలుపుచుండిరి. రెంటిని జెప్పుటకు నట్టినిలువుగీఱలను రెంటి నుపయోగించిరి. (11) అట్లే యెన్నింటిని దెలుపవలయునన్న నన్ని నిలువుగీఱలను వ్రాయునది. ఇప్పటికిని నక్షరము లెఱుఁగనివారు నిలువుగీఱలతో లెక్కను గుర్తింతురు.

రోమకసంఖ్యలలో మొదటినాలుగువఱకు నీపద్ధతి ప్రకారమే i, ii, iii, iiii అని వ్రాయుదురు. ఐదునకువచ్చినప్పుడు మాఱినట్లు తోఁచుచున్నది. ఐదునకు v వ్రాయుచున్నారు. ఇ దెట్లు వచ్చినదో తెలియదు గాని యిక్కడఁగూడ వ్రేళ్ల సంబంధ మున్నదా యని యూహింప సాహసించుచున్నాను. ఎట్లన మొదటి నాలుగుగీఱలును నాలుగువ్రేళ్లకు సరిపోయినవి. చూపుడువ్రేలు, నడిమివ్రేలు, నుంగరపువ్రేలు, చిటికెనవ్రేలు. iiii. ఐదునకు వచ్చినప్పుడు బొటనవ్రేలినిగూడఁ జేర్పవలసివచ్చినది. కనుక నది ||||| ఈయాకృతిని దాల్పవలసివచ్చెను. అయిన నీపద్ధతినే కడవఱకు నవలంబింపవలెనన్న గీఱలసంఖ్య యెక్కు వగుటచేత మిక్కిలి దీర్ఘ మగును. కాఁబట్టి దీనిని మార్చి సంఖ్య యతిదీర్ఘముగాకుండఁ గుదించుమార్గ మవశ్యము. మఱియు నొక్క చేతితోఁ జూపఁదగిన సంఖ్య వ్రేళ్లసంఖ్యనుబట్టి యైదు తోఁబూర్తి యగుచున్నది. కాన నీబొటనవ్రేలు చూపుడువ్రేలును గలసినరూపము గల v ను ౫ కు సంకేతముగాఁ జేసికొని దానిపైన మరల నిలువుగీఱలను జేర్చుటచేత ౬ మొదలైనవానిని vi మొదలైనవానిచే రూపించుట యుక్తముగాఁ దోఁచియుండవచ్చును. ఆవల జ్ఞానమును, భాషయును నభివృద్ధిఁ జెందుకొలఁది ననేకవిధము లైన మార్పుల కావశ్యకత కలిగి చేర్పఁబడియుండును. సందర్భోచితముగ నెప్పు డెప్పు డెట్టి మార్పులు గలిగినది నిర్దేశించుట చాలఁ గష్టము. కొన్నియంకెల కాయాభాషాలిపిలోని యక్షరసంకేతములే సంఖ్యాసంకేతములుగాఁ గూడ నిలిచియున్నవి. రోమకులలో ౧౦౦ కి 'c' ౧౦౦౦ కి 'm' నిలుచుచున్నవి. ఆభాగములో నూటికి 'సెంటు' వేయిఁటికి 'మిలి'యను నామము లుండుటచేత నాసంఖ్యానామముల మొదటియక్షరములే యాసంఖ్యారూపములుగఁ జేరియుండవచ్చును. అయిన మఱి కొన్ని యక్షరములు సంఖ్యారూపములుగ నెట్లు వచ్చెనో తెలియదు.

ఇట్లక్షరరూపములు సంఖ్యారూపములుగ నిలుచు సంప్రదాయ మితర భాషలలోఁ గూడఁ గలదు. అఱవమునందు సంఖ్యలసంకేతము లన్నియుఁ బ్రాయికముగా నక్షరరూపములనే పోలి యున్నవి. ఇంగ్లీషునందు మొదటియంకె 'I' అను మూఁడవయచ్చును బదిలోని సున్న నాలుగవయచ్చగు 'O'ను బోలియున్నవి. తెనుఁగున మొదటియంకె మొదటిసరళ మగు'౧'కారమును బదిలోని సున్నపూర్ణానుస్వారమును బోలి యున్నవి—

ఇంగ్లీషులో సామాన్యముగా వాడు నరాబిక్ సంఖ్యలలోఁ గూడ నిప్ప టికిని మొదటిసంఖ్యకు వ్రేలినిబోలు నొకనిలువుగీఅనే వాడుచున్నారు. నాగర లిపిలోఁ గూడ మొదటియంకె యొకనిలువుగీతే. విశిష్టమునకు లెక్కకును వ్రేళ్ల కును జాలసంబంధము గలదనుట మాత్రము స్పష్టముగాఁ జెప్పవచ్చును. దక్షిణ హిందూదేశమున మాత్రము వ్రేళ్లను బోలిన నిలువుగీఅల నంతగా వాడుటలే దు. అక్షరసంకేతములే కొన్నియంకెలుగా నుండుటయును దక్కినయంకెలు గూ డ నక్షరసంకేతరూపములనే యనుసరించియుండుటనుబట్టి లిపి ముందుగా నేర్పడి వృద్ధియైనతరువాత గణితము ప్రబలఁజొచ్చి యుండవలయు నని తోఁచుచున్నది.

సామాన్యముగ నభివృద్ధిఁ జెందియుండు నన్నిభాషలలోఁ గూడ నొకటి మొదలుగఁ బదివఱకు నొక్కొక్కసంఖ్యకు నొక్కొక్కసంకేతమే కలిగియున్నది. అంతకుఁ బైన లెక్కించునప్పుడే స్థానములకొలఁది పెక్కు లగురూపములు వాడఁ బడుచున్నవి. ఇందులకుఁ గారణ మేమిగా నుండనోపు ?

ఆదిపురుషకుటుంబ మింకను జెదరిపోక యొకటిగా నుండఁగనే పదివఱకు లెక్కింప నెఱిఁగి సంకేతముల నేర్పఱచుకొని యుండి యావలఁ గుటుంబము వృద్ధి యై భిన్నమై చెదరిపోయి నానాదేశముల నాక్రమించిన తరువాతఁ గూడ నప్ప టికి వారికిఁ గలిగియుండిన జ్ఞానమును బోఁగొట్టుకొనక పైన వృద్ధిచేసికొనుట చేత నీపద్ధతి యందఱకును సామాన్యముగ నిలిచి యుండవచ్చును. కాలదేశసం దర్భములనుబట్టి యాయాయంకముల రూపములు నానావిధములుగ మాఱినను బది వఱకు నొక్కొక్కసంకేతమును నిలుపుచుండిన సామాన్య మగుపద్ధతి మాత్రము మాఱక స్థిరముగా నాటుకొని యుండవచ్చును.

అట్లు కాకపోయిన నింకొకవిధముగ నిది సిద్ధించి యుండవచ్చును. జను లందఱు నొకటిగా నుండఁగనే యీలెక్కించునెఱుక కుదిరియుండలే దనుకొం దము. నానాదేశస్థులు వారివారికిఁ గలిగిన జ్ఞానాభివృద్ధినిబట్టి సందర్భోచితము లగు నాయాకాలములందు లెక్కింప నారంభించి యుండవచ్చును. లెక్కింప నారంభించినది యొక్కచోటఁ గాకపోవచ్చును. నొక్కకాలమునందుఁ గాకపో వచ్చును. అట్లయ్యును నెక్కడఁ గాని యెప్పుడు గాని మొట్టమొదట లెక్కింప నారంభించినప్పుడు వారి కాలెక్కను జూపుటకుఁ జులకనగా దొరకునవి చేతి వ్రేళ్లే యనుటకు సందేహ మేమియు లేదు. మొదట నైదువఱకును నొకచేతి యైదువ్రేళ్లను జూపి యంతకుఁబైనిఁ జూపవలసివచ్చినప్పుడు రెండవచేతివ్రేళ్లతోఁ

జూపుచుండుట బహుసహజమును స్వభావము నైసర్గికృత్యము. దీని నొకదేశస్థులు మఱియొకదేశస్థులవలన గ్రహించి యుండవక్కఱలేదు. ఇది ప్రతివానికిని స్వయముగాఁ బుట్టుతెలివి. కాఁబట్టియే యిది లోకమున నందఱకు సామాన్య మైన యేకపద్ధతిగాఁ దటస్థించినది. లోకమునందలి జనుల కందఱకును రెండు చేతులకుఁ బదివ్రేళ్లుండుట యెట్లు సామాన్యముగఁ దటస్థించినదో యట్లే యీపదివఱకుఁ గలుగులెక్క యొకఘట్టముగా నుండుటయు నింతవఱకును సంఖ్యలోను ముఖ్యముగా నైదువఱకు నొకతీరుగా నుండుటయు నీలెక్కకుఁ బ్రాయికముగా నొక్కొక్కయంకె యుండుటయుఁ దటస్థించినది.

ఈపద్ధతివిషయములో రెండుసందేహములు పొడమవచ్చును. వ్రేళ్లతో మొదట లెక్కించుటే దీనికిఁ గారణ మైనచోఁ జేతులవ్రేళ్లు పదితోడఁ గాళ్లవ్రేళ్లు పదియును జేరఁగా నిరువది యైనది, కాఁబట్టి, యిరువది దగ్గఱఁగదా ఘట్ట మేర్పడవలయును. అట్లుకాక యైదుదగ్గఱఁ గాని పదిదగ్గఱఁ గాని ఘట్ట మగుటకుఁ గారణ మేమి యని యడుగవచ్చును. చేతివ్రేళ్ల నెత్తి చులకనగాఁ జూపినట్లు కాలివ్రేళ్ల నెత్తి చూపఁజాలము. కాఁబట్టి స్వభావముగ మన సట్లు పోదు. ఒక్క చేతివ్రేళ్లమీఁదిలెక్క పూర్తి యైనతరువాత నింకను నిలిచియుండిన మరల నా చేతివ్రేళ్లనే త్రిప్పుట గాని లేక రెండవచేతివ్రేళ్ల నెత్తికొనుట గాని సహజముగాఁ దటస్థించును.

రోమకాంకములయం దిట్లె యున్నది. ఐదొకఘట్ట మైనది. దానికిఁ బైన వచ్చులెక్కయగు నాఱునకు నైదుతరువాత మఱియొకటి యనుటకుఁగా V+I=VI అని వేయుచున్నారు. ఆపల నైదునకు ముందు దగు నాలుగును గూడఁ గుదించి IIII కు బదులుగా నైదుకన్న నొకటితక్కువ యనుభావములో నెడమప్రక్క నొకటి వేసి ‘IV’ సంకేతమును గూడ వాడుచున్నారు. ఇట్లే పదికి ‘X’ సంకేత మేర్పడినతరువాత పదియగు‘X’సంకేతమునకు నెడమప్రక్క నొకటి వేసి పదికంటె నొకటి తక్కువ యనుభావముతో ‘IX’ గుర్తును దొమ్మిదిసంకేతముగా నేర్పఱచినారు. ఈపద్ధతినే కడవఱకు నవలంబించినారు.

రోమకాంకములలోఁ బదికి X అనునేకరూప మైన సంకేత మున్నది, గాని, యితరభాషలందుఁ బెక్కింట నట్లు కాక పదికి మొదటిసంఖ్య యగు నొకటిని వేసి దానికుడివైపుఁ జుక్కను గాని సున్నను గాని నిల్పుచున్నారు. వ్రేళ్లను జూపుటే యంకముల కాదిసాధన మయినంతటఁ మొదటి తొమ్మిదింటికి

వలెనే పదికిఁ గూడ నేకరూప మైనసంకేత ముండక ద్విరూప మగు సంకేతము రానేల యనియు నొకయాక్షేపము గలదు. దీనికి సమాధానము నిట్లూహింపఁ దగియున్నది. మొట్టమొదటఁ బదికి నిప్పుడు మనము నొకటికిఁ గుడివైపున నుంచుచుక్కయో, సున్నయో యొక్కటే సంకేతమై యుండనోపును. ఆవలఁ బదికిఁ బైన లెక్కింప నారంభించినప్పు డాలెక్కను బదిగుర్తు కుడివైపున నిలుపు చుండిరి. పదునొకటి యనఁగాఁ బదియు నాపై నొకటి ౦ + ౧ = ౦౧. ఇదియే బహురూపసంకేతముల కారంభము. ఇదియే గణితశాస్త్రాభివృద్ధికి మూలాధార మైన దశాదిస్థానసంకేతమున కారంభము.

ఇట్లు పదికి '౦' సంకేత మైనంతట దీని కెడమవైపున నొకటి '౧' చేరి యిది ౧౦ గా మాఱుటకుఁ గారణ మే మని యడుగవచ్చును. సున్న పదికి గుర్తై యుండఁగాఁ బైన లెక్కింపఁ బందొమ్మిదికి ౦౯ అయ్యె. అనఁగాఁ బదియు దానిమీఁదఁ దొమ్మిదియు నని భావము. ఇఁక నొకటిని జేర్ప నిరువది యైనది. దానిపై నొకటిఁ జేర్ప నిరువదొకటి యైనది. అనఁగా రెండుపదులును నాపై మఱియొకటి యని యర్థము. దీని నెట్లు గుర్తించునది? పదికిఁ బైన లెక్కించి గుర్తిం చుటలో రెండుచోట్లు లేర్పడినవి. ఎడమవైపుది పదిని దెలుపునదియుఁ గుడివైపు ది యొకటి మొదలగు తొమ్మిదివఱకుఁ గలలెక్కను దెలుపునదియు. ఇప్పు డిరు వదియొకటిని వేయుటకుఁ గుడివైపున ౧ నివేసిన నిరువదికిఁ బైని దగు నొకటిని దెలుపును. దానికి ముందుఁ బదులచోటున ౨ వేసిన నది రెండుపదులును నాపై నొకటియు నను భావమునుదెలుపును. అనఁగా నిరువదియొకటి యగును. అట్లయి న నిరువదిమాత్రమే వేయవలసినప్పుడు కుడివైపున వేయవలసిన సంఖ్య లేదు గాని యెడమవైపున ననఁగాఁ బదులచోటున మాత్రము వేయుటకు ౨ ఉన్నది. కుడివైపున, అనఁగా నొకట్లచోటున నేయంకెయు లే దనియు నెడమవైపునది పదులఁ దెలుపుసంఖ్య యనియు సూచించుటకుఁగాను బదికిఁ గుర్తైన సున్నను బెట్టిరి. కనుక నిరువదికి ౨౦ రెండుపదు లైనది. ఇట్లీపద్ధతి ననుసరించి ౧౦ ఒక పదియైనది. ౦౧ కి మాఱు ౧౦ వచ్చినది. '౧౦' కి '౦౧' వ్రాయుచుండినందుల కప్పటి శిలాతామ్రాదిశాసనములు దొరకిన నేర్పడవచ్చును. లేనంతటఁ గేవల మూహలను జేయఁదగియున్నది. ఈపద్ధతిప్రకారము పెరుఁగుకొలఁది నవసరము నుబట్టి నూఱులస్థానములు, వేలస్థానములు మొదలైన వేర్పడినవి. ఇట్లిక్కడ నంకె లేమిని సూచించుటచేత నీసున్నకు శూన్యార్థమును సూచించుభావము

సంభవించినది. ఈవిధమునఁ బదియంకెలతోడనే యెంతటిసంఖ్యనైన గుర్తింప నలవియైనది. ఇది కాలక్రమమున మిక్కిలి యభివృద్ధిని జెంది యొకప్రత్యేకశాస్త్రముగా నేర్పడినది. ఇదియే గణితశాస్త్రము. జ్యోతిషమునకును, ఖగోళశాస్త్రము లోనగు ననేకశాస్త్రములకు నీగణితశాస్త్రమే మూలాధారము. గణితశాస్త్రము సిద్ధాంతశాస్త్రము. దీనిసిద్ధాంతముల కితరప్రకృతిశాస్త్రములవలె నెప్పుడు గాని మార్పులేదు. ౨+౨=౪, భేదములేదు.

ఈగణితశాస్త్రము మనదేశమునఁ జాలఁ బ్రాచీనకాలమునందే మిక్కిలి యభివృద్ధిఁ జెందియుండినది. పాశ్చాత్యు లింకను లెక్కింపలేనిస్థితిలో నుండఁగనే యార్యులు గణితశాస్త్రమును మిక్కిలి యున్నతస్థితికిఁ దెచ్చియుండిరి. కొందఱీగణితశాస్త్రమును నరబ్బులవలనఁ బాశ్చాత్యు లాదిలో గ్రహియించి రందురు. ఐరోపాఖండమున నాగరకత చెందియున్న దేశములందును సామాన్యముగ వాడఁబడు తొమ్మిదియంకెలు సున్నకును నరబ్బీనామము లుండుటే యీయభిప్రాయమునకుఁ జాలమట్టుకుఁ గారణముగా నుండనోపును. అరబ్బులు స్పెయిన్ దేశమును జయించి యాక్రమించినప్పుడు వారు డీశాస్త్రము నక్కడఁ బ్రవేశపెట్టిరనియు నక్కడనుండి యది తక్కినదేశములకు వ్యాపించిన దనియు ననుచుండిరి, గాని, వెనుకటిశోధనములవలన నట్లు కా దనియు నార్యులలోనే గణితము మొదటఁ బ్రబలిన దనియు నేర్పడుచున్నది. ౮౧౩-౮౩౩ తురుష్కప్రభువు 'ఆల్‌మమూన్' కాలమునకు ముందు నరబ్బు లీగణిత మెఱిఁగినట్లు లేదు. అంతకుఁ జాలముందే యూరపులోని తూర్పుదేశములలో గణితము కొంత వ్యాపించియుండినది. 'పైథాగొరస్' శిష్యులలో వెనుకటితెగవారు దీనిని మనహిందూదేశమునుండి గ్రహించి ఇటలీదేశములోఁ బ్రవేశపెట్టి రనియు వారివలన నైరోపాప్రాచ్యదేశీయ విద్యావంతులు కొందఱు తెలిసికొనియుందు రనియు నూహింపఁదగి యున్నది. ఐన నీయంకెల యప్పటిరూపములకును నిప్పటిరూపములకు నేమాత్రము గాని పోలిక యున్నట్లు లేదు. అరబ్బులు 'గోబార్' అను నీయంకెలు ౭౬౦ సంవత్సరము ప్రాంతపు "ఆల్‌మన్‌సార్" ప్రభుత్వకాలములోనో లేక యావెంబడి ప్రభువులకాలములోనో 'బాగ్దాద్' లోఁ బ్రవేశపెట్టఁబడినవి గాని 'ఆల్‌మమూన్' ప్రభువుకాలమున కీవఁ గా దనుట నిర్ణయము. ఈ 'ఆల్‌మమూన్' కాలమునం దీగణితశాస్త్రము హిందూదేశమునుండి గ్రహింపఁబడి పర్షియాదేశమునఁ బ్రవేశపెట్టఁబడినది. ఈ 'గోబార్' అంకెలు గూడ నప్పుడే వచ్చియుండనోపును.

అక్కడనుండి యుత్తరపు 'ఆఫ్రికా' కును 'స్పెయిన్' కును నీగణితశాస్త్రపద్ధతి యు నంకరూపములును వ్యాపించినవి. స్పెయిన్‌నుండి యితరము లగు 'యైరోపా' దేశములకుఁ బదియవ శతాబ్దాంతముననో పదునొకండవ శతాబ్దారంభముననో వ్యాపించినవి. అంతకుముందు వాడఁబడుచుండిన పూర్వదేశాంకరూపములను అణఁచి యీ 'గోబార్' అంకెలు ప్రబలినవి. ఐన నంకరూపములకంటె శాస్త్ర జ్ఞాన మెక్కువవేగముగాఁ బ్రసరించుటవలన నంకములం దీరెండురూపములును గూడఁ గలసి కొంతకాలము వాడఁబడుచుండినవి. ఇట్లు ముప్పదిరెండునకు 'రోమ శాంకములు 'గోబార్' అంకములును గలసి XXX 2 (32) పదునాలు గను టకు X 4 (14) అని వ్రాయుట కానవచ్చుచున్నది.

విశిష్టమునకు గణితశాస్త్రము హిందూదేశమునందే యంకురించి ప్రబలి యావల నక్కడనుండి తక్కినదేశములకుఁ బ్రసరించి వ్యాపించిన ట్లున్నది. ఇతరదేశస్థుల కింకను మొదటినుండి లెక్కింపనే తెలిసితెలియక యుండుకాలములోనే మన దేశమున గణితశాస్త్రము మిక్కిలి యభివృద్ధిఁ గాంచి యున్నతస్థితికి వచ్చి యుండినది. గణితశాస్త్రముమీఁద నాధారపడు నితరశాస్త్రములు కూడ నెక్కువవృద్ధిఁ జెంది యుండినవి. ఖగోళశాస్త్రాదు లట్టివి. మనవా రప్పుడే గ్రహకూటాదుల గమనించి నిర్ణయించి సూర్యచంద్రాదుల గమనములకును దక్కినగ్రహకూటముల గమనములకును గలసంబంధముల గమనించి వాని యావృత్తికాలములఁ గనిపెట్టి లెక్కించి సూర్యచంద్రాదులగ్రహణములను రాఁగలవానిని సంవత్సరములకొలఁది ముందుగానే నిముసములు గూడ నెచ్చుతక్కువలు కలుగకుండ గణించి కాలనిర్ణయము గావింప సమర్థులై యుండిరి. అప్పుడు వారిజ్ఞానమును సామర్థ్యమును వృద్ధికాంచుటనుబట్టి శాస్త్రములు నిలువక వృద్ధిఁ జెందుచుండినవి. ఆవృద్ధి యింతవఱకు నట్లే జరుగుచుండినంతట నిప్పటి కింకెంతో యభివృద్ధమై యుండవలసినది. అట్లు కాక కొంతకాల మైనతరువాత, వేసవకుఁ జట్టుతగిలిన చెట్టువలెఁ బెరుఁగుట యంతయు నిలిచిపోయినది. ఇఁక నెండిపోవలసినస్థితికిఁ గూడ వచ్చినది. కాని యెండిపో లేదు. శాస్త్రాభివృద్ధి యంతయు నాఁగిపోయినది. కాని యింకను క్షీణించిపో లేదు. అంతటితో నిలిచియున్నది. దానికైన సంతోషింపఁ దగియున్నది. ఇంతవఱకు నభివృద్ధికిఁ వచ్చియుండిన యీమనగణితశాస్త్రమును మనవలన గ్రహించి నేర్చుకొనిన పాశ్చాత్త్యులు మనలను మిగిలి యీశాస్త్రము నెంతయు నభివృద్ధిచేసినారు. మఱి యింకను వృద్ధిఁజేయుచున్నారు. మన మిట్లు వెనుకఁ

బడుట యొంత యు శోచ్యము. అయినదానిని గుఱించి చర్చించుట ప్రస్తుతాంశ ము గాదు. ఏది యె ట్లున్నను నీగణితశాస్త్ర మార్యులలోఁబుట్టి చాలవఱకుఁ బెరిఁ గిన ట్లే ర్పడుచున్నది.

ఆంధ్రులకు సంస్కృతమునందలి యీశాస్త్రమే యాధార మగుటకు సం దేహము లేదు. ఆంధ్రులలో నెప్పుడు గణితశాస్త్రము ప్రసరించి వ్యాపించినది, నిర్ణయముగా నిర్ధారణచేయుట కష్టము. మొదటి కాంధ్రు లార్యులలోఁ జేరిన యొక తెగవారే యగుదురా లేక వారు ప్రత్యేకజాతీయమువారా యను వివా దమే తెగకయున్నది. ఆంధ్రు లార్యులే యైనంతట వారివిజ్ఞానమే వీరివిజ్ఞానము. కాలదేశసన్నివేశములఁ బట్టి మార్పులఁ జెంది యుండవలయును. అట్టియెడ నా ర్యులగణితశాస్త్రమే యాంధ్రులగణితశాస్త్రమునై సంస్కృతములోని యంకము పాదులే కాలక్రమమున రూపముమాఱి యిప్పటితెనుఁగంకె లయి యుండనోపు.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెనుఁగు | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౦ |
| ఇంగ్లీషు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
| పూర్వదేవనాగరము | १ | २ | ३ | ४ | ५ | | ७ | ८ | ९ | ० |
| ఘోబర్ | 1 | 2 | 3 | N | ५ | 6 | 7 | 8 | 9 | 0 |
| నానాఘట్టశాసనము | — | = | ≡ | ¥ | | 6 | 7 | | 9 | |

ఇందు దేవనాగరి ఒకటి, రెండు, మూఁడు, ఏడు, సున్న ఇంగ్లీషులోని యాయంకెలను బోలియున్నవి. ఘోబర్ అంకెలలోని యొకటి (కొంతమట్టుకు) మూఁడు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, సున్న ఇంగ్లీషులోని యాయంకెలను బోలియున్నవి. దేవనాగరిలోని నాల్గును దెనుఁగు నాలుగును నొక్కటిగానే యు న్నవి. కొంతమట్టుకు మూఁడును బోలికఁ గలిగి యున్నవి. తెనుఁగుమూఁడును ఇంగ్లీషుమూఁడును నొక్కటిగా నున్నవి. నానాఘట్టశాసనమునందలి యంకెలలో మొదటిమూఁడంకెలకును నడ్డగీఁత లున్నవి. ఇవి రోమకాంకములలోని నిలువు గీఁతలకుఁ బ్రతిగా నున్నవి. ఇందలి ఆఱు, ఏడును (కొంతమట్టుకు) దొమ్మిదియు ను ఇంగ్లీషు అంకెలవలె నున్నవి. విశిష్టమునకుఁ దెనుఁగంకెల యిప్పటిరూపము లలో మూఁడు, నాలుగు, సున్న తప్పఁ దక్కిన యేయంకె గాని యితర భాషాంక ములతో సాదృశ్యమును దాల్చి యుండలేదు. అ వన్నియు స్వతంత్రరూపము

లఁ గలిగి యున్నవి. కాఁబట్టి తెనుఁగంకెలు మొత్తమున కేయితరభాషాంకముల నుండి గాని యిప్పటిరూపపరిణామము గాంచినట్లు చెప్పుట కెడము లేదు.

భాషకు లిపి యేర్పడుటకు ముందే యంకములకు రూపము లేర్పడునట్లు కొందఱందురు. నాకది సహజముగాఁ దోఁపదు. భాష కొంత యభివృద్ధిని జెంది లిపి యేర్పడి వ్రాఁత కెక్కినతరువాతనే యంకములును వ్రాఁత కెక్కవలసివచ్చినప్పుడే వానికి రూపనామము లేర్పడ నావశ్యకత తటస్థింపఁగల దని నాతలంపు. కొన్నిభాషలలోఁ గొన్నియక్షరములే యంకములకు వచ్చుచుండుట యీభావమును బలపఱచుచున్నది. అట్లయిన సంకరూపము లాయాభాష లిపివిన్యాసము ననుసరించి యుండుట సహజము. అక్షరముల తిరుగుడులే యంకెలందును గాన్పించుచుండును. తెలుఁగునం దిట్లే యున్నది.

సున్నలును, దానిభాగములును, తెనుఁగక్షరములఁ దఱచుగా వచ్చుచుండును. అడ్డుగా నడ్డగీఁతలు కలవు. నిలువుగీఁతలు లేవు. తెనుఁగంకెలలో సైతము సూర్యాకృతిని బోలు సున్న పదికి వచ్చుచున్నది. తక్కిన తొమ్మిదియంకెలును జంద్రరేఖను బోలు నఱసున్నను బలువిధములఁ గలుపుట వలనఁ గలుగుచున్నవి. ఇందు నడ్డగీఁతలు కొన్నిటఁ దోడుపడుచున్నవి.

అఱసున్నను గొనలు క్రిందివైపునఁ జూచునట్లు నిలిపిన '౧' ఒకటి యైనది. దానిక్రింద నడ్డగీఁత వైచిన '౨' రెండైనది. రెండఱసున్నలను గొన లెడమవైపునఁ జూచునట్లొకదానిక్రింద నొకటిని బైయఱసున్న క్రిందికొనయుఁ గ్రిందియఱసున్న పైకొనయు నంటునట్లు నిలిపిన నది '3' మూఁడైనది. ఒకయఱసున్నను గొనలు పైనఁ జూచునట్లు నిలిపి దానిక్రింద దానినడిమిభాగము నంటునట్లొక్కసున్నను నిలిపినంతట నది '౪' నాలుగైనది. రెండఱసున్నలను నొకదానికొన లెడమప్రక్కఁ జూచునట్లును దక్కిన దానికొనలు కుడిప్రక్కఁజూచునట్లును నడిమిభాగము లంటియుండునట్లును గలిపివ్రాసిన నది'౫'యైదైనది. రెండఱసున్నలను రెంటికొనలును గుడివైపునఁ జూచునట్లును బైయఱసున్న క్రిందికొనయును గ్రిందియఱసున్న పైకొనయును నంటియుండునట్లును వ్రాసి క్రిందియఱసున్న క్రిందికొన నంటి కుడివైపున కొకయడ్డగీఱను వ్రాసిన నది '౬'యాఱైనది. కొనలు క్రిందఁ జూచునట్లొకయఱసున్నను నిలిపి దానిక్రింద మఱియొకయఱసున్నను గొనలు పైనఁ జూచునట్లు నిలిపి పైయఱసున్న కుడికొనను గ్రిందియఱసున్న యెడమకొనతోఁ గలిపినంతట నది'౭'యే డగుచున్నది. ఒకయఱసున్నను గొనలు పైవైపు

నఁ జూచునట్లు నిలిపి దానికుడికొననుండి యడ్డగీఁతను గుడివైపునకు గీచినంతట నిది '౮' యెనిమిది యగుచున్నది. రెండఱసున్నలను గొనలు కుడివైపునఁ జూచున ట్లొకదానిపై నొకదానిని బైయఱసున్నక్రింది కొనయుఁ గ్రిందియఱసున్నపై కొన యు నంటియుండునట్లు నిలిపి పైయఱసున్న పై కొననుండి కుడివైపునకు నడ్డగీఁత గీచినంతట నది '౯' తొమ్మిది యగుచున్నది. పదికి సున్నయై యుండి యిప్పుడు ఒకటియును గుడిప్రక్కను సున్నతోడఁ జేరి '౧౦' పది యయినది. పదులు, నూ ఱులు, వేలును, దెలుఁగుపేళ్లు. అంతకుఁ బైన సంస్కృతసంఖ్యానామములనే వాడుచున్నారు. ఈవిధముగా సున్న యఱసున్న యడ్డుగీఁతలతోడఁ దెలుఁగంకె లన్నియు నైనవి.

ఆంధ్రాక్షరము లన్నియుఁ గూడ నిట్టివే యగుటచేత నీయక్షరములకును నంకములకును మిక్కిలి పరస్పరానుగుణ్యము గలిగి కలసిమెలసి కంటి కింపును గొలుపుచున్నవి. ఆంధ్రాక్షరరూపములు కను సొంపైనవి. ఆంధ్రాంకములు గూడ వాని కనుగుణములై యందముగ నున్నవి. ఇట్టియెడఁ దెలుఁగు వ్రాయునప్పుడు సుందరములైన యీతెలుఁగంకెల విడనాడి భాషాంతరములోని యంకసంకేత ముల నందుఁ జొనిపి సహజసౌందర్యమును బాడుచేయుట యెంతయును గర్హ్య మైనది. దీనివిషయమై మరల విచారించెద.

ఇంతమట్టుకుఁ బూర్ణసంఖ్యాంగము లగునంకములను గుఱించి యయినది. ఇంక భిన్నసంఖ్యలను వానిరూపములను వానిని గుర్తించువిధములను గుఱించియు విచారింతము. మనగణితశాస్త్రమునందు నఱువది యొకఘట్టముగా నున్నది. అఱు వదిసంవత్సరముల నొక్క యావృత్తిగా గణించెదరు. దినము నఱువదిఘటికలుగా విభజించినారు. ఘటిక యఱువదివిఘటిక లయినది. అట్లే లిప్తలు మొద లైన వై నవి. ఈయఱువదవభాగములకుఁ బ్రత్యేకనామము లున్నవి గాని ప్రత్యేకాంక రూపములు లేవు. ఇట్లే యావశ్యకతనుబట్టి కావలసినభాగములను బ్రత్యేకనా మములచేఁ దెలుపుచున్నారే కాని సామాన్యముగ నన్నిభిన్నసంఖ్యలను గుర్తింపఁ దగినపద్ధతి యేదియుఁ గానరాదు.

అఱవమునందును ననేకవిధము లైనభిన్నసంఖ్యల నుపయోగించుచు వా నికిఁ బ్రత్యేకనామముల నిడి వానికిఁ దఱచుగా నక్షరరూపము లగు ప్రత్యేకసం కేతములను గూడఁ గల్పించియున్నారు. వీరును గొన్నినిర్దిష్టభిన్నసంఖ్యల వ్రాయఁ

గలరే కాని యేభిన్నసంఖ్యను గాని గుర్తింపఁ గల సామాన్య మగు పద్ధతి వీరికి నున్నట్లు కానరాదు.

తెనుఁగునందును భిన్నసంఖ్యలు వాడుచున్నారము గాని యవి మిక్కిలి పరిమితములు. అవి యన్నియు నాలుగవపాలునకు సంబంధించినవియే కాని యంత కన్న వేఱైనవి కావు. వానికిఁ బ్రత్యేకనామములును బ్రత్యేకసంకేతములును గల్పింపఁబడియున్నవి. ఒకటిని నాలుగుసమభాగములు చేసిన నం దొక్కదానికి ననఁగా నాలుగింట నొకపాలునకు 'పాతిక' యని పేరు. దానిని నొక్కనిలువుగీతచే '।' గుర్తింతుము. అట్టిపాతికలు రెండైన ననఁగా నాలుగింట రెండుపాళ్లకు 'అర' యని పేరు. దానికి 'ৼ' సంకేతముచే గుర్తింతుము. ఇది వాస్తవముగ '॥' రెండు నిలువుగీతలే. వ్రాతవేగమున మొదటిగీత కొంతసంకుచితమై రెండవగీతతోఁ గలిసి వచ్చుటచేత 'ৼ' రూపమును బొందినది. 'ৼ' అనఁగా రెండు పాతికలు. అట్టినాలుగవపాళ్లు మూఁడైన ననఁగా మూఁడుపాతికలు ముప్పాతిక యైనది. దానికి నొకసంకేతము 'ৼ।' ఇదియు ను మూఁడుపాతికలను గుర్తించు మూఁడునిలువుగీతలు. '।।।' వ్రాఁత వేగమున 'ৼ।' ని ట్లయ్యెను. నాలుగుపాతికలు కలసిన పూర్ణసంఖ్య 'యొకటి' యగుచున్నది. ఈభిన్నసంఖ్యలు మరల విభక్తములైనవి. మరలను నాల్గింటిచే విభక్తములే. పాతికను నాల్గుసమభాగములుచేసిన నం దొకటికి 'వీస'మని పేరు. ఇది 'ఒకటి' లో నాలుగవపాలైన 'పాతిక' లో నాలుగవపా లగుటచేత నొకటిలోఁ బదునాఱవపా లయినది. దీనికి సంకేతము '—' ఒక అడ్డుగీత. ఇట్టివీసములు రెండైన దానికి 'పరక' యని పేరు. దానికి సంకేతము '=' ఇది వేగవశమునఁ గలిపి వ్రాసిన రెండడ్డుగీతలు- మూఁడు వీసములకు 'ముప్వీస' మని పేరు. దానిగుర్తు '≡' ఇదియును గలిపి వ్రాసిన మూఁడడ్డుగీతలే. మరల నీవీసమును నాలుగుసమభాగములు చేసిన నం దొకదానికి' కాణి' యని పేరు. ఇది యొకటింటఁ బదునాఱవపా లగువీసములో నాలుగవపా లగుటచేత నొకటిలో నఱువదినాలుగవపా లయినది. దీనికి సంకేతము మరల నొక నిలువుగీత. ఈకాణికి సంకేతమైననిలువుగీతకును బాతికకు సంకేతమైన నిలువుగీతకును రూపభేదము లేదు. నామభేదము గలదు. అయిన ను స్థానభేదమునుబట్టి వానిని గుర్తింపవచ్చును. మొదటిస్థానమున వచ్చునవి పాతికలు, రెండవస్థానమందు వచ్చునవి వీసములు, మూఁడవస్థానమందు వచ్చునవి కాణులు. అనఁగా వీసముస్థానమునకు నెడమప్రక్కస్థానము పాతికలది, కుడి

తట్టువది 'కాణి'లది. మొదటి రెండుస్థానములలో దేనియందుఁ గాని యంకె లేక పైస్థానమున నంకె వచ్చుపట్ల నంకె లేనిచోట 'హాళ్ళి' యను విసరుతోఁ జేరిన సున్న నుంతురు. ఇది వెనుకవచ్చునంకెయొక్క స్థానమును నిర్ణయించును. ఇట్టు ।౭। వేసిన నది పాతికకాణి యగును. ఇంతకుఁబైన నిదే రీతిగాఁ బెరలు సురలు నున్నవి గాని యవి వాడుకలో లేవు. ఇవి సామాన్యముగ వాడుభాగములు. ప్రత్యేకవిషయములలో నామాంతరము లున్నవి. వరహాలప్రసక్తిలో వీనినే పావు, మాడ, ముప్పావు, దుగలము, చవలము, లేక బేడ, ముద్దుగలము, కాణి, అఱ వీసము, ముక్కాణి యనిమెదరు. అంకసంకేతములలో భేదము లేదు. ధాన్యాదులకొలతలో 'పుట్లు' 'తూములు' 'ముంతలు' 'చిట్లు' నున్నవి. ఇవి పైనఁ బ్రచారించినవానివలె నాలుగవభాగములు గావు. ఐన నిందుఁ బుట్లు ప్రధానము లైనవానిభాగములుగాఁ దూములు, ముంతలు, చిట్లు నేర్పడిన వనుటకన్నఁ జిట్లాద్యములై వానిగుణకముగ ముంతలు, తూములు, పుట్లు, నేర్పడినవి యన వచ్చును. విశిష్టమునఁ బైనఁ జెప్పినభాగము లన్నియు నాలుగవభాగములే. ఇతరభాగములకు నామములు గాని వానిని గుర్తించుటకు సామాన్యసంకేతములు గాని తెనుఁగున లేవు. ఇదియును నాంధ్రములో నెప్పు డెట్లు ప్రవేశించినది యెఱుఁగఁ జాలకున్నారము. ఇందు 'పావు'నకుఁ గా లనియు 'ముప్పావునకు' ముక్కా లనియుఁ గూడఁ జెప్పుచున్నాము. కాఁబట్టి యిది పశుపాద సంఖ్యను బట్టి వచ్చిన దని మాత్ర మూహింపఁ దగియున్నది. తక్కినవే లెట్లు వచ్చినవో నిర్ణయముగాఁ దెలియదు. తెనుఁగునందలి పూర్ణాంకసంకేతములు తెనుఁగువ్రాత మోడి ననుసరించియున్నవి. ఈభిన్నాంకరూపములు మాత్ర మట్లు లేవు. దీనినిబట్టి యోజింప నివి తెనుఁగునఁ బుట్టి పెరిఁగినవిగాఁ గాన్పింపవు. అన్యులనుండి స్వీకరింపఁబడి యుండునా యని సంశయింపఁ దగియున్నది.

పాతికలు మొద లగు నిలువుగీఁతలు గలసంకేతములు రోమకాంకములలో మొదటి మూఁడుసంఖ్యలరూపములను బోలి యున్నవి. వీసములు మొద లగు నడ్డగీఁతలు గలసంకేతములు నానాఘట్టశిలాశాసనములోని మొదటిమూఁడుసంఖ్యలరూపములవలె నున్నవి. ఇంతటితో నివి యాందుండి గ్రహింపఁబడిన వని చెప్ప సాహసింపను. ఆదియందు గణితము వృద్ధి గాకపూర్వము లెక్కించి గుర్తించుటకు గీఁతలు సహజముగా ముఖ్యసాధనములై యె ట్లుండెనో యట్లె యాంధ్రులు భిన్నసంఖ్యల గుర్తింప నారంభించినప్పుడును గీఁతలు ముఖ్యసాధనములుగా నేర్పడియుం

డవచ్చును. నిలువుగీఁతలు మొదట వచ్చి యావల నంతకన్నఁ బైనఁ బోయినప్పుడు మార్పునకై యడ్డగీఁత లేర్పడియుండును.

ఏది యెట్లున్నను భిన్నసంఖ్యలవిషయములో మనగణిత మొక్కటియుభివృద్ధిఁ బొందినది కాదు. తెనుఁగున నేకవిధమైన భిన్నసంఖ్యలను గుర్తించుటకు మాత్రమే కొంతవఱకు మార్గ మున్నది. గణితశాస్త్రాభివృద్ధి కది చాలదు. సామాన్యముగ సర్వవిధములైన భిన్నసంఖ్యలను గుర్తించుటకు ననువగుమార్గ ముండవలయును. ఒకటింట నాల్గవపాలు ననఁగా నాలుగు సమభాగములలో నొక్కభాగమును గుర్తించుటకు సంకేతమును బ్రత్యేకనామమును గూడఁ గలదు గాని యొకటింట నైదవ పాలు ననఁగా నైదుసమభాగములలో నొక్కభాగమును గుర్తించుటకుఁ బేరు గాని గుర్తు గాని లేదు. నాలుగుభాగములలోని యొకటి రెండు మూఁడు భాగములను గుర్తింపఁగలమే కాని తక్కిన యేసమభాగములలోని యేభాగములనుగాని గుర్తింపలేము. ఈవిధమున భాగములను దెలుపు నంకములకు భిన్నాంకము లని పేరు. ఇట్టి సర్వవిధము లైన భాగములను ననఁగా సర్వవిధము లగు భిన్నాంకములను గుర్తించుటకు ననువగు సామాన్య మైన మార్గము తెనుఁగునందు లేకపోవుట తెనుఁగునకుఁ బెద్దకొఱఁతగా నున్నది. గణితమున నీభిన్నసంఖ్యలు తఱచు వచ్చుచుండును. తెనుఁగంకెలలో వాని గుర్తింప లేకపోవుటచేతఁ దెనుఁగునందు నింగ్లీషంకెలను వాడుట కొకవిధ మైన వ్యాజమైనది. ఈ భిన్నసంఖ్యల సామాన్యముగ గుర్తించుటకుఁ బాశ్చాత్యు లొక సామాన్యసులభమార్గము నేర్పఱచియున్నారు. యెన్నిసమభాగములలో నెన్నిభాగముల నెత్తుకొనునది తెలుపుటకు నాసంఖ్యలను నొకయడ్డగీఁతకుఁ గ్రిందను బైనను నిలుపుదురు. అడ్డగీఁతకుఁ గ్రింద నాలుగు వేసి పైన నొకటి వేసిన $\frac{1}{4}$ నాలుగుసమభాగములలో నొక్కభాగము నెత్తుకొనిన ట్లర్థము. అనఁగా నిది నాలుగింట నొకపాలు 'పాతిక'యయినది. ఈపద్ధతి నవలంబించిన నాలుగుభాగములలో నుండి కొన్నిభాగముల నే గాక యెన్ని సమభాగములనుండి యైన నెన్నిపాళ్ళు నైన నెత్తుకొని గుర్తింపఁ గలము. $\frac{1}{5}$ వేసిన నైదుసమభాగము లందు నొక్కపా లని యర్థము. $\frac{13}{14}$ నగు ౧౪ సమభాగములందు ౧౩ భాగము లనఁగాఁ బదునేడింటఁ బదిమూఁడుపాళ్ళని యర్థము. ఈవిధి ననుసరించి సర్వవిధము లగుభిన్నసంఖ్యలను గుర్తింపవచ్చును. ఈపాశ్చాత్యపద్ధతిని మనము తెలుఁగునందుఁ గైకొనుట యుక్తము, నవశ్యము,

ననన్యగతికము. దానిచేఁ దెనుఁగున భిన్నసంఖ్యల గుర్తించుటకు వీలు లే దను కొఱఁత తీఱును. అన్యభాషల నాశ్రయింపవలసిన యవసర మడఁగును.

ఈసుకరమైన పద్ధతి నవలంబించి నంతట మన తెనుఁగంకెలతోడనే పూర్ణ సంఖ్యలే కాక భిన్నసంఖ్యలసైతము కొఱఁతలేకుండ గుర్తింపఁగలము. మనయాంధ్రాంకములు మిక్కిలి యందముగా నున్నవి. అక్షరముల వ్రాతమోడి ననుసరించి యుండుటచే నక్షరములనడుమ నివి వచ్చినప్పుడు కంటికి భేదమును గొల్పక పంక్తి సౌందర్యమునకు భంగమును గల్పింపక గొలుసువలె జరుగుచున్నవి. కొన్ని ద్రావిడాదీతరభాషలయంకెలు చిక్కయిన యక్షరములుగా నున్నవి. తెనుఁగంకె లట్లుగాక వ్రాయుటకు మిక్కిలి చులుకనగా నున్నవి. ఇట్టిసుగుణములు గల మన తెనుఁగంకెలను మన తెనుఁగువారే విడనాడుచున్నారు. తెనుఁగులో వ్రాయుచుండు నప్పుడు కూడ నడుమఁ దెనుఁగంకెలకు బదు లింగ్లీషంకెల వేయుచున్నారు. తెనుఁగంకెలు చేసినపాప మేమో తెలియదు. లెక్కలలో నంతటను, దెనుఁగంకెలకు బదులుగా నింగ్లీషంకెలనే వేయుచున్నారు. ఇంగ్లీషు రాక మున్కొ యైన రాని కరణములు గ్రామముల లెక్కలలోఁ గూడ నింగ్లీషంకెలే వాడుదురు. ఇప్పుడు పాఠశాలలోఁ జదువుచుండు బాలురకుఁ దెనుఁగంకె లెట్టివో తెలియవు. ఆరంభపాఠశాలలోఁ గూడ నింగ్లీషంకెలే చెప్పుదురు. గాని తెనుఁగంకెల జోలికిఁబోరు. మాతృభాషలో నీయంకముల నెఱుఁగక యే యుండుట యుక్తము గాదు, గాన, వానిని బాలురకు నేర్పవలసిన దని యుపాధ్యాయులను మందలింపవలసివచ్చినది. ఒకవేళ దెనుఁగంకెలలో భిన్నసంఖ్యలను నన్నింటిని గుర్తించుట కవకాశము లేనందున లెక్కలను వేయుట కింగ్లీషంకె లవశ్యమందు రేమో భిన్నసంఖ్యలను గుర్తించుట కింగ్లీష్ భాషలో నుపయోగించు పద్ధతినిఁ బైన నేను జెప్పినట్లు మనము నవలంబించినంతటఁ దెనుఁ గంకెలతోనే వానివలెనే యన్ని భిన్నసంఖ్యలను వ్రాయ వచ్చును.

పండితులు గూడఁ దెనుఁగంకెలవిషయములో నిట్టియనాదరమునుజూపు దురభ్యాసము దుఃఖింపవలసియున్నది. అనేకులు పండితులుగూడఁ దమగ్రంథముల ముద్రించునప్పుడు పుటసంఖ్య నింగ్లీషంకెలతో ముద్రింతురు. తుదకుఁ దెనుఁగున ముఖ్యలక్షణగ్రంథ మగునప్పకవీయమును ముద్రించినవారికిఁ దెలుఁగంకెలు తెలియకపోయెనేమో వారి కవి దొరకినవి కావేమో. ఈగ్రంథమునకు గూడఁ బుటసంఖ్యను నింగ్లీషంకెలతో ముద్రింప నవసరమ్మేమి? మనకంకెలు లేకపో లేదు,

అవి యందమైనవి కాకపో లేవు. వేయుటకుఁ గష్టమైనవి కావు. ఇట్లుండ నేల యీస్వకీయానిరసనము. ఏల యీపరకీయానుసరణము. మనవారి కెప్పు డీదురభ్యాసము తొలఁగునో తెలియదు. ఉద్గ్రంథముల రచియించి ముద్రించుపండితులే యీదురభ్యాసమునకు లోనై యుండ వార్తాపత్రికలు మొదలయినవాని నేమనవలయును.

గుణ మెక్కడనున్నను గ్రహింపఁదగినదే కనుక భిన్నసంఖ్యల గుర్తించు పాశ్చాత్యపద్ధతి నవలంబించి యాంధ్రాంకసంకేతముల సమగ్రముగ వృద్ధిపఱచి యన్యసంకేతముల గ్రహింపవలసిన యావశ్యకత యించుకైన లేకుండఁ దొలఁగించి యాంధ్రు లందఱును దెనుఁగున వ్రాయునప్పుడు తెనుఁగంకెలు తప్ప నితర భాషాంకముల నుపయోగింపఁగూడ దని నియమమును జేసికొని యట్లాచరించుట మనకందఱకును విధి. అదియే నిక్కమైన మాతృభాషాసేవ. ఈవిషయమునందుఁ దగుకృషి చేయు నాంధ్రభాషాభిమానుల నందఱఁ గేల్మోడ్చి వేఁడుచున్నాను.

———



# భాషాసేవ.

— రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు. —

సేవాతత్త్వమును విమర్శింప మొదలు పెట్టితిమా ప్రపంచము నంతను విమర్శించినట్లే యగును. సేవ యనంతరూపములఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఒక్కొక పరి దుఃఖభూమికను, ఆనందభూమికను దానే ధరించుచున్నది. దీనికి రంగస్థలములు రెండే. కామ్యరంగము, నిష్కామ్యరంగము. మనహృదయమే నాట్యశాల.

ఫలముఁ బొంది సేవించునవి కొన్ని, సేవించి ఫలమును బొందునవి కొన్ని మన కగపడుచునే యున్నవి. వేయికన్నులతో మనలను గాపాడి సఫలీకృతులను జేసిన మాతృదేవిసేవలో ఋణపడియే యుందుము. గురుసేవ చేసిచేసి సేవకుఁ దగిన ఫలమును బొందుచునే యున్నాము.

ప్రపంచయాత్ర సేయుప్రతిమానవునకును నేదియో యొకసేవ పరమావధిగా నుండుట సహజమైపోయినది. సేవాస్వరూపమే ప్రపంచయాత్ర యేమో?

ఏదియో యొకసేవ సంకల్పించుకొనుట మనకు విధి. దీనిని నిర్ణయించుకొను బాధ్యతయు మనయందే కలదు. మనబాధ్యతయే మనల నానందింపఁజేసినను బాధించినను. నిర్బాధకమైన సేవకై యత్నించుట పండితధర్మము.

కామ్యమునందే ఖేదము, నిష్కామ్యమునందే మోదముఁ గల దనుట మన భారతభూమిలో మొదటిమాట.

సేవాధర్మమును వెదకికొనుటలో హ్రస్వదృష్టి కుటుంబావరణమును మించదు; విశాలదృష్టికి విశ్వ మేసరిహద్దుల నిర్ణయింపఁజాలదు. దృష్టివిశాలమే యాత్మవికాసము.

నేఁడు, రేపు సర్వజనులకు సరిసమానముగ సహాయపడఁగల సాధన మేది కలదో యాసాధనాభివృద్ధికి దోహదము సేయుసేవయే పరమోత్కృష్టసేవ. సంగీతసేవకు విశాలము తక్కువ; నిలుచునదియుఁ గాదు; ఆనంద మపారమే; అది తాత్కాలికము; ముందు వారికందునది కాదు. సాహిత్యసేవకు విశాల మతిశయము; శాశ్వతమై నిలుచునది; ఆనంద మపారమే గాక సర్వసమానము.

సాహిత్యసేవకై జీవితసర్వస్వముల ధారవోసి ధన్యులై మనలను ధన్యులనొనరించిన పూర్వపండితులను, కవులను, మహారాజులను స్మరించి కృతజ్ఞతం

జూపుచుముగాక! ఏదేశమువారైననేమి, యేభాషాసేవచేసిన నేమి, వారందఱు నొక్కశ్రేణిలోనివారు.

ఆధునికపండితులలో, గవులలో, మహారాజులలో నిష్కామ్యసాహిత్య సేవకై సర్వమును ముడుపుఁగట్టిన ముఖ్యులు నేఁడును గలరు. వీరిజీవితములు ధన్యములు, ధన్యతమములు, నానందమయములు. వీరి కుపాసనాదైవతము అక్షరబ్రహ్మ మగుటచేఁ గానోపు నిర్భయము, నిర్మోహము, నిరహంకారము, నిశ్చయజ్ఞానము, నిరతిశయానందము నెన్నంటి కాపాడుచుండును. వీరిధ్యాన మంతయు నక్షరబ్రహ్మలగ్న మగుటచేఁ గానోపు వాక్కు లమృతత్వము నొందు చున్నవి; వీరిధారణ యంతయు నక్షరబ్రహ్మపర మగుటచేఁ గానోపు హృదయ మచంచలత వహించుచున్నది; వీరిసమాధి యంతయు నక్షరబ్రహ్మార్పణ మగుట చేఁ గానోపుఁ గుటుంబసర్వస్వముల మఱచుచున్నారు; చిరంజీవు లగుచున్నారు.

యోగసిద్ధి నొందఁగోరువారి కాదర్శము పూర్వాచారధర్మము; పూర్వా చారమూలధర్మములను మీఱిన యోగభంగమే ఫలము. భంగము బహుభంగు లు. కామక్రోధలోభమోహమదమాత్సర్యస్వరూపములతోఁ దాండవించుచు భం గయోగులను దెబ్బతక్కలాడించును.

కావ్యకర్తపూర్వజన్మ ఋషిజన్మ; ఋషి పాడై కావ్యకర్త యయ్యెను; కావ్య కర్త పాడైనచో నేజన్మ కలదో?

తాఁ జేయుపనియే యోగము; పండితులు సమదర్శులు; సారస్వతసేవ పండితధర్మము; వారిధర్మమును వారు నెఱవేర్చుకొనుటలోఁ గామము చేరరాదు; చేరెనా- సారస్వతము "రైల్వే" నాశ్రయించును. కాసుపీసములకు మహాకావ్య నామకము లుత్పన్నము లగును. క్రోధము చేరరాదు; చేరెనా- కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బ, పుల్లియామపై తాయిపడును. లోభము చేరరాదు; చేరెనా- ముద్రణశాలాధికారితో ముచ్చటించిన పిమ్మటఁ గాని కలముఁ బట్టనీయదు. మో హము చేరరాదు; చేరెనా- పూర్వాపరసందర్భములకుఁ బూర్ణానుస్వారము కలుగును. మదము చేరరాదు; చేరెనా- యుక్తాయుక్తములు పిండిగుండ యగును. మాత్సర్యము చేరరాదు; చేరెనా- తాఁ జెడ్డకోఁతితోఁగోఁతికొమ్మచ్చు లాడించును.

పరిణామము ప్రకృతిస్వభావము; ప్రకృతిస్వభావమును మీఱి లోక మిం కొకదాని నాలోకింపఁ జాలదు; ఆలోకించుటకై యాలోచింపకయు మానదు; ఆలోచించినను నాలోచింపకపోయినను, ఆదిస్వరూపముఁ బ్రకృతి విడనాడదు.

పృథివ్యాపస్తేజోవాయురాకాశములలో ననంత మాకాశము; అనంతా కాశమున నిండిన శబ్దము శాసనబద్ధమై భాషాస్వరూప మందినది.

నియమబద్ధము కాని దేదియు నిలుచునది కాదు; నియమము నుల్లంఘించిన పంచభూతములే ప్రళయముం దెచ్చుచున్నవి.

శిల్పశాస్త్రనియమములను మీఱిన శిలావిగ్రహమే, యారాధకుని పారంపర్యమును నాపదలలో ముంచుచున్నది. వికలాంగ మననముచే దౌహృదిని వికలాంగుని బ్రసవించు ననియు, మొయిలిపోయిన సూర్యచంద్రులను గాంచిన గర్భిణి తొట్రుమొట్రు బిడ్డలను గాంచు ననియుఁ బరిశోధనలతో బయటపెట్టువారి వాక్యముల ననుసరింపనివారైనను శిల్పశాస్త్రాభిప్రాయమును ద్రోసిరా జనఁజాలరు.

ఆదినుండియు మన కారాధ్య యగు భాషాదేవిరూపమునకును గొన్ని నియమములు కలవు; సర్వాంగసౌష్ఠవము, లాలిత్యము, ప్రసన్నతయు నామెయందు దైవాఱునప్పుడే మన కోర్కుల నీడేర్చుచుఁ బురుషాంతరముల వఱకు మనల భావానుగుణ్యముగఁ గాపాడుచున్నది. ఆమె లక్ష్మివలెఁ జంచల కాదు; కాళివలె బీభత్సస్వరూపిణియుఁ గాదు; మృదులస్వభావ, దయార్ద్రహృదయయు; ఈమెను సేవించుటలోఁ బూర్వాచారనియమముల నుల్లంఘించితిమా, లక్ష్మీస్వభావమును, గాళీస్వభావమును మీఱి యాగ్రహముతో మనమాట ముంచువారి కందనీయదు; నెత్తిలలను వేయించును; మనయారాధన యంతయు బూడిదలోని పన్నీరువంటిదియగును; మన మెంతయు జాగ్రత్తతో నామెకరుణకుఁ బాత్రులము కావలయును. దేశదేశములనుండి యనేకాలంకారములను దెప్పించి నిత్యోత్సవమున నలంకరించి యామె నానందింపఁజేసి మన మానందించుటయే పరమావధి.

భాషాదేవి సేవలో మనము తడయరాదు. మనకాలయాపన యామె కసహ్యము; మనమాంద్యము నామె సహింపదు. తలఁపులో మెఱసిన భావపరంపర నక్షరబ్రహ్మార్పణగా నామె నారాధించుచుండినఁ బ్రసన్నురాలు కాఁగలదు.

జగజ్జనని యగు భాషాదేవికి మనప్రసంగము లన్నియు శ్రవణానందములే. అర్థవిహీనము లైనను, అస్పష్టోచ్చారణ కలవి యైనను, మనపలుకులకు ముచ్చటపడుచునే యుండును. గంభీరభావపూరితములు, సుశబ్దములు, నగువాక్యముల నాలించి మహానందము నొందుచునే యుండును. కాని వయోనుగుణ్యముగఁ, బాత్రానుగుణ్యముగ, సుప్రయోజనముతో మనము ప్రసంగింపనిచో నామెసంతో

షము సంతోషము కాదు; లోలోన నావేదన పడుచునే యుండును. బిడ్డల తొక్కుపలుకులు నత్తిపలుకులుగా మాఱినపుడు తల్లి కావేదనకాక మఱేమగును?

గ్రామ్యగ్రాంథికసహస్రనామార్చన సేయునపుడు యుక్తాయుక్తములను యోజించుపని మనయందే కలదు; పురాణోక్తసమయమున వేదోక్తమును, వేదోక్తసమయమునఁ బురాణోక్తమును నయుక్తములే కదా!

అదిగో! భాషాదేవ్యాలయశిఖరము! ఛందోవ్యాకరణప్రాకారముల లోనికి శ్రమ యనక పోవుదము; ఒక్కొకసోపానముపైఁ జెక్కఁబడిన పూర్వపండితకవిమహారాజుల నామసువర్ణాక్షరములం జదువుదము; ఏనాఁడో సమర్పింపఁబడి యీనాఁటికిని నమ్లానములై యామోదమును వెదచల్లుచున్న గ్రంథపుష్పములను శ్రవణముల నలంకరించుకొందము. మ్రొక్కుబడులఁ జెల్లించుకొనుట కిదియే సమయము. మీమీయలంకారముల నన్నిటిని నామె పాదపీఠమునకు సమర్పింపుఁడు ఆహా! ఏనాఁటి దీయాలయము! ఎప్పటిశిల్ప మీదేవీస్వరూపము! చెక్కుచెదరక, వర్ణము మాఱక, స్థిరపీఠముపైఁ బద్మాసనమునఁ గూరుచుండి కలకలలాడు నవ్వుమొగముతో దర్శనమిచ్చు నాదేవి కాత్మార్పణ మొనర్చి తరింతము. ఆమెత్తనివరదహస్తము మనల నుద్ధరించునుగాక!

---

# ఆంధ్రభాషాసేవ.

— జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. —

---

ఆంధ్రుల కాంధ్రభాషాసేవ యవశ్య మగునా యను విషయమును గూర్చియు, నాంధ్రవాఙ్మయము ప్రకృతస్థితిని గూర్చియు నిందుఁ జర్చింపఁదలఁచి నాఁడను.

ఏదేశములో నున్న వారి కాదేశభాష సేవ్య మని స్వతస్సిద్ధముగాఁ దోఁచుచుండఁగా నావిషయమై సంశయ మేల పుట్టవలయు నని కొంద ఱాక్షేపింపవచ్చును. స్థూలదృష్టి నీయాక్షేపము న్యాయ్యమే-ఆంగ్లేయభాషాగ్రంథములు చదువుట కర్తవ్యమా కాదా యనుసందేహ మాంగ్లేయులకుఁ బొడమనే పొడమదు. ఆప్రకారమే ఫ్రెంచి, జర్మనులకును- కాని మనదేశభాషలచరిత్రము విలక్షణముగా నున్నది. ఈభరతఖండ మొక్కదేశము కాదు. అనేకదేశములుగల యొక ఖండము. ఇం దేఁబదియాఱు (ఛప్పన్న) దేశములు నేఁబదియాఱు భాషలు నున్న వని పూర్వసంప్రదాయము. డాక్టరు గ్రియరుసనుగారి శోధనమువలన నిప్పుడు వాడుకలో నున్న భాష లింతకంటె నధికముగా నున్నట్లు తేలినది. వీనిలోఁ గొన్ని మాత్రమే సంస్కృతము లయి గ్రంథప్రయోగార్హములుగా నున్నయవి. అవి యైనను స్వతంత్ర భాషలు విజృంభింపవలసినంతగా విజృంభింప లేదు. దీనికిఁ గారణము లేకపోలేదు. ఈదేశభాషలు తత్తద్దేశీయులకు మాత్రమే సేవ్యము లయినవి. వీని కెల్లప్పుడు నేదో యొక సర్వదేశపూజ్య మగు భాషాంతరముతో స్పర్ధ జనించి యాయన్యభాష ముఖ్య మగుటయు నీదేశభాషలు వెనుకపట్టుటయుఁ దటస్థించినది. ఈయన్యభాషలలో మొదటిది సంస్కృతము. సర్వసమృద్ధ మగుటచేతను భరతఖండమునం దెల్లఁ బరమప్రమాణముగాఁ బరిగణింపఁబడు వేదశాస్త్రము లీభాషయందే యుండుటచేతను, నీసంస్కృతభాష, భాషలలో నెల్లనుత్తమభాషగా నాసేతుశీతాచలముఁ బూజింపఁబడుచున్నది. సర్వదేశవ్యాప్తమును సర్వస్వతంత్రమునగు సంస్కృత మేకదేశవ్యాప్తములును సంకుచితములు నయిన దేశభాషలకంటె మిన్న యనిపించుకొనుట వింత కాదు. దేవభాష దేశభాషల నిట్లు వెనుకఁ ద్రొక్కినను వాని నణఁగఁ ద్రొక్కలేదు, సరికదా, తాను ప్రవహించు భూముల నెల్ల ఫలవంతములుగఁ జేయు మహానదులవలె నేయేదేశములం దాసంస్కృతభాష

వ్యాపించెనో. యాయాదేశభాషల కదివఱకు లేని శబ్దార్థసంపద గలిగించి యది తనకుఁ బుత్రిక యనఁ దగుగౌరవమును గల్పించెను. మొత్తము మీఁద నీదేశము లో సంస్కృతభాషాసంపర్కముచే బాగుపడని భాష యొక్కటియును లే దనియే చెప్పవచ్చును. కావుననే పూర్వలాక్షణికులు ప్రాకృతములు వైకృతములు నని దేశభాషల నెల్ల రెండు విధములుగా విభజించి యున్నారు. ఈభేదము దేశభాష లకు సంస్కృతముతోఁ గల సంబంధమును బట్టి కలిగినది. సంస్కృతశబ్దములలో నీషద్వికారము కలుగుటచేఁ బుట్టిన భాషలు ప్రాకృతము లనియు నధికవికారము గలుగుటచేఁ బుట్టినవి వైకృతము లనియుఁ జెప్పవచ్చును. ఓఢ్రము, బంగాళీ, హిందీ మొదలగు నౌత్తరీయభాషలు ప్రాకృతములు. ఆంధ్రము, ద్రావిడము, క ర్ణాటము మొదలగు దాక్షిణాత్యభాషలు వైకృతములు. ప్రాకృతభాషలలోఁ గా ని వైకృతభాషలలోఁ గాని సంస్కృతేతరాంశములు లే వని యూహింపఁగూడ దు. రెంటియందును సహజము లగుదేశ్యాంశము లున్నవి. సంస్కృతభాషాసం బంధము కలుగునప్పటి కౌత్తరీయభాషలు బాల్యావస్థలో నుండుటచేత సంస్కృ తము వానిని జేపట్టి దిద్ది తీర్చుటవలన సంస్కృతసాదృశ్య మాభాషల కధికము గాఁ గలిగినది. కాని, సంస్కృతజనితములు గాని శబ్దములును శబ్దలక్షణవిశేష ములు నాభాషయందు లేకపోలేదు. ప్రాకృతములలో దేశ్యశబ్దము లుండుటచేత నే ప్రాకృతములు ద్వితీయప్రకృతి యనియుఁ బ్రాకృతసమములు గూడఁ దత్సమ ములే యనియు నాంధ్రలాక్షణికు లొప్పుకొని యున్నారు. దాక్షిణాత్యభాష లంతకు ముందే కొంతవఱకుఁ బ్రౌఢములై యుండుటవలన సంస్కృతసంపర్కముచే నాభాష లంతగా మాఱలేదు. కాని, సంస్కృతభాషాసాహచర్యముచే వికార ము నొందని భాష యొక్కటియు భరతఖండమందు లేదు.

చిన్న మొక్కలకు మహావృక్షముల ఛాయ యుపకారకమే. అది లేనిచో మొలకలు వాతాతపముల సహింపఁ జాలక నశించి పోవును. కాని యవి బ్రతికి దృఢపడిన పిదప నాఛాయ వాని కపకారకమే యగును. క్రమక్రమముగా వా నకు నెండకు నోర్చి వానిబ్రదు కవి స్వతంత్రముగా బ్రదుక నేర్చినం గాని పెద్ద చెట్లు కానేరవు. అట్టియవకాశము కలుగనంతవఱకు వికాసహీనములై గుంట పూవులు పూయుచుండును. ఆలాగుననే సంస్కృతభాషాసంపర్క మాదిని దేశ భాషలకు మేలే యొనర్చినను, జివరకు వాని విజృంభణమున కది నిరోధకము గాఁ బరిణమించినది. స్వతంత్రభాష యగుటచే సర్వదేశములందును సంస్కృతమే

గౌరవింపఁబడుచుండినది. పండితులుఁ గవులు నాభాషయందే గ్రంథములను రచించిరి. సంస్కృతగ్రంథములు చదివి యర్థముచేసికొన లేనివారికొఱకే దేశభాషాగ్రంథములు పుట్టినవి. అవి యైనను జాలవఱకు సంస్కృతగ్రంథముల యనువాదములే. స్వతంత్రగ్రంథము లరుదు.

ఇట్లుండఁ గొంతకాలమున, కనఁగా, బౌద్ధమత మవతరించినపిదప నామతమును బోధించు గ్రంథము లనేకములు మాగధీ (పాలీ) భాషలోఁ బుట్టుటచే నాభాష కొంత విజృంభించినది. అశోకుని రాజ్యకాలమందును, ఆంధ్రవంశ్యరాజుల కాలమునందును నీప్రాకృతమే రాజాశ్రయము నొంది బహుదేశముల వ్యాపించినది. ఈకాలమునందే తద్భవశబ్దము లనేకములు కర్ణాటాంధ్రభాషలలోఁ జేరినట్లు కనఁబడుచున్నది. చాళుక్యరాజ్యారంభకాలము మొదలుకొని సంస్కృతమునకుఁ బూర్వమున్న యౌన్నత్యము తిరిగి వచ్చినది. ఈకాలమునందే యాంధ్రకర్ణాటకాది దక్షిణదేశభాషలకు వికాసము హెచ్చి యాభాషలయందు గ్రంథనిర్మాణ మారంభ మైనది. ఈవికాసమునకు ముఖ్యకారణ మిది యని నొక్కి వక్కాణించుటకు సాహసింపఁజాలను గాని బౌద్ధమతమువలనఁ బ్రాకృతభాషలకుఁ గలిగిన యుద్బోధనముఁ బ్రసారముఁ గొంతవఱ కితరదేశభాషలకుఁ గూడఁ దగిలిన దని యూహించెదను. ఇది మొదలు వైకృతవాఙ్మయములు కొంతవఱ కభివృద్ధి నొందుచు వచ్చినను సంస్కృతభాషాజ్ఞానహీనుల కొఱకే యవి యుద్దేశింపఁబడుటయు, సంస్కృతవాఙ్మయము ముఖ్యము, దేశభాషావాఙ్మయములు గౌణములు నగుటయుఁ దటస్థించినది. నాలాయిరభాషయగుటచే ద్రవిడము వైష్ణవులకును బసవమతవ్యాప్తికి ముఖ్యసాధనమగుటచేఁ గర్ణాటకము బసవమతస్థులకును గొంతవఱకుఁ బ్రధానములే యయినను మొత్తముమీఁద సంస్కృతభాషాగౌరవము తగ్గలేదు. ఇటీవల మహమ్మదీయు లీదేశమున కధిపతులై నప్పుడు పారసీకభాషకు రాజాశ్రయము కలిగి యది ప్రబలినది. కాని, దానిప్రభావము వ్యావహారికభాషయందుఁ గనఁబడినట్లు గ్రాంథికభాషయం దగపడదు. మనభాష లదివఱకే వృద్ధినొంది యుండుటం బట్టియు, నవియుఁ బారసీకమును, కేవలవిజాతీయభాష లగుటం బట్టియుఁ బారసీకమునకు దేశభాషలయం దంతగాఁ బ్రవేశము దొరకలే దని తలంచెదను. పూర్వము చాళుక్యరాజ్యకాలమునందును- పిదపఁ గర్ణాట (విజయనగర) రాజులకాలమందును గొంతకాలము కర్ణాటకభాషకును గొంతకాల మాంధ్రభాషకును రాజాశ్రయము గలిగి యవి దక్షిణదేశభాషలలో

నెల్ల నధికగౌరవమును బొందినయవి. "దేశభాషలందుఁ దెలుగు లెస్స" యను సూక్తి యిందుకుఁ దార్కాణము. ఈకాలమందే తెలుఁగు స్వదేశమందు విజృంభించుటయే గాక పరదేశముల నైత మాక్రమించినది. పూర్వశాసనములఁ బట్టి చూడ నెల్లూరికి దక్షిణమునను, తిరుపతికిఁ దూర్పునను ద్రావిడభాషయే దేశభాషగా నున్నట్లు కనఁబడుచున్నది. ఇప్పుడో తూర్పున- చెన్నపట్టణమువఱకును బడమట- చిత్తూరువఱకును, దెనుఁగే వ్యాపించియున్నది. పూర్వము బల్లారిమండల మించుమించుగాఁ గాంతయుఁ గర్ణాటదేశముగానే యుండెను. దానిలో జాల భాగ మిప్పుడు తెనుఁగుదేశ మైనది. సమీపప్రదేశముల నాక్రమించుకొనుట మాత్రమే కాక ద్రావిడదేశమధ్యభాగమునఁ గూడఁ బ్రవేశించి, తంజావూరు, తిరుచునాపల్లి, పుదుకోట, మధుర మొదలగు ప్రదేశములఁ గొంతకాలము తెలుఁగుభాష విజృంభించినది. ఆకాలమందు దక్కడ ననేకాంధ్రగ్రంథములు వెలువడినవి. విజయనగరరాజ్య మంతరించినపిదప ద్రావిడదేశమం దాంధ్రభాషావిజృంభణము క్రమక్రమముగా క్షీణించి యిప్పుడు నామమాత్రావశిష్ట మైనది.

మహమ్మదీయప్రభుత్వము గతించినపిమ్మట నాంగ్లేయప్రభుత్వము క్రమక్రమముగా భరతఖండ మంతటను వ్యాపించి పాదుకొన్నది. రాజభాష యగుటచే నాంగ్లేయభాషయే గౌరవభాజన మైనది. రాజకీయవ్యవహారముల కావశ్యక మగుటచే భూతికి ఖ్యాతికిని గూడ నిదియే ముఖ్యసాధన మైనది. పాఠశాలలలో నాంగ్లేయగ్రంథము లవశ్యపఠనీయములు. దేశభాషాగ్రంథపఠన మనావశ్యక మైనది. దేశభాషలును వానితోపాటు కొంతవఱకు సంస్కృతము నసభ్యము లయినవి. ఇది యొక వింత గాదు. అన్యాక్రాంతము లగుదేశముల కెల్ల నీగతి తప్పదు. ఆదిని గ్రీకుభాష మహోన్నతస్థితియం దుండెను. పాశ్చాత్యవాఙ్మయముల కన్నింటికి నీ యవనవాఙ్మయమే మాతృక. రోమనులు గ్రీకుదేశము నాక్రమించుకొన్నపిదప గ్రీకులస్వాతంత్ర్యముతోఁ గూడ గ్రీకుభాష యౌన్నత్యమును క్షీణించినది. 1066 వ సంవత్సరమున నాంగ్లేయదేశము నార్మనులచే నాక్రమింపఁబడి కలకాలము వారిపాలనకు లోఁబడి యుండెను. అంతకుఁ బూర్వము 'ఆంగ్లోసాక్సను' భాష యాదేశమందు వ్యాపించి యుండెను. నార్మనురాజులు వచ్చినపిదప వారిమాతృభాష యగు 'నార్మన్ ఫ్రెంచి' భాష రాజకీయవ్యవహారమునందును గ్రంథరచనయందును దేశభాష కాదేశ మయ్యెను. ఇట్లు పరభాషచేఁ బాఱఁద్రోలఁబడి దేశ

భాష పామరముఖగహ్వరముల డాఁగి యుండి రూపుచెడి, కొంతకాలమునకు దే
శాభిమాన మను దోహదముచేఁ దిరిగి యంకురించి ప్రబలెను.

ఈప్రకారమే యీదేశమందుఁ గూడ నిప్పు డిప్పుడు దేశాభిమాన మం
కురించి దానిమూలమున దేశభాషలకుఁ గూడఁ గొంత వికాసము గల్గుచున్నది.
కాని వర్తమానదేశస్థితిని బట్టి బహుసంఖ్యాకము లగు దేశభాషల కుద్బోధము
కలిగించుట దేశాభివృద్ధి కనుకూలమా లేక ప్రతికూలమా యనుసంశయము
పలువురు ప్రాజ్ఞులమనంబుల బాధించుచున్నది. కావునఁ బ్రస్తుతవ్యవహారస్థితులను
బట్టి దేశభాషాభివృద్ధి దేశోన్నతికి సాధకమా బాధకమా యనువిషయము చ
ర్చింప నవసరము కలిగినది.

భరతఖండము బహుదేశాత్మక మనియుఁ బూర్వ మీదేశముల కైకమత్య
ము లేకపోవుటచే నన్నియు దుర్బలము లై యొకదాని వెంట నొకటి యన్యా
క్రాంతములు గావలసివచ్చి యుండుటవలన నీఖండమునకుఁ దొలుత నుండిన యౌ
న్నత్యము తగ్గిన దనియు, నీదుస్స్థితిని దొలఁగఁజేయు నభిలాష దేశమందుఁ బొడ
మిన దనియు నీభారతభూమిలో నివసించు నన్ని జాతులవారికిఁ దామెల్ల నేకజా
తివార మను బుద్ధి పుట్టినఁ గాని వారి కైకమత్యము కలిగి తన్మూలమున దేశాభి
వృద్ధి గాఁజాల దనియు, నేకత్వబుద్ధి కేకభాషాసేవ సాధకము నగుననియు నీహే
తువులచే బహురూపము లగు దేశభాషల వృద్ధిఁ బొందఁ గోరుట మనపురోవృద్ధికి
హానికర మనియుఁ గొందఱు దేశాభిమానుల యభిప్రాయము. సజాతీయభావము
దేశాభివృద్ధి కావశ్యకమే యనియు నైకమత్య మేకభాషాసేవవలన బలపడు నను
మాట కూడ సత్యమే యనియు నైనను దేశభాషాసేవ కూడ నవశ్యకర్తవ్య మని
యు మఱికొందఱు దేశాభిమానుల మతము. నే నీకోటిలోఁ జేరిన వాఁడను.
ఆసేతుహిమాచలము గల జను లందఱు నేకమతితో నభిలషించినఁగాని దేశోన్నతి
యొనఁగూడదు. నిరభ్యంతర సంపర్కమువలనఁ గాని యైకమత్యము కుదురదు.
సాహచర్యమున కేకభాషాసేవ ముఖ్యము. ఇది నిర్వివాదవిషయము. ఆంగ్లేయ
పరిపాలనము మూలమున నాంగ్లేయభాష యెల్లెడ వ్యాపించి యున్నది; గావున
నాభాషనే సామాన్యభాషగా నవలంబించుట యుక్త మని కొంద ఱందురు. ఈ
మతము కొంతవఱకు న్యాయమే. రాజభాష యగుటచే నీభాష యిదివఱకే
యంతట గౌరవభాజన మై యున్నది. దేశాభిమానోద్బోధకము లగు గ్రంథము
లనేకము లీభాషయం దున్నవి. ఖండాంతరసాహచర్యమున కిది యుపకరించును.

ఈహేతువులచే నాంగ్లేయభాష సేవ్యమే. కాని, పరభాష యగుటచే భరతఖం
డవాసుల కది స్వదేశాభిమానము వృద్ధిపఱుపఁజాల దనియు దీనికి బదులుగా
దేశభాషలలో నుత్తమ మనఁదగిన దానిని సామాన్యభాషగా గ్రహింపవలయు
ననియు హిందీ, లేక హిందూస్థానీభాష సర్వవిధముల నీపదవికిఁ దగి యున్న దని
యు మఱికొందఱ యభిప్రాయము. ఇదియు సయుక్తికమే. ఈరెండుమతములలో
నేది మంచిది యనుమాట యటుంచి దేశభాషావశ్యకత నిరూపించెదను:—

సామాన్యభాష యేదైనను దేశభాషలు తత్తద్దేశీయుల కవశ్యసేవ్య
ములే. విద్యాభివృద్ధివలనఁగాని దేశాభివృద్ధి గాదు. జనసామాన్యమునకు విద్యా
భ్యాసము మాతృభాషామూలమునఁ గావలయును గాని యన్యభాషామూలము
నఁ గాదు. ఇప్పు డాంగ్లేయభాష వ్యాపించి యున్నది గదా యని యందు రేమో.
ఆంగ్లేయభాష దేశభాషలఁగొంతవఱకుఁ గ్రోత్సహించుటకు మాత్రమే చాలినది గాని
జనసామాన్యమునకు విద్యావృద్ధికిఁ గారణ మైనది కాదు. ఆంగ్లేయభాష నభ్యసిం
చినవారిసంఖ్య యల్పము. అందాఱి తేఱినవారిసంఖ్య యత్యల్పము. జను లందఱు
నీభాష నభ్యసించి తన్మూలమున విద్యావంతులగుదు రనుమాట కల్ల. అట్లింతకు
ముం దెన్నఁడును జరిగి యుండలేదు. సంస్కృతభాష నిరంకుశముగా సర్వదేశ
ములందు వ్యాపించి యున్ననాఁడుఁగూడ నది దేశభాషలను సంస్కరించి పోషిం
చినదే గాని వానిని నిర్మూలము చేయఁ జాలినది కాదు. ఇఁకఁ బాశ్చాత్యభాషలు
చేయఁగలవా? ఒకవేళఁ జేయఁగల వందము. అది మనకు క్షేమకరము గాదు.
స్వదేశవ్యవస్థలయం దాదర ముండినఁ గాని దేశాభిమానము వర్ధిల్లదు. దేశవ్యవ
స్థలయం దెల్ల దేశభాష ప్రధానము. మాతృభాషను విడనాడి యన్యభాష నా
శ్రయించినవాఁడు పరులచే విడువఁబడిన ప్రాతగుడ్డలను గట్టికొనువానివంటివాఁడు.
అట్టివాని కాత్మగౌరవమే యుండదు. ఇతరులచే వాఁ డెట్లు గౌరవింపఁబడును.
గౌరవహీనుల కౌన్నత్య మెక్కడ? కనుకనే యిదివఱలో మాతృభాషను నిరా
కరించి యుండిన కొన్నిజాతులవారు దాని నిప్పుడు పునరుద్ధారణము చేయ య
త్నించుచున్నారు. ఐర్లండు, వేల్సు, ఈదేశపుఁబ్రజ లిదివఱలో నాంగ్లేయభాష
యం దాదరము హెచ్చి తమతమభాషల నించుమించుగా నంతరింపఁ జేసిరి. ఇప్పు
డది తప్పని తెలిసి మాతృభాషాపునరుజ్జీవనమునకై కంకణము కట్టుకొని పనిచే
యుచున్నారు. ఇంతకంటె వింత మఱియొకటి కలదు. 'జ్యూసు' (యూదులు)అను
నొక జాతివా రున్నా రని పలువురకుఁ దెలిసినవిషయమే. వారిపూర్వనివాసస్థా

నము "పాలస్టయిు" నను దేశము. వారి ప్రాచీనభాష "హీబ్రూ". ఈభాషయందే "బైబిలు" పూర్వభాగము రచియింపఁబడినది. ఏకారణముచేతనో యీభాష క్షీణించి యేసుక్రీస్తు పుట్టిననాఁటికే యంతరించినట్లు కనఁబడుచున్నది. "క్రీస్తు" అవతరించిన కొంతకాలమునకు 'పాలస్టయిను'దేశ మన్యాక్రాంత మగుటచే "జ్యూస్" చెల్లాచెదరై యాయాదేశములు చేరి యాయాదేశవేషభాషల నలవఱచుకొనిరి. ఇటీవల వారికి జాత్యభిమానము హెచ్చి నిర్జీవమయిన హీబ్రూభాషకుఁ బునఃప్రాణప్రతిష్ఠ మొనర్ప యత్నించుచున్నారు. ఇతరు లిట్లు చేయుచుండ సజీవములయి యేపు గలిగి యున్న మన మాతృభాషలను మనము నిరాకరించుట హాస్యాస్పదము కాకుండునా. సర్వశ్రేయస్సముచ్చయమునకు భంగము కలుగకుండఁ దత్తద్దేశీయులు తత్తద్దేశభాషల సేవించుట సర్వవిధముల శ్రేయస్కరము. ఈమతము ననుసరించియే పలువురు దేశాభిమానులు దేశభాషాభివృద్ధికై కడఁగుచున్నారు. ఈ యత్న మిప్పుడు భరతఖండ మంతటను జరుగుచునే యున్నది. ఆంధ్రభాషయందుఁ గూడ నూతన వికాసాంకురములు కన్పట్టుచున్నవి. ఈయంకురములను దృఢపఱుచుభారము విద్యాధికులయం దున్నది.

ఆంధ్రవాఙ్మయము ప్రకృతస్థితి:—ఆంధ్రవాఙ్మయ జీవితమునందు మూఁడవస్థలు కనిపట్టనగును. మొదటిది సంస్కృతగ్రంథానువాదమయము. రెండవది ప్రబంధమయము. మూఁడవది యగు వర్తమానావస్థ బహుముఖముగా నున్నది. సంస్కృతగ్రంథానువాదరూపము లగు నాంధ్రగ్రంథము లిప్పటికిని బుట్టుచునే యున్నవి. వానితోపాటాంగ్లేయాద్యన్యభాషాగ్రంథములు మాతృకలుగాఁ గొన్నిగ్రంథములు బయలుదేఱుచున్నవి. పూర్వము లేని నాటకములు, నవలలు, లెక్కకు మిక్కిలిగా వెలువడుచున్నవి. దేశచరిత్రమును దెలుపుపుస్తకములు నచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. నవీన శాస్త్రమర్యాదల సూచించు చిన్ని పుస్తకములు కొన్ని గలవు. వార్తాపత్రికలు క్రమక్రమముగా వ్యాపించుచున్నవి. ఆంధ్రవాఙ్మయవాహిని యిన్ని పాయలుగాఁ బ్రవహించు చున్నను నవలలు నాటకములు నను నవి రెండే పెద్ద పాయలు. ఆధునికాంధ్రవాఙ్మయమునకు ముఖ్యలక్షణము లెవ్వి యన, నవలలు నాటకములు నని చెప్పవచ్చును. నాటకములకు మాతృకలు సంస్కృతనాటకములు. నవల లాంగ్లేయనవలలకుఁ బుత్రికలు. ఇప్పుడిప్పుడు బంగాళీ మొదలగు కొన్ని దేశభాషలలో నున్న నవల లనువదింపఁబడుచున్నవి. కాని, యింతవఱకు స్వతంత్రగ్రంథము లని చెప్పఁదగిన నవలలసంఖ్య యత్యల్పము.

కొంద ఱట్టి నవలలు లేవందురు. నాటకములస్థితి గూడ నట్లే యున్నది. సంస్కృతమునుండి తెనిఁగింపఁబడిన కొన్ని నాటకములు మాతృకలసాహాయ్యము లేక యన్వయింపవు. స్వాతంత్ర్యవేషమును దాలిచిన నాటకములు కొన్ని గలవు గాని వానిలో సరసము లని యెన్నఁ దగినవి మిక్కిలి తక్కువ.

ప్రతికావ్యమునకును ముఖ్యోద్దేశ మొకటి యుండి రచనాపద్ధతి యందుల కనుకూలముగా నుండెనేని యాకావ్యములు శోభిల్లును. కావ్యము వలని ప్రయోజనము వినోద మని కొందఱును వివేక మని కొందఱును, బండితులు బహుదేశములయందు భిన్నాభిప్రాయు లయి యున్నారు. ఈరెండు మతములను సమన్వయము చేసి విద్యానాథుఁడు కావ్యప్రయోజన మిట్లు నిర్ణయించెను.

యద్వేదాదధిగతం శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాన్తాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే.

కర్తవ్యాకర్తవ్యముల నిరూపించి కర్తవ్యకరణమం దాసక్తియు నకర్తవ్యమునం దువైముఖ్యమును గలిగించుట గ్రంథము లన్నిటికిసామాన్యప్రయోజనము. వేదశాస్త్రము లుభయము మూలమునను బురాణములు యుక్తిమూలమునను నీప్రయోజనమును సాధింపఁ జూచును. కావ్యములోఁ గర్తవ్యాచరణమునందు సరసత్వము నకర్తవ్యాచరణమునందు విరసత్వము నాపాదించి తన్మూలమునఁ గార్యసిద్ధిని బడయఁ గోరును.

సరసత్వము కావ్యలక్షణవిశేషము. సదర్థబోధన మను నౌషధమున కిది తీయని యనుపానము. మం దెంతమంచి దైనను రుచ్య మగు ననుపానము లేక లోపలకుఁ బోదు. లోపలికిఁ బోయినఁ గదా దానివలన గుణము కనఁబడుట. కావుననే కావ్యమున కుత్కృష్టతను విద్యానాథుఁడు ప్రతిపాదించెను.

దోషరహితములు గుణసహితములు నగు కావ్యములు సరసము లగును. (త దదోషౌ పరికృతౌ చ వాగర్థౌ- ఆంధ్రశబ్దచింతామణి) గుణదోషనిర్ణయము కావ్యశాస్త్రమునందుఁ జేయఁబడినది. కేవల శబ్దచమత్కారమే ప్రధాన మని కొందఱ యభిప్రాయము. దీనిం బట్టియే పూర్వకవులు కొందఱు శబ్దశ్లేషలు దీర్ఘసమాసములు నతిమాత్రముగాఁ బ్రయోగించి కావ్యములం బాడుచేసిరి. ఇప్పటికావ్యములలో నీదోషము లంతగా లేవు గాని దోషాంతరము లధికముగఁ

గనఁబడుచున్నవి. వీనిలో రసౌచిత్య మొక పెద్దదోషము. ప్రతికావ్యమునకును
గన్యుద్దిష్ట మగు ముఖ్యార్థ మొకటి యుండవలయును. కావ్యరచనాపద్ధతి యంత
యు నాయర్థమున కనుకూలముగను బోషకముగను నుండవలయును. లేనిచో
రసౌచిత్యదోషము పట్టును. కావ్యము విరస మగును.

పూర్వకావ్యములతోఁ బోల్చి చూడ నిప్పటి కావ్యములందు ధారా
శుద్ధి తక్కువ. ధారాశుద్ధి యుండినఁ గాని కావ్యము హృద్యముగా నుండదు.
భాషాపరిచయముకంటె గ్రంథనిర్మాణోత్సాహ మధికముగా నుండుటయే దీనికి
ముఖ్యకారణము. ఆంగ్లేయభాషాభ్యాసము మనదేశములో వ్యాపించినపిదప
నాంధ్రభాషాసేవ తగ్గినది. సామాన్యముగాఁ బట్టపరీక్షయం దాఱితేఱిన వారికిఁ
గూడఁ బూర్వపు బడులలోఁ జదువుకొన్నవారి కున్న యాంధ్రభాషాజ్ఞానము
లే దనియే చెప్పవచ్చును. అయిన నిప్పుడిప్పుడు దేశాభిమానముచు దస్మాల
మున దేశభాషాభిమానమును నంకురించి పలువు రాంధ్రగ్రంథముల రచించుట
కారంభించినారు. ఇది భావిశుభసూచక మనుటకు సందేహము లేదు. కాని,
యిప్పుడు గ్రంథరచనచేయువారలలో దక్షులగువారిసంఖ్య యల్ప మని చెప్పక
తప్పదు. ఏదయిన నొకకార్యము చేయవలయునన్న నుత్సాహ మావశ్యకము.
అయిన నది యొక్కటియే చాలదు. దక్షత యుండవలయును. లేనిచోఁ గార్యము
సుకృతము గాదు. ఆంధ్రుల మైనంతమాత్రమున మన కందఱకు నాంధ్రభాష
చక్కఁగా వచ్చు ననఁగూడదు. సామాన్యవ్యవహారమునకుఁ జాలినంత భాష
యందఱకు వచ్చును. కాని సద్గ్రంథ నిర్మాణమునకు వలయుభాష పూర్వసద్గ్రం
థములం జదివినఁగాని యలవడదు. ఆంగ్లేయులందఱు నాంగ్లేయభాష నెఱిఁగిన
వారే. "మార్లే"దొరవలె వ్రాయఁ గలిగిన వారెంద ఱుందురో నిర్ణయింప సుల
భము గాదు. పరిశ్రమము చేయకయే మాతృభాష యలవడు నని కొంద ఱందు
రుగాక. అది సరి కాదు. భావముల కైనను భాష కైనను సత్కృతులఁ బఠింప
వలయును. అవి గాక వేఱొక యుపాయమున విద్య యభ్యస్తము కాదు.
ఆంధ్రవాఙ్మయప్రపంచమున కెల్ల భారతము మూలస్తంభము. దానిలోఁ గొన్ని
పర్వము లయినను సవిమర్శముగాఁ జదువనివాఁడు తెనుఁగుభాష నభ్యసించితి
నని చెప్పుకొనఁ దగదు.

# తిక్కనార్యకృతవిరాటపర్వవిమర్శనము.

— మొదటిభాగము. —

—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు- కాకినాడ.—

లోకములో సారస్వత మెంత యుండినను సద్విమర్శనము లేకయుండిన లాభ మింతయు నుండనేరదు. వినియోగపరిజ్ఞానము లేకుండిన విత్త మెంత యుండినను లాభ మెట్లుండనేరదో యట్లే వినియోగపరిజ్ఞానము లేనివిద్యవలనను బ్రయోజన మంతగ నుండనేరదు. సదసద్వివేచనజ్ఞాన ముండినం గాని వినియోగ పరిజ్ఞానము వెలయనేరదు. అందులకై విమర్శనము లవసరములు.

తరిచి చూచినపిమ్మటను గదా మహోదధియందు నమృత ముద్భవించినది. కావున మథించి పరిశీలించినం గాని సారస్వతాంభోధియందు విబుధానుభవయోగ్యం బగుమనోహరసుధ పుట్టనేరదు.

ఒప్పుతప్పెరయురసజ్ఞు లుండినం గాని సత్కావ్యములు పుట్టఁజాల వని యాంధ్రకవితాపితామహుఁడు నుడివియున్నాఁడు. దీనింబట్టి సత్కావ్యములు జనించుటకు సద్విమర్శనము లవసర మనియే తేలుచున్నది.

ఎవ రెన్ని చెప్పినను మనలో నొప్పుతప్పెరయురసజ్ఞత చాలఁ దక్కువగా నున్నది. ఇదివఱకు మంచివిమర్శనములు లేనేలే వనవచ్చును. విమర్శనముల వలని లాభము మనవారికిఁ దెలియకపోవుటచేతనే మనలోవిమర్శకు లన్నను విమర్శనము లనినను హెచ్చగు నుపేక్షాభావము కలిగియున్నది.

మఱియు నొప్పులనే చూపవలయును గాని తప్పులను జూపరా దను దుర్భ్రమ కూడ మనలో నిదివఱకు గాఢముగాఁ గలదు. దోషజ్ఞత మనలో నుండి తొలఁగి పోవుచుండుటచేతనే నిక్కమగు పాండిత్యము కూడ నదృశ్య మగుచున్నది. కావుననే మనవాఙ్మయ మనుకరణమూలమై నిస్సారమై పోఁజొచ్చినది. ఇది కేవల దేశీయపద్ధతియందున్నలోపము. ఇది కొంతవఱ కతృప్తికరముగా నున్నమాట నిజము. ఇపుడు పాశ్చాత్యనాగరకత మనదేశరంగమున నాట్య మాడఁ జొచ్చినతరువాతఁ బూర్వపద్ధతు లన్నియు మాఱిపోవుటయు ను మనసారస్వతములోనికి విమర్శనములు వచ్చి పడుచుండుటయుఁ గలుగుచున్నది. కాని యవి సదసద్వివేకజనితములు కాక గుణదోషవిభాగము సరిగఁ జేయఁజాలని నీరసస్థితిలో నున్నవి. అది గాక మనయువకుల హృదయక్షేత్రములందు విజాతీయ సారస్వతపరిచయమాత్రజనితాపూర్వభావాభాసగుల్మము లుదయించి ప్రబలి

సరససద్భావనసస్యముల కడ్డువచ్చి వానిని జంపివేయుచున్నవి. ఇందుమూలముచే హాని యెక్కు వగుచున్నది. ఇది విదేశీయపద్ధతుల నంధపరంపరగా ననుసరించుటవలనఁ గలిగిన పెద్దలోపము. కాన నిది మఱింత నిస్సారతను గలిగించుటయే గాక యవలక్షణభూషితత్వమును గూడ హెచ్చుగఁ దెచ్చిపెట్టుచున్నది. కాన నీరెండును గూడ హానికరముగా నున్నవి కాని సారస్వతాభివృద్ధికి బాగుగ ననుకూలించునవిగా లేవు.

ఈదురవస్థనుండి మనసారస్వతమును దప్పించుటకై సద్విమర్శనముల వెలయింపఁజేయవలసిన యవసరము తటస్థించినది. నిక్కమగుసారస్వతమార్గమును దెలిసికొనంజాలక మనవారు పెడదారులం బడుచుండుటం గని నిక్కమగు విమర్శనమార్గముం జూపి మనసారస్వతము క్రమాభివృద్ధి నందునట్లు చేయుతలంపుతో సదసన్నిరూపణపూర్వకము లగువిమర్శనములు వ్రాయ మొదలిడితిని. నాయాశయములను గ్రహింపఁజాలనివారు నేను బహుగ్రంథములపై ఖండనముల వ్రాయుటే ముఖ్యోద్దేశముగాఁ బెట్టుకొనినట్లు భ్రమ చెందుచున్నారు. మనుచరిత్రాదిప్రబంధముల విషయములో దోషములను గుణములను గాను గుణములను దోషములను గాను బరిగణింపఁజేయు విమర్శనములు బయలుదేఱి సారస్వతాభిమానుల నపమార్గములఁ ద్రొక్కించి గమ్యస్థానము దుర్లభ మగునట్లు చేసివేయుచుండుటచే లోకంబున సత్ఫలప్రాప్తి కలిగించుటకై యిదివఱకు విమర్శనములను వ్రాసియుంటిని. అట్టియవసరమే పుట్టి నన్నపార్యాదుల పొత్తములం గూర్చి కూడఁ గావించితిని. ఇప్పుడు తిక్కనార్యునివిరాటపర్వముంగూర్చి వెఱ్ఱిపోగడ్తలుకూడ మనపండితముఖములనుండియే బయలువెడలుచున్నయవి. నేను పైని జూపిన రీతిగా మనసారస్వతముకంటె దేశకాలపాత్రములంబట్టి కొంతవిలక్షణమై యుండు నాంగ్లసారస్వతముయొక్క పరిచయలేశమును బట్టి కలిగిన మనోవికారములకు లోనై మననవనాగరకులు మనసారస్వతమునకు నవలక్షణములను బెక్కింటిని దెచ్చిపెట్టఁ బ్రయత్నించుచున్నారు. పాశ్చాత్యసారస్వతము నైనను సరిగ గ్రహించియుండిన నంతగా హాని యుండదు కాని యల్పజ్ఞత నొకింత సంపాదించుకొని దానిని బెద్దచేయువారివలన హాని విశేషమగుచున్నది. మనుచరిత్రవిమర్శనములో నీయంశము చాలభాగము ఋజువుచేసియున్నాను. విరాటపర్వవిమర్శనమునందుఁ గూడ నావిషయమునే హెచ్చుగాఁ జూపవలసియున్నది. జగమున సద్విమర్శనముల వ్యాపింపఁజేసి సత్యసారస్వత

జ్ఞానము వృద్ధి నొందించుటకయి యీయుద్యమము గావింపఁబడుచున్నది. నేను సత్క్రమనిర్మాణకార్యక్రమమునకు భంజకములుగా బయలువెడలుచున్న నవీనకుటిల విమర్శనముల నిర్మూలించి జగమున సత్కావ్యనిర్మాణమున కనుకూలించు విమర్శనములనే వ్రాయుచున్నాను. కావున భాషాభిమానులు దీనిని సావకాశముగాఁ జిత్తగింతురుగాక!

—భారతాంధ్రీకరణము గావించుటలో తిక్కన దృక్పథమేమి ?—

తిక్కనార్యుని భారతరచనమునుగూర్చి చర్చించుకొనుటకుం బూర్వము దానిని విరచించుటలో నామహాకవియొక్క దృక్పథ మేదియో మనము తెలిసికొనవలసియున్నది. ఏమనఁ:- నవనవవిమర్శకులు పెడమార్గములం బడి తిక్కనార్యునిదృక్పథము వే అనియు, నయ్యది నన్నపార్యునిదృక్పథమువంటిది కాదనియు- ఆసంగతిని దెలిసికొనినం గాని తిక్కమఖిగ్రంథముల విమర్శించుటకుఁ దగు నర్హతయే యుండ దనియు నొక్కి వ్రాసియున్నారు. కాన దానింగూర్చి ముందుగాఁ బరిశీలించుకొనవలసి వచ్చినది. తిక్కన యే దృక్పథముతో భారతాంధ్రీకరణము కావించెనో యయ్యది కావ్యకళాదృష్టి యని నవనవవిమర్శకులు సిద్ధాంతీకరించుచు నిట్లువ్రాసిరి. "ఈతనిది ముఖ్యముగాఁ గావ్యకళాదృష్టి, రసమయ మగు దృష్టియే గాని నన్నపార్యుని సంహితారచనాదృష్టి--యాగఫలసంపాదనాదృష్టి-వైదికమతధర్మరక్షణదృష్టియు మాత్రము కాదు."

మఱియు నీ రిట్లు వ్రాయుటతోఁ దృప్తి నొందకః-"భారతము పంచమవేదంబై ధర్మబోధకగ్రంథముగా దలఁపఁబడుటచే ధర్మబోధకము లగుశ్లోకముల ను గొన్నిటిని సమయముదొరకినపుడెల్ల నాయాపాత్రములచేఁ బలికించుచుండుట యాచారమై నట్లున్నది. అట్లే యిచ్చట ద్రౌపదిచేఁ బరదారాభిమర్శనము పాపమని బోధించు నొకయుపన్యాస మిప్పించినారు. కాని తిక్కనార్యుఁ డీభారతమును గేవలధర్మబోధకం బగుగ్రంథముగఁ జేయుట కెప్పుడును బ్రయత్నింపలేదు. సందర్భానుకూలముగా నీతిబోధ యావశ్యకమైనపుడు ధౌమ్యాదుల నీతిబోధనలవలె చక్కగా రచియించునే కాని సమయము దొరకినప్పుడెల్ల ధర్మబోధకుఁ గడంగఁడు. అని వ్రాసిరి. కావ్యకళాదృష్టినే ప్రధానముగాఁ జేసికొని భారతాంధ్రీకరణము కావించె ననిరి. ఈభారతసంహితను బ్రబంధమండలిగా మార్చివేసినాఁడనిరి. ధర్మబోధ యనిన నన్నపార్యున కెంతయుత్సాహము కలదో యంతయుత్సాహము యుద్ధవర్ణనమన దిక్కనార్యునకుఁ గల దని వీరు వ్రాసిరి.

ధర్మప్రధాన మగు భారతామ్నాయమును రసప్రధాన మగు భారతప్రబంధముగా మార్చుట యనఁగా సత్యముచే మహాభారతమును జాలహీనస్థితిలోనికిఁ దెచ్చుటయే యగును. అతిపవిత్ర మగుదేవాలయమును వినోదదాయక మగు గృహస్థాలయముగా మార్చుటవంటిదే యగును తిక్కనార్యుఁడు కూడ నీక్రింది పద్యములో భారతమును, బంచమవేద మని యు ధర్మమూలం మనియు లిఖించి యున్నాఁడు.

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైనయామ్నాయమున్.

క. వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.

ఇట్టి దానిని గావ్యకళాదృష్టితో విరచించుట యన దానిఘనతను దీసివేయుట గాదె!

మహాభారతము బహువిధదృక్కులు ప్రధానముగాఁ జేసి వ్రాయఁబడినయమూల్యవిషయసర్వస్వము. భారతదృక్పథములంగూర్చి యాదికవి యగు నన్నపార్యుఁడు వ్యాసాశయముల ననుసరించి యిట్లు వ్రాసినాఁడు.

"సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణం బనియును నైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ, డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరఁగుచుండఁ జేసె భారతంబు."

భారతదృక్పథములు పెక్కింటిలోఁ గావ్యకళాదృష్టియొకటియని యీపద్యమువల్లఁ దేలుచున్నది. అనేకదృక్పథములలో నొక్కదానిని బ్రధానము చేసికొని గ్రంథము వ్రాయుట యన దానిని హీనస్థితిలోనికిఁ దెచ్చుట కాదా ? తిక్కనకుఁ గావ్యకళాదృష్టియే ప్రధానమైనచోఁ దెలుఁగున నొక్క భారతచంపువును వ్రాసిన బాగుగ నుండియుండును. అంతియే గాని పంచమవేదమును దెలుంగులోనికి

దెత్తు నని చెప్పి కావ్యకళాదృష్టినే ప్రధానముచేసికొని ధర్మాదుల నంతగాఁ బాటింపక గ్రంథము వ్రాయుట యెంతమాత్రమును దగియుండ నేరదు.

తిక్కనార్యుఁడు తాను గావ్యకళాదృష్టితో వ్రాసితి నని యెచ్చటను చెల్పలేదు, గాని, యాతని భాషాంతరీకరణగమనికంగనఁ దనకావ్యకళాచాతురిని జూపుటకై తీసికొనిన శ్రమను ధర్మాదివివరణములకై తీసికొనలే దను బోధలోనికి వచ్చును.

—తిక్కనార్యుని యద్వైతదృష్టి—

తిక్కనార్యుఁ డద్వైతదృష్టితోఁ గూడ భారతాంధ్రీకరణ మొనరించె నని మనవవిమర్శకులు వ్రాసిరి. కాని యది మూలములేనివ్రాత. తిక్కన వేదాంత పరిజ్ఞానము కలవాఁడే కావచ్చును గాని యాతనిగ్రంథ మా యంశమును రూఢి చేయుట లేదు. ఏమన, మహాభారతమునందలి ముఖ్య వేదాంత భాగముల నన్నిటి ని నీతఁడు తెనిఁగింపక విడిచివేసినాఁడు. పంచమవేదమునకుఁ బ్రాణభూత మైన భగవద్గీతనే యాతఁడు ముట్టలేదు. ఉత్తరగీతల స్పృశింపలేదు. సనత్సుజాతీయాదుల నంటలేదు. ఇట్టి వనేకములు గలవు. కావున నీతఁ డద్వైతదృష్టితో వ్రాసె ననునది వట్టిస్తవమాత్ర మగుచున్నది, కాని, వాస్తవ మగుటలేదు. ఇంక నీతఁడు కావ్యకళాదృష్టితో భారతమును విరచించినాఁ డనునది మాత్రము కొంతవఱకు సత్య మగుచున్నది.

ఏ మైన నేమి? విరాటపర్వము ముఖ్యముగాఁ గావ్యకళాదృష్టితోనే వ్రాయఁబడిన దని చెప్పినఁ జెప్పవచ్చును. ఏమన, నందుఁ బురుషార్థచతుష్టయములో నర్థకామములకే హెచ్చుగుతావు కలదు కాని ధర్మమోక్షముల కంతగాఁ దావు లేదు. తిక్కనార్యున కిది చాలఁ బ్రీతికర మైన పర్వము. ఈతనికి దీనియం దున్న 'మో' జితరపర్వముల యందు లేదు. కావుననే యాతాను దెనిఁగించువదునేనుపర్వము లను గూర్చి పీఠికలో ముచ్చటించునపుడు విరాటమును మాత్ర మీక్రిందిరీతిగాఁ బ్రత్యేకముగా వర్ణించి యితరముల వర్ణింపక విడిచినాఁడు కనుఁడు.

మ. హృదయాహ్లాది చతుర్థమూర్జితకథోపేతంబు నానారసా
  భ్యుదయోల్లాసి విరాటపర్వ మట నుద్యోగాదులుం గూడఁ గాఁ
  బదునేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
  దుదిముట్టంగ రచింపుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

ఇందుఁ గథాచమత్కారము కల దని రససముంచిత మని కాన హృదయా హ్లాదక మని నుడివినాఁడు. దీనిని శృంగారాదివర్ణనములతో విశేషముగాఁ బెంచి వ్రాసినాఁడు. కావున నీతనికావ్యకళాచాతురిని దెలిసికొనుటకు నీపర్వవిమర్శన మును బెట్టుకొనుట యుచితమే.

కాని మనపవవిమర్శకులు కవికులసార్వభౌముఁ డగుతిక్కనార్యుని కవితా రహస్యమును బాగుగ గ్రహించుకొనంజాలక తమయభినవకళాచాతురిచే నాతని నిలువఁబెట్టవలసియున్నట్లు భావించి తమమెదడులోఁ గ్రొత్తగాఁ బ్రవేశించి వికార ములఁ బుట్టించుచున్న పాశ్చాత్యకవితావిశేషాభాసములనే సోమయాజియుచు బ్రధానముగాఁ జేసికొని కావ్యకళను బెంపుచేసె నని తేల్చుచు సంగలను స్వక స్తవములఁ జేయు మొదలిడిరి. వీరియపమార్గక్రమము తిక్కయజ్వమార్గమున కెంతదూరముగా నున్నదో ముందింకఁ జూపవలసియున్నది.

— కావ్యాలంకారములం గూర్చి —

చక్కని సునిశితవిభాగ మొనరించి యలంకారముల నిరూపించుటలో మనహైందవులు చూపినంత బుద్ధివిశేషమును బాశ్చాత్యులు చూపలే దని మోనియర్ విలియమ్స్‌దొర తన హిందూవిజ్ఞానము (Indian Wisdom) అనుగ్రంథములో వ్రాసియున్నాఁడు. మనవారు వ్రాసిన యలంకారశాస్త్రము చాల విపులముగ నున్నది. శాస్త్రము విపులముగా నున్న దన నలంకారముల శాస్త్రకారుఁడు కల్పించె నని యర్థము కాదు. అవి లోకమున సహజముగాఁ గలవు. అయ్యవి కవులకావ్యములందు మాత్రమే వాడఁబడుచున్నవి కావు. లోకులు బాలురు స్త్రీలు వృద్ధులును గూడ నిత్యమును గావించుసంభాషణము లందును వాడఁబడుచున్నవి. మఱియును మనమహాకవులగ్రంథములలో నెన్ని యలంకారములు కలవో యన్నియును బాశ్చాత్యమహాకవుల పుస్తకరాజములం దుఁగూడఁ గలవు కాని వాని నన్నిటిని మనశాస్త్రజ్ఞులు సూక్ష్మబుద్ధితో విభా గించి చూపియున్నారు. పాశ్చాత్యపండితు లంతవివరమునకుఁ బోలేదు. కాన వారు పరిగణించి చూపునలంకారములసంఖ్య చాలఁ దక్కువగానున్నది. కావ్యా లంకారము లనునవి మానవుఁడు దేహమున నలంకరించుకొను సువర్ణాద్యలంకార ములవలెఁ బైనుండి వచ్చుక్రొత్తవస్తువులు కావు. కవితాతను వగుశబ్దార్థములందే యవి యిమిడి యుండును గాన నవి సహజములే. మనవా రలంకారములం గూర్చి తఱచుగా ముచ్చటించుచుండుటయును బాశ్చాత్యులంతగా ముచ్చటింప

కుండుటయును గని మన నవవిమర్శకులు వానియం దరుచికలవా రగుచున్నారు. దీనికిఁ గారణము పైఁ దెల్పఁబడినరీతిగాఁ బాశ్చాత్యులందు వీని కంతగాఁ బ్రచారము లేకుండుటయే. ఆకారణముననే మన నవమేధావు లలంకారము లందు ద్వేషభావమును గూడ వహించి యవి కావ్యములం దుండ నవసరమే లే దని కూడఁ జెప్పుచున్నారు. అట్టి నూత్నాభిరుచి గలమననవవిమర్శకులు తమ యం దున్న యీ యపూర్వాభిరుచినే తిక్కనకును దగిలించి "సామాన్యముగా తిక్కన యలంకారములనే ప్రయోగింపడు" అని సాహసించి లిఖించిరి. న్యాయ ముచేఁ గవుల వాక్యచమత్కారములకే యలంకారము లని పేరు. కాన, తిక్క నయలంకారములను వాడఁ డనఁ జమత్కారవాక్యములు వాడఁ డని యర్థము చెప్పు కొనవలసివచ్చును. ఇది హాస్యాస్పదము కాదా.

—తిక్కనార్యుని యలంకారప్రియత్వము.—

సోమయాజి యలంకారప్రియులలో నగ్రగణ్యుఁ డని యాతని విరాట పర్వమువలననే తెలియవచ్చుచున్నది. ఎట్లన- కావ్యముల సాలంకారతం గూర్చి యలంకారశాస్త్రములలో నభిప్రాయభేదములు కలవు. కావ్యప్రకాశకారాదు లంతటను సాలంకారత యుండవలసినదే కాని యాయున్న యలంకార మేదేని యొకచోట స్ఫుటముగా లేకుండినను హాని లే దని తలంచిరి. సాహిత్యదర్పణ కారాదు లట్లు తలంపక సర్వత్ర స్ఫుటాలంకారత యుండవలె నని నొక్కిచెప్పిరి. తిక్కన యీ రెండవపక్షములోనివాఁడు; అనఁగా సర్వత్ర సాలంకారత యుండ వలె నను వారిలోనివాఁడు. ఈతఁడు తనవిరాటపర్వములో నర్తనాగారము వర్ణిం చుసందర్భములో "విమతకావ్యంబునుం బోలె నస్పష్టాలంకారం బై" యని వ్రాసినాఁడు. అస్పష్టాలంకారత (అస్ఫుటాలంకారత) మహాకావ్యలక్షణము కా దని దీనింబట్టి తేలుచున్నది. అలంకారములం గూర్చి యిట్టి తలంపులఁ దనవిరాట పర్వమునందే వెలిపుచ్చినతిక్కన యలంకారముల వాడుటలో వెనుదీయునా ? అట్లుచేయఁడు. ఇంతయేల మనవారుగూడ సామాన్యముగాఁ జూచు శబ్దాలంకార ముల వాడుటలోఁ గూడ నీతఁడు చాల శ్రద్ధవహించువాఁడే. విరాటపర్వమునం దంతటను శబ్దాలంకారముల విచ్చలవిడిగా వాడి యున్నాఁడు. ఈవిషయమును గూర్చి విపుల మగు వ్యాసమును వ్రాసి త్రిలింగపత్త్రికారాజములో "ఆంధ్రకవి తాగురుకవిత్వాదిప్రశంస" అను శీర్షికక్రింద నేనిదివఱకుఁ బ్రచురించి యున్నాను. కాన గ్రంథవిస్తరభీతిచేఁ దిక్కనార్యుని శబ్దాలంకారప్రియత్వముం జూపు నుదా

హరణములను నొకటిరెండిటి నిచట నిచ్చుచున్నాను. మనవవిమర్శకులు విశేషముగా మెచ్చుకొనిన శమీతరువర్ణనమునఁ దిక్కన యిట్లువ్రాసె.

గీ. కనియెఁ బవమానవివిధనర్తనకళాని,వర్తిఁ గాకఘూకారవస్ఫూర్తిజాత
భీతిపరిసరవర్తి నాభీలభుజగ,చండమూర్తి శమీతరుచక్రవర్తి.

ఇందులో నర్తన, నివర్తి, స్ఫూర్తి, వర్తి, మూర్తి, చక్రవర్తి, యనిశబ్దాలంకారము విశేషముగా వాడఁబడినది. ఈశబ్దాలంకారము కావ్యరసస్ఫోరకముగాఁ గూడ నంతగా లేదు. అది గాక జమ్మిచెట్టు తుమ్మ లోనగు క్షుద్రతరువులలోనిది కాని రావి మఱ్ఱి మున్నగుమహావృక్షములలోనిది కాదు. అయినను "ర్తి" పలు సారులు వచ్చునట్లు చేయుటకై 'శమీతరుచక్రవర్తి' అని మనకవి వాడినాఁడు. ఇంకను గాకములు ఘూకములు నొక్కసమయమున నొకచోటఁ గూడియుండి ధ్వనిచేయునవి కావు. పగలు మసలునవి కాకములు, రాత్రిఁ దిరుగు నవి ఘూకములు. కాన, పగటిపూఁటఁ గావింపఁబడిన యీవర్ణనమునఁ "కాకఘూకారవస్ఫూర్తి" యనుట కేవలశబ్దాలంకారప్రియత్వమునే తెలుపుచున్నది. ఇంకను గర్ణప్రశంస వచ్చినచోట్లఁ దఱచుగా "కర్ణవికర్ణ" యని వాడుచు వచ్చినాఁడు. కర్ణవికర్ణులు జంటగా నుండువారు కారు. సమానబలపరాక్రమములు కలవారు కారు. ఇట్టివారిని గలిపి 'కర్ణవికర్ణ' యని వాడుట కేవలశబ్దాలంకారప్రియత్వమునఁ గాక మఱొకల కగును. మఱియును గామాతురుఁడైనాఁ డని చెప్పవలసిన చోటుల "కందర్పదర్పగోచరుఁడై" యని విసువు లేకుండఁ దిక్కన వాడినాఁడు. ఇది శబ్దాలంకారప్రియత్వమును సూచిచేయును గదా. ఇట్టిప్రయోగములు విరాటపర్వము నిండఁగలవు. ఈతఁడు మొదటిపద్యములో "ఇచ్చమెచ్చు" అని వ్రాసి తుదిగద్యములోఁగూడ "ఉభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి" అని వ్రాసినాఁడు. (బుధారాధనవిధేయతిక్కననామధేయ- అని యుత్తరరామాయణగద్యములో లిఖించినాఁడు) ఇవి యన్నియు శబ్దాలంకారప్రియత్వమునకే గదా ప్రబలసాక్ష్యము లగుచు? ఈవిధముగా శబ్దాలంకారప్రియుఁడైయుండువాఁడు రసోపస్కారకము లగునర్థాలంకారముల వాడుటయందాసక్తి లేనివాఁ డగునా? కాళిదాసునివలె బహుప్రౌఢముగా నీతఁ డర్థాలంకారముల వాడినాఁ డని బహువిమర్శకులు వ్రాసియున్నారు. ముం దర్థాలంకారములం గూర్చి చర్చించుకొందుము గావున నిచట నింతటితోఁ గట్టిపెట్టుదము. వేయేల యలంకారప్రియుఁడు కానివాఁడు కవి యెన్నఁటికిని గానేరఁడు. గొప్పకవు లలం

కారములు వాడ రనుభ్రాంతికి లోనై నవనవవిమర్శకులు తిక్కన కలంకారము
లనిన గిట్ట దని వ్రాసివేసిరి. ఇది హూణవిద్యాపరిచయము గల తమయం దున్న
యభిరుచి కాని తిక్కనది కాదు. తిక్కనార్యుని కవిత్వవిశేషమును నవనవవిమర్శకు
లు సరిగఁ దెలిసికొనియే యుండలే దని దీనివలన స్పష్టముగఁ దేలుచున్నది. ఇఁక
వీరివిమర్శన మపమార్గమునం బడిన దని వేఱుగఁ జెప్పవలయునా?

— కుచాదివర్ణనప్రశంస —

ఇఁకఁ బాశ్చాత్యసారస్వతాభిరుచిచే మోహితు లగునవమేధావు లేవ
గించుకొను మనకావ్యరచనావిశేషములలోఁ గుచాదివర్ణనము గూడ నొక్కటి
యగును. వారియేవగింపులజోలి మన కేమిటికి, కాని, కుచవర్ణనముపైఁ దమకుఁ
గలయరుచిని దిక్కనార్యునకుఁ దగిలించి కుచాదివర్ణన మన నాతనికి గిట్ట దనియుఁ
గుచముల వర్ణన మాతఁడు చేయలే దనియు నవనవనాగరకులు సాహసించి వ్రా
సిరి. కుచాదివర్ణనము కూడ దనుటకుఁ గూడ నొకగొప్పకారణముం దెలిపిరి.
కుచములు, నాభి, వళులు మున్నగునవి కట్టుబట్టలోపల నుండి పోవునఁట. అవి
పైకిఁ గాన్పింపవు కావున వానిని దిక్కన వర్ణింపలే దఁట! దీనింబట్టి కావ్యకళా
దృష్టి నవనవవిమర్శకులకు లే దనవలసివచ్చుచున్నది. ఇది నవనవవిమర్శకుల
రుచి కాని తిక్కనార్యునిది కాదు. మనకవులు కన్నులతోఁ జూచినదానిని మాత్ర
మే వర్ణింపవలె నను తలంపు కలవారు కారు. "కనుఁగొను కంటె నద్భుతము
గా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్" అని మన కవులే చెప్పిరి. ఇంతయేల, తిక్క
నార్యుఁడు బట్టలో నిమిడియుండు కుచములు, నూగారు, వళులు, మున్నగువానిని
వర్ణించియే యున్నాఁడు. వానిని నవనవవిమర్శకులు చూచుకొనలేదు. కాని యా
యావర్ణనములు గలపద్యముల నుదాహరించియే యున్నారు, గనుఁడు.

"అడుగుల నునుఁగాంతి నయ్యెడ పద్మరాగంబుల నెలకట్టుకరణి నొప్పఁ
బాలిండ్లు తను పెద వ్రాలింపఁ జెన్నొందు నసుఁగౌఁదీఁగ యల్లాడుచుండ"

అని యున్నది. ఇది విరాటపర్వములో 4 వ యాశ్వాసమున నుత్తరా
వర్ణనమున నున్నది. ఇందుఁ బాలిండ్లవిరివి వర్ణింపఁబడినది. మఱియు నిది మన
నవవిమర్శకులగ్రంథములో 410 పుటలో నున్నది.

"నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁ దెచ్చి యచ్చున బెట్టిన ట్లంద మొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి కుప్పలుచేసి నట్లొప్పుమెఱసి
……………అంఘ్రితలములుఁ గుచములు నాననంబు"

అని మఱియొకపద్యము కలదు. ఇది విరాటమున రెండవయాశ్వాసము లో నున్నది. కీచకుఁడు ద్రౌపదిని వర్ణించుటలోనిది. దీనిలోఁ గుచములు చక్ర వాకములవలె నున్న వని వర్ణింపఁబడినది. ఇది మననవవిమర్శకుల పొత్తములో 287 వ పుటలో నున్నది. కుచవర్ణనము తిక్కనార్యుని శాంతిపర్వమునఁ గూడఁ గలదు.

"వెడవెడ నూగారు వింతమై యేర్పడ దారిన వళులలో నారునిగుడ"

అని కలదు. ఇది విరాటపర్వములోని, ప్రథమాశ్వాసమున నున్నది. ఇది యుత్తరను గవి చేసినవర్ణనములోనిది. ఇందు నూగారును, వళులును, గూడ వర్ణింపఁబడినవి. మఱియు నది మననవవిమర్శకులపుస్తకములో 409 వ పుటలో నున్నది.

ఇట్టివర్ణనము లున్నను మననవవిమర్శకులు వానిని దమచేతులతో వ్రాసి యుంగూడ నెఱుంగలేక పోయిరి. వీరికిఁ దిక్కనకవిత్వమునం గలకావ్యకళ యేదో తెలియదు.

— మననవవిమర్శకుల విమర్శనక్రమము —

కావ్యకళాదృష్టితో వ్రాయఁబడిన కావ్యరాజముల విమర్శించు విమర్శ కులు కూడఁ గావ్యకళాదృష్టితోనే తమవిమర్శనములను వ్రాయవలె నని యిది వఱకే వ్రాసియున్నాను. మన నవవిమర్శకు లట్లుచేయక వందిమాగధాదిస్తోత్ర పాఠకదృష్టి నవలంబించి తిక్కన వ్రాసినదాని నెల్ల మంచిసెడ్డల నారయక స్తుతించు స్థితిలోనికి వచ్చిరి. వీరిస్తోత్రపాఠములు మితిమించిపోయినవి. ఇందుల కొక యుదాహరణము నిచ్చెద.

—తిక్కన గ్రంథమునకు మూలమైన సంస్కృతప్రతి యెద్ది—

తిక్కన సంస్కృతభారతమును దెనిఁగించితి నని కదా చెప్పుకొనినాఁడు. ఆతఁ డాధారముగాఁ దీసికొనిన సంస్కృతప్రతి యేది యని మననవవిమర్శకులు శంకించుకొని యొకసారి యుత్తరదేశప్రతి యని యు మఱియొకసారి దక్షిణదేశ ప్రతి యనియు వివిధగతుల వ్రాసివ్రాసి తుదకుఁ దిక్కన సంస్కృతప్రతుల నేనిని ననుసరింపలే దనియుఁ దనయఖండప్రతిభ వెలయ స్వతంత్రగ్రంథముగానే స్వేచ్ఛా లతో వ్రాయ నయ్యది సంస్కృతమూలముకంటె సర్వవిధముల రసవత్తర మగు టం గని సంస్కృతకవులు తిక్కనార్యుని మేలివ్రాఁతలను సంస్కృతములోనికి దింపి పంచమవేదమును సవరించుకొని రనియు వ్రాసిరి. ఇది ముగ్ధవాద మని

వేఱుగఁ జెప్పవలెనా? మనసంస్కృతపండితులు తెలుఁగనినను దెలుఁగుకవు లని నను పెొచ్చుగునీసడింపు కలవా రనియుఁ దెలుఁగుకావ్యములఁ జూడనైనఁ జూడ రనియు మననవవిమర్శకులే పలుచోట్ల వ్రాసిరి. ఇట్టిసంస్కృతపండితులు తిక్కనవ్రా సిన తెలుఁగువ్రాఁతలం గని మెచ్చుకొని వానిని సంస్కృతము చేసి యతిపవిత్ర మనియుఁ బంచమవేద మనియుఁ దాము పూజించుచుండు సంస్కృతభారతములోఁ బెట్టి రనుట నమ్మఁదగినది కాదు. సంస్కృతగ్రంథముకంటెఁ గొన్నితావులఁ దిక్క నార్యునిగ్రంథము మెఱుఁగుగా నున్న దనిన ననవచ్చును గాని యంతమాత్రముచే నీమెఱుఁగుల సంస్కృతకవులు తీసికొనిపోయి సంస్కృతభారతామ్నాయములోఁ జేర్చుకొని రనుటమాత్ర మంతగా భావ్యముగా నుండదు. అయినను వాదము నిమిత్తము మననవవిమర్శకులు చెప్పినదానినే యంగీకరింతము. అట్లగుచోఁ దిక్క నవ్రాఁతలకన్నిటికిని దిక్కనయే దిక్కగును గాని సంస్కృతప్రతి యేదియు నాధా రము కాదుగదా. కావున నాతనివ్రాఁతలకు నాతనినే బాధ్యునిగాఁ జేయుచు నాతనివిరాటపర్వమునందలి గుణాగుణముల విమర్శించి చూచుకొందము. తిక్కన యెక్కువవాఁడే. అయినను నక్కడక్కడఁ బ్రమాదములకు లోనగుచు వచ్చి నాఁడు. అది కనిపట్టక యిదివఱకు మననవవిమర్శకులు తిక్కనయందుఁ గలిగిన గ్రుడ్డిమోహముచే దోషములను గూడ గుణములనుగా నే వర్ణించివేసిరి. అదియే కూడనిపని. అదియే సారస్వతమునకు హానిని గలిగించునది కాన, తిక్కనార్యుని దోషములను దోషము లనియు గుణములను గుణము లనియు సందర్భానుకూల ముగా నిరూపించుచు నిష్పాక్షికవిమర్శనమును లోకహితార్థమై యిప్పుడు కావిం చుకొందము.

గుణవత్తర మనియు దోషరహిత మనియు నిదివఱకుఁ బ్రజలందఱచేతను గొనియాడఁబడుచున్నది తిక్కనభారతము. అట్టిలోకాతీత మైనప్రఖ్యాతిగల తిక్కకవి సార్వభౌముని విరాటపర్వమున దోషములఁ గూడ నెంచుట యా యని యాగ్ర హమును వహింపకుఁడు. అట్లు చేయుట తగదు, ప్రమాదములు ధీమంతులకైన నుండవచ్చుఁగదా! లోకసామాన్యదృష్టికి మనోహరజలపూరపూరితముగాఁ గా న్పించుచున్న తటాకోదకము పారిశుద్ధ్యవిచారకపరీక్షలోఁ బెట్టి చూచినఁ గొంత దోషయుతముగాఁ గాన్పింపవచ్చును. అయినను లోకము మెచ్చుచున్న దనుకార ణమునఁ బారిశుద్ధ్యవిమర్శకాభిప్రాయమును ద్రోసివేయరాదు. అట్లు త్రోసివేయు ట హానికి మూల మగును. అట్లే నిక్కమైన కావ్యకళాదృష్టితోఁ బరీక్షించి చూచిన

దోషాదికము లేవైనఁ గాన్పించిన వాని ద్రోసివేయుట సారస్వతమునకు హానికర మగును. కాఁబట్టి మననవవిమర్శకులు కావ్యకళాదృష్టితోఁ గావించిన విరాటప ర్వవిమర్శన మెంతపటుత్వము కలదిగా నున్నదో కావ్యకళాదృష్టితోఁ బరిశీలించి చూచుకొందము. చదువరులు శాంతచిత్తములతోఁ జిత్తగింతురుగాక.

— పాండవులయజ్ఞాతవాసప్రశంస —

విరాటపర్వము దుర్ఘటమైన పాండవాజ్ఞాతవాసముం గూర్చి ముచ్చటించు నదిగా నున్నది. ఈయజ్ఞాతవాసమును సమర్థించుటలోఁ జిక్కు లనంతముగాఁ గలవు. భారత మీయంశము నిట్లు తెల్పుచున్నది.

"చ. మహితసముజ్జ్వలాకృతులు మానధను లజనమాన్యు లంగనా
సహితముగాఁ గనేమిగతి సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నాపదుమూఁడవయేఁడు మత్స్యభూ
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పవే."

ఈపద్యమువలనఁ దేలుభావవిశేషములం గూర్చి నవవిమర్శకులే యిట్లు వ్రాసిరి. "ఇంతే గాక యీపద్యమునం దీవిరాటపర్వగ్రంథముచే సాధింపవలసి యున్న "పాండవు లజ్ఞాతవాసదీక్ష నెట్లుగడపి, తమమాటను నెగ్గించుకొని యుం దురు" అనుసమస్యగూడ సూచింపఁబడి యున్నది. పాండవు లొకరు నిద్దఱుఁగా రు, ఐదుగురు. వీరు సామాన్యులు కారు, మహితసముజ్జ్వలాకృతులు, వీరియాకా రము తేజస్సును బట్టియే చూచినవా రెవ రైన వారిని గుర్తింపవచ్చును. మఱియు నెట్లో రహస్యముగ నెవ్వరియొద్దనో చేరి కాలము గడుపుకొందు రనుట కైనను వీరు మానధనులు, జనమాన్యులు. మఱియు వీరంగనాసహితులు గూడ నై యుం డిరి. ఐదుగురు పురుషులు నొకస్త్రీయుఁ గలసియుండినచో వీరెట్టిమారువేషముల నున్నను ఇట్టివిపరీతసంబంధము పాండవులకుఁ దక్క నితరులకు లేదు. గావున, వీరిరహస్యము బయలువడకుండ నుండుట సాధ్యము కాదు. కావున నహితుల కప్రభేద్య మగునాపదుమూఁడగునేఁడు గడపుట మఱింత దుర్ఘటము. ఇట్లిన్ని చిక్కులతోఁ గూడుటచే దుర్ఘటమైన యీయజ్ఞాతవాసము నెట్లు గడపి బయలు పడిరి యనునదే యీపర్వమునందలి ముఖ్యవిషయము. ఆసమస్యనే యీపద్య మున తిక్కనార్యుఁడు సూచించినాఁడు." దీనింబట్టి పాండవాజ్ఞాతవాస మెట్లు జరి గిన దనువిషయమే విరాటపర్వములో ముఖ్య మనియు నది ద్రౌపదిపంచపతిత్వా

దాలమూలముగాను బాండవులరూపరేఖావిలాసాదులమూలముగాను దుర్ఘటమ
నియుఁ దేలినది.

మఱియును ధర్మరాజు భూసురోత్తములతో "మాకజ్ఞాతవాసంబు సలుపం
గవలయు నందు ధార్తరాష్ట్రులు సూతతనయసౌబలులును జెఱుపన వేతురు చిన్న
సన్న మెఱుఁగిరేనిఁ జాల నెగ్గు వాటిల్లు" నని పలికి యున్నాఁడు. దీనింబట్టి యతి
స్వల్పవిషయమునఁ గూడఁ బాండవు లేమఱి యుండిన హాని వాటిల్లు నని తేలు
చున్నది.

— ధర్మదేవతావర ప్రశంస —

పైస్థితులంబట్టి చూడ మానవప్రయత్నముచేఁ బాండవుల యజ్ఞాతవాస
మును గాపాడుట దుర్ఘటము. కావున సంస్కృతకవులు ధర్మదేవతావరమును శరణ
ముగాఁ దీసికొనిరి. అది కలదు కావునఁ బాండవు లెట్లు ప్రవర్తించినను వారియునికి
రహస్యముగానే యుండు ననియు నది లోకుల కెవ్వరికిని బోధపడ దనియుఁ గాన
నిది దుర్ఘట మెట్లగు ననియుఁ జెప్పుదురా? అట్లనందగదు. ఎందులకైనను మంచి
దని యీవరమును దీసికొనినను, బాండవులు, బహిరంగముగా స్వేచ్ఛ ననుస
రించి తిరుగక తమయునికి రహస్యముగానే యుండుటకుఁ బ్రయత్నము నెంతవఱ
కుఁ జేయఁ దగునో యంతవఱకు వారు చేసి నట్లుగా సంస్కృతగ్రంథములు
ను, దెనుఁగుగ్రంథములును గూడఁ దెల్పుచున్నవి. "ఎంతధర్మదేవతవర మున్నను
తాము బయలుపడుదుమేమో యనుభయము వారికుండకతప్ప" దని మననవిమ
ర్శకులే వ్రాసియుండిరి. పాండవులు తాము బయల్పడకుండునట్లు చేసికొనునుపా
యములఁ బన్నించుటలోనే, కవియొక్క ప్రౌఢత యుండును గావున మనతిక్కనార్యుఁ
డారహస్య మెట్లు కాపాడెనో కనుఁగొందము.

— పాండవులవిరాటసభాప్రవేశము —

తిక్కనార్యుఁడు పాండవులవిరాటనగరప్రవేశము నెట్లుసమర్థించుకొని వచ్చె
నో దానిని ముందుగా మనము కనుఁగొనవలసియున్నది. ఈసందర్భములో సోమ
యాజి పాండవులయజ్ఞాతవాసమును సురక్షితము చేయలేకపోయె నని చెప్పితీర
వలసి వచ్చుచున్నది. ఏమన, నీతఁడు పాండవులు విరటునింట జ్యేష్ఠానుక్రమము
గా ననఁగా ధర్మజునితరువాత భీముఁడు, భీముని యనంతరమున నర్జునుఁడును, నటు
పిమ్మట నకులుఁడును, నంత సహదేవుఁడును బిదపఁ బాంచాలియుఁ జొచ్చినట్లు వ
ర్ణించినాఁడు. ఇట్లు చెప్పుటచే వారిని బాండవు లని విరాటాదులు గుర్తుపట్టుట సు

లభమగు నని మనవారు తలఁచుచున్నారు. కావుననే యుత్తరదేశమునందలి భారతప్రతులలో వ్యుత్క్రమముగాఁ బాండవులు విరటునికొలువులోఁ బ్రవేశించినట్లు గాఁ జెప్పఁబడియున్నది. ఉత్తరదేశప్రతులే కాక తిక్కనకవిశ్వము ననుసరించిన వని తెలుపఁబడిన దక్షిణదేశప్రతులందుఁ దక్కఁ దక్షిణభారతప్రతు లన్నిటియందును బాండవులు వ్యుత్క్రమముగానే విరటునికొలువుసొచ్చినట్లు చెప్పఁబడినది. ఈవిషయమై మనవవిమర్శకులు వ్రాసినవ్రాతలో నిట్లున్నది. "పాండవప్రవేశక్రమము న నుత్తరదేశపాఠమునకును దక్షిణదేశపాఠమునకును గూడ భేద మగపడుచున్నది. ఉత్తరదేశప్రతులలో ధర్మజుఁడు, భీముఁడు, ద్రౌపది, సహదేవుఁడు, అర్జునుఁడు, నకులుఁడు- అనునీక్రమమున-ననఁగా ద్రౌపది నకులార్జునసహదేవులకుఁ బూర్వముననే విరటునికొల్వునఁ బ్రవేశించిన ట్లున్నది. విరటుని యాస్థానమునఁ బ్రవేశించిన క్రమము క్షేమేంద్రుని భారతమంజరిలోఁ గూడ నీయుత్తరదేశప్రతులపాఠములో నున్నట్లే యున్నది. జావాద్వీపమునందలి విరాటపర్వములోని క్రమ మించుక భేదించినను ద్రౌపదిమాత్రము చిట్టచివర ప్రవేశించినట్లు లేదు. అనఁగా యుధిష్ఠిరభీమార్జునుల ప్రవేశముతరువాత ద్రౌపదీప్రవేశము కలదు. అటుపైని సహదేవుఁడు, నకులుఁడు ప్రవేశించిన ట్లున్నది. ఉత్తరదేశప్రతులలో నకులసహదేవులకు మధ్యగా నర్జునుఁడు ప్రవేశించిన ట్లుండ దీనిలో యుధిష్ఠిరభీములకుఁ దరువాతనే ప్రవేశించిన ట్లున్నది. మొత్తముమీఁద నీగ్రంథము లన్నిటిలోను ద్రౌపదిమాత్రము చివరఁ బ్రవేశించినట్లు లేదు. ఒక్క దక్షిణదేశప్రతులపాఠముననే పాండవులు జ్యేష్ఠానుక్రమముగాఁ బ్రవేశించినట్లును జివరకు ద్రౌపది ప్రవేశించినట్లును గనఁబడుచున్నది. *

ఈప్రకారముగాఁ బ్రమాణముగాఁ దీసికొనఁ దగిన సంస్కృతప్రతు లన్నిటియందును బాండవుల విరాటసభాప్రవేశమును గ్రమము తప్పించి వ్యుత్క్రమముగాఁ జెప్పియుండఁగాఁ దిక్కనార్యుఁడు మాత్రము జ్యేష్ఠానుక్రమప్రవేశమును వర్ణించుటలో విశేష మేమి యుండఁగలదు? పరికించిచూడ వ్యుత్క్రమప్రవేశమునందే విశేషము గాన్పించుచున్నది. జ్యేష్ఠానుక్రమప్రవేశములో వీరు పాండవులని తెలిసికొనుటకు నవకాశము కల దనియు వ్యుత్క్రమప్రవేశములో నట్లు లేదు కాన నిందే విశేషము కల దనియు విమర్శకులు చెప్పుచున్నారు కనుఁడు.

---

* దక్షిణదేశముననే యాంధ్రలిపిలోఁ బూర్వము ప్రచురింపఁబడిన భారతప్రతిలోఁ గూడ నుత్తరదేశప్రతులందువలెనే వ్యుత్క్రమప్రవేశమే చెప్పఁబడియున్నది.

చదలువాడ సుందరరామశాస్త్రులవారును దండిగుంట సూర్యనారాయణశాస్త్రులవారును దిక్కనార్యుని విరాటపర్వమును వ్యాఖ్యతోఁగూడఁ బ్రచురించి తత్పీఠికలో నీవిషయమై యిట్లువ్రాసిరి. "పాండవు లేవురును జ్యేష్ఠానుక్రమముగఁ బ్రవేశించి రనుటయు నుచితముగాఁ దోఁపదు. ఒకరివెంబడి నొకరు వరుసగాఁ బ్రవేశించినచో వీరిని గుర్తించుట సంభవింపవచ్చునుగదా ! అందువలన నాంధ్రలిపిని ముద్రితసంస్కృతగ్రంథమునందుఁ గనఁబడు పాండవప్రవేశప్రకారమె సముచితంబును నుత్తరగ్రంథావిరుద్ధంబు నగుచున్నది. అందు మొదట ధర్మరాజును, అనంతరము భీముండును, అటుపిమ్మట ద్రోవదియు, నంత సహదేవుండును, బిదప నర్జునుండును, బదంపడి నకులుండును నిట్లు వ్యుత్క్రమముగా విరాటుని నగరు చేరినట్లు వర్ణింపఁబడినది. ఇది పాండవులకజ్ఞాతవాసమున కనుకూలమగుటవలనను, నుత్తరగ్రంథావిరుద్ధం బగుటవలనను నీసందర్భమున నాంధ్రలిపి ముద్రితసంస్కృతగ్రంథపాఠమే యుక్తతరం బని గ్రహింపనగు."

ఇంతయేల మననవవిమర్శకులును (అనఁగా విరాటపర్వమును బొగడిన వారు) వ్యుత్క్రమప్రవేశమే పాండవుల గుర్తుపట్ట వలను గాకుండఁ జేయవచ్చు నని యిట్లు తెలిపిరి.

"వరుస నయిదుగురుపాండవులు జ్యేష్ఠానుక్రమంబుగను చివరకు ద్రౌపదియుఁ బ్రవేశించి రని చెప్పినచో, వీరు పంచపాండవులు ద్రౌపదియు నని విరాటాదులు గుర్తుపట్టుదురేమో యనుసందేహముచే న ట్లొనర్పఁబడిన దని చెప్పిన చెప్పవచ్చును.''

మఱియును గ్రమమును దప్పించిన ప్రవేశములో నింక నొకసారస్యము కూడఁ గల దని నవవిమర్శకు లిట్లు వ్రాసిరి.

"ఉత్తరదేశప్రతుల పాఠములో పురుషులందరును నయిదుగురు నొకరివెంబడి నొకరు ప్రవేశించి రని చెప్పుటలోఁ గలవిసుగుదలను (Monotony) బోగొట్టుటకు ద్రౌపది మధ్య పెట్టబడిన దనియు నకులసహదేవు లిద్దఱియాకారములలోను మాటలలోను గలసాదృశ్యము కనబడకుండఁ జేయుటకుగా నర్జునుఁడు వారిద్దఱికి మధ్య ప్రవేశించినట్లుగాఁ జెప్పఁబడిన దనియుఁ గొందఱు విమర్శకులు తలంచియున్నారు.''

మొత్తముమీఁద నేవియో కొన్నిచాతుర్యములు వ్యుత్క్రమప్రవేశము నందుఁ గాన్పించుచున్నయవి గాని జ్యేష్ఠానుక్రమప్రవేశమునందుఁ గానవచ్చుట

లేదు. అది హానికిఁగూడ మూల మగుచున్నదని విమర్శకులతలంపు. ఇఁకఁ దిక్కనార్యుఁడు తెచ్చిపెట్టిన క్రమములో విశేష మెట్లుండఁగలదు? మననవవిమర్శకులు జ్యేష్ఠానుక్రమప్రవేశములోఁ గూడఁ జాతుర్యము కల దని చెప్పఁబోయి యిట్లువ్రాసిరి.

"ఇక దక్షిణదేశప్రతులలో యథాక్రమంబుగఁ బ్రవేశించిన ట్లుండుటను గూర్చి ప్రతివిషయమునను స్త్రీలకంటె పురుషులు ముందు నడచుట స్వాభావికముగాన నట్లుమార్పఁబడిన దని కొందరువిమర్శకులు తలంచుచున్నారు"

ఇది యాపాతరమణీయ మగుయుక్తిరాజము. ఆలోచించి చూచిన మఱింత హానిని దిక్కనపాఠమువలనఁ దెచ్చిపెట్టునదిగాఁ గూడ నున్నది. సామాన్యముగా లోకములోఁ బ్రతివిషయమునను స్త్రీలకంటెఁ బురుషులు ముందు నడతురుగావు ననే పంచపురుషులు నడచినతరువాత నొకస్త్రీ వారివెంబడి నడచుటచే వారు పంచపాండవు లని యు వారితరువాత నడచినస్త్రీ ద్రౌపది యనియుఁ దలంచుట కవకాశ మేర్పడుచున్నది. ఇటఁ బాండవులు లోకధర్మము ననుసరించి యు ను లోకాచారము ననుసరించియు ను బోఁదగినది కాదు. వారివ్యవహార మిచ్చటఁ బ్రత్యేక సందర్భము కలది. ఏమన, వీరు సత్యస్థితిని గప్పిపెట్టి యసామాన్యమార్గమును ద్రొక్కి గూఢసంచార మొనరించి తమరహస్యమును గాపాడుకొనవలసి యున్నది. ఇట వీరివర్తనము వ్యావహారికతంత్రములోనిది గాని ధర్మతంత్రము లోనిది కాదు. పెద్దమనుష్యు లెవ్వరైన మీయూ రేమి మీపే రేమి యని యడిగినప్పుడు సత్యము చెప్పుట లోకధర్మము. అయినను నీపట్టున ధర్మజునంతటి వాఁడే సత్యము చెప్పువాఁ డెవఁ డని విరటునితోఁ బలికినాఁడు. తనపేరు కంకుభట్టని తాను బ్రాహ్మణుఁడ (సన్న్యాసి) నని యుఁ జెప్పినాఁడు. సాధారణముగా ధర్మజునకు సత్యము చెప్పుట స్వాభావికము. అయినను నిచట యస్వాభావికముగ నసత్యము చెప్పినాఁడు. తమయజ్ఞాతవాసరహస్యము బయలుపడకుండుటకు నచట నస్వాభావికమార్గ మవలంబింపవలసి వచ్చినది. కాన మననవవిమర్శకులు చెప్పినది తప్పు. సందర్భరహితము.

మఱియును నవవిమర్శకులుమఱియొకయుపపత్తిని గల్పింపఁబోయి యిట్లు వ్రాసిరి.

"ఇంతేగాక బ్రాహ్మణమతోజ్జృంభణమునకు నీదక్షిణదేశప్రతులలోనిమార్పునకు నేమేని సంబంధ ముండు నని తలంచినచో వీ రెట్లు ప్రవేశించినను ధర్మ

దేవతయొక్క నరమనోహ్రసము గాఁవున గుర్తింపఁబడును మనుభయము వీరికిఁకలుగలే దని సూచించుటకే జ్యేష్ఠానుక్రమముగఁ బ్రవేశించినట్లు చెప్పఁబడిన దని తలంపవచ్చును."

ఇది యన్నిటిని మించిన వింతవాదము.

"ఎంత ధర్మదేవతవర మున్నను తాము బయలుపడుదు మేమో యను భయము వారి కుండక తప్పదు." అని వ్రాసిన మనవవిమర్శకు లామాటను వెంటనే మఱచిపోయి ధర్మదేవతవర మున్న దను నవకాశము నాధారముగాఁ దీసికొని విశృంఖలముగఁ బ్రవర్తించి రనుట యుచిత మెట్లు కాఁగలదు. వీరికి ధర్మదేవతవర మున్న దనియు నది యమోఘ మనియుఁ దలంపే యున్న యెడల వా రెట్లు ప్రవర్తించినను బ్రవర్తింపవచ్చును గదా! మాఱుపేరులు పెట్టుకొని మాఱువేషములు వేసికొని యొకసామాన్యనృపునికడ నీచవృత్తులలోఁ బ్రవేశించి హీనంపుబ్రతుకు నేల బ్రతుకవలసివచ్చెను. అతిసుకుమారగాత్రి యగు ద్రోవది, పాపము! సుధేష్ణకడ దాస్యమేల చేయవలసివచ్చెను. ఈమెదాస్యము చేయుటలోఁ జేతులు పొక్కులెక్కిన వని భీమునికడ నేడ్చినదే? ఇఁకను భీముఁడు విరటుని కొలువులోఁ బ్రవేశింపఁ జనుటలో ధర్మజుఁడు పోయినమార్గమునఁ జనక మఱియొకమార్గమునఁ జనియె నని తిక్కనార్యుఁ డేల వ్రాయవలసివచ్చె? మఱియును, దమకులసతి యగుద్రౌపదిని దఱిమికొని వచ్చి విరటునిసభ కెదుటఁ దన్ని పడఁద్రోసి యవమానించిన కీచకుని ధర్మజభీము లేలసహింపవలసివచ్చెను? భీముఁడు వానిని జంప నుద్యమించుచుండఁగా ధర్మరాజు గూఢభాషణముల వాని నేల యాఁపవలసివచ్చె? తమధర్మపత్నికిఁ బెద్దయవమానము కలిగినను దాము బయల్పడిపోవుదు మనుభీతిచేతనే కదా భీమధర్మజులు కిమ్మనక నిలిచిపోయిరి. ఇవన్నియు నేమి చెప్పుచున్నవి? ధర్మదేవతావర మున్న దని తలంచి పాండవులు నిరంకుశప్రవర్తనము కలవారు కాక తమగూఢప్రచారమును సాగింప జాగరూకులై స్వప్రయత్నములను జేయుచుండి రని తేలుట లేదా? ధర్మజుఁడు పోయిన మార్గమునఁ జనక, భీముఁడు వేఱొకమార్గమును బట్టుటయు వీరు సభాప్రవేశవిషయమునఁ గూడ నతిజాగరూకులై సమయభంగ మగునను భీతిచే నెట్లో కాలము గడిపి రనియుఁ దేలుట లేదా? కాన మనవవిమర్శకులు చెప్పినదంతయు నిస్సారము. అరణ్యపర్వములో వెళ్లిపోయిన ధర్మదేవతావరప్రశంసను దిక్కనార్యుఁడు మరల విరాటపర్వములోఁ దడవుటకూడ స్వారస్యవిహీనమే.

## — స్వవచనవ్యాఘాతదోషప్రశంస. —

ఇవి యన్నియు నిట్లుండఁగాఁ బాండవులు జ్యేష్ఠానుక్రమముగా విరటు కొల్వు సొచ్చి రనుటలో నొకగొప్పదోషము కలదు. దానిని మనతిక్కనమఖి గాని మననవవిమర్శకులు గాని కనుఁగొననే లేదు. ఏమన- నీక్రమము తిక్కనయే వ్రాసిన యుత్తరగ్రంథమునకు విరుద్ధముగా నున్నది. కీచకుని వధించుటను గూర్చి ద్రౌపదీభీములు మాటలాడుకొనుటలో ద్రౌపది భీమునితో మన ముభయులము విరటునికొల్వునకు వచ్చినసమయ మొక్కటియే గావున సుధేష్ణాదులు మనకిద్ద ఱకును సంబంధ మున్నట్లు తలంచి రని చెప్పినది. తిక్కన పద్యముం గనుఁడు.

" వలలుని దెస మాలిని చూ,క్కల తెఱఁ గెదఁ బొందుఁ దెలిపెడుం గంటిరె వీ
రలు వచ్చినసమయంబును, దలఁపగ నొక్కటియ యివ్విధం బెట్లొక్కో."

భీముఁడు, ద్రౌపది సమకాలమున వచ్చిన ట్లిచ్చటఁ జెప్పిన తిక్కనార్యుఁడు మొదట పాండవులు జ్యేష్ఠానుక్రమముగఁ బ్రవేశించిన ట్లెట్లు చెప్పెను? ఇది స్వవచనవ్యాఘాతదోషముతోఁ గూడుకొనినది కాదా? తప్పక యిది దోషమె. కాన, తిక్కనవ్రాఁతను బట్టియే పాండవుల విరటకొలువుప్రవేశము వ్యుత్క్రమముగా నున్న దని సూచింపబడుచున్నది. అయినను- అనాలోచనపూర్వకముగా మన నవ విమర్శకులు ద్రౌపదినిఁ జివరఁ బెట్టుటలోఁ దిక్కనార్యుని కావ్యకళాకౌశలము తేలుచున్నదని వ్రాసిరి. దీనింబట్టితిక్కనవ్రాసిన దానినెల్లఁ బొగడుటయె తమపనిగా నవవిమర్శకులు పెట్టుకొని రని తేలుచున్నది. ఇది న్యాయ మగువిమర్శనపద్ధతి గాదు. తిక్కన జ్యేష్ఠానుక్రమముగాఁ బాండవులు విరటునికొల్వులోఁ బ్రవేశించి రనుటలోఁ గాని ద్రౌపదిని జివరఁ బెట్టుటలోఁ గాని యేవిధ మగు కావ్యకళాచాతుర్యమును లేకపోవుటయే గాక పైఁగా దోషములు కూడ జనించినట్లు తేలుచున్నది. ఇది ప్రమాదవశమై యుండవచ్చును. అయినను మననవవిమర్శకులు వీనిని వేనిని బాటింపక విపరీత మగువ్రాఁతలు వ్రాసివేసి రని సూచింపబడుచున్నది. ఇది సత్యవిమర్శనరతులు చేయఁదగిన పనియును గాదు. విమర్శనప్రౌఢతను దెలుపు నదియును గాదు.

తిక్కనార్యుఁడు వ్రాసిన యీవ్రాఁతంబట్టి ధర్మజుఁడు భీముఁడు ద్రౌపది ప్రవేశించినతరువాత మిగిలినవా రు ప్రవేశించినట్లు తేలుచున్నది. ఇదియే హానిలేనిపాఠము. తిక్కనార్యుని వని మననవవిమర్శకులు వ్రాయుకావ్యకళాసౌందర్యములు హా

స్యాస్పదములై పోవుచున్నవి. గ్రంథములో సౌందర్యము లేకున్నను గలదు కల దని విమర్శకులు వ్రాసిన వ్రాతవలన నదియుండఁ గలదా ?

ఇప్పుడు మనకు మనవనవిమర్శకులు వ్రాయు కావ్యకళాసౌందర్య మన నే మో బోధపడినది. అది యేమి యన నర్థము లేని వట్టి వాగాడంబరము. ఇట్టి పిచ్చివ్రాతలు విద్యార్థులహృదయములలో లేనిపోని దురూహలఁ బుట్టించి వార లం బెడమార్గములఁ బెట్టుట కక్కఱకువచ్చునే గాని వేఱుగులాభ ముండ నేరదు.

ఇది పాండవులప్రవేశమును గూర్చిన చర్చ. ఇంకఁ బాండవులు వేసికొనిన వేషములను గూర్చియును జేసిన ప్రసంగములను గూర్చియు వాని యందున్న కా వ్యకళాసౌందర్యమును గూర్చియును ముచ్చటించుకొందము.

— ధర్మజాదులవేషములంగూర్చి —

ఉత్తరదేశప్రతులలో ధర్మజుఁడు బ్రాహ్మణవేషముతో విరటుని కొల్వు సొ చ్చె నని యున్నది. మనతిక్కనార్యుఁ డాతనికి బ్రాహ్మణసన్న్యాసివేషమును సమకూ ర్చె. ధర్మదేవతామహిమముచే నున్నయుఁనికిన యుధిష్ఠిరునకు బ్రాహ్మణసన్న్యాసి రూపం బలవడి ధాతుపటదండకమండలకలితమూర్తియై తనవైపునకు వచ్చుచుం డఁగా దూరమునుండి కని విరాటుఁడు...

"సీ. కరచరణాద్యంగకము లేలొకో రత్నభూషణప్రకరంబుపొందు దొఱఁగె.
నుభయపార్శ్వంబుల నిభఘట లేలొకో చనుదేవు సమవాళిసమితి మొరయఁ
బాయు తొలంగు మం చాయతవేత్రహస్తులమొత్త మేలొకో తోడరాదు
ధవళాతపత్రము లత్తెఱచుగా నేలొకో పట్టరు మౌక్తికప్రభలు వెలుఁగ
నితఁడు రాజగు రాజునునితమాత్ర, గాదు మూర్ధాభిషిక్తవర్గంబు దనదు
చరణయుగ్మంబుఁ గొలిపింపఁ జాలుసార్వభౌముపదవికిఁ దగిమెఱుఁగు భంగి వాఁడు."

అని వర్ణించినట్లు తిక్కనార్యుఁడు వ్రాసియున్నాఁడు. ఇది యసంగతవర్ణనము గాఁ గాన్పించుచున్నది. ఏమన, దూరమున నుండి యావచ్చుచున్న వాఁ డెవ్వరో విరటుఁ డెఱుంగఁడు. ఆతని కితఁడు క్రొత్తవాఁడు. రూప మన్ననో సర్వవిధముల బ్రాహ్మణసన్న్యాసివేషమునఁ గలదు. ఇట్టివిప్రయతిం గని విరాటుఁ డీతనితో నేనుఁ గుల గుంపులేల రావు? వందిమాగధు లేల రారు? ఛత్రచామరము లేల లేవు? ఈతనికరచరణాదులందు రత్నభూష లేలలే వని శంకించుకొనుట కవకాశ మెక్క డినుండి వచ్చినది ? ఒకగోవుం గని దీనికిఁ దుండమేల్ల లేదు, కుంభము లేల కాన

రావు, దంతము లేలపోడకట్ట వనుట యెట్టిదియో నిదియు నట్టిది కాదా? విప్ర
సన్న్యాసికిఁ గరచరణాదులందు రత్నభూష లెట్లుండును? వందిఘోష లెట్లుకలు
గును? ఇభఘట లెట్లువచ్చును? ఛత్రచామరము లెట్లుసంప్రాప్త మగును. కంకు
ని పూర్వావస్థం బట్టి యీవర్ణనములు గావించె నందురా? దాని విరాటుఁడె
ఱుఁగఁడు గదా? ఆవిప్రయతియందు బ్రాహ్మణయతిచిహ్నములకంటె సార్వ
భౌమచిహ్నములు హెచ్చుగాఁ గాన్పించుచున్న వందురా? ధర్మదేవతామహిమ
ముచే ధర్మరాజునకు సమయరక్షణార్థమై విప్రసన్న్యాసిరూపము వచ్చిన దనిన
నర్థమేమి? అది వట్టికృత్రిమవేషధారణము కాదే? దైవమహిమముచేఁ గలిగిన
రూపవిశేషమే? అట్టిరూపు మఱుఁగంటిపోయి గుట్టునుమట్టును జెడఁగొట్టు క్షత్రి
యసార్వభౌమత యెట్లు విరాటునకుఁ గాన్పించినది? పగటివేషములవేయువారలు
కృత్రిమముగా ధరించువేషములుకూడ సరిగ నిర్దేశితవేషమునే తోఁపఁజేయును
గదా? అట్టిస్థితిలో దైవాయత్తమగు నీవిప్రరూపమును దూరమునుండి చూచి
న యపరిచితులకుఁ గూడ సార్వభౌమత్వమును సూచించిన దనిన దైవమహిమ
ములోఁ గొఱంత కల దనియే చెప్పవలసియుండును గదా? బ్రాహ్మణవేషము స
రిగ లే దని యే యనవలెను గదా? ధర్మజాదుల నిజరూపములు కప్పఁబడి పోయి
క్రొత్తచిహ్నములు కలిగి వారియజ్ఞాతవాసము నిర్బాధకముగా సాగుటకే కదా
ధర్మదేవత యారూపముల ననుగ్రహించె. అవి సరిగ లే వనుట యసంగతము కా
దా? కాన, తిక్కనార్యుఁ డొనర్చిన యీవర్ణన మెంతమాత్రమును సరిగ లేదు.
ఇది యొకప్రమాద మనకతప్పదు. సమయభంగకరముగా నున్నది. కథకు సంద
ర్భించి లేదు. ధర్మజునందలి సార్వభౌమత్వము పోయి చాలకాల మైనది. అదిగాక
యతఁ డప్పుడప్పుడు బ్రాహ్మణవేషములో నుండుటకూడ వాడుక. ద్రౌపదీస్వయం
వరాది సమయములందు, పాండవులు విప్రవేషములలోనే యున్నారు. వారిసా
ర్వభౌమత్వమును, అనఁగాఁ జక్రవర్తికులజత్వమును నప్పు డెవ్వరును గనుఁగొని
యుండలేకపోయిరి. అట్టిస్థితిలో ధర్మజుని విప్రసన్న్యాసివేషమును దవ్వులనుండి
చూడఁగనే పూర్వాపరసందర్భము లేవియు నెఱుఁగని విరాటుఁ డాతనియందు
సార్వభౌమత్వమును గనిపెట్టుట వింత! మూలమునందుఁ గూడ నిట్టివర్ణనము క
లదు. కాని అదియు నసంగతము. మూలమునందున్న లోపములను దిద్దివేసి చక్క
గా వ్రాయుటకుఁ బూనుకొనిన తిక్కనార్యుఁడు కూడ ధర్మజునకు దైవమహిమము
చేఁ గలిగిన రూపవిశేషమును మఱచిపోయి యెప్పుడో యాతనియం దుండిన

సార్వభౌమత్వమును మనసునకుఁ దెచ్చుకొని యీవిప్రయతియందు ఛత్రచామ రాదికలితత్వాదు లేలలే వని శంకింపించుట వింతగా నున్నది. ఈవర్ణనము తప్పు.

మఱియును గరశబ్దమునకు శబ్దాలంకారార్థమై చరణశబ్దమును జేర్చి కర చరణామలంను భూష లేలలే వని తిక్కన్న శంకింపించినాఁడు. రాజుల కరములం దు భూషణములుండవచ్చును. కాని చరణములం దుండవే. ఇట, కరచరణామలను టలో సారస్య మేమో! దాని కేమి. అజ్ఞాతవాస సంరక్షణార్థమై ధర్మదేవతచేఁ బాం డవుల కొసంగఁబడిన రూపవిశేషములు తమకుఁ గలవర్ణనచాతుర్యమును జూపు టకై మనకవులు పాడుచేసి రనక తప్పదు. సత్యరతికలవార లీసిద్ధాంతమునకు వచ్చి తీరుదురు.

ఇంకను "ధవళాతపత్రముల్ తఱుచుగా నేలకో పట్ట" రనుదానియందలి "తఱుచుగా" యనుదాని యర్థ మేమో? అరుదుగాఁ బట్టుచున్నా రని యర్థము చెప్పుకొనవలెనా యేమి?

ఈసందర్భమునఁ దిక్కన యుధిష్ఠిరుని సన్న్యాసినిజేయుటలో విశేష మేమి? ఈసన్న్యాసి విరటునికొల్వులోఁ జేసినవ్యాపార మేమి? జూదమాడుటయే గదా; వట్టి యాటకాదు; డబ్బుపెట్టి యాడుట. ఈతఁడు విరటుని నగరునకుఁ బోవునపు డుపనిషదాదులఁబట్టుకొని పోలేదు. పాచికలకట్టలను జంకనిడుకొని పోయినాఁ డు. ఇది విరుద్ధము కాదా! ఇది యాయాశ్రమమున కించుక యైనఁ దగి యున్న దా? సన్న్యాస మనునది లోకవ్యవహారముల నన్నిటినుండి విరక్తినొందిన పిమ్మ టనుగదా తీసికొనఁదగినది. ఇది యాశ్రమరాజము గదా? ఇట్టి యుత్తమాశ్రమ మును బొందినవాఁడు పాచికలనాడుటలోఁ గాలము గడపినాఁ డనుట యుచిత మెట్లు కాఁగలదు? కావున, నుత్తరదేశపుఁ బ్రతులలో నున్నట్లు ద్విజమాత్రుఁ డనుటయే యుచితము. ద్విజుఁడు పాచికల నాడుటయు ధర్మము కాదు గాని యా తఁడు సంసారతాపత్రయమునఁ బడియుండువాఁడు; అట్టివాఁడు కక్కుఱితికి లోన గుట యంతగా నస్వాభావికము కాదు. అది గాక, ఒకసంవత్సరము మాత్రమే వ్రతినై యుండి తరువాత శత్రువుల జయించుటకుఁ బోవుదు నని కూడ నీతఁడు చెప్పినాఁడు. శత్రువులతో యుద్ధము చేయుట జయకాంక్ష నొందుట మున్నగు లౌకికకృత్యములు గృహస్థున కుండవచ్చును గాని సన్న్యాసుల కుండఁదగినవి కావు. ఇది తాత్కాలిక సన్న్యాసముగాఁ గాన్పించుచున్నది! ఇది హాస్యాస్పదము కాదా? మఱియును దిక్కనార్యుఁడు విరటునిచే, కంకభట్టాయని పిలిపించినాఁడు.

భట్టశబ్దము గృహస్థు లగువిప్రులవిషయములో వాడఁదగును గాని సన్న్యాసుల విషయములో వాడఁదగినది కాదు. * అదిగాక యాతఁడు కాషాయదండకమండలువుల ధరించినట్లు తెల్పఁబడియున్నది. ఈయతిలింగములు కలవాఁడు విప్రయతి యగును గాని బ్రాహ్మణేతరయతి కానేరఁడు.

"బ్రాహ్మణో క్షత్రియో వాథ వైశ్యో వా ప్రవ్రజేత్ గృహా దితి కౌర్మోక్తే ర్వర్ణత్రయస్యా ప్యధికారః । పూర్వవాక్యం తు కాషాయదండాదినిషేధార్థం " అని నిర్ణయసింధువులోఁ జెప్పఁబడియున్నది. దీనింబట్టి కాషాయదండకమండలువులు గలయతిత్వ మొక్క బ్రాహ్మణులయందే యుండు నని తేలుచున్నది. కాన కాషాయ దండాదిలింగములు గలయతి యగుకంకుని జూచి నీకుల మేది యని విరటునిచే నడిగించుటలోఁ జాతుర్యము లేదు. కేవల విప్రవేషముకంటె సన్న్యాసివేషమే యజ్ఞాతవాసమును గాపాడఁ జాలునది యగుటకును నవకాశము లేదు. ఇంక నుత్తరదేశపు బ్రతులలో నున్నవిప్రవేషమును మార్చి తిక్కనార్యుఁడు ధర్మజుని యతివేషములోనికి దింపుటలో వైరస్య మున్నది గాని సారస్యము లేదు.

— వీరిసంభాషణములం గూర్చి —

ఇంక, పాండవులు విరటునికొల్వుకు వచ్చి కావించినసంభాషణము లెంత జాగరూకత కలిగి యున్నవో విమర్శించి చూచుకొందము.

— ప్రచ్ఛన్నవేషులై పాండవులు తాము పాండవులకడ నుండెడివార మనుటం గూర్చి —

పాండవు లెల్లరును దాము విరటునికడ కేఁగి యింతకుఁ బూర్వము పాండవుల కొలువున నుండెడివార మని చెప్ప నిశ్చయించుకొని యట్లుచేసినట్లు తిక్కనార్యునిచే వర్ణింపఁబడియున్నది. ఈపద్ధతి చాల హానికరమైనది. అజ్ఞాతవాసమునకు భంగకరమైనది గాఁ గూడ నున్నది. విరటునిసభకుఁ గ్రొత్తగా వచ్చి చేరినవారై దుగురుపురుషులు నొక్క స్త్రీయు నై యున్నారు. వీరెల్లరును నొక్క దినముననె వచ్చిరి. అందఱును మహితసముజ్జ్వలాకృతులు. వీరిసంఖ్యయును వీరి యాకృతులును బాండవు లేమో యనున నుమానము కలిగించు స్థితిలోనున్నవి. ఇట్లుండగాఁ దమంతఁ దామే విరాటాదులకుఁ బాండవులు జ్ఞప్తిలోనికి వచ్చునట్లు చేసికొనుట చాల హానికరము కాదా! విమర్శనము నతివివరములోనికిఁ

* ఇది యింకను విచారింపవలసియున్నది.

దీసికొనిపోయి యాక్షేపణము గావింప యత్నించుట తగ దంమరా ? ఈయాక్షే
పణము మనము చేయునది కాదు. తిక్కన పక్షమున వాదించు మనవవిమర్శకులే,
యీక్రిందిరీతిని గావించిరి.

"వీరు చెప్పినమాటలను బట్టి- ముఖ్యముగా వీరంచఱు తాము ధర్మజుని
కొలువులోనివార మని చెప్పుకొనిన దానినిబట్టి- వీరే పాండవులు ద్రౌపదియు నై
యుందురేమో యని విరటాదులు తప్పక సందేహింపవలసినదే."

మన తిక్కనార్యుఁడు తాను మూలమునందుఁ గలయనౌచిత్యమును దొలఁ
గించి యనౌచిత్యము కలుగఁజేయుచు వచ్చినాఁడుగదా ? మూలమునం దున్న
హానికర మగు నీసంభాషణము నేల దిద్దలేదు ? ప్రచ్ఛన్నవేషములం దాల్చి
యజ్ఞాతవాసమును జల్లఁగ నడుపుకొనవలసియున్న పాండవులు తాము పాండవుల
కడనుండెడి వార మని యందఱును గూడ నేల చెప్పుకొనవలెను ? అట్లు
చెప్పుకొనకుండిన వచ్చుహాని యేమి ? ఏదియును లేదు. ఈభరతఖండమున ననేక
దేశములు కలవు. అనేకరాజ్యము లున్నవి. ఒక్కొక్కఁ డొక్కొక్కచోట నుండెడి
వాఁడ నని యేల చెప్పుకొనరాదు ? అట్లు చెప్పుకొనవచ్చును. దాన హాని లేక
పోఁగాఁ బైఁగా లాభ ముండియుండును, గాని, మూలములో నట్లులేదు గావునఁ
దిక్కనయు నట్లువ్రాయలే దనవలయును. మూలమును జక్కఁగా విమర్శించుకొని
పిమ్మటఁ దనభాషాంతరీకరణమును దిక్కన వ్రాయలేదని దీనివలన స్ఫుటపడుచున్నది.

ఇవి యన్నియు నిట్లుండఁగా మనతిక్కనార్యుఁడు కంకునిచే పరటునిసభలోఁ
జేయించిన యితరసంభాషణములును గుట్టు నంతను బైటఁబెట్టి యజ్ఞాతవాసము
నకు భంగమును గల్గించునవిగా నున్నవి. అతిమర్ఘట మగునీయజ్ఞాతవాసము
నెట్లు నడుపఁగల మని యేడ్చిన ధర్మరాజు, నీవత్సరము నెల్లెట్లో కన్నులు మూసి
కొని గడుపవలె నన్నధర్మరాజు, విరటుఁడు నీవెవ్వ రని యడుగఁగా లేనిపోని
వక్రసంభాషణములు గావించుచుఁ దనకుఁగల భాషాజ్ఞానమును శ్లేషలమూలము
గను ధ్వనులమూలముగను వెలిపుచ్చి తమనిజచారిత్రమును స్ఫురింపఁజేయుచుఁ
గపటవేషానుకూల వాక్యములఁ బలుకుటలోఁ దనచాతుర్యమును జూపఁదొడం
గెను. శ్లేషలు పనికి రానివాఁ డని చెప్పఁబడిన తిక్కన హానికర మగుస్థానమున
నవిచారపూర్వకముగ వానిని బెట్టఁజొచ్చెఁ గనుఁడు.

"ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం

బెయ్యది నాకు నింతయును నేర్పడఁగా నెఱిగింపుఁ డున్నరూ
పయ్యది నావుడు న్నరవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డిట్లనున్".

అను తిక్కనార్యుని పద్యముఁబట్టి విరటుఁడు క్రొత్తగ వచ్చిన కంకునిం గని నీయూరుఁ బేరుఁ జెప్పు మని కోరినట్లు స్పష్టముగ నున్నది. రాజు వేసిన యీ యుచితప్రశ్నలకుఁ గంకుఁ డిచ్చినసమాధాన ముచితముగ లేదు. తా నెవనిని సేవించుటకై చనినాఁడో యారాజు, నీదేశ మేమి, నీ కుల మేమి, నీ యూరేమి, పేరేమి, యున్నదున్నట్లు చెప్పు మనఁగా దరహాసముచేయుచు, లోకములో సత్యముపలికెడివాఁ డెవ్వఁడు, తోఁచినట్లు పలుకుటయేగాని సత్య మెక్కడనుండి వచ్చును, దానినంతగాఁ గనుఁగొనువా రెవ రని సమాధానముచెప్పుట యనుచితాధికప్రసంగము గాక మఱే మగును? తాను సన్న్యాసివేషములో నున్నను నయ్యది నీళ్లు కాఱునదిగా నున్నది. ఏమన, నీతనివ్యాపారము జూడ మాయట. రాజు నావిధముగా సేవించి జీవించుట ధర్మరాజాదులు చేసినది రాజసేవయే. కావుననే వారికి ధౌమ్యుఁడు సేవాధర్మమును బోధించి విరటునికడ కంపినాఁడు. ఆబోధలో "ఏయోజ విదగ్ధుఁడై పలుక నొద్దులకుం దగ దట్లు చేయఁగన్" అని తిక్కనయే పలికించె. విరటునికొలువులో ధర్మజుని బ్రతు కెటు లున్నదో ద్రౌపదిచే మన తిక్కనయే యీ క్రిందిరీతిని జెప్పించె.

"ఉ. అట్టిమహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁడై వెడకూడుఁ జీరయుం
బెట్టఁగ నిల్చి వాని మది ప్రీతికి నీడగు వృత్తిఁ బేసునుం
బుట్టును మాలి యిప్పు డిటు బ్రుంగుచువాటునఁ బొందఁజూచి నా
కెట్టు మనంబువట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్చుఁ జెప్పుమా."

ఈవిధముగా సేవకత్వము చేయవలసిన స్థితిలో నున్నకంకుఁడు ప్రభువు నీనిజచారిత్రముం జెప్పు మని ప్రశ్నించినప్పుడు చిఱునవ్వునవ్వుచుఁ దననిజచారిత్రముం జెప్పువాఁ డెవఁ డని సమాధాన మిచ్చునా? ఇందులో యోగ్యత గాని, సరసత గాని యుండఁగలదా? మేము నానాభూతములము. మనస్సు, చంచలము, ఇంక సత్యముపలుకుట యెట్లు సంభవించును. అని సత్యముపలుకుట యసాధ్యమగుటం గూర్చి యొక నిస్సారోపన్యాసము నిప్పించి సత్యము పలుకువాఁడనుగా ననిపించి పిమ్మట నేను ద్విజుఁడను, గురువిషయజాతుఁడను, ధర్మసుతుసఖుఁడను- అని కంకునిచేఁ దిక్కన పలికించె. అంతటితోఁ బోలేదు. ఈపలుకులలో ధ్వనులు, శ్లేషలు నున్నవట. ద్విజుఁడనుదానిలో క్షత్రియుఁడ నని యర్థాంతరంగి

కార్థము గలదఁట. కురువిషయజాతుఁడ ననఁగాఁ గౌరవ్యుఁడ ననునర్థము తెలుచునే యున్నది. ధర్మసుతుసఖుఁడ ననఁగా 'తనకుఁ దాను' చెలికాఁడే కావున దానే ధర్మరాజునని యాంతరంగికార్థము గలదఁట.(విరాటపర్వవ్యాఖ్యాత లీవిశేషములఁ జెప్పిరి). కంకుఁడు తాను క్షత్రియుఁడ నచుధ్వని వచ్చురీతిగాఁ బ్రసంగించె. ఇంక విరటుఁ డన్ననో కంకుఁ డెంతబ్రాహ్మణవేషములో నున్నను, నీతఁడు బ్రాహ్మణుఁడు గాఁ డని యు క్షత్రియుఁ డై యుండు నని యుఁ దలంచె నఁట! అట్టివానికడఁ దన నిజచారిత్రంబు బయల్పడురీతిగా శ్లేషామలను వాడి, సత్యమును బయటపెట్టుట యెంత హానికరమో వేఱుగఁ జెప్పవలయునా? కంకునిచే నిట్లు ప్రసంగింపఁ జేయుట ప్రౌఢతయా? తిక్కనార్యుఁడు శ్లేషకవిత్వమునందుఁ దనకుఁ గలనేర్పును జూపఁదగినతా విదియా? ఈప్రసంగ మెంతమాత్రమును సమయానుకూలము గను బాత్రోచితముగను లేదు. కంకుఁ డిచట జేసిన సంభాషణముం గూర్చి మన నవవిమర్శకులే యిట్లు వ్రాసిరి.

"వెనుక ధర్మజుఁడు 'ఉన్నరూపు పలుకు నన్నరు లెవ్వరు-అంతె-పట్టి చూడఁగలరె యెట్టివారు.' అని చమత్కారముగఁ బలుకుచు, "ద్యూతక్రీడకుఁ గ్రొండొక నేతుంగపటమున నొవ్వనిజనంబులు నాచేతిధన మెల్లఁ గొని పరి భూతి యొనర్చిన విరక్తిపొడమి వెడలితిన్" అని వాస్తవార్థమే యెట్లు బయటపెట్టెనో-" అని కంకుఁడు వాస్తవార్థమునే బయటపెట్టినట్లు వ్రాసిరి. కంకుని యీయధికప్ర సంగము చాల 'చమత్కారముగ' నున్న దని నవవిమర్శకులు సంతసించిరి. ఈసం తోషముల కేమి గాని యీకంకుని సంభాషణ మంతయుఁ గథకుఁ జాల భంగక రముగా నున్నది.

—ద్రౌపదీసంభాషణాదికముం గూర్చి.—

ఇఁక ద్రౌపదీసంభాషణముం గూర్చి ముచ్చటించుకొందము. ఈమె సుధేష్ణ కడఁ గావించిన సంభాషణము ధర్మజుని సంభాషణమునకు సర్వవిధములఁ దోడై యజ్ఞాతవాసము బయల్పడిపోవుటకుఁ గావలసిన సందర్భముల నన్నిటిని జక్కఁగాఁ గూర్చినది. తిక్కనార్యుని మాలిని (ద్రౌపది) సుధేష్ణతోఁ దన కైదుగురుపతులు కల రని తెలిపినది. మననవవిమర్శకులు సూచించినరీతిగా నిది యొక్కటియే చాలును రహస్యమునంతనుబట్టబయలుచేయుటకు. మఱియు నామె యంతటితోఁ బోనీయక తన్ను శత్రువులు పతులముందర సభలోఁ గొప్పు పట్టుకొని యీడ్చి రని యు నాయవమానము సహింపలేక ప్రచ్ఛన్నవేషులై యున్న తనమగలును

దానును నడవులలోఁ దిరిగి తిరిగి యిచటికి వచ్చితి ననియుఁ దన కీసైరంధ్రీవేష మొకసంవత్సరమువఱకు నవసర మనియు నుడివినది. పాండవుల కడనుండి వచ్చితి నని చెప్పుకొనిన కంకుఁడు ను దానొకవత్సరము వ్రతము సలుపవలసి యున్నదని చెప్పినాఁడు. అక్కడనుండి యే (పాండవులకడనుండియే) వచ్చినానని చెప్పుకొనిన మాలినియును దన కొకవత్సరపువ్రత మున్న దనియే చెప్పినది కదా. ఇవి యన్ని యును సమయభంగదములు కావా? తిక్కనార్యుఁడు తనకావ్యకళాచాతురిని సరిగ వినియోగించి యీవ్రాఁతను వ్రాసినట్లు తలంచుటకు వలను గా కున్నది. ద్రౌపది తనకుఁ బంచపతులు కల రనియు శత్రువులు వారిమొఱుటఁ దనకొప్పుపట్టి యీడ్చి రనియుఁ జెప్పకుండినఁ దమ యజ్ఞాతవాసమునకు భంగము కలుగునా? కలుగదు. ఇంక నేల యీరీతి సంభాషణము చేయవలయును. అది హానికి మూల ము కాదా? మననవవిమర్శకులుఁ గూఢముగాఁ బలికినది కాదా యనిరి. గూఢ ముగాఁ బలికినంత నేమి లాభము? తనపతులు గంధర్వు లనినది కాదా యందు చేని యది నిజము తెలిసికొనుట కడ్డురాదు. ఐదుగురు పతులుగల స్త్రీ లోక ములో మఱియొకతె లేదు. హీనజాతులందుఁ గూడ నేకకాలమున నైదుగురు పతులు కలది లేదు. అట్టిది మననవవిమర్శకులు చెప్పినట్లుగా నొక్క ద్రౌపదియే. ఇట్టిపరిస్థితులలోఁ దనపతులు గంధర్వులనినంతన నేమి ప్రయోజన ముండఁగలదు? విరటునిపురిలో నైదుగురు గంధర్వులు పతులుగా గలస్త్రీ కలదని వినినంతన దు ర్యోధనుఁ డేమనినాఁడో గనుఁడు.

"క. గంధర్వులను నెపంబున, నంధతమసగూఢవృత్తి ననిలసుతుఁడు గ
ర్వాంధమతియైన సూతు స,బాంధవముగఁ జంపెఁగాక పరులకు వశమే"

కీచకునిచావునకుఁ గారణభూతయైన స్త్రీ ద్రౌపది యని నిశ్చయించినాఁ డు దుర్యోధనుఁడు. ఇట గంధర్వు లనుమిష యడ్డు రాలేదు.

కాఁబట్టి తిక్కనార్యుని రచనావిశేషము కథాసందర్భముఁ జెడఁగొట్టిన ద నక తప్పకున్న దని చెప్పవలసివచ్చు మన్నది. సమయానుకూలముగా లేదు. ఇట్టి వ్రాఁత కావ్యకళాభిజ్ఞతను దెలుపు ననుట యెట్లు.

— ద్రౌపదీసుధేష్ణల ప్రసంగచాతుర్యము —

ద్రౌపదీసౌందర్యమును గాంచి సుధేష్ణ "నిన్నుఁ నాకడఁ జేర్చుకొనిన వ దులుకచ్చు గలనాపతి నిన్ను మఱఁగి నన్ను ద్రోసిరా జగు నేమో. కాన నిన్నుఁ జేర్చుకొనుటకు జంకుచున్నా" నని పలుకఁగా ద్రౌపది తగుసమాధానము చెప్పి

సుధేష్ణభయమును తీర్చినట్లు తిక్కన వర్ణించినక్రమము విచిత్రముగా నున్నది. త్రిలోకసుందరి వైన నిన్ను నాకడ నుంచుకొనిన సహజముగా జారత్వలోలుఁడైన నా పతి నీసౌందర్యముం గని నీవలలోఁ బడిపోవునేమో యను భీతి కలుగుచున్నది కాన నిన్నుఁ జేర్చుకొనఁ జాల ననఁగా "నీ కేమియు భయము లేదు, నా కమిత విక్రము లయినగంధర్వులైదుగురు పతులుగా నున్నారు. వారు నన్నెప్పుడును గూఢముగాఁ గనిపెట్టుచుందురు. నాపై నెవ్వఁడేని కన్నువేసినఁ వాని నానాఁడే యమపురికిఁ బంపివేయుదురు. కాన నన్నుఁ జేర్చుకొను" మని పలికిన దనుటలో సారస్య ముండఁగలదా ? ద్రౌపదిని దనకడఁ బెట్టుకొనినఁ దనపతి యామెవల పునం దగులునని యు నాహేతువుచే నతనికిని తనకును గలపొత్తు చెడు ననియు భయము పుట్టినంతమాత్రముననే నిన్ను నాకడ నుంచుకొనఁజాల ననిన సుధేష్ణ "అపక్రపరాక్రమము గలతనపతులు తన్ను మోహించినవానిని దప్పక యాదినముననే యమమందిరమున కతిథినిగాఁ బంపుదు" రని ద్రౌపది చెప్పుటను విని యెట్లు భయమువీడి యామెను జేర్చుకొనఁగలదు? మొదట భర్తతోడి పొత్తునకు భంగము వచ్చునేమో యని సుధేష్ణ జంకుచుండఁగా యాజ్ఞసేనీవాక్యము లంబట్టి తనమైదవతనమునకే భంగముకలుగు నని గదా సుధేష్ణ గ్రహించుకొన వలెను. అట్టి స్థితిలో నామె ద్రౌపది నెట్లు చేర్చుకొనఁగలదు? ద్రౌపది వాక్యములంబట్టి తనపాతివ్రత్యమునకు భంగముండ దని తేలుచున్నది కాని సుధేష్ణపక్షమున భంగముండ దని తేలుట లేదే; కాన నీసందర్భములో ద్రౌపదీసుధేష్ణల ప్రసంగ మసంగతముగా నున్నది. ద్రౌపదీభర్తలు దేవత లని యు నమితపరాక్రమము కలవా రనియు వారు తమసతి నంటుకొనఁజూచువారిని జంపివేయుదు రనియుఁ దెలిసికొని తనపతి యగువిరటుఁడు ద్రౌపదిపై నాశపెట్టుకొనఁ డని సుధేష్ణ భావించె నందురా ? అట్లనుటకు వలనుపడదు. "కామాతురాణాం న భయం న లజ్జా" యన వినమే. కామాతురులకుఁ దాము జారత్వమును నడపినఁ జావు వచ్చునేమో యనుభయము కలుగదు. ఇంచుక కలిగినను దాము తమదుష్టోద్యమమునుండి వెనుదీయుదు. ఇది లోకానుభవముచే నందఱు నెఱిఁగియున్న సంగతియే. రావణాదులచారిత్రము లీసంగతినే న్రొక్కి చెప్పుచున్నవి. ఈవిషయ మంతయును సుధేష్ణయు నెఱుంగును. కావున ద్రౌపది యిచ్చిన సమాధానము సుధేష్ణను మఱింత భయపెట్టఁ దగినదిగాని వేఱుకాదు.

ఇట్లసంగతముగా నున్నయీ ప్రసంగమునుండి మననవవిమర్శకు లొక కావ్యకళాచాతుర్యమును బుట్టించి రేమో యనుకొనుట కొక యవకాశమించుక కలుగుచున్నది. తనపతు లమోఘవిక్రములని పలికినద్రౌపది తనసంగతి దెలుపుచుం దనపతులయెదుటనే శత్రువులు తన్నుం దలపట్టియీడ్చి రని యు నట్టిదురవస్థ వాటిల్లినను దనపతు లేమియుం జేయలేకపోయి రనియుం బైంగా నడవులపాలై యుపవాసముల వ్రతములం జేయంజొచ్చి రనియుం జెప్పినదికదా. ఈవాక్యములం బట్టి ద్రౌపదీభర్తలసమర్థు లని యు నేమియుం జేయంజాలరనివా రనియు ద్రౌపది పలుకులు వట్టిదంభోక్తు లనియు భావించి సుదేష్ణ మిన్నకున్న దని చెప్పుటకు మన నవవిమర్శకులు సాహసింతు రేమో. ఏమైనను నిది వట్టిసాహసోక్తి కాక మానదు. మననవనాగరకు లెంతటిసాహస మైనను గలవారే. వీరు పైద్రౌపదీవాక్యములంబట్టి యొకనాటకకళాచాతుర్యమును దీసిరి.

". నీచమతి నన్ను నెవ్వండు, చూచిన నారాత్రిలోనం జూతురు తెగం దా
రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమము లఖర్వము లైనన్."

ప్రథమాశ్వాసములో నున్న యీవాక్యములు ముందు ద్వితీయాశ్వాసములో రానున్న కీచకవధను సూచించుచున్న వనియుం గావున నిచట "అంకాస్య లక్షణము" పట్టిన దనియు వీరు చెప్పిరి. నాటకమునందు వచ్చు "అంకాస్యలక్షణము" ఈసందర్భములోం బట్టదు. ద్రౌపది తన్నంటుకొనంబోయి తనభర్తయగు భీమునిచేం గీచకుండు చంపంబడు ననువిషయమును సూచించె నని చెప్పుట యసంగతము. ఆమెకు ముందు కీచకునిచేం దనకుం బరాభవముకలుగు నని యు నందుమూలముచే భీముం డాతని జంపు ననియు నెంతమాత్రమును దెలియదు. అట్టిది ముందు రాంబోవుకథ నెట్లు సూచింపంగలదు. ఒకయంకాంతమున నొకపాత్రము ప్రవేశించి తరువాతి యంకప్రారంభమున వచ్చుపాత్రమును సూచించినచో నయ్యది యంకాస్య మగును. ఇక్కడ నంకమునకు బదులుగా నాశ్వాసమును దీసికొందము. అయినను బ్రథమాశ్వాసాంతమున ద్రౌపది ప్రవేశింపలేదు. అయినను బ్రథమాశ్వాసాంతమున ద్రౌపదీప్రవేశము కల దనుకొనినను నామె పలికినపలుకులు ద్వితీయాశ్వాసముఖమున నున్నవిషయముల సూచించుట లేదు. ద్వితీయాశ్వాసముఖమున బలవిక్రమసంపన్నులగుమల్లులు ప్రవేశించిరి. తరువాత భీముండు ప్రవేశించెను. పిమ్మట నామల్లులకు ను భీమునకు ను యుద్ధము జరిగె. అటుపిమ్మట నెప్పుడో కీచకుండు ప్రవేశించుట యు వానికిని ద్రౌపదికిని

సంవాదము జరుగుటయు వర్ణింపఁబడియె. అనంతరము జరిగిన కీచకవధ ద్వితీయాశ్వాసాంతమున వర్ణింపఁబడియె. కాన నిచట నంకాస్యలక్షణ మెట్లు పట్టినది? ముందు రాఁబోవు కథాసందర్భము నేమియు నెఱుఁగని ద్రౌపది యాదృచ్ఛికముగాఁ బలికిన పలుకులు ముందెప్పుడో రాఁబోవు కీచకవధ నెట్లుసూచించును. అట్లు సూచించుననుచోఁ గథ యస్వాభావిక మైపోవును. మఱియు ను ద్రౌపది పలుకులు కీచకవృత్తాంతమును సూచించుననుచో నాశ్వాసాదిని ధర్మరాజు-

"మనవంశంబున వృత్తాంబును, బెంపును గావఁజాలు పుణ్యసతివి దు
ర్జను లగుశత్రులువలమనములు, గనుఁగొని యేమఱక మెలఁగఁగావలయుఁ జుమీ"

అనిపలికినపలుకులును ముందు రాఁబోవుకీచకవృత్తాంతమును సూచించు ననవచ్చునా? ఎంతమాత్రమును దగదు. ఇచట నాటకగమనిక యించుకయును లేదు. కథాసందర్భ మంతయును జెడి దానినస్వాభావికము చేసినది. ప్రబంధములలో నచ్చటచ్చట నాటకశైలి యుండుట వాడుకయే. అట్టిస్థితిలోఁ బ్రౌఢకవి యగు తిక్కనగ్రంథములో నదియుండుట వింత గాదు. కాని, యున్నదాని నిప్పటి నవనాగరకు లతిమాత్రముచేసి పాడుచేయుచున్నారు. ఇప్పట్టున, ననఁగాఁ, బాండవుల విరాటపురప్రవేశమును వర్ణించుభాగమునఁ గావ్యకళాచాతురి చూపఁబడిన దనుట సత్యేతరవిషయము మఱికదప్పదు.

సద్భావవ్యక్తీకరణముచేయుటలోఁ దిక్కనసోమయాజిని మించినవాఁడు లేఁడు. విరాటునిపురమునకు నడచిపోవుసందర్భములో నంతఃపురస్త్రీరత్న మగు ద్రౌపది పాదసమార్గాయాసమును దిక్కనార్యుఁ డీక్రిందిపద్యములో బహుసరసముగా వర్ణించినాఁడు.

". డప్పిజనించె వేఁడుపుటంబులు పొక్కఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడుస్వశంబు గా
దప్పర మిచ్చటచ్చటను నాసల వచ్చితి నింతదవ్వ్వకో
యిప్పటిభంగి నొక్కడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్."

వస్తువర్ణనము చేయుటలోఁ గూడఁ దిక్కనసోమయాజి చాల నైపుణ్యము చూపియున్నాఁడు. శమీతరువర్ణనము- ఈక్రింది సీసపాదములలో బహురమ్యముగాఁ జేయఁబడినది.

సీ. "నెగసినకొన లేచి నింగి యంతంతకు నవులఁ ద్రోవఁగఁ దనరారుదానిఁ
జాఁగినశాఖ లాశాచక్రముల కొలందులు బారవెట్టంగఁ బొలుచుదానిఁ

గవట లోఁడొంటితోఁ గదియుచు నెడములుమ్రింగి ప్రబ్బగసొంపుమిగులుదాని
లోని జొంపము పవలును బెనుఁజీఁకటి నొదవించి పొదలంగ నొప్పుదాని”

కాని యీక్రింది దాని యెత్తుగీతము-

“గనియెఁ బవమానవివిధనర్తనకళాను, వర్తిఁ గాకఘూకారవస్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నాభీలభుజగ, చండమూర్తి శమీతరుచక్రవర్తి.

సీసపాదమునకుఁ దగినరీతిగా లేదు.

భీమార్జుననకులసహదేవులు విరాటునిపురములోఁ బ్రవేశింప వేసికొనిన వేషములును, అచటఁగావించిన ప్రసంగములును బాగుగానున్నవి. భీముని వంటలవాని వేషము మాటలును జూడుఁడు. ఎంతయింపుగానున్నవో! అర్జునుని వేషమును బ్రసంగమును బాగుగనే యున్నవి. విరాటుఁ డొక ప్రభువుగాఁ జిత్రింపఁబడుట లేదు. ఎందులకును బనికిరాని యేబ్రాసిగాఁ జిత్రింపఁబడినాఁడు. ప్రభుత్వరీతి లేదు. తెలివితక్కువప్రసంగము లెన్ను. కనఁబడినవాని కెల్ల నారాజ్యము నీకిచ్చెదను నీవేలు కొమ్మనుచు వచ్చినాఁడు. ప్రభుత్వ మొనరింపఁ దగనివాఁడని దీనివలనఁ దేలుచున్నది.

ఉభయభాషాకవిమిత్రుని యుభయభాషాపరిపూర్ణప్రవీణత పుస్తకమునందెక్కడఁ జూచినను విస్పష్టముగాఁ దెలియుచున్నది.

గ్రంథవిస్తరభీతిచే నీవిమర్శన మింతటితోఁ గట్టిపెట్టి మిగిలినవిమర్శనమును ముందుఁ బ్రకటించుచున్నాఁడను.

# జీవితశిల్పము.

— గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారు, యం. ఏ., నెల్లూరు. —

ఇప్పటి విద్యావిధానము ననుసరించి వివిధకళలయం దొసఁగఁబడు శిక్షణము చాలవఱకు విఫలమైన దని చెప్పనొప్పును. ఏలయన- నియ్యది యాయా పట్టభద్రుల నిరుద్యోగమునకు దారిద్ర్యమునకు దుఃస్థితికిఁ గారణ మగుచున్న దే గాని, యే యొకరిద్దఱకో తప్ప నిసుమంతయేని కీర్తి గాని సుఖము గాని కూర్చుట లేదు. వారిజీవితములు దైన్యమునకుఁ దావలములు, భగ్నాశాదుఃఖభాజనములు నగుచున్నవి. వారిపట్టముల ఫలము తీఱని కడగండ్లపాలయి చివికి పోవుటయే. సంతృప్తియు సంతోషమును లేని వారిజీవనము జీవన్మృతియే గదా. ఈవిషయ పరిణామమునకుఁ గత మరసిన నిట్లు తోఁచును. మనకళాసంస్థలలో నలవడుకళాభ్యసనము జీవితనిర్వహణమున కేపాటియు నుపకరించునది గాదు. పొత్తముల వల్లించినదానిని బరీక్షల వెలిఁగ్రక్కి యెట్లో బిరుదు సంపాదించుకొని యుద్యోగములకుఁ బ్రాకులాడుటయే యాధునిక విద్యాచరిత్రసారము. శిక్షణకాలమున విద్యార్థికిని బరిసరప్రపంచమునకును సంబంధమే లేదు. అతని కిరుగుపొరుగువారి జీవితములలోఁ బాల్గొనుట కేపాటియు నవకాశము లేదు. ప్రకృతిసౌందర్యము నవలోకించి యానందించుట యన నేమో యతఁ డెఱుఁగఁడు. ఆతనికి దైనందిన జీవితముపైఁ గన్ను లేనే లేదు. మఱి ధర్మాధర్మవిచక్షణయే లేనప్పుడు ధర్మాచరణమం దాసక్తి యెచటనుండి వచ్చును? ఇప్పటి కళాపట్టభద్రు లిట్లు కేవలశుష్కపాండిత్యసంభారవాహులై తమజీవితమున నిరర్థ లగుచున్నారు.

నిక్క మరసిన జీవితమును నొకకళ. అది సామాన్యకళ గాదు. ఉత్తమకళ. శిల్పమునకు వలెనే జీవితమునకును గట్టిశిక్షణము వలయును. జీవితకళాశిక్షణము లేనిచోఁ గడమకళల నేరుపు లెల్ల వెలిమిడిలోని వేలుములే. అన్నికళలకును బరమప్రయోజనము జీవితకళానైపుణియే. జీవితకళాకౌశలమునకుఁ దిలోదకము లొసంగిన కళావిత్త్వమే యీనాఁటి సకలానర్థములకు మూలము. జీవితము కళ యనుట యెట్లు? లలితకళలకును జీవితమునకును సామ్యము గలదా? యనునది యిప్పుడు మంతవ్యము. శిల్పిహృదయప్రకటనమే కళ. జీవి హృదయప్రకటనమే జీవితము. సాంకేతికసామగ్రి కళలకును జీవితమునకును సమానమే. శబ్దజా

లము కావ్యకళ కెట్లో, రంగులు గీఁతలు చిత్రలేఖనకళ కెట్లో, స్వరములు సంగీతకళ కెట్లో, కర్మజ్ఞానేంద్రియములును మనస్సును జీవితమున కట్లే యుపకరణములు. కళాలంబనము భావనాప్రపంచము గదా! జీవితాలంబనము భౌతిక ప్రపంచమే యనుదు రేని తత్త్వతః భౌతికసృష్టి భావనాసృష్టి కెంతయు దీసిపోవదు. మానవశక్తికంటె నధికతరశక్తియొక్క భావనయే భౌతికసృష్టి. కావున నది యే పరమసత్యము. భౌతిక మని పేరుపెట్టి దానిని నశ్వర మనియు హేయ మనియుఁ ద్రోసిపుచ్చుట సరిగాదు. భౌతికప్రకృతి పరిశీలనమే గదా పాశ్చాత్యుల నింత యున్నత పదవికిఁ దెచ్చినది. కావునఁ గళకుం బోలె జీవితమునకును వస్తువు ప్రశస్తమే. మఱి కావ్యసంగీతాదికళల గుణము లన్నియు జీవితమునకును వలయును. ఐక్యము, పౌర్వాపర్యసమన్వయము, అంగాంగితారతమ్యము, అంగస్థాపనము, చైతన్యము, సహృదయత, సారస్యము శిల్పమునకుం బోలె జీవితమునకును బ్రధానగుణములు. ప్రయోజనైక్యమును, గ్రమపరిణామమును, యుక్తాయుక్తవివేచనయు, శమదమాదిసుగుణసంపత్తియు, ఔత్సుక్యమును, రాసిక్యమును, భూతదయయు, ధర్మనిరతియు లేనిజీవితము చుక్కానులేని నావ, త్రాడు తెగిన గాలిపడగ, కడలి నడిమి క్షణమాత్రకల్లోలము, 'శారదాభ్రశకలచయము.' కళాత్మక మగురసము 'బ్రహ్మానందసహోదర' మగుచో, జీవితరసము బ్రహ్మానందమే. కావున జీవితమే ప్రథమకళ.

అట్లయ్యు విద్యాధికుల మని విఱ్ఱవీఁగు మనయొక్క యీనాటిజీవితము కళగాదు, కళాభాసము. ప్రయోజన మెఱుఁగము. ప్రణాళిక లేదు. విచక్షణ మృగ్యము. ధర్మబుద్ధి శూన్యము. ఎందును నిలుకడ నహి. కేవల ధనార్జన సంతానలాభములు జీవితశిల్పమున లెక్కకు రావు. లౌక్య పదవులును నైహికపఠనములును జీవితకళాదక్షతను సూచింపవు. గ్రంథపాండిత్యము భావనాచమత్కృతియుఁ గూడ జీవితశిల్పమునం దల్పములే. స్వార్థపరత్వము, అపరిమితతృష్ణ, భోగలాలసత్వము, యాచ్నాదైన్యము, అపాత్రదానము, ఆశాభంగము, దుఃఖము- ఏవంవిధపరిణామము గలిగి మనజీవితము విషాదాంతనాటకముంబోలి యున్నది. ఇందులో నానందమే లేకున్న బ్రహ్మానంద మెటనుండి వచ్చును ? రస మింకిపోయినది; రసాభాసము భాసిల్లుచున్నది. ఏవురు మహనీయులకో తప్ప కడమవారికెల్ల జీవితాంతమునకుఁ దేలుఫలితము పెద్దసున్న !

దీనికి ముఖ్యకారణము మనమనస్సే. ఇదియే జంతుజాలమునుండి మానవుని గొప్పసేసి వేర్పఱుచునది. ఇదియే మానవజీవితసర్వానర్థములకు హేతుభూతము. మానవాభివృద్ధికి మీఱరాని యంతరాయము. జీవితశిల్పమునకు సమూలనాశకము. జీవితమున కత్యంతోపయుక్తము లైనయగ్నిపవనాదులవలెనే మనస్సును మనకు స్వాధీనమై నియమబద్ధ మైనచోఁ బరమోపకారి. అట్లుగాక మనలను లోఁగొని విశృంఖలముగ విజృంభించినచో దావానలమువలెను దుపానువలెను మహోత్పాతహేతువు. కంటికి వెలుఁగునిచ్చునది నిప్పే; ఒంటిని గాల్చునది నిప్పే. ప్రాణమిచ్చు నది గాలియే; ప్రళయముఁ దెచ్చునది గాలియే. అట్లే జీవునకు దేవునితో సాధర్మ్యముం గూర్చునది మనస్సే, దయ్యపునడవడిం దార్చునదియు మనస్సే. స్వాధీనము నియతము నిశ్చల మగుమనస్సు పరమమిత్రము. విశృంఖలము, నిరంకుశము చంచల మగుమనస్సు పరమశత్రువు. ఇదియే భేదము.

కావున జీవితశిల్పము సార్థకము గావలయుచో మనము మనస్సును లోఁగొనవలెను, నియమింపవలెను, నిలిపివేయవలెను. ఇది యెట్లు సాధ్యము? మనస్సును బలిమిమై నణఁచివేయు పూనిక యసహజము, వ్యర్థము. రావణాసురుని తలలవలె నొకవైపు మాయించిన మఱొకవైపు లేచుటయే మనసు స్వభావము. కావున నది గాదు మార్గము. మఱిసులభోపాయ మేదన మనస్సు నెల్లపుడు సద్భావముతో నింపుట. ఎవ్వ రెవరి స్వభావమును నభిరుచి ననుసరించి వారివారి కుదాత్తముగ నుత్తమముగ నుత్తేజకముగ నూర్జితముగను నెయ్యది తోఁచునో దానితో నామనస్సును బూరించి, యూఁదించి, తన్మయ మొనర్చుట. తాత్త్వికుఁడేని పరతత్త్వముతోడను, కళోపాసకుఁడేని సౌందర్యభావనతోడను, ప్రకృతి శాస్త్రజ్ఞుఁడేని ప్రకృతి ధర్మమర్మముతోడను మనస్సు ననుసంధించుకొనుఁడి స్థైర్యము కుదురును; అరిషడ్వర్గము నమయును; అహంకారమమకారము లడఁగును; వైరాగ్యము ప్రయత్నముగనే నెలకొనును; స్వాంతము తనంతనే స్వాధీనమగును. అప్పుడు జీవితకళారహస్యము బోధపడును. జీవితసారస్య మనుభవమునకు వచ్చును. మనస్సును జయించిన మహాత్ములే జీవితకళాపారగులు; జీవితశిల్పకోవిదులు. త్రికరణశుద్ధి యేతత్కళాపండితుల ముఖ్యలక్షణము. "మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః" గదా. ఇయ్యది మహత్కార్యములందే గాక వారి నిత్యకృత్యములందును నెల్ల పనులందును విలసిల్లును. నిజముగా వారిదృష్టిలో-

కొద్ది గొప్ప యను భేదమే లేదు. సర్వము సమానమే. వారేమి చేయుచున్నను వారి సర్వశక్తులు నేకాగ్రముగ నాపనిపైఁ బ్రసరించును. కావున దానియం దనితరశోభ, వైలక్షణ్యము దీపించుచుండును. వారు నడచుచున్నను గూర్చుండి యున్నను, మాటాడుచున్నను, వ్రాయుచున్నను, భోజనము చేయుచున్నను, మజ్జనమొనర్చుచున్నను నాతీరు వేఱు, ఆ నేర్పు సమగ్రము, ఆసొంపు సంపూర్ణము. వారేమి పనిసేయుచున్న దానియందు నిమగ్నులు; ఊరకున్న ఆత్మనిష్ఠులు, శాంతిసుఖోపవిష్టులు. వారి జీవిత మాత్మస్వరూపి యగు పరమేశ్వరుని తేజము ప్రతిబింబించువిమలదర్పణము, దేవదేవుని చిత్రలీలలకాటపట్టు, సకలకళాపరమావధి.

కళలకెల్ల మూలసూత్రము నానాగుణ సామరస్యము వలని యైక్యసిద్ధి. అట్లే జీవితకళయందును వలయునవి వివిధోపకరణసమ్మేళనము, కాయికమానసికాధ్యాత్మికశక్తుల సామరస్యము, నేతన్మూలమున జీవేశ్వరైక్యసిద్ధి. ఏయొక్కయంశమునేని యుపేక్షించి యేకదేశాభివృద్ధిఁ గనువాఁడు జీవితశిల్పమునఁ గొఱవడినవాఁడే. బాహ్యధర్మాచరణప్రవృత్తియొక్కయు నంతశ్శాంతినిర్వృతియొక్కయు నిరంతరయౌగపద్యము జీవితశిల్పసాఫల్యము, సకలకళాపరమావధి. ఇట్టి జీవితశిల్పి పరమేశ్వరకల్పుఁడే.

---

# సాహిత్యము-అలంకారశాస్త్రము.

—బులుసు వేంకటరమణయ్యగారు—చెన్నపురి.—

మన ప్రాచీనాంధ్రసారస్వతము—ఇంచుమించుగ నంతయు, నేఁటి మార్పును జెందక యొకమాదిరిగనే యున్నదనియు, నట్లుండుటకుఁ గారణము మనవారు ప్రబంధములందలంకారశాస్త్రనియమములను జొప్పించుటయే యనియు, లక్షణనియమము నతిక్రమించిన- ప్రబంధములందు లేనిపోనివర్ణనములు చేరక ప్రబంధములు మంచిపద్ధతినే యనుసరించి యుండెడి వనియు నిప్పటివిమర్శకులు చాలమంది తలంచుచున్నారు; తలంచుటయే కాదు; గ్రంథములందును, వ్యాసములందును వ్రాయుచున్నారు. వీరియభిప్రాయము 'ఆలంకారికులు కల్పించిన లక్షణములు ప్రబంధములకు సరిపడ వనియు, వానిని విడుచుటయే శ్రేయ మనియుఁ' దేలుచున్నది.

బంగారపుమంచిచెడ్డలను నిర్ణయించుటకు గీటుఱాయి సాధన మయినట్లే కావ్యమునందలి బాగోగులను నిర్ణయించుట కలంకారశాస్త్రమే సాధనము. అన్ని విధముల కావ్య, ప్రబంధము లుత్తమము లగునట్లు చేయుటయే యలంకారశాస్త్రపరమప్రయోజనము. కావ్య, ప్రబంధవాఙ్మయస్థితిని సమర్థించి దానిని జక్కదిద్దునదే యలంకారశాస్త్రము. ఈయలంకారశాస్త్రలక్షణములే కావ్యశోభకుఁ గొఱత కలిగించుననుట యయుక్తము.

కావ్యమునకుఁ బరమప్రయోజనము రసము. రసరహితమగు కావ్యమునఁ గథ యెంతయున్నను నిరుపయోగము. రసవంతమగు కావ్యమునఁ గథ విస్తరించి లేకున్నను లోపము లేదు. రసవంతమును- రమణీయమును నగు వాక్యమొక్కటి చాలును; అదియే కావ్య మనిపించుకొనును. 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మను విశ్వనాథకవిరాజులక్షణము, 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్య' మ్మను జగన్నాథపండితరాజులక్షణమును బయియంశమునే విశదపఱచుచున్నవి. ఆలంకారికు లేలక్షణములను గల్పించినను, నవియెల్ల రసపరిస్ఫూర్తి కనుగుణము లగునవే కాని వేఱుకావు రసభంజకము లగువానిని వారు కల్పింపరు. దేశ-కాల-పరిస్థితులనుబట్టి యభిరుచులు, నాశయములు మాఱునపుడు ప్రాచీనలక్షణములలో నప్రశస్తముల నతిక్రమింపవచ్చు ననుటయు- వారినిర్వచనమే. కావుననే కొన్ని నాటకములలోఁ బ్రాచీనలాక్షణికులు నిర్ణయించిన సంధ్యంగములు, దృశ్యలక్షణములు ప్రస్తుతకాలమున నుపయోగింపనపుడు విడుచుట కడ్డాకి లేదు. ఇప్పటినాటకకర్తలు వానిని విడుచుచునే యున్నారు.

లక్షణములు ప్రబంధములకు- పద్యకావ్యములకు సరిపడలేదని యిప్పటి యాంధ్రవాఙ్మయవిమర్శకుల యాశయము. దృశ్యకావ్యములసంగతి వారు తలఁ

వనే లేదు. దానికిఁ గారణము మనప్రాచీనాంధ్రవాఙ్మయమున దృశ్యకావ్యములు లేకుండుటయే.

విమర్శకులు లక్షణము ననుసరించియే ప్రబంధము లహృద్యము లయిన వని చెప్పుట కొక కారణము కలదు. మహాకావ్యమునందు పదునెనిమిదివర్ణనము లుండవలె నని దండ్యాచార్యులును, విద్యానాథపండితులును జెప్పిరి. వానిననుస రించిన కావ్యాలంకారచూడామణిలోను, నరసభూపాలీయములోను నావిధి నేయు న్నది. ఆంధ్రకవుల కవియే శరణ్యములయినవి. సందర్భశుద్ధి యున్నను లేకున్న ను రసపోషణము జేసినను జేయకున్నను మనయాంధ్రప్రబంధకర్తలు, కావ్య నిర్మాతలు నెల్లర్లో తమగ్రంథములందు పదునెనిమిది వర్ణనముల నిఱికించుచు వచ్చిరి.

కావ్యమునం దష్టాదశవర్ణనము లుండితీరవలయు నని కాని, అటులు లేని కావ్యము మహాకావ్యము కానేఱదని కాని యాలంకారికులలోఁ బ్రాచీనులు గాని నవీనులు గాని చెప్పలేదు. ఒకరిద్దఱు దాక్షిణాత్యాలంకారికులుమాత్రమే వానిం జెప్పిరి. వారును వర్ణనములకుఁ గాక రసమునకే ప్రాధాన్యము నొసఁగిరి. రసభం జకముగ- నౌచిత్యదూరముగ వర్ణనము లుండుట వారికిని సరిపడదు. కావుననే వారు 'ఈవర్ణనలలోఁ గొన్ని లేకున్నను దోషము లేదు' అని చెప్పవలసివచ్చిన ది. ఆంధ్రలాక్షణికులు దాక్షిణాత్యసంస్కృతాలంకారికులనే యనుసరించుట చే- రసము, ఔచిత్యము మొదలగువానిసంగతి యెటులున్నను నష్టాదశవర్ణనములను మాత్రమే మహాకావ్యమునఁ బ్రధానములుగఁ జెప్పినారు.

ధ్వని ప్రధానముగఁ గలకావ్యమే యుత్తమకావ్యము; ధ్వని యున్నను దా నికిఁ బ్రాధాన్యము లేకవాచ్యము ప్రధానముగ నుండునది మధ్యమకావ్యము; ధ్వని లేని దధమకావ్యము. ఈవిభాగమునే చాలమంది యామోదించిరి. కాని వర్ణన ముల యాధిక్య-న్యూనతలనుబట్టి కావ్యమున కుత్తమత్వము గాని యధమత్వము గాని కలుగవు ధ్వనియందును- రసధ్వనియే కావ్యమునకు జీవము. రసభంజక ము లగులక్షణము లున్నచో వానిని విడుచుటయే శ్రేయము. దాని నాలంకారి కులును గాదనరు.

ఆంధ్రమున నలంకారవాఙ్మయము చాలఁ దక్కువ. అందును, అర్వాచీనా లంకారికానుసరణమున వెలువడిన యొకటి, రెండుగ్రంథములే ప్రమాణము లగు చున్నంచుగఁ దెలుఁగుప్రబంధములు తల్లక్షణముల ననుసరించియే యున్నవి. కాన, ప్రబంధములలో నౌచిత్యమునకు వెలియగు వర్ణనములును గొన్ని యుండుట తట స్థించినది. కాని సవిమర్శముగ నాలంకారికుల హృదయము నెఱింగినచో 'ఆలం కారికలక్షణానుసరణముననే ప్రబంధము- కావ్యములు పాడువడిన' వను వారియా శయము తొలఁగిపోఁ గలదు.

---

# అనువాదము--స్వాతంత్ర్యము.

— దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు. —

---

ఆంధ్రకవనము ననువాదముతో నే ప్రారంభమయినది. అనువాదముతో నే యభ్యుదయము నొందినది. ఆంధ్రవాఙ్మయమున నగ్రస్థానము నలంకరించిన యుద్గ్రంథములు మూఁడు ననువాదములే. కవిత్రయ మని గణుతికెక్కిన మేటికవులు మువ్వురు ననువాదకులే. అనువాద మలంతికార్యము కాదు. ఒకభాషలోని సౌభాగ్యమును వేఱొకభాషలో వెలయించుటకుఁ గావ్యశిల్పమునఁ గృతహస్తులయిన కవులకే గాని తక్కొరులకుఁ దరము గాదు. స్వతంత్రరచనముకంటె ననువాదము క్లేశకరమును, శ్లాఘ్యతరమును. చిత్తరువునఁ దనయిచ్చకువచ్చిన రూపమును వ్రాయుటకును బ్రశస్తమయిన యొకప్రత్యేకవ్యక్తిని దీర్చుటకును గలయంతర మెట్టిదో స్వతంత్రరచనకు ననువాదమునకును గలయంతరమును నట్టిదే. స్వతంత్రరచనముకంటె ననువాదము గుణోత్తరమై యొప్పు నని కళావిదు లందురు. ప్రతిభాశాలి యైనయొకకవిచే నిర్మింపఁబడి, తత్సదృశుఁ డైనమఱియొకకవిచే దేశకాలపాత్రోచితసంస్కారవిశేషములతోఁ దీర్పఁబడుకావ్యము గుణోత్కర్ష నెనయు ననుటలో నత్యుక్తి యేమి ? అనువాదసారస్యముచేత మహాభారతము మహోత్కర్షను గనలేదా ? విద్వద్బాధమయిన నైషధమున కనువాదప్రభావముచేత విద్వదమృతత్వము సిద్ధింపలేదా ? కళావిదులు కానిపెద్దలు కొంద అనువాద మన్నంతనే యనాదరమును సూచింతురు. అనువాదము సన్మానార్హము కా దని వాకొన్న పెద్దలును గలరు. వారిజోలి మన కేల ? కాని కళావిదులయాదరమునకు భాజనముకాని యనువాదమును గలదు. వివరింతును.

అనువాదము రెండువిధములు. (1) భాషానువాదము - (2) భావానువాదము.

భాషానువాద మనఁగా నొకభాషలో నున్నపదములను బొల్లు పోకుండ నావరుసనే మఱి యొకభాషలోనికి మార్చుట. ఇందు ప్రతిపద్యానువాదము; ప్రతిపదానువాదము; మాత్రమే కాక ప్రత్యక్షరానువాదముకూడ వెలసినది. ఈ తీఱురచననే యార్యులు "మక్కికిమక్కి" యని వ్యవహరింతురు. "ప్రతిలో నున్నంత వఱకె బయ్యనగికెజ" అన్నపద్యపాద మీతెలుఁగుకవిత నుద్దేశించియే పొడమెనేమో !

భాషానువాదమునఁ గవిబ్రదుకు చాల సస్వతంత్రము. అతఁడు మూలగ్రంథ కర్తకుఁ బదదాసుఁడు. ఆతనియడుగులలోనే యడుగుల నిడవలయును. అతఁడు నడచిననడకలే నడవవలయును. ఆతఁడు తొడిగినతొడవులే తొడుగవలెను. అతఁడు చూచినట్లే చూడవలెను. ఆతఁడు పలికినట్లే పలుకవలెను. అది యొకవిధమయిన శిక్ష. ఈయనుకృతి హాస్యాస్పదము. లోకమున నెవ్వఁడేని మఱియొకని బాహ్యచేష్టల ననుపదము ననుకరించునేని చూచినవారు నవ్వుదురుగదా! కళాకుశలుఁడు కానివద్యకారుఁడే యీదాస్యమునకుఁ దలయొగ్గును.

ఈయనువాదమున భాషకే ప్రాధాన్యము కాని భావమునకుఁ గాదు. భావస్ఫురణ లేనికావ్యమున రస ముత్పన్న మగుట దుర్లభము. రసవిరహిత మయినకావ్యము బచ్చెనపువ్వువంటిది. ఆమోదమును గూర్పని యాకారసామ్యమున కచ్చెరు వందువారును గలరుగదా! భాషానువాదకున కుపజ్ఞతోఁ బనిలేదు. కమ్మనిపలుకులే కావలె నన్న కఠినియమమును లేదు. మాటకు బదులు మాటను గూర్చుటే పని కావున నాతనికిఁ జేతికందిన దెల్లను శబ్దమే. గణయతిప్రాసముల యొత్తిడికిఁ గ్రుక్కుఱితిపడియాతఁడెట్టిపాడుపదమునకైనను బాలుపడును. అప్రసిద్ధముల నాహ్వానించును. అప్రయోజ్యముల నర్చించును. శాస్త్రములోని విశేషవిధుల కెల్ల నాతఁ డడుగడుగున నడుగులకు మడుఁగు లెత్తును. నానార్థ నిఘంటు వాతని కక్కఱకు సాయపడు పరమాప్తుఁడు. శబ్దౌచితికి నతనికిని జాల దవ్వు. భూదేవుఁ డనవలసినచోట- "మన్నుదయ్య" మనుట కాతఁడు జంకఁడు. దివిజగంగామృత మనవలసినచోట- 'మింటివాఁగువిషి' మనుటకును గొంకఁడు. భాషానువాదకుఁడు వింతవింతపదములకు విందుచేసి బంతులు సాగించును. పాత కవినోదమున కొలకొన్నిపలుకులు- (1) సుతసుధాగుండు. (2) ద్రవిణమాయో వ్రీహిమాయో. (3) పయోపిత్తు. (4) కాటికాపరి. (5) అనంతాసురుఁడు.

జాతీయము లయిన పలుకుబడు లాతనికిఁ బలుకవు. తెలుఁగునుడికార మాతనికిఁ గారముగాఁ దోఁచును. భాషాసంప్రదాయము నాతఁడు పాటింపఁడు. "కేశేషు గృహీత్వా" అనుసంస్కృతపదమును నెంద్రుకలయందు పట్టుకొని అని యాంధ్రీకరించును. पान सुपारी खाना चाहिये- అను హిందీవాక్యమును 'ఆకు వక్క తినవలెను.' అని తెలిఁగించును. It can be done in no time అను

---

(1) కుమారచంద్రుఁడు. (2) ధనలక్ష్మియో ధాన్యలక్ష్మియో. (3) స్వర్గకాంక్ష. (4) వనపాలకుఁడు. (5) భూసురుఁడు.

నాంగ్లవాక్యమును, 'అది కానికాలములోఁ జేయఁబడఁగలదు' అని యనువదించును. ఇట్లితరభాషామర్యాదలలోఁ బ్రుంగుడువడి భాషానువాదకుని తెలుఁగు తెలుఁగుఁదనమును గోల్పోయి వికారాకారమును దాల్చును. పదము లొండొంటితోఁ బొందుపడియుండక గొగ్గిపండ్లవలె నెగుడుదిగుడై యుండుటచే శైలీసౌభాగ్యము కొఱఁతపడును. ఇంతయేల భాషానువాదమునకుఁ బ్రసాదాదిగుణములు కుదురవు. ద్రాక్షాదిపాకములు రుచింపవు. వైదర్భీప్రముఖ రీతు లతుకవు. అట్టి కవిత చదువనుజదువను బాఠకులకుఁ దల కంటగించును. తత్కాలమున మూల గ్రంథమునుగూర్చియు నీరసభావ ముదయించును. ఈ తెలుఁగు తెలిఁగింపు కేవల మధునాతనము.

(2) భావానువాద మనఁగా- నొకభాషలో నున్నభావమును మఱియొక భాషలోనికిఁ గొనితెచ్చుట. దీనికే స్వతంత్రానువాద మని పేరు. ఇందు మూల గ్రంథములోని భావమునకే ప్రాధాన్యము గాని భాషకుఁ గాదు. భావమును వ్యక్తము చేయుట కనువాదకుఁడు తనభాషను దనయిచ్చకు వచ్చినతెన్నునఁ ద్రిప్పుకొనును. రసోచితము లయినపలుకుల నొలికించును. అనుచితము లని తోఁచినచో మూలములోని యంశములను దొలఁగించును. అవసర మయినచో నూతనాంశములను లగించును. సందర్భమునుబట్టి కథాభాగమున సయితము మార్పులుఁ గూర్పులుఁ గావించును. భావప్రకటనమునకును రసోత్పాదనమునకును ననువయిన శబ్దాలంకారములచేతను నర్థాలంకారములచేతను దనకవిత నలంకరించును. పెక్కుమాట లేల? ఆతఁడు సర్వస్వతంత్రుఁడు. ఆతని దంతయు నూతనసృష్టి. మూలగ్రంథములోని గాథ, నాత్మప్రతిభాయంత్రమునఁ గరఁగి యతఁడు మరలఁ బోఁతపోయును. ఆయచ్చునఁదీసి కావ్యము జీవకళలతోను భావసంపదతోను వెలసి స్వతంత్రరచనమే యగుచున్నది. ప్రాచీనకవుల యనువాదము లన్నియు నీతెగకుఁ జేరినవే. భాషాదాస్యమును వారెఱుఁగరు. కావుననే నాఁటికృతు లన్నియుఁ బరిపక్వమయిన పాకమును గలిగి శైలీసౌభాగ్యము నెనసి ప్రసాదగుణభాసురము లై రసాలవాలము లై కావ్యకళోపాసకులకు నిరంతరసేవ్యములై నేఁటికిని వాఙ్మయరంగమున కలంకారము లై యలరారుచున్నవి. భావానువాదమునకు నన్నయ, తిక్కన, యెఱ్ఱాప్రెగ్గడ, భాస్కరుఁడు, శ్రీనాథుఁడు మున్నగుకవుల కవన మెల్ల నుదాహరణమే. మచ్చునకుఁ దిక్కనతెలిఁగింపులోని తొలిపద్యమును మాత్ర ముదాహరింతును.

మూలము. కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
అజ్ఞాతవాస ముషితా దుర్యోధనభయార్దితాః ౧
పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ
ద్రౌపదీ చ కథం బ్రహ్మ న్నజ్ఞాతా దుఃఖితా వసత్. ౨

అనువాదము——

చ. మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితముగాఁగ నేమిగతి సమ్యగుపాయనిగూఢవృత్తి మై
నహితుల కప్రభేద్య మగునాపదమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా.

కవిబ్రహ్మ యయిన సోమయాజి తనయనువాదమున, ద్రౌపదికిఁ గల విశేషణములను దొలఁగించినాఁడు. పితామహులకు మూలమున లేనివిశేషణములను దగిలించినాఁడు. మఱియు సంస్కృతములోని రెండుశ్లోకముల కొకపద్యమునే వ్రాసినాఁడు. తిక్కన చేసిన యీమార్పు మూలమునకు మెఱుఁగు పెట్టినదని రసవిదులు కొనియాడినారు.

స్వాతంత్ర్యము.

గ్రంథమును పెంచుటకును గుంచుటకు ననువాదకున కధికారము కలదు. ఔచిత్య మనుకొలకఱ్ఱతో నాతఁడు కావ్యపరిమాణమును నిర్ణయించుకొనును. భారతానువాదమునఁ గొన్నికథలు పెరిఁగినవి. కొన్నికథలు తఱిఁగినవి. మొత్తముమీఁద మహాభారత మనువాదమున నగ మయినది. భారతకవులతర్వాతఁ బ్రౌఢకావ్యముల ననువదించి యప్రతిమఖ్యాతి నందినఘనుఁడు శ్రీనాథుఁడు- ౨౮౯౮ శ్లోకములతో ౨౨ సర్గలుగా నున్న శ్రీహర్షనైషధము శ్రీనాథుని యనువాదయంత్రమున నలిఁగి ౧33౨ పద్యములతో ౮ ఆశ్వాసముల శృంగారనైషధముగా నవతరించినది. శ్రీనాథమహాకవియనువాదమునఁ దాను గైకొన్న స్వాతంత్ర్యము నిట్లు విస్పష్టముగా విశదీకరించినాఁడు.

"భట్టహర్షమహాకవీశ్వరుండుఁ గవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధశృంగారకావ్యప్రబంధవిశేషంబున, నశేషమనీషి హృదయంగమంబు గా, శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబుపోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున......"

అనువాదమున కెంతటి భారము కలదో యెంతటి మెలఁకువ వలయునో పైపలుకులవలనఁ దెల్లమగుచున్నదిగదా! స్వాతంత్ర్యవిభవమున ననువాదకుఁడు మైమఱచి యించుక పొరపాటు చేసెనేని దానివలనఁ గావ్యమునకుఁ గళంకము కలుగును. కథాపురుషులశీలము కలుషిత మగును. ఇందులకు శ్రీనాథునియనువాదమునుండియే యొక చిన్నయుదాహరణము.

నైషధమున—మే మర్థుల మయి వచ్చితి మని యింద్రుఁ డన్నపుడు నలుఁడు తనకుఁ బ్రియతమ మయిన పదార్థము నిచ్చి, గొప్పవాఁ డయిన సుర పతిని దృప్తిపఱుప నెంచి—

(భీమజా చ హృది మే పరమాస్తే జీవితా దపి ధనా దపి గుర్వీ
న స్వమేవ మమ సార్హతి యస్యా ష్షోడశీ మపి కళాం కిల నోర్వీ)

"దమయంతి నాకు ధనముకంటెను బ్రాణముకంటెను బ్రియ మయినది. దానినే యొసఁగుదు నన్న నది నాసొమ్ముకాదు. (అయినను దారదానముధర్మము కాదు)" అని చక్కగా విమర్శించుకొని యాసాహసమునుండి విరమించినాఁడు. పిమ్మట నింద్రుఁడు "దేయం దారసుతాదృతే" అను ధర్మము నెఱిఁగిన వాఁ డయ్యును గుయుక్తి పన్ని- కోరరాని దారదానమునే కోరఁగా 'నసహ్యించుకొని' "ఆర్జవం హి కుటిలేషు న నీతిః" అని తిరుగఁబడి పెడత్రోవ త్రొక్కినాఁడు.

ఇందు నలుని యాూవార్యావేశమును వివేకమును నీతిజ్ఞతయుఁ బ్రకట మగుచున్నవి. మూల మిట్లుండఁగా—

శృంగారనైషధమున- నలుఁ డర్థి యనుపేరు విన్నంతనే పులకించి యుబ్బి తబ్బిబ్బయి—

క. "ప్రాణంబుకంటె భీమ, క్షోణీపతితనూజమీఁదఁ గూర్మి గలదు, గీ
ర్వాణాధీశ్వరుఁ డయ్యలి, వేణిక్ మదిఁ గోరెనేని వేగమ యిత్తున్."

అని నిశ్చయించుకొనియె ననియు, నటుపిమ్మటనింద్రుఁడు "భీమపుత్త్రిపైఁ గా మనసేసి వచ్చితిమి... చేయుము దూతకృత్యమున్." అని యన్నంతనే-ఇంద్రునివిక పటంపుభాషణను లని యొక వంకపెట్టి, "కుటిలబుద్ధులగెలువంగఁగుటిలమతియు, యర్థ్మ మగుఁ గాని నీతిగా దార్జవంబు"—అనెడునీతి నాధారము చేసికొని తప్పించుకొనఁజూచె ననియు, నున్నది. శ్రీనాథునిరచనవలన, నలుఁడు కార్యాకార్య జ్ఞుఁడు కాఁ డనియు, మారెఁడు పొంగి బారెఁడు క్రుంగెడు స్వభావముగల యల్ప హృదయుఁ డనియుఁ గ్రియాభీరు వనియుఁ దేలుచున్నది. ఇంతకును మూలమేమి? శ్రీనాథుని యనువాదమున దొరలిన పొరపాటే కదా!

# మాదయ్యగారిమల్లన్న-రాజశేఖరచరిత్రము.

—చేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ., యల్. టి., పిఠాపురము.—

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమందలి కవులలో మాదయ్యగారిమల్లన్న యనుకవివరుఁడుండెను. ఆతఁడు రాజశేఖరచరిత్ర మను నొక చక్కనిప్రబంధమును రచించి కృష్ణదేవరాయని మహాప్రధాని యగుసాళువ తిమ్మరుసుయొక్క మేనల్లుఁడు నల్లుఁడు నగు నాదెండ్ల అప్పయమంత్రి కంకిత మిచ్చెను.

మల్లనకవి కృష్ణదేవరాయలయాస్థానమం దున్నట్లును, ఆచక్రవర్తి కొక ప్రబంధ మంకితము చేసినట్లును రాయవాచకమందలి యీక్రిందివృత్తాంతమునలనఁ దెలియవచ్చుచున్నది.

"రాయలవారున్ను చాలాసంతోషపడి, ముక్కు తిమ్మయ్య, అల్లసాని పెద్దయ్య, మాదన్నగారిమల్లయ్య మొదలైనకవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితానాయకులతో పలుకరించ్చి, ఆతీరున అయ్యాని అనంగా, కుళ్లాయి,కబ్బాయి, తాళి చౌకట్లు, చేసరిపేరులు, కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను, మనుచరిత్రాను, చెప్పు మని ఆనతిచ్చినారు." (రాయవాచకము-116 పుట)

కాని, మాదయ్యగారిమల్లన్నవల్ల నేగ్రంథము కృతిపొందిరో రాయవాచకముంబట్టి గాని, తదితరాధారములంబట్టి గాని తెలియరా లేదు. ఈకవి వ్రాసిన గ్రంథ మొక్కటియే- అనఁగా, రాజశేఖరచరిత్రము మాత్రమే కాన్పించుచున్నది. దీనిని కృష్ణదేవరాయలకుఁ గాక నాదెండ్ల అప్పయమంత్రి కంకితముఁ జేసినాఁడు. బహుశః మఱియొక గ్రంథము రచించి కృష్ణరాయనికిఁ గృతి యిచ్చియుండవచ్చును. అది కాలప్రవాహములో మునిఁగి యదృశ్య మైన దేమో!

అల్లసాని పెద్దన్న, ముక్కుతిమ్మన్న మున్నగుకవులతోపాటీకవియుఁ గృష్ణదేవరాయలు దిగ్విజయదండయాత్రలకుఁ బోయినపు డాతనిశిబిరములోనే రాజసాన్నిధ్యమున నుండుచుండెను. ఈవిషయముఁ గూడ రాయవాచకమువల్లనే తెలియవచ్చుచున్నది. (రాయవాచకము: 89 పుట.)

కుమారధూర్జటియు నీవిషయమునుదనకృష్ణరాయవిజయమునుం దుదాహరించెను. విజయపుర అహమదాబాదు నవాబులను జయించినవెంటనే యాశిబిరములలో నుండఁగానే యీముప్వురుకవులును విజయస్తోత్రములతో శ్రీకృష్ణదేవరాయలను గొనియాడిరఁట! (కృష్ణరాయవిజయము. ఆ. 3.)

కృతికర్త :—మాదయామాత్యునిపుత్రుఁ డగుమల్లన్న శైవబ్రాహ్మణుఁడు. ఈతనిది శౌనకసగోత్రము. అయ్యంకిపురమునకు నధికారి. ప్రస్తుతము కృష్ణాజిల్లా దివితాలూకాలో నున్న అయ్యంకిగ్రామమే యిది కావచ్చును.

ఉ. శంకరపాదసేవనవశంవదమానసపంకజాత ని
శ్శంకవచోవిలాసరుచిసారవినిర్జితపూర్ణపూర్ణిమా
శాంక దురక్షరాననభయంకర శౌనకగోత్రపాత్ర య
య్యంకిపురాగ్రహారవిభవాకర మాదయమల్లనక్షితీ? (రాజశేఖరచరిత్రము).

ఈకవి శైవమతావలంబకుఁ డయి యఘోరశివాచార్యుని శిష్యుఁడుగా నుండెను. ఈయఘోరశివాచార్యుఁడే ముక్కు తిమ్మనకు నతని మేనమామ యైనఘంట సింగన్నకును గూడ దీక్షాగురువుగా నుండినట్లు వారి గ్రంథములవల్లఁ దెలియవచ్చుచున్నది. మల్లనకవి శైవదీక్షయే గాక సారస్వతప్రజ్ఞ కూడ నీగురువు నుండి నేర్చుకొనిన ట్లీగ్రంథమందలి యాశ్వాసాంతగద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. "ఇది శ్రీమదఘోరశివాచార్యగురుకరుణావిశేషలబ్ధసారస్వత మాదయామాత్యపుత్రమల్లయ్యనామధేయప్రణీతం బైనరాజశేఖరచరిత్రంబు—".

కృతిపతి :—కృతిపతి యగు నాదెండ్ల అప్పయమంత్రి యాకాలముననఁగా ౧౫వ శతాబ్దాంతమునను, ౧౬వ శతాబ్దప్రారంభమునను- ప్రసిద్ధకుటుంబమునకుఁ జెందినవాఁడై తానును గొప్ప యుద్యోగమును జేసి ప్రఖ్యాతపురుషుఁడుగా నుండెను. ఈతనిది మాయువేలవంశము. విశ్వామిత్రగోత్రము. ఈతనియింటిపేరగునాదెండ్ల యొకగ్రామనామము. నాదెండ్ల యనెడుగ్రామము గుంటూరుజిల్లా, నరసారావుపేఁటతాలూకాలో నున్నది. కాఁబట్టి వీనివంశము మొదటినుండియు గుంటూరుసీమయందే వెలసి యుండె నని చెప్పవచ్చును. ఈయప్పయమంత్రి విజయనగరసామ్రాజ్యచక్రవర్తి యగుకృష్ణదేవరాయల శిరఃప్రధాని యైన సాళువ తిమ్మరసునకు మేనల్లుఁ డని చెప్పినమాత్రముననే యాతనివంశప్రతిష్ఠ స్పష్ట మగుచున్నది. అయినను నాదెండ్ల అప్పయమంత్రి ప్రసిద్ధి తిమ్మరసుమూలమునను, నాతనిసంబంధమువలననే గాక స్వకీయవంశపారంపర్యమునఁ గూడ వచ్చిన దని చెప్పుటకుఁ జాల నాధారములు గలవు. ఈతనివంశవృక్షము రాజశేఖరచరిత్రమం దిట్లు గాన్పించుచున్నది.




కావున నీయప్పయ్యవంశములోఁ బూర్వులుఁ గొందఱు విజయనగరరాజ్యమందు దండనాథులుగాను, మహాప్రధానులుగాను నుండుటచే, అప్పయ్యకుఁ బూర్వమే యీనాదెండ్లకుటుంబము బహుళవిఖ్యాతిఁ బొందెనని విశదమగుచున్నది. అప్పయ్య తాతయుఁ, దండ్రియును దండనాథులుగా నుండినట్లును అప్పయ్య ముత్తాతయగు చిట్టిగంగన్న సాళువనృసింహరాయల యొద్ద మంత్రిశేఖరుఁడుగా నుండినట్లును నీగ్రంథమందలి వంశవర్ణనవలనఁ దెలియుచున్నది. చిట్టిగంగన్న మహాప్రధానివిషయ మీక్రిందిపద్యములలో విశదమగుచున్నది.

ఉ. సాళువనారసింహమనుజప్రభుకార్యకళాధురంధరుం
డై లవణాబ్ధివేష్టితధరాధిపధుర్మతమంత్రమంత్రిసుం
డాలవితానకేసరి యనంగ ననంగసమానరూపరే
ఖాలలితాంగుఁ డట్టిచిటిగంగన యొప్పు గుణానుషంగుఁడై.

శా. అంగాధీశకళింగరాజమగధాద్యత్యాదిభూభృత్సభా
రంగాభంగవిహారముల్ ఘనశిలాగ్రావస్థలీసంసర

ద్గంగోత్తుంగతరంగనిర్గళితనిధ్వానోద్భటప్రక్రియా
సాంగత్యంబులు చిట్టిగంగవిభునాచాసంభ్రమారంభముల్.

ఇట్టీయప్పయ్య వంశస్థులు చాలకాలము నుండియు విజయనగరరాజుల కొలువులో గొప్పయుద్యోగములు చేసి విస్తార మగుకీర్తి గడించినవారే. ఇట్లుండఁగా అప్పయ్యమంత్రి తండ్రి యగు తిమ్మన్న కృష్ణదేవరాయల మహామంత్రి సాళువ తిమ్మరసుసోదరి, కృష్ణమాంబను వివాహ మాడుటచే నటకుఁ బూర్వమే పేరుప్రతిష్ఠలుఁ బొందిన యీకుటుంబము మఱింత ప్రఖ్యాతివహించినది.

సీ. ఏమంత్రిమణి నిజస్వామికార్యక్రియాతత్పరమానసోత్సాహశాలి
యేమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రితప్రకరరక్షణకళాప్రౌఢబుద్ధి
యేమంత్రిమణి వచోహేలాతినైర్మల్య శీతలతాధూతశీతరోచి
యేమంత్రిమణి సుధాధామశాంభవధామధాళధళ్యసుతుల్యధవళకీర్తి
యట్టి మంత్రికులోత్తంసమహితనృపతి,పటలమకుటాగ్రఘటితపత్పద్మయుగళి
సకలకర్ణాటరక్షావిచక్షణుండు, దీనసురశాఖి సాళువ తిమ్మమంత్రి.

గీ. అమ్మహామంత్రి కతనియర్ధాంగలక్ష్మి, సకలపుణ్యాంగనాజనశ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి లలిని మెఱయు,తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె.

సాళువ తిమ్మరసు తనచక్రవర్తియాజ్ఞచొప్పున విశ్వాసపాత్రు లగువారిని క్రొత్తగా జయించిన దేశములయం దధికారులుగా నియమించి యుండెను. అట్టియవసరమును నవకాశమును గలిగినప్పుడు తనసోదరిపుత్రు లైనతనమేనల్లుండ్రను విడిచిపెట్టునా? కావునఁ దనమేనల్లుండ్రను అప్పయ్యను, గోపయ్యను బరిపాలకులుగా నియమించియుఁ, దనకొమార్తె యగుతిరుమలాంబను అప్పయ్యకుఁ బెండ్లిచేసియు నిట్లు వారిని వృద్ధిలోనికిఁ దెచ్చెను. ఏలాకో పెద్దమేనల్లుఁడగుకోనయ్యవిషయ మేమియుఁ గాన్పింపదు. అప్పయ్యగోపయ్యలు మాత్రము రామలక్ష్మణులవలె నేకముఖముగా బ్రవర్తించుచుండి రని యనేకాధారములఁబట్టి తెలియవచ్చుచున్నది. అప్పయ్యయు గోపయ్యయు రాజ్యాధికారములు నిర్వహించి యనేకదానధర్మములను, దేవాలయప్రతిష్ఠలను జేసి శిలాశాసనములను, బెక్కింటిని జెక్కించిరి. ఇంతియ కాక విద్యాప్రియులై పెక్కుగ్రంథములను వ్రాయించి యంకితముఁ జేయించుకొనిరి. స్వయముగాఁ గొన్నిగ్రంథములను వ్రాసినట్లు గూడఁ దెలియుచున్నది. నాదెండ్ల గోపయ్య గుత్తిదుర్గమునకుఁ బాలకుఁడుగా నుండిన ట్లీగ్రంథమందు సూచింపఁబడినది. కాని, అప్పయ్యమంత్రి యెచ్చటఁ బరిపాలించెనో,

యేయుద్యోగముఁ జేసెనో యావిషయ మీగ్రంథమం దెచ్చటను నిర్వచింపఁబడలేదు. దీనిని గుఱించి చర్చించుచు బండారు తమ్మయ్యగారు శుక్ల సంవత్సర ఉగాది సంచికలో వారు రచించిన 'మాదయ్యగారి మల్లన్న, రాజశేఖరచరిత్రము' అను వ్యాసమున నిట్లు నుడివిరి. "అప్పయమంత్రి యేదుర్గపాలకుఁడో, మల్లనకూడఁ దనగ్రంథమున వివరించియుండలేదు. కాని యాశ్వాసాంతపద్యములలోని 'శుంభత్పూర్వభూభృద్దిశానారీమన్మథా,' యను విశేషణముచేత నీతఁడు నుదయగిరిదుర్గ రక్షకత్వమున నియుక్తుఁడై యుండునేమో యని నేఁ దలంచుచున్నాను." దీనిని బట్టి వారియభిప్రాయ ముదయగిరిలో నప్పయమంత్రి దుర్గాధికారముఁ జేసియుండెనేమో యని కాన్పించుచున్నది.

వీరు చేసిన యూహ నాకెంతమాత్రమును సరిపడలేదు. "పూర్వభూభృద్దిశా" యని యున్నదికాని 'పూర్వభూభృత్పుర' మని యుండలేదు. 'పూర్వభూభృత్పుర' మనియున్నయెడల వారు చేసిన యర్థము సరిపోవచ్చును. 'దిశా' యని యుండుటచేఁ బ్రత్యేకముగా నొక పురనామక మగుసీమ గాక మఱియేదో విపులతర మగుదేశముగా నుండవలె నని తలంచితిని. ఇట్లు విమర్శించుచు నన్వేషింప సాగితిని. శాసనాదికప్రకటనలలోఁ బ్రవీణు లగు నాస్నేహితులతో ముచ్చటింపఁగా నొకరు మంగళగిరిశాసనములో నాదెండ్ల అప్పయ్యనుగుఱించి కొంతవిషయ మున్నది యని తెలియఁజేసిరి. ఆవెంటనే ఎపిగ్రాఫికా ఇండికా ఆఱవసంపుటములో నున్న యాశాసనమును జదివితిని. తదుపరి నా మొదటియనుమానము రూఢమైనది. 'పూర్వభూభృద్దిశా' యనువిశేషణము, ఉదయగిరి రాజ్యసూచకముగాద నియు, మఱి వేఱుప్రదేశమును గుర్తించుచున్న దనియు స్పష్టమైనది. నాదెండ్లప్పయ్య, ఉదయగిరిలో నెన్నఁడు నివసించియుండలేదు. ఆశాసనప్రకారము శ్రీకృష్ణదేవరాయలు సాళువ తిమ్మరసు సహాయమునఁ గొండవీడుదుర్గము సాధించి, గజపతి నోడించిన తరువాతఁ దాను నూతనముగా జయించిన దేశమును బరిపాలించుటకుఁ గాను తిమ్మరసుమహామంత్రిద్వారా తగినవారిని నియమించెను. అప్పుడు తిమ్మరసు తనమేనల్లుఁడు, నల్లుఁడు నైన అప్పయ్యను గుత్తి, వినుకొండ, అమరావతి మున్నగుకోటలపై నధికారము నప్పగించి తనకనిష్ఠభాగినేయుఁ డైన గోపయ్యను గొండవీడుదుర్గమున నుంచి తూర్పుదేశమంతయును స్వాధీనము చేసికొనెను. ఈయేర్పాటువలన నప్పయ్యకు ననంతపురము జిల్లా మొదలు గుంటూరు జిల్లా తుదవఱకు ననఁగా, తూర్పుకొండలభాగమంతయు—కొండవీడుసీమ తప్ప

నప్పగించెను. కావున 'పూర్వభూభృద్దిశా' యనుమాటలవలనఁ దూర్పుకొండల దేశ మని స్పష్ట మగుచున్నది. ఈదేశ మంతకు మధ్యస్థముగా నున్న వినుకొండ యీతనికి రాజ్యస్థానముగా నుండవచ్చును. ఏలన నీయన చేసినదానశాసనముల లోఁ జాలవఱకు నాసీమయందును, నాపట్టణపుచుట్టుపట్ల నున్నగ్రామములయం దుఁ గాన్పించుచున్నవి. కనుక వినుకొండ ముఖ్యస్థానముగాఁ జేసికొని తూర్పునాఁ డంతయు- కొండవీడు—కాక, నాదెండ్లప్పయ్య పరిపాలించె నని నిశ్చితముగాఁ జెప్పవచ్చును.

నాదెండ్లప్పయ్య మహావదాన్యుఁడు. ఆయనచేసినదానధర్మములు సుమా రిరువదివఱకు నొక్కనుంగళగిరిశిలాశాసనములోనే యున్నవి. ఇంక ననేకములు గుంటూరుజిల్లాలోను, కడపజిల్లాలోను నున్నట్లు దెలియవచ్చుచున్నది.

1. వినుకొండకును, కుంతీనదికిని మధ్యను అప్పాపుర మనుగ్రామము నిర్మిం చి వినుకొండలోని అంగడిగోపినాథస్వామివారికిఁ గానుకగా సమర్పించెను.

2. రొంపిచర్లలో నున్న యనంతగోపినాథస్వామివారికిఁ దల్పట్టణసమీ పమున గోపవరగ్రామమును నిర్మాణముచేసి సమర్పించెను.

3. మద్దిరాలగ్రామములో నున్నమాధవీదేవికి సమీపగ్రామ మగుపమిడి మఱ్ఱును ధూపదీపకైంకర్యములకు నిచ్చివేసెను.

4. మల్లవరగ్రామములో నున్న చెన్న కేశవరామనాథస్వామివారి కాగ్రామ మును దేవబ్రాహ్మణభోగ్యముగా నొసంగెను.

ఇంక ననేకము లగు దేవాలయప్రాకారనిర్మాణములును, నగ్రహారప్రతిష్ఠ లు నీమహావితరణశీలుఁడు చేసినట్లు శిలాశాసనములు వేనోళ్లఁ జాటుచున్నవి.

ఈతఁడు వైష్ణవభక్తుఁడు. రాధామాధవమంత్రోపాసకుఁడు. (రాధావిట మంత్రలిఖితమతిసంపుటికిన్ అను పద్యాంతమును జూడుఁడు.) అట్లయినను నీయన చేసిన దానధర్మములలో నెక్కువసంఖ్య శైవసంబంధ మైనవియే. ఈవిషయ మా తనివిశాలహృదయమును, శివకేశవాభేదతాత్పర్యమును విశదపఱుచుచున్నది.

ఆకాలపు మహాపురుషు లందఱివలెనే యప్పయ్య కేవలము మంత్రాలో చనయందే గాక దండనాథుఁడై ఘోరరణములనుగూడఁ జేసియుండెను. ఈవిష య మనేకస్థలములలో నీగ్రంథమున సూచింపఁ బడినది.

శా. స్వర్భాభమాజనకీర్తనీయగుణఘోమద్విట్ప్రతాపార్యమ
స్వర్భానూద్భటపారసీకఖచీసావీరఘోటీఖురా

విఘ్నాతోద్భలఘాటిఘూళిభరదోర్వ్యాసఘూతార్జునా
గర్భస్థాపితభూర్భువప్రముఖలోకస్వచ్ఛకీర్తిచ్ఛటా !

నాదెండ్ల గోపమంత్రిరచించిన కృష్ణార్జునసంవాద మనెడు నాంధ్రద్విపద కావ్యములోఁ దనయన్న యగునప్పమంత్రిని గుఱించి యిట్లు వర్ణించెను.

ద్విపద. "అందునప్పయమంత్రి యాచకలోక, మందారభూజసమానవైభవుఁడు
రాజశేఖరచరిత్రకు నధినాథు, డాజికిరీటి మహాభాగ్యయుతుఁడు
చింతామనోహరకాంతివిస్ఫురుఁడు, కంతుజయుతసంకాశుఁడై తనరి
శ్రీయశోనిత్యుండు శ్రీకృష్ణదేవ,రాయసామ్రాజ్యభారధురంధరుఁడు
బలవదరాతిభూపతినుతపాద, తలుఁడు సాళువ తిమ్మదండనాయకుఁడు
లక్ష్మీమహాదేవిలాగుననొప్ప, లక్ష్మమ్మకు జనించి లాలితలీలఁ
బెరిఁగినతిరుమలాంబికఁ బెండ్లియాడి, నిరుపమప్రాభవనిత్యుఁడై వెలసె."

మల్లనకవి తనరాజశేఖరచరిత్రమును నప్పయమంత్రి కంకితముఁ జేసినను, గ్రంథమందు మాత్రము అప్పయకంటెఁ దమ్ముఁడగు గోపయ్యనే యెక్కువగాఁ గీర్తించినట్లు గాన్పించుచున్నది. శిలాశాసనాదికములలోఁ గూడ నప్పయకంటె గోపయ్యయే యెక్కువసమర్థుఁ డైనట్లుఁ గోచరించుచున్నది. ఇంతయేల కృష్ణదేవ రాయలు నూతనముగా జయించిన కళింగరాజ్యభాగ మంతకు మూలకంద మనియు, జీవస్థాన మనియుఁ జెప్పఁదగిన కొండవీటి దుర్గమున కీతనినే పాలకునిఁగా నియమించినవిషయ మాలోచించినయెడల గోపయ్య యధికతరప్రాభవము నిశ్శంకముగా ద్యోతక మగుచున్నది. గోపనమంత్రి చాణక్యప్రజ్ఞగలవాఁడై భట్టియుగంధరులవలె రాజనీతియం దప్రతిమానుఁడై యుండెను. రాజశేఖరచరిత్రమందు గోపయ్యమంత్రి కుత్తిదుర్గపరిపాలకుఁడుగాఁ జెప్పఁబడినాఁడు. అట్లే మంగళగిరి శాసనములో నప్పయమంత్రి మొట్టమొదట, కొండవీటిదుర్గమునకు నధికారిగా నిర్ణయింపఁబడిన ట్లున్నది. తరువాత గోపయ్య కొండవీటికిని, అప్పయ్య వినుకొండ మున్నగు దుర్గములకును నియమింపఁబడినట్లుఁ దెలియవచ్చుచున్నది. ఈవిషయము లన్నిటిని బరికించి చూడఁగాఁదూర్పుదేశము పాలనాధౌరంధర్య మీయిద్ద అన్నదమ్ములకును నొప్పగింపఁబడి వారిలోవా రేకగ్రీవముగఁ జక్రవర్తి యనుమతిని విభజించుకొని పరిపాలకదేశములు మార్చుకొనియు సామ్రాజ్యమునకు లోటులేకుండఁ గొనసాగించి రని చెప్పవచ్చును. వీరిద్దఱును బరస్పరము ప్రేమవిశ్వాస పాత్రులై రామలక్ష్మణులవలె మెలంగుచుండిరఁట.

క. ఆయనుఁగుందమ్మఁడు విన, యాయతమతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడుం
బాయక యన్యోన్యప్రియు, లై యలరిరి రామలక్ష్మణాకృతు లగుచున్.

కృష్ణమిశ్రవిరచిత మయిన ప్రబోధచంద్రోదయనాటకమునకు గోపయ మంత్రి వ్రాసినవ్యాఖ్యయందలి పీఠికలో నీతనిగుఱించి యిట్లున్నది.

" నాదెండ్ల గోపసచివో నవమార్గవేత్తా చాణక్యభట్టిశివధర్మయుగంధరాదీన్
యః పూర్వమంత్రితిలకా నపి ధిక్కరోతి "

అనఁగా గోపయ్యమంత్రి రాజనీతియం దొకనూతనమార్గ మవలంబించిన వాఁడై, చాణక్యభట్టిశివధర్మయుగంధరులను గూడ నధఃకరించినవాఁ డయ్యెను. కాని గోపయ్య యవలంబించిన నూతనమార్గ మేదియో సూచింపఁబడలేదు.

గోపయ్య ప్రతిభాన్వితుఁడైన బుద్ధిశాలి. స్వయంప్రకాశముచే ననేకము లగు నుత్కృష్టకార్యములను జేసి తనకును దనయన్నగారికినిఁ గీర్తిపుంజములను గడించినాఁడు. సంస్కృతమున, ప్రబోధచంద్రోదయమునకుఁ "చంద్రిక" యను వ్యాఖ్యానము రచించి తనవంశమును గుఱించియు, కృష్ణదేవరాయలవంశము గుఱించియు సంపూర్ణములు చరిత్రాంశములు దెలియఁబఱిచినాఁడు. ఆంధ్రభాషను గృష్ణార్జునసంవాద మనుద్విపదకావ్యము స్వయముగా రచించి యాంధ్రకవి యని పించుకొనినాఁడు.

దానధర్మములు చేయుటలోఁ గూడ నన్నగారి కేమాత్రము వెనుదీయలేదు. ఈతఁడుచేసిన దానశాసనములుముఖ్యముగా, కొండవీటిలోను, దత్పరిసరము లలోను గాన్పించుచున్నవి. కొండవీటిలో యజ్ఞవేదికారాఘువేశ్వరునకుఁ బ్రాకార గోపురప్రాసాదములఁ గట్టించియు, అంగరంగవైభవాదులకు, ఉన్నవ- మున్నగు గ్రామాములను ధర్మముచేసియు, రామచంద్రపురాగ్రహారమును నిర్మించి బ్రాహ్మణుల కొసంగియు, నిట్లు దేవబ్రాహ్మణభక్తి నపారముగఁ జూపినాఁడు. కృష్ణరాయనికి బాసటమైన ప్రసిద్ధాంధ్రులలో నీతఁడు మొదటివరుసలో నుండఁదగినవాఁడని వక్కాణింపవచ్చును. ఆంధ్రచరిత్రపరిశోధనకుతూహలులగు నాంధ్రసర్వకళాశాల విద్యార్థు లెవరైన నిట్టియాంధ్రప్రసిద్ధపురుషుల దివ్యచారిత్రములను వెలికిఁదీసి. యాంధ్రమహాపురుషుల జీవితమాలగాఁ బ్రచురించిన నెంతయో దేశాభ్యుదయమునకుఁ దోడ్పడు నని మనవిచేయుచున్నాను. వీరిచరిత్రవిషయము లింతవిపులముగా వ్రాయుట నాప్రస్తుతకార్యమున కంత యవసరము గాకపోయినను, ఈమహామహులచరిత్రములను గొంతవఱకైనను సేకరించి యాంధ్రసోదరుల కిచ్చె

డుతలంపునఁ నొకించుక యప్రసక్తవ్యాప్తిని పీఁవిషయములను వ్రాసితిని. కాన నన్ను క్షమింపవేఁడుచున్నాను.

కథ:—ఆవంచిపురమందు హేమధన్వుఁ డనురాజు ధర్మయుతముగఁ బా లించుచుండెను. ఆతఁడు విభాసుఁ డను రాజకుమారిని, పాలిక యనుదానిని వి వాహమాడెను. రాజదంపతు లనపత్యులై శివునిగూర్చి తప మాచరించిరి. ఈ శ్వరుఁడు వారిభక్తికి మెచ్చి యొకఫలము నొసంగెను. దానిని రాణి యారగింపఁ గా గర్భము దాల్చి యొకకుమారునిఁ గనియెను. ఆపుత్రునిపేరు రాజశేఖరుఁడు.

రాజశేఖరుఁడు చిన్నతనముననే వేదశాస్త్రములను, ధనుర్విద్యను నేర్చి మహాబుద్ధిశాలియు, మహాశూరుఁడు నయ్యెను. ఒకనాఁ డొకముని తనకొమార్తె నొకరక్కసుఁ డెత్తికొనిపోయె నని విలపించుచు రాజునొద్దకు వచ్చి యారక్కసుని జం పి తనకూఁతును విడిపించుటకు యువరాజును బంపు మని వేఁడుకొనెను. రాజ శేఖరుఁడుఁ దండ్రియాజ్ఞ శిరసావహించి, ధనుర్బాణములను గైకొని మంధరపర్వ తప్రాంతమున నాపిశితాశనుని దార్కొని యాతనితో ఘోరయుద్ధమును జేసెను. రక్కసుఁ డాహవమున నిలువలేక, పాఱి, మహాకాళిపిఱుంద డాఁగెను. రాజశేఖ రుఁడు వెన్నంటి దేవాలయముఁ జొరఁగా మహాకాళి ప్రత్యక్షమై రాజశేఖరుని శౌర్యప్రతాపములను మెచ్చి, రక్కసుని క్షమింపు మని కోరి, రాజకుమారున కొక దివ్యమణి నిచ్చెను.

కాళికాలయమున రాజశేఖరుఁ డుండఁగా నొకయోగిని వచ్చి మునికుమా రిక యగుభానుమతిని దెచ్చి యాతని కొప్పగించి, యాతని కొక త్రికాలవేది యగుచిలుకను గానుకగా నిచ్చెను. రాజశేఖరుఁడు సముచితముగ సంతసము వె లిపుచ్చి, యటనుండి మునిసహాయమునఁ బదరికాశ్రమమునకుఁ బోయి, యచ్చ ట నున్నతాపసులను సేవించి, వారిదీవన లొంది భానుమతినిఁ దల్లి కొప్పగించి తిరిగి వచ్చుచుండఁగా నిదాఘాతపశ్రమచే నొకసరోవరమునొద్ద విడిసెను. ఆసమ యమునఁ గొలనిలో స్నానముఁజేసి సఖీజనపరివృతయై వచ్చుచున్న యొకరాజక న్యను జూచి, తత్క్షణమే మోహించెను.

ఆమె యెవ్వతె యని చిలుక నడుగఁగా నాచిలుక యిట్లు చెప్పందొడం గెను. "ఈకన్య అరుణపురపు రాజైన కీర్తిపాలునికూఁతురు. ఈమె కొండొకశా పకారణమున నిట్టిరాజునకు జనించినది. అది యే దనఁగా: ఈయరుణపురమందే యిద్దఱుబ్రాహ్మణు లిరుగుపొరుగుల వసించుచుండిరి. వారిలో ముకుందుఁ డనువాఁ డు ధనికుఁడు. అరుణుఁడు నిర్ధనుఁడు, అరుణునిభార్య ధనార్జనము కొఱకుఁ దన

పతిని దేశాంతరము పంపెను. ఆతఁడు యమునానదీతీరమున విష్ణునిగూర్చి తప మాచరించుచుండఁగఁ బుష్పవతీపురరాజైన నందకుఁడను గంధర్వనృపాలుని తనయ యగులతయును, మహేంద్రనగరభూజాని యగుచిత్రవాహనుఁడనుయ క్షేశునిపుత్రిక యగుకనకమంజరియును జలకమాడుటకు నదీతీరమునకుఁ బోయి యచ్చట నొకచెట్టునుండి వ్రేలాడుచున్న యొక పూగుత్తి యుకొఱకుఁ దగవులాడి, యొకరినొక రాక్షేపించుకొనుచుఁ, గనకమంజరి తననెచ్చెలి యగులతను జూచి, యదిగో దపస్సుఁ దప మాచరించుచున్న యా మునిపుంగవునిఁ దపోభం గముఁజేసి యాతని కుసుమాస్త్రవశునిగఁ జేయఁగల సమర్థత మనలో నెవ్వారి కున్నదో చూత మని పంతము వైచెను. అంత లత యాతాపసుని దగ్గఱఁజేరి తనమోహనవిలాసములఁ జూపనారంభించెను. ఆజడదారి విష్ణునిగూర్చి తపమా చరించుచున్న యతఁడే. కావున నాభూసురోత్తముఁడు లతాకన్యయొక్క యా వనోద్రిక్తనిర్హేతుకసాహసమునకుఁ గినిసి యామెను శపించెను. తచ్ఛాపవశమున నీసింధుపతి కామె పుత్రికయై జనించినది. ఈకన్యపేరు కాంతిమతి" అని శుకము చెప్పెను.

కాంతిమతిగూడ రాజశేఖరుఁ జూచి వెంటనే మోహపాశమునఁ జిక్కెను. యువతీయువకు లిద్దఱు విరహాతురులై తమస్థానముల సోలుచుండిరి. కాంతిమతి తనచెలికత్తెను రాజశేఖరునియొద్దకు దూతికగాఁ బంపెను. రాజశేఖరుఁడు కాంతి మతియొద్దకుఁ జిలుకను పంజరమున నిడి యాదూతికద్వారా పంపెను ఆచిలుక సింధుపతియొద్ద నిలిచి రాజశేఖరునికులగోత్రములను, గుణగణములను స్తుతించు చు నుపన్యసించెను. సింధుపతి సంతుష్టుఁడై రాజశేఖరునివంటి రాజకుమారుఁడు అల్లుఁడు గాఁ గలఁడని మానసమున నుప్పొంగి యాతనియొద్దకుఁ బురోహితుల నుఁ బంపి తననగరమున కాతని రావించెను. వెంటనే వివాహ ప్రయత్నములఁ జే సి తనకూఁతు నాతని కిచ్చి పాణిగ్రహణోత్సవముఁ గావించెను. వధూవరు లిరు వురు నావంచిపురమునకుఁ దిరిగివచ్చిరి. అచ్చట హేమధన్వమహారాజును దన రాజ్ఞియుఁ గొడుకునుఁ గోడలిని సముచితముగ దీవించి, గారవించి, తమపురము నకుఁ దోడ్కొనిపోయిరి. రాజశేఖరుఁడును, కాంతిమతియు సమస్తభోగముల నను భవించుచు సుఖంబుననుండిరి.

కథాకల్పనము :— ఈగ్రంథమందలి కథేతివృత్త మేపురాణమునుండి గాని యేకథాకోశమునుండి గాని తీసికొనఁబడినదో ప్రస్తుతము తెలియ రాలేదు. అనే

కపురాణములను గథాసరిత్సాగరాది కథాగారములను బరిశోధించితిని. కాని యీకథకు మాతృకనుఁ గనుఁగొనలేకపోతిని. బండారు తమ్మయ్యగారు సైతము దీనిమూలకథ యెచ్చటను గానఁబడలే దనియే తెల్పిరి. కావున నీకథ కవికల్పిత మనియే యిప్పటివఱ కూహింపవలసియున్నది.

అయిన నీకథయందలి కల్పన మంతవిచిత్ర మైనది గాదు, అద్భుతమైనది గాదు. ఇది సామాన్యముగ మనదేశమందు వాడుకలోనున్న సాధారణకథలవలెనే యున్నది గాని దీనియం దొకవిశేష మేదియుఁ గాన్పింపదు. ఇట్టికథలను వేడుక కథలు (Romances or romantic stories) అని ఐరోపాదేశీయులు పిలుతురు. అయినను వారికథలకును, మనకథలకును నితివృత్తమందుఁ గొంత భేదము గలదు.

వారికథలలో సాధారణముగ నొకయోధుఁడు (Knight) దీనజనరక్షణార్థమై దేశమందుఁ దిరుగుచు నొకానొకయరణ్యమున నార్తరవము వినును. అది యేమని పరికించుటకుఁ బోవ నొకయువతీలలామ యొకానొకదుష్టునిచే బాధల నొందుచు రక్షణముకొఱకు నేడ్చుచున్నట్లు కనుఁగొనును. అంత నాయోధుఁ డామోటుమానిసితో యుద్ధముఁ జేసి వానిని జంపి యాకన్యకను విడిపించును. తరువాత నామెకు రక్షకభటుఁడుగా నుండుటకుఁ బ్రతిజ్ఞఁ జేసికొనును. ఆమెచిక్కులలోఁ బడినప్పు డెల్ల నామెను దప్పించును. ఆతను కొన్ని యుపద్రవములలోఁ దగుల్కొన నామెయు నాతనిని విడిపించును. ఇట్లుభయులు ప్రేమపరీక్షలలో నచంచలులుగా నిలువఁబడి తుదకుఁ బరిణయముఁ జేసికొందురు. ఇటువంటి రసోల్లసితకథ లైరోపాదేశములందలి పూర్వపువాఙ్మయములలో వేలకువేలున్నవి.

మనదేశమందలి రసోల్లసితకథలు కొంత వేఱుగా నుండును. ఒకరాజకుమారుఁడు వేఁటనిమిత్తము గాని, విలాసార్థముగాఁ గాని యొకయడవికిఁ బోయి యచ్చట నొకసరోవరము చెంత విశ్రమింప నాకొలనిలో స్నానముచేయుచున్న యొకసుందరాంగిని జూచి తటాలున మోహపరవశుఁడగును. ఆమెయు నారాకొమరునిఁ జూడఁగనే మదనునివాఁడితూపులకు గుఱియగును. అంత నామెచెలికత్తె యానూతనపురుషుని డగ్గఱి, వృత్తాంత మంతయుఁ దెలిసికొని తనచెలికిఁ జెప్పును. ఆరాకొమరుని నర్మసఖుఁడుగూడ సత్వరుఁడై యొద్దకుఁ బోయి విరహిణిగా నుండుటఁ జూచి యామెయుదంత మంతయుఁ దనస్నేహితునకు నివేదించును. ఇట్లిరువురిపరస్పరానురాగము నిశ్చిత మైనతరువాత రాజకన్యతండ్రి యారాజకుమారునితండ్రికిఁ

పెండ్లిసందేశముఁ బంపును. తరువాత రాజకుమారుఁడు బంధుమిత్రసహితముగాఁ బెండ్లికొమార్తపట్టణమునకుఁ బోయి శాస్త్రోక్తముగ నామెను వివాహమాడి తనపురమునకుఁ దెచ్చుకొనును. అచ్చట నూతనదంపతులు సుఖముగానుండి పుత్రీపుత్రులం గని వృద్ధినొందుచుందురు. ఇదియే సామాన్యముగ మనదేశమందలి రసవిలాసకథ యాకృతి.

ప్రస్తుతము రాజశేఖరచరిత్రలోని కథ దీనికిఁ దూచా తప్పకుండ సరిపోవుచున్నది. కావున నీకథయందుఁ బ్రత్యేకముగఁ జెప్పఁదగ్గ విశేషము లేవియుఁ గానరావు. ఈకథ నీకవి నూతనముగాఁ గల్పించినను బ్రశంసాపాత్ర మగునంశములు గోచరింపవు. మనదేశమందలి కాశీమజిలీకథలు, కథాసరిత్సాగరములోని కథలు కొంచె మెచ్చుతక్కువగ నీలాగేయున్నవి.

కాని, యితివృత్తములోఁ జమత్కృతి లేకపోయినను గథానిర్మాణములో నేమైనను గొప్ప విశేష మున్నదియా యని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మరయుదము. ఇతరకవుల కల్పనయందుకంటె నీకవియొక్క కల్పనమం దొండురెండద్భుతవిశేషములు గానఁబడుచున్నవి. అవి యేవన- కథాకల్పనమందలి యౌచితియుఁ బరిమితియు. ఈమహాకవియందలి యౌచితీపరిమితిజ్ఞానము సామాన్యముగ ననితరకవిదృశ్య మని నాతలంపు. ఈతనికల్పనలయందు విపులీకరణముకంటె సంయమన మెక్కువగాఁ జూపట్టును. మహాబుద్ధిశాలి యగునీకవి తన ప్రతిభను నియమనిగళములలో నిమిడ్చి విశృంఖలవ్యాపారములలో విహరింప నీయక నిరోధించుటయే యొక గొప్పవిశేషము. ఇదియే నిజమైనకళాభిజ్ఞుని ముఖ్యలక్షణము. ఈలక్షణ మీకవియందు విస్ఫుటముగా గోచరించుచున్నది. రసమందును, నీతియందును నౌచితియు, వర్ణనములయందలి పరిమితియు నీగ్రంథమం దన్నితావులఁ జూడనగును. కావున నీమహాకవి రెండువిధముల సమర్థుఁడు. కవితాశిల్పములోఁ బ్రత్యవయవమును యథామితముగాఁ గుదుర్చుకొనుటయు రసాద్యలంక్రియలలో నౌచితీపరిజ్ఞానమునకు దోసిలియొగ్గుటయు నీయనయందు ముఖ్యలక్షణములు.

ఈగ్రంథమును కవికర్ణరసాయనముతోను వసుచరిత్రతోను సరిచూచిన యెడల మనకు ముఖ్యముగ రెండుసంగతులు స్ఫురించును. ఈగ్రంథమందలి కథయు, నా రెండుగ్రంథములకథలు నితివృత్తభాగమున సమానముగానే యున్నవి. వానియందలి కథాశరీరము దీనికంటె నెంతమాత్రముఁ బెద్దది కాదు. అటు లయినను నీకావ్యముకంటె నవి రెండును సుమారు రెండింతలుగాఁ బెంచి వ్రాయఁబడి

నవి. ఈమెపు కథేతివృత్తములలోని దైర్ఘ్యమునఁ గాక కేవలము వర్ణనలయందలి దైర్ఘ్యమువలనఁ గలిగిన దని విమర్శకముగాఁ జూచినఁ దెలియఁగలదు. కాని మల్లనకవి ప్రబంధనిర్ణీతము లైన వర్ణన లన్నిటినిఁ జేయలేదా యని యోచించి నను నీచిన్నగ్రంథమందు సైత మష్టాదశవర్ణనములు యథావిధిగా నున్న వని తెలియవచ్చుచున్నది. కావున వలయు వర్ణన లన్నిటినిఁ జేసియుఁ గథాప్రణాళిక కేలోటును సోఁకనీయక, నవనవోన్మేషముగా రచించియు, నీగ్రంథమును వాని కంటె సగముపాలులోఁ బూర్తి గావించెను. ఇట్టిపరిమితిజ్ఞానచోదిత మైన సంయమన మీకవియందు మొదటివిశేషము.

ఇంక రెండవవిశేష మౌచిత్యజ్ఞాన మని చెప్పితినిగదా. అది రసమందును నీతియందును ప్రత్యేకముగాఁ గాన్పించుచున్నది. ఈకవీశ్వరుని శృంగారవర్ణనము లెంతసుశ్లీలముగాను, లజ్జాయుతముగాను నున్నవో యాయాఘట్టములఁ జదివిన స్పష్ట మగును. పెద్దనాదులవలె వెఱ్ఱివెఱ్ఱికల్పనలను గాని, విపరీత చేష్టితములను గాని, చేర్చక నాయికానాయకుల శృంగారాభివర్ణన మెంతయో మర్యాదభావములతో నలంకరించినాఁడు. తుదకు నాయికానాయకులు వివాహానంతరము కేళీగృహమునఁ బ్రవేశించినతరువాతఁ దెర దించివేసినాఁడు. పెద్దన్న, నృసింహకవి, రామరాజభూషణుఁడు, పింగళిసూరన్న మున్నగుమహాకవులవలె తెరమఱుఁగున జరుగవలసిన క్రియాకలాప మంతయు బట్టబయలుగాఁ జూపలేదు. కృష్ణదేవరాయలకాలములో శృంగారవిషయమునం దింతనియమము పాటించుట కెంతధైర్యశాలియు, నిష్ఠాగరిష్ఠుఁడు నై యుండవలయునో యోచింపవలయును. కాఁబట్టి కథాశరీరమున జీవగ్రంథులవలె నున్న వర్ణనవిషయములలోను, రసాది నియమములలోను, మల్లనకవి యత్యద్భుతమైన వివేకమును జూపి కావ్యశిల్పమున నసదృశస్వాతంత్ర్యము గనఁబఱిచినాఁడు.

కథాకథనము సామాన్యముగా నున్నది. కాని యెక్కువ నైపుణ్యముఁ జూపుచుండుట లేదు. కథాసందర్భములలో నీకవి సంధానించిన భావములు గూడ సర్వసాధారణములే. అటు లయినను గథాప్రణాళిక రుచిహీనముగా నుండక, నవనవోన్మేషరుచిరముగా నుండును. దీనికిఁ గారణము: ఈకవి విషయములను నిరర్థకముగాఁ బెంచకుండుటయు, వర్ణనలయందు ననవసరశబ్దవైచిత్ర్యముగాని యస్థానవిషయప్రవేశము గాని చేయకుండుటయే. కథ చక్కగ సాగుచున్న చ్యోక్షపుతీఁగవలె మెఱుపు లీనుచు వడివడి నడచుచుండును. ప్రతిసందర్భమున నైసర్గికభావ

ములే కదుపుచుండును. హృదయమునఁ బుట్టినరసభావములు ముకురమందు ముఖము ప్రతిబింబించినట్లు పద్యములందు సులభముగా గోచరించుచుండును. ఈమహాకవి బుద్ధియందు కవిత్వము నిసర్గజన్యమైన కళగా నున్నది గాని మనస్సును పిసికి, పిండి, యొడ్చి, కాచ్చిన రసమునుండి పుట్టిన పద్యబంధముగా దని తెలియుచున్నది.

ఇతివృత్తసంఘటనము చాలఁ బొందికగాను, సరళముగాను జేయఁబడినది. మానవప్రకృతికి మించిన కార్యసంచయముఁ జూపఁబడలేదు. మునికుమారికథ హృదయశకలమువలె నిసర్గభావోన్మీలనముఁ జూపుచున్నది. లతాకనకమంజరుల కథ గూడ నట్లే యుండఁదగినదియే కాని, నిర్హేతుకముగా బ్రాహ్మణమునితపోభంగము ముడిపెట్టుటచేఁ గొంతసందర్భోచిత్వము తగ్గినది. ఆఁబోతులు పోట్లాడి లేఁగదూడ మీఁదబడినట్లు వీరిద్దఱును, బుష్పగుచ్ఛముకొఱకుఁ బెనఁగులాడి దూరమునఁ దపమాచరించుచున్న యరుణుని మీఁదఁ దమమోహనవిలాసములఁ బ్రయోగింప నుద్దేశించుటకుఁ దగినకారణము కవి ముందుగఁ జూపలేదు. ఈయతుకసంభావ్యముగా నున్నది. శాపముకొఱకుఁదెచ్చిపెట్టినసంగతి కాని సహజమైన కారణము గలదిగా నుండలేదు. కాంతిమతీరాజశేఖరుల ప్రణయకథ మొత్తము మీఁద నత్యుత్తమముగాఁ గూర్పఁబడినది. అయినను దీనియందును గొన్నిదోసఁగులుఁ గానవగును. కాంతిమతి స్వయముగాఁ దనచెలికత్తెను దనప్రియునియొద్దకుఁ బంపుట యనుచిత మని తోఁచుచున్నది. పూర్వకవు లిట్లునాయికకు స్వాతంత్ర్యమిచ్చి యుండలేదు. తనప్రియవయస్య తన విరహబాధను జూచి యోర్వలేక స్వయముగా దౌత్యమునకుఁబోవుటయో లేక నాయికతలిదండ్రులు తమప్రియతనూజవిరహతాపశమనముకొఱకు రాజకుమారునియొద్దకు సందేశముఁ బంపుటయో యున్నది గాని యీగ్రంథమం దున్నట్లు నాయిక స్వయముగా నాయకునియొద్దకుఁ జెలికత్తెఁబంపి తనహృదయనిర్వేద నివేదనముఁ జేసికొనుట యపూర్వము. ఇట్టివి స్వల్పదోషములు. మొత్తము మీఁదఁ గథాకల్పనము మనోహరముగాను, స్వాభావికముగాను, నుచితజ్ఞముగా నుండి సర్వత్ర రసవంతముగానున్నది.

శైలి:—కథాసంవిధానము కంటె నీకావ్యమందలి కవిత్వశైలి యెక్కువ రమణీయముగా నుండి, యీమహాకవి కెక్కువ ప్రతిష్ఠఁ గలుగఁజేయుచున్నది. ఈతని శైలి చాలఁ గోమలముగాను, మంజులముగాను, శ్రవఃపేయముగా నుండును. పదగుంఫనము జాళువారి చక్కని రుచులను బుట్టించుచుండును. కమనీయము ల

గుపలుకులను గ్రుచ్చుటలో నీకవికి సమానమైనవాఁడా కాలమున ముక్కుతిమ్మన్న తప్ప మఱియొకఁడు గానరాఁడు.

క. చెప్పఁదగుఁ గవిత రసముల్, చిప్పిల నప్పప్ప బళిబళీ యన; లేదా
మెప్పుడుఁ జేయకయుండుట, యొప్పుఁజుమీ సుకవి యెంతయుచితజ్ఞుఁడౌకో!

అని యీతఁడు తనకావ్యమునకుఁ బ్రరోచనగా జెప్పికొనెను. తానుఁ జెప్పినమాటలు తనకుఁ జక్కగా వర్తించునట్లే కవిత్వమును జెప్పి, ప్రతిపద్యమునను రసము చిప్పిలుచుండునట్లు చేసెను. ఈరసార్ద్రత చాలవఱకు శబ్దసాధిత మైనను గొన్నిపట్టుల నైసర్గికభావసంజనితమై యొప్పుచున్నది. కథామార్గవశమునఁ గలిగిన ప్రతిసందర్భమందును దత్తదుచిత మైన భావములను స్ఫురణకుఁ దెచ్చికొని వానిని మృదుమధురశబ్దజాలములఁ దొడిగి, వీనులకు విందగునట్లు నాతిమాత్రముగ విస్తరించి, కావ్యమునంతను మిగులఁ బొందికగను, నిమిడికగను రచించెను. కవిత్వమందు ధారాశుద్ధి మెక్కువ. పెద్దనయందలి పెళపెళ ధ్వని ఝాంకారములు లేవు. నృసింహకవియందలి గడుసుపోకడలు గాన్పింపవు. ముక్కుతిమ్మన్న యందలి పలుకుల నెరతనంపుఁగిటుకులు గానరావు. అట్లయినను మల్లన కవిత్వము వీరి కబ్బములకు వెనుదీయక యాకవివరులతో సమానగౌరవముఁ దెచ్చుచున్నది. దానికిఁ గారణములు ధారాశుద్ధిత్వము, పదలాలిత్యము, భావసారళ్యము, రసార్ద్రత. శబ్దాడంబరము కొఱకును, శబ్దచమత్కృతి కొఱకును నీకవి యెన్నఁడుఁ బెనఁగులాడలేదు. శ్లేషయమకాదులతట్టు, కన్నెత్తిచూడలేదు. పెద్దసమాసములతోఁ బద్యములను నింపుటకుఁ బ్రయత్నింపలేదు. రసనిరూపణమే ముఖ్యకర్తవ్యమని యోజించుకొనినాఁడు. కావున నీప్రబంధమందే పద్యముఁ జదివినను వెంటనే యందలిభావము హృదయంగమ మగుచున్నది. రసాస్వాదనమున కంతరాయము లెచ్చటనుఁ గలుగనీయలేదు. కథయంతయు నరఁటిపం డొలిచినట్లు సుబోధ్యమై, సుగ్రాహ్యమై హృదయాహ్లాదము గలుగఁజేయుచున్నది.

పుత్త్రుని కలిమికిఁ దలిదండ్రులు బొందెడి యానంద మెట్లు వర్ణింపఁబడినదో చూడుఁడు-

ఉ. చందురువంటి నెమ్మొగము చక్కటిఁ దూలఁగఁబుట్టు పెంపుకల్
గెందలిరాకుఁ బాదములఁ గీల్కొనఁజేసినయట్టి చిన్నిపైఁ
డందెలు గల్లుగల్లు మన నాడుచు నల్లన చేరవచ్చి నా
ముందఱ నాడ నెన్నఁడొకొ ముద్దియ ముద్దుఁగుమారుఁ గాంచుటల్.

ఈవిషయమునే నృసింహకవి మఱింత గడుసుగ నెట్లు పెంచెనోచూడుఁడు.

ఉ. ముంగిటనాడు పుత్త్రుఁ డతిమోదమునం దను దాలఁగాంచి వే
డ్కం గరయుగ్మమెత్తి చిఱుగంతులతో వెసయేఁపుతోడ డా
యంగఁ జెలంగి యెత్తికొని యక్కునఁ జిక్కఁగఁజేర్చి ముద్దుమో
మం గమియార ముద్దిడుట ముజ్జగమేలుటగాక యుండునే.

మంథరనగవర్ణన మీకవియందును, పెద్దనయందును సరిపోల్చి చూచిన నీయిరువురి శైలీభేదము తెలియఁగలదు. మల్లనయందలి మాదయానమణిమంజీర నిక్వణమును, నల్లసానివాని ఘనాఘనగర్జితగంభీరనిర్ఘోషమును విశదముగాఁ గన్పట్టుచున్నవి.

సీ. వామదేవునిమామ వాడనిక్రొవ్విరిఁ బూజగావించిన పుణ్యుఁ డితఁడు
సకలామరశ్రేణి సంప్రీతిఁ బొందంగ దాన మిచ్చిన మహాధర్మి యితఁడు
తులసిఁ గల్పించి మర్త్యులఁ బావనంబుగఁ జేసిన యుపకారజీవి యితఁడు
దేవస్థలకుఁ గామధేనువుఁ గలిగించి తలఁపు లీడేర్చిన ధన్యుఁ డితఁడు
పాపశత్రుండ్రాటఁ ద్రచ్చు నిర్బంధమునకు, నోర్చి త్రిప్పట నొందిన యుత్తముండు
ఇతఁడు సర్వప్రదానైకహేతు వనుట, గలశవార్ధికిఁ గల్పనాగౌరవంబు.

సీ. జరఠకచ్ఛపరాజు చరమాంగగృహమేధిభోగివేష్టనరేఖఁ బొలుచుజాణ
కులములోఁ దరిపు గలిగి మించినమేటి మైనాకునొరసిన మానటీఁడు
తొలువేలుపుల వేలుపుల పనుల్ గొనుజేఁడు కడలిగాయుల లోఁతుఁగన్న గబ్బి
సురరాజునకుఁ బాంసుకరిఁ జేర్చు మరకాఁడు కల్పకంబుల పంట కమ్మలీఁడు
గండు మథితసుధాధౌతకటకజాత, చంపకనవప్రకంపనాకంపవిసర
దఖరముఖరవమధుకరముఖరశిఖర, నందరసమందిరం బగు మందరంబు. (మను.)

భావములయం దద్భుతకల్పనావైచిత్ర్యము గాని, భావనాశక్తియందు నిర్భయాఖర్వగర్వసంచారవిహారగతులు గాని కన్పడవు. వర్ణనలు కృష్ణరాయ పెద్దనల యత్యధికలోకజ్ఞానసంపత్తిని జూపింపవు. ఏవేని కొఱవడినను సమ్మోహనశక్తి గల భాషామాధుర్య మన్నిటిని గప్పి, యానందపారవశ్యముఁ గలుగఁజేయుచుండును. మచ్చున కీక్రిందిపద్యములను జేర్చితిని.

ఉ. పుత్తడిబొమ్మయో చిలుకబోదయొ కెంజిగురాకుగుత్తియో
ముత్తెపుఁగోవయో మదనమోహనబాణమొ నావనీవిహా
రాత్తమతిన్ సఖీజనసహస్రము గొల్వఁగ వచ్చిపోయె నేఁ
డిత్తఱి నొక్కబిత్తరియహీనవచోరచనావిశారదా!

ఉ. ప్రన్నని పాదముల్ చిలుకవారినఁ గందెడు మేనుదీఁగెయర్
వెన్నెలవాలు నెమ్మొగము నిద్దపుముద్దు మెఱుంగుఁజెక్కులుం
గ్రొన్నెలవంటి నెన్నుదురుఁ గోమలబాహుమృణాలయుగ్మముం
గన్నులఁ గట్టినట్లు పొడఁగానఁగనయ్యెడు నాపు నెచ్చెలీ.

గీ. అల్లనల్లన సతి నడయాడె నేని, కలికికాలుసుల వాల్గంటి పలికెనేని
యంచలంచల వచ్చురాయంచకదుపు,కూడ నేతెంచుఁగీరంపుఁగొదమపదువు.

శా. కేలం దామరక్రొవ్విరిన్ బిరబిరన్ గేలీగతిం ద్రిప్పుచున్
వాలారుంగొనగోళ్ల ఘుగ్గకణికావ్రాతంబు పోమీటుచుం
గ్రాలుంగన్నుల ముద్దులేనగ విగుర్పన్ తెప్పలల్లార్ప క
వ్వాలుంగంటి ననుం గనుంగొనిన భావం బెన్నఁడుం బాయునే.

మహాకాళిని వర్ణించుటలో నామెభయంకరమూర్తిత్వముఁ జూపక మనో జ్ఞాకృతిని వర్ణించిన పద్యము కడుంగడు శ్లాఘనీయము. ఇది యాకవీశ్వరుని భావనాసౌకుమార్యమునకు గొప్పదృష్టాంతము.

సీ. కొప్పుపై నొప్పెడు కొదమచంద్రునితోడఁ గస్తూరికాతిలకంబుతోడ
సీమంతవిరచితసిందూరరుచితోడఁ గ్రొత్తము త్తియపుఁజేర్చుక్కతోడఁ
దళతళ మనుదంతతాటంకములతోడ రమణీయనాగహారములతోడ
గలుగల్లను రత్నకంకణంబులతోడఁ జిలుఁగైన చెంగావిచలువతోడ
ముద్దుమోమున లేనవ్వు మొలకతోడఁ, జల్లచూపులఁ గరుణారసంబుతోడ
శాంతరూపంబు గైకొన్నశంభురాణి, యమ్మహాకాళి ప్రత్యక్ష మయ్యె నపుడు.

ఆకాలపు కవీశ్వరుల యన్యోన్యానుకరణ సౌమనస్యమునకు నిదర్శనము గా వా రుపయోగించిన పక్షిదూతల ప్రశ్నావర్ణనములఁ దిలకింపుఁడు.

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భముల్
పరిశీలించినవాఁడ దంపతుల కుత్పాదింతు సారస్యముల్
మురిపెం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు న్మేదినీ
శ్వరశుద్ధాంతనితంబినీజనులకున్ సంపూర్ణచంద్రాననా!

వ. భామినీజనంబులకు భావభవదివ్యజ్ఞానవిశ్వాసముద్రానిక్షేపభూమినై యుండు దుఁ దిర్యగ్జాతిమాత్రంబుగాఁ దలంపవలదు, విరించివదనకమలవినిర్గత వివిధ శాస్త్రవాసనాపూర్ణకర్ణుండ నైనయేను. (శ్రీనాథుఁడు)

చ. నలినజురాణివాస మొకనాఁడు ననుం దనచేతిఁబ్రోదిరా
చిలుకను వాదుకుం గవిత చెప్పఁగఁదా నియమించి యంత నా
పలుకులఁ గొంత వాసి గని భావమునం గడు మెచ్చుచున్న ఖా
చలమున నానుతుక్క నులిచక్కఁగ దువ్వుచు గారవించుచున్.

చ. ప్రబలములైన కౌతుకకృపారసవత్సలతాదరంబులన్
శబలితచిత్తయై యపుడు నాకుపమాతిశయోక్తికామధే
నుబిరుద మిచ్చి తల్లిఖితనూపురము న్భవనైకమాతయు
య్యబల మదంఘ్రిఁదాఁ దొడిగె నాబిరుదంబిది చూడు మేర్పడన్.

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁబూర్వపక్షములు జోకం బెంచుచు న్వెంది య
క్షీణప్రౌఢిఁ దిరస్కరించుచుఁ దుదన్ సిద్ధాంతము ల్నిల్పుచున్. (సూరన్న)

శా. రామప్రాభవమైంధవాధిపకుమారా సింధుభూపాల న
న్నే మోకా మదిలోఁ దలంపకు వచోహేవాకకాకోదర
స్వామి న్నాకుఁ ద్రికాలవేది యనిభాషాదేవి పేరిచ్చె నా
రామారత్నము చేతిరాచిలుక నేర్పన్ నేర్చితిన్ సర్వమున్.

శా. వాదింతున్ బహువేదశాస్త్రకలనానైయాత్యసంసిద్ధి న
వ్వేదవ్యాసులతోడ నైన మదిసంవీక్షించి మెచ్చోట నేఁ
గాదన్నన్ మఱి నిర్వహింపఁగ నశక్యం బేరి కస్మద్వచ
శ్శ్రీదాంపత్యము నాకనాక యనుకో సిగ్గయ్యెడున్ భూవరా ! (మల్లన్న)

ఇట్లె వర్ణనావిషయములలోను గల్పనావిషయములలోను శ్రీకృష్ణదేవరాయలకాలపుఁగవులకుఁ శ్రీనాథుని శృంగారనైషధము మేలుబంతి యైనది. దాని యందలి క్రమమును సామాన్యముగఁ దప్పినవారు లేరు.

రసము. నీతి:—ఈప్రబంధమందలిశృంగారరసము గుఱించియు, నీతివివేకమును గుఱించియు వెనుకటిభాగములోఁ గొంతవఱకుఁ జెప్పఁబడినది. ఆకాలమందలి యితరమహాకవులవలె నీతఁడును జేసినశృంగార రసవర్ణన లుద్రేకపూరితములై యుండక యౌచిత్యమర్యాదలలో నిమిడియున్నవి. శృంగారరసవిషయములో నీతని యుచితజ్ఞతను నుద్వేగనిగ్రహమునుఁ జూపునట్టి యీక్రిందిపద్య మీ కవితల్లజునిచిత్తశుద్ధికి నిదర్శనముగా నూహింపవచ్చును.

క. తననగరి కరిగె నపుడ, జ్జనపతినందనుఁడు గేళిసౌధస్థితిపై
వనితామణిఁ దలపోయుచు, ననువేలదృఢానురాగుఁడై యుండుతఱిన్.

ఇందు నాయకుఁ డగురాజశేఖరునిప్రేమానురాగమును వర్ణించుచు నా యనురాగము దృఢముగా నుండియు, ననువేలముగా నున్నదియే గాని, యుద్వేలముగా నుండలే దని, యీచిన్నమాటలోఁ గవి తనశృంగారరసనిరూపణవిధానరహస్య మంతయుఁ దెలియఁజెప్పెను. ఈకావ్యమందలి శృంగారరసము స్త్రీపురుషులును, బాలబాలికలును గూడ సిగ్గుఁబొంద నవసరములేకుండఁ జదువఁదగినంత మర్యాదయుతముగ నిరూపింపఁబడినది. ఆనాఁటియాంధ్రప్రబంధములలో రసౌచిత్యమున నీగ్రంథమే ప్రశస్త మని నిరాక్షేపణముగాఁ జెప్పవచ్చును. "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్యకారణం" అని క్షేమేంద్రకవి చెప్పినాఁడుగదా! ఆసూక్తి కిది తార్కాణము. అట్లయినను నొకచోట మాత్ర మీకవి యనౌచిత్యదోషమునకుఁ దా విచ్చె నని చెప్ప సాహసించుచున్నాను.

వామనభట్టబాణుఁడు దాను రచించిన పార్వతీపరిణయ మను సంస్కృతనాటకములో హిమవంతుఁడు తనభార్యయగు మేనకతోఁ గూఁతు రగుపార్వతిని గూర్చి "ఆభోగశాలికుచకుట్మల మాయతాక్ష్యాః" అనినట్లే యీగ్రంథమందును సింధురాజు తనకుమార్త యగు కాంతిమతి యౌవనసౌందర్యము విలోకించి రోమాంచముఁ బొందిన ట్లభివర్ణింపఁబడినది.

ఇందు తండ్రిపొందిన గగుర్పాటు హర్షపులకాంకుర మైనను నాసందర్భమున న ట్లభివర్ణించుట యనుచిత మనియు, నప్రశస్త మనియు నాతలంపు.

శృంగారరసమును మృదులముగాఁ బోషించినట్లు తక్కినరసములను నాయాపట్టుల సహజోవజ్ఞతో నీకవివరుఁడు నిరూపించినాఁడు. భానుమతీహరణవిషయమునఁ గరుణారసమును, యోగినీవృత్తాంతమున శాంతరసమును, వికంకటదైత్యభండనమున వీరరసమును సజీవముగా వర్ణించి తనరచనానైపుణిని వికసింపఁజేసెను. కావుననే యేభాగములుఁ జదివినను నాయాసందర్భముల నుచితమైన రసము చిప్పిలి తాను గ్రంథాదిని జేసిన ప్రతిజ్ఞ నీమహాకవి నిర్వహించుకొనినట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఏతత్కావ్యప్రాశస్త్యము :— శ్రీకృష్ణదేవరాయల యాస్థానమం దున్నప్రశస్తకవులలో మాదయ్యగారి మల్లన యొకఁ డని గ్రంథస్థము లగునాధారములం బట్టియుఁ, బండితసంప్రదాయ గాథలనుబట్టి యుఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు

పెద్దన, తిమ్మనలతో సమాన మైనకవిగానే యన్నిస్థలములలోను వర్ణింపఁబడినాఁడు. కుమారధూర్జటి రచించిన కృష్ణరాయవిజయములోను శ్రీకృష్ణరాయజీవితచరిత్ర మైన రాయవాచకములోను గూడ మల్లనకవి పెద్దన తిమ్మనలతోఁ గలిపి ప్రశంసింపఁబడినాఁ డని ప్రథమములోనే చెప్పితిని. కాఁబట్టి పూర్వకాలమునుండియు నీకవికి నామహామహులతోపా టగ్రస్థాన మీయఁబడినది. ఇట్టియగ్రస్థానమున కీయన యెంతయు నర్హుఁ డనియే తలఁపవలసియున్నది. పెద్దన్న తిమ్మనలతో నైనను, నాకాలపు టితరమహాకవులతో నయినను, నీతని సరిపోల్చిన యెడలఁ గొన్నికొన్ని విషయముల నీతఁడు తగ్గుచున్నను, మఱికొన్నిటియందు వారికంటె నధికుఁ డని యే చెప్పవచ్చును. పెద్దన్నవలె నిస్తుల మగు ప్రతిభాగాంభీర్యములం జూపకున్నను, నాతనికంటె నెక్కుడైన మృదులమంజులభావములతోఁ గావ్యము నలరింపఁగలిగెను. ముక్కు తిమ్మనవలె ముద్దులొల్కు పాత్రసంభాషణములం జేయ లేకపోయినను నాతనితో సమానముగఁ బదలాలిత్యరసనిరూపణలం జేయఁగలదిట్ట యని యనిపించుకొనియెను. ఇంక నాకాలపు టితరమహాకవులగు నృసింహుఁడు, ధూర్జటి, కృష్ణరాయలు మున్నగువారికంటెఁ గవితామాధుర్యమునకుఁ బరిపోషకమైన భాషాసౌకుమార్యమున మిన్న యని చెప్పుటకు సంశయింప నక్కఱ లేదు. ఈవిధముగ వారికంటె నెక్కువతక్కువలలో సమానముగా నుండియు నొక విషయములో వారిలోఁ గొందఱికంటె నెక్కువగాఁ బరిగణింపఁ దగియున్నాఁడని వెనుక సూచించితిని. అది యే దన రసౌచిత్యము. అనఁగా శృంగారమును, నీతిని జక్కఁగా మేళవించి బాలబాలికలైనను జదువుటకు సిగ్గుపడ నవసరము లేకుండ నౌచిత్యమును బాటించి గ్రంథము నామూలాగ్రముగా రచియించెను. ఈవిషయమునఁ గృష్ణరాయలును, ముక్కు తిమ్మన్నయు నీతనిదరి నుండఁదగి యున్నను, దక్కినవా రందఱు దూరముగా నుండవలసినవారే. ఇదియ యీకవీశ్వరునియందలి ముఖ్యవిశేషము. బుష్యాశ్రమశృంగారమున దగ్గుబల్లి దుగ్గనకవి రచితమైన నాసికేతోపాఖ్యాన మెంతవర్ణనాతీత మగుప్రాశస్త్యము నొందినదో, యట్లే రాజాంతఃపురశృంగారమున నీకవియు నంతయసమానరసౌచిత్యముఁ జూపుటచే నీరాజశేఖరచరిత్రమును నసాధారణగౌరవము నొందఁదగి యున్నది. కావున నీకవిపుంగవుఁడు మహాకవియనఁబడుటకుఁ దగినవాఁడై యాతనిగ్రంథము మనయాంధ్రవాఙ్మయమున నున్న ప్రబంధరాజములలో నొకటి యని చెప్ప నర్హత గలదియై యున్నది.

---

# తెలుఁగునుగూర్చిన కించిత్సమాలోచనము.

— శతావధాని- విద్వాన్- దోమా వేంకటస్వామిగుప్తగారు, చెన్నపురి. —

---

క. "జిలిబిలిపలుకులఁ బలుముద్దులఁ గులికెడి తెలుఁగుబాసతో సరియగునే ?
తెలిసియుఁ దెలియక పీనుల, నలయించెడి వెట్టిమొట్టి యఱమొఱబాసల్?"

అను బుధోక్తి కగ్గమయిన తెలుఁగుబాసనుగూర్చి యేచర్చ గావించినను జాగ్రత్తగాఁ గావింపవలయు ననుట నిర్వివాదము. అట్టిసందర్భమున నాబోఁటి కించిజ్జ్ఞుఁడు చేయు చర్చ "తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః" అను మహాకవ్యుక్తి కుదాహరణం బగు. అయినను పెద్దలీవ్యాసమునఁ గల మంచిని మన్నించి దోసఁగులను క్షమింతురుగాత.

ద్రావిడభాషలలోనే కాక- భారతీయభాషలలోనే కాక- ప్రపంచభాషలలోఁ దెలుఁగునకు మంచి స్థాన మున్న దని దానికి నుండు " Italian of the East " "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అను మన్ననలు వాకొనుచున్నయవి. వాని నెల్ల నిక్కడ నేకరువు పెట్టుట గాని- వానినిగూర్చిన వివరణము వ్రాయుట గాని చర్వితచర్వణ మగును, గాన నాపథమును ద్రొక్కక- కేవలము తదభ్యుదయమును గూర్చియును, నద్దాని నేఁటి స్థితినిగూర్చియుఁ దలపోయుట తగు నని తోఁచెడిని.

దీని యభ్యుదయమునుగూర్చి యాలోచించునప్పుడు దీని ప్రారంభదశనుండి నేఁటివఱకుఁ గలిగిన స్థితిభేదములను దిక్ప్రదర్శనముగాఁ జేర్కొన నగు. మహాభారతకవులకును గించిత్తత్పూర్వాపరకవులకును బూర్వము తెలుఁగుయొక్క స్థితి యూహాసాధ్యముగా నున్నది. కాని యిదమిత్థ మని నిర్ణయమునకు వీలుగానట్లు పెక్కుఱ యభిప్రాయము. కనుక భారతకవులకుఁ బూర్వ ముండిన తెలుఁగు స్థితి దురూహము. కాని- యప్పు డభ్యుదయము లే దని చెప్ప వీలు లేదు. ఏకైకస్థాయ్యారోహణముగా నది యంతకు ముందే యెంతకాలమునుండియో యభివృద్ధినొందకున్నచో నన్నయభట్టునాఁటి కేనియును నన్నిచోడుని నాఁటి కేనియు నంతటి మనోజ్ఞపరిపాకము నొంద వీ లుండునా ? అయినను నది యెన్నిదశాభేదములను దాఁటి యాస్థితికి వచ్చినదో సులభముగాఁ జెప్ప వీలు గాదు. ఏతద్విషయకముగా ననేకపర్యాలోచయితలవలెనే శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి

కవిరాజుగారు కవిత్రయమునకుఁ బూర్వ మీతెలుఁగుబాస "యేలపాటలు-జంగంకతలు" మొదలయిన స్థితులను దాఁటి వచ్చియుండు నని యొకచో వ్రాసియున్నారు. కాని యం దేది యెంతకాలమువఱ కనునిర్ణయము కుదురుట సాధ్యపడినట్లు తోఁపదు.

కవిత్రయమునాఁటినుండి భాషాదశాభేదములను స్థూలముగా- (1) భారత కవులయుగము-(2) భాషాంతరీకరణయుగము- (3) ప్రబంధయుగము. (4) శబ్దాలంకారయుగము- లేక పిల్లవసుచరిత్రల యుగము- (5) నవలానాటకయుగము (ఇందులోనే అవధానాది చిత్రకవితాపద్ధతు లంతర్భూతములు) (6) ఖండకావ్య యుగము. అని విభజింప వచ్చును.

ఈరీతిగా భారతకవులనాఁటినుండి నేఁటివఱకుఁ దెలుఁగుబాసయొక్క జీవితమునందలి స్థితులను స్థూలముగా విభజింపనయినది. అంతేకాని- నేఁడు ఖండకావ్యయుగ మన్నంతమాత్రమున దేవీభాగవతము, శ్రీకృష్ణభారతము, శ్రీమద్రామాయణము, శ్రీబ్రహ్మాండ బ్రహ్మవైవర్త బ్రహ్మవాయుపురాణాదిమహాగ్రంథములు బయలుదేఱుచుండక పోలేదు. బయలుదేఱక పోవు. ఎల్లకాలమున నెల్లజాతులనుండి యొక్కొక్క కాలమున నొక్కొక్కజాతికిఁ బ్రాముఖ్య ముండు రీతియే యిక్కడ నుదాహరించుకొనవచ్చును.

ప్రారంభమునఁ దెలుఁగునకు దేశీయత విశేషముగా నుండినది. అనఁగాఁ దెలుఁగు దేశ్యశబ్దములు విశేష మగు వాడుకలో నుండిన వన నొప్పు. అట్టిస్థితి నన్నయ్యకుఁ బూర్వముననే యుండినది. కాని నన్నయాదులకుఁ బూర్వమున నుండిన తెలుఁగు వాఙ్మయపు టుదాహరణములు మృగ్యములు. అయినప్పటికి నన్నయ్యనాఁటికిఁ గాని, నన్నయ్యభట్టు నిటీవల తిక్కనసోమయాజ్యాదుల నాఁటికిఁ గాని, బాసయందు దేశ్యములయొక్క మిక్కుటమయిన యుపయోగము సడల లేదు. అందులకుఁ దిక్కనసోమయాజికైతలోని దేశ్యపదోపయోగబాహుళ్యమే నిదర్శనము. నన్నయముఖ్యుల కాలము మొదలు తెలుఁగువారికి సంస్కృతభాష యందు మక్కువ యెక్కువయినది. అందులకుఁ గారణము మతవిజృంభణమొండె- తద్గీర్వాణభాష యంగాంగశోభయొండె నయియుండును. అంతమాత్రమున నన్నయాదులు తమ తెలుఁగుఁదనమును బొత్తిగా విడనాడి రని తలంప వీలులేదు. వారు తజ్జాతీయత మఱియుం దుంచికొనియే యున్నారు. కవిత్రయము నాయన దత్కాలికులగు తదితరకవులును వ్రాసిన కయితలు సంస్కృతమున కనువాదములే యయినను నవి మక్కికి మక్కి భాషాంతరీకరణములు గాక- వానిలో

గీర్వాణకృతులు జీర్ణమై పిమ్మట స్వతంత్రముగా వెల్వడినవై యున్నవి. పిమ్మట భాషాంతరీకరణయుగమునందు భాషాంతరీకరణనిబంధనము లెక్కువ యయినవి. సంస్కృతచంపువుల పద్ధతి ననుసరించి కొన్ని స్వతంత్రములయిన విధానములతోఁ బ్రబంధవిధాన మేర్పాటుచేయఁబడినది. పిమ్మట నందఱును గతానుగతికముగా దాని ననుసరించినారు. పింగళి సూరన్న యొక్కరుఁడు తక్కఁ దమ పద్ధతులలో స్వాతంత్ర్యమును వహించిన వారు చాలనరుదు. తదనంతరము శబ్దార్థాలంకార వ్యాకరణాదికములయిన కట్టుబాట్లంతో బిగువునొందినవి. ఇప్పటిలోనే మహమ్మదీయరాజ్యవిజృంభము. దాని కిటీవల నాంగ్లేయవిద్యాప్రాధాన్యము. తెలుఁగు భాష కప్రాధాన్యము. ప్రధానభాషయాంగ్లము. తెలుఁగు మొదలయిన దేశభాషలు "సెకండ్ ల్యాంగ్వేజీ" పదవ్యవహృతములు. ఇట్లు రాజసభభాష యింగ్లీషయిపోవుటంజేసియును, పరదేశ పరభాషల క్రొత్తవన్నెచిన్నెలును ఝాంకారములును "క్రొత్త వింత" లై తోఁచుటంజేసియును, అటు, ఇంగ్లీషుగాని యిటు తెలుఁగుగాని సమగ్రముగాఁ దెలియక- తెలిసినను కొందఱిచేఁ బరభాష మిగుల గౌరవముతోను, స్వభాష యౌదాసీన్యముతోను నయి కాని కారణములచేఁ గనుపఱుపఁబడినది. ఈసందర్భమునం దీబాసల రాపిడిలో- ఇంగ్లీషునఁ జేతఁగాక- తెలుఁగునఁ జాలి రాక "యెట్లురా! దైవమా ?" యని యల్లాడుచున్నవారికిఁ బట్టుగా గ్రామ్యవాదసమస్య బయలుదేఱినది.

దానిలోఁగూడ బలహీనత యుండుటచేతనే యది సార్వజనీనమయిన తృప్తి నొసఁగలేక పోయినది. చర్చాపచర్చలపయిన నది వ్యావహారికభాష యను రెండవ పేరు నొందినది. అయినను నింకఁగూడఁ బరిష్కరింపరాని చిక్కొకటి యెదుర్కొనుచున్నది. దేశమున కెన్నియో విభాగములు. అందొక్కొక్కదాన నొక్కొక రకమయిన "యేచ"గల వ్యావహారికభాషారీతి యుండును. ఆపద్ధతి యక్కడి వారికవగత మగును గాని పరస్థలస్థులకు వెగటుగా నుండుటయే కాక కొన్ని సందర్భములయందు నర్థమే కాకుండును. లేనిచో విపరీతమయిన యర్థము నొసంగును. ఒకటి రెండు చిన్నయుదాహరణములను గాంచుఁడు. కొన్ని వత్సరములక్రిందట నేను బొట్టతోలిని మదరాసు స్టేషనులో దిగితిని. అప్పు డొక జట్కావాఁడు అరవతెలుఁగున "నిన్ను తీసికొనిపూడుస్తాము రావయ్యా!" అనఁగా అందలి "పూడుస్తాము" అను శబ్దము మాకర్నూలువైపున మిక్కిలి యవలక్షణమయిన యర్థ మిచ్చును గాన నామాటకు నే నాయర్థమేనేమో యనుకొని.

కోపింపఁ బూనితిని. నేను మొదటి పర్యాయము రాజమహేంద్రవరము వెళ్లి యొక హోటలులో బసచేసియుండఁగా నొకఁడు వచ్చి "అయ్యా! తలకోసుకుంటారా" అనఁగా నది యశ్లీలార్థముగాఁ నాకుఁ దోఁచినది. కాని యందుకు-అభ్యంజనస్నానము గావించుట యని యర్థము. ఆదేశపు ఊసవల్ల నాశబ్దమున కాయాపము వచ్చినది. దేశభేదములచే జన్యములయిన రూపార్థభేద కారణముల యిన యిట్టి యేస లనేకములను బ్ర॥ కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు కొన్ని వత్సరముల క్రిందఁ దమ "వజ్రాయుధపత్రిక" లోఁ బరిశ్కృతముగాఁ బేర్కొనియుండిరి.

ఈకారణవాద మిట్లుండఁగా వ్యావహారికభాష యను పేరితో వ్యాకరణాదినియమదూరమయినపక్కి చిన్నకతలమూలముగాను భావకవిత్వ మను పేరి తునకకబ్బముల మూలముగాను వ్యాప్తి నొందుచున్నది. కాన దీని నిలుకడవిష యము చర్చనీయము. ఇందలి యేసలు సార్వజనీనములు గామింజేసి అయేసల కలవడని దేశముల కివి సరిగా నవగతములు గాకపోవును. ఇఁక భావకవిత్వపు ఖండకావ్యములమాట యందమా ? అం దనేకములయర్థము తద్రచయితకే తెలియదు. ఏమి టయ్యా ! యిది "యనిప్రశంసించినచో "షెల్లీ, కీట్స్, వర్డ్సు వర్త్, లాంగ్ఫెల్లో" మొదలయిన పేర్లను బల్కి మధ్య మధ్యను పటపటాయమానముగాఁ గొన్ని యింగ్లీషు శబ్దముల నిమిడ్చి బ్రహ్మాభేద్యర్థముగా నుపన్యసింతురు.

ఆంగ్లేయభాష తొట్టతొలిని దేశమున నడుగిడిన దినములలో దాని యందెక్కువ యాదరవిశ్వాసములు దేశమునందు జన్మించినవి. అందుకుఁ గారణ మిది యన్నవస్త్రగౌరవప్రద మగు నను నభిప్రాయము. దానితోడ దేశభాషయును దేశభాషపండితులును నౌదాసీన్యమునకు పా లగుట తప్పినది కాదు. తెలుఁగు విద్దియ రాణింపకపోవుట కిది యే కారణము. కాని యందుఁ గల మ ఱేలోపమో కాదు. ఈభాష కెంతవఱ కౌదాసీన్యము కల్గిన దనఁగా- ఇంగ్లీషు నేర్వనివాఁడు తెలుఁగు చెప్పఁజాలఁ డనియును ఇంగ్లీషుపరీక్షప్యాసుగాని వానికిఁ దెలుఁగుపండితుని పదవి సులభముగా లభింప దనియు ననునంతవఱకుఁ గల్గినది. ఇంగ్లీషు కొంత డొక్కశుద్ధి కల్గి యేపాటిగానో తెలుఁగున లొడలొడలాడఁగల్గిన వాఁడు పండితుఁ డనఁబడుచున్నాఁడు. ఈపరిస్థితి యందలి సామంజస్యమును నిదియే కొంతకాలము వఱకుఁ గొనసాఁగినచో భాషయొక్క భవిష్యత్స్థితి యె ట్లేర్పడునో యనుసందర్భమును నారయఁబడునుగాక.

---

# భాషానియమము.

— మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులుగారు, బెజవాడ. —

---

అనాదికాలమునుండియు నొకరియుద్దేశమును మఱియొకరు గ్రహించుటకు భాషయే ముఖ్యసాధనమై విరాజిల్లుచున్నయది. దీనిమూలముననే కళ లన్నియు వికాసము గాంచినవి—

వేదార్థవిజ్ఞానమూలమునఁ గర్మానుష్ఠానద్వారా చిత్తశుద్ధిని గాంచి శ్రవణమనననిదిధ్యాసనములచే బ్రహ్మసాక్షాత్కారమునంది కైవల్యమందుటయు భాషాఫల మనకతీరదు. ఇట్టిభాషలలో సర్వాంగసుందర మగుచుఁ బాణిన్యాదిమహర్షులచే సలక్షణముగాఁ జేయఁబడి విరాజమానమగునది గీర్వాణభాష. దానిమాతృభాషగాఁ గైకొని పామరజనసాధారణముగా ననాదికాలమునుండి సకలవిజ్ఞానప్రదములై యున్నయవి దేశభాషలు. వానిలోనిదే మనయాంధ్రభాష. భాషయనునది దానివ్యాప్తిగల దేశమం దంతటను నేకరూపముగా నున్నచో నొక్కరి యభిప్రాయమును మఱియొకరు గ్రహించుట సులభమగును. గ్రాంథికభాష యేకరూపమై యున్నందుననే ద్రావిడకర్ణాటాదిదేశస్థు లగుపండితులును నీకావ్యములఁ బఠించి విజ్ఞానవంతు లగుచున్నవారలు. నే నొకప్పుడు మద్రాసులో దేశీయశైలితో నుపన్యసింపఁగా విదేశీయులు విషయము మాకు బోధపడలే దనిరి. మఱునాఁడు గ్రాంథికశైలితో నుపన్యసింపఁగా విషయము గ్రహించి యానందించిరి. ఇట్టిభాష విజ్ఞజనసమ్మతము లగులక్షణములతోఁ గూడియున్నచో శ్రుతిసుఖముగా నుండును గనుకనే సకలభాషాభిజ్ఞుఁడును సకలశాస్త్రవిదుఁడును మహర్షిసముఁ డగునన్నయభట్టారకుఁడు, "ఆంధ్రశబ్దచింతామణి" యనువ్యాకరణము రచించి దానికి లక్ష్యముగా మహాభారతములోని కొన్నిపర్వముల రచించెను. యతిప్రాసనియమములఁ బరిపాలించుట కవులకుఁ బ్రయాససాధ్యమైనను నియమబద్ధములైన యట్టిపద్యములు, శ్రావ్యములు గాను విద్వన్మనోరంజకములుగా నుండుననుటకు సహృదయులే సాక్షులు. అవలక్షణము లగుపద్యములు వక్తలకును శ్రోతలకును ననర్థదాయకము లనుటకనేకపూర్వవృత్తములు గలవు.

కనుకనే నన్నపార్యునియనంతరము తిక్కయజ్వ శ్రీనాథాది మహాకవు లనన్యసామాన్యపాండిత్యవిరాజమానులైనను నన్నయభట్టవ్యవస్థాపితభాషానియమముల నుల్లంఘింపకయే మహానిబంధములరచించి భాషకును దన్మూలమునలోకమునకు

మహోపకార మొనరించిరి. అనాదికాలమునుండి వ్యవహారములో నున్నయాంధ్రభాషకు నన్నయభట్టారకునకుఁ బూర్వమందును వ్యాకరణము లుండియుండును. కాలవశమున నయ్యవి శిథిలప్రచారములైనప్పుడు వీరు రచించియుందురు. ఇటులుండఁగా సుమారు 30 సంవత్సరములకుఁ బూర్వము కొందఱు నవనాగరకశిఖామణులు వర్ణాశ్రమధర్మోన్మూలనమునకుఁ గడంగినట్టులే భాషానియమోల్లంఘనముం జేయుచు గ్రామ్యశైలితో నెవరివాడుకలో నేశబ్దములు గలవో యాశబ్దములతోడనే గద్యపద్యాదుల రచించుటయు నట్టిభాషనే పాఠశాలలో విద్యార్థులకు నేర్పుటయు నిట్టిభాషయే గ్రాంథికముగా నుంచుటకుఁదగిన చట్టములం జేయుటకుఁ గడంగుటయు మొదలగువిధానముల నవలంబించిరి. ఈకృత్య మాంధ్రగీర్వాణభాషాపండితుల కసమ్మతమైనను వీరలకుఁ దగినంత రాజసన్మానముగాని పలుకుబడిగాని లేనందునఁ జేయునదిలేక శుభకాలమును నిరీక్షించుచుండిరి. కర్ణకటువులగుశబ్దముల విని వగచుపండితులపై శారదాదేవికిఁ గరుణ గలిగి యాయుమ్మ మ॥ జయంతి రామయ్యపంతులుగారి హృదయమందుఁ బ్రవేశించి ప్రేరణచేసెను వీరు బహుభాషావిదులు. ఆంధ్రమందు నిరూఢపాండిత్యము కలవారలు. సనాతనధర్మాభిమానులు- వీరు గొప్పరాజకీయోద్యోగమం దుండియుఁ దీరిక గల్పించుకొని భాషానియమసంరక్షణమునకై చేసినప్రయత్నమునకుఁ మేర లేదు. వీరిప్రయత్నమున కీయాంధ్రసాహిత్యపరిషత్తులును బత్రికయు ఫలములు-వీరలాదినములలో నింతటిదృఢప్రయత్నముఁ జేయనిచో నీభాష నీచాతినీచస్థితికి వచ్చియుండెడిదనుటకు సంశయింపఁ బనిలేదు. ౨౫ సంవత్సరములలో నెన్నియో శాసనములు వెల్లడింపఁబడినవి- అముద్రితగ్రంథములు- కవులచరిత్రములు-విమర్శనములు - లక్షణచర్చలు నిట్టివెన్నియో వెల్లడింపఁబడినవి. వేయేల- ఇప్పటికిని భాషాభిమానము గలపండితు లిందఱుగల రనుసంగతి యీపత్రికమూలముననే విదిత మగుచున్నది. ఇట్టిభాషాభిమానము గలపండితులకు సవినయముగా నొకమనవిఁ జేయుచున్న వాఁడను- భాషాభిమానముతో సమముగా నుండఁదగినది- దేశాభిమానము, స్వీయవేషాభిమానము, స్వీయధర్మాభిమానము. దేశీయుల పూర్వాచారములఁ బాటించి యాచరణములో నుంచుటయే దేశాభిమానము; తమపూర్వపురుషుల బట్టకట్టువిధమును, తిలకము ధరించుటయు, జుట్టుంచుకొనుటయు నిట్టిది వేషాభిమానము; స్నానసంధ్యాద్యనుష్ఠానము, శ్రాద్ధాద్యాచరణము, భక్ష్యాభక్ష్యవిభాగము- పేయాపేయవిభాగము- మడి, మైలలు పాటించుటయు శ్రుతిస్మృత్యాదిప్రమాణబద్ధ

తయు నిదియంతయు స్వీయధర్మాభిమానము. మనయాంధ్రసోదరులు ప్రాయికము
గా వీనిని గమనించుటలేదు. పరానుకరణప్రధానులగుచు బంగాళీల ననుకరిం
చువారు కొందరు-తురుష్కుల ననుకరించువారు మఱికొందఱును- నూటికిఁదొంబది
మంది యాంగ్లేయుల ననుకరించువారలుగా నున్నారు. ౫౦ సంవత్సరములు వ
యస్సుగలతండ్రిని ౨౦ సంవత్సరములు వయస్సుగలకుమారుని నొకచో నిలిపి
పరీక్షించితిమేని నితఁ డాతనికుమారుఁ డనినమ్ముటకు వీలులేని వైషమ్యము గనుప
ట్టుచున్నది. పరమార్థమటుంచినను లోకవ్యవహారమునకును నిది సరిపడి యుండ
లేదు. "పోలీసులు" మొదలగువారలు తమతమ "డ్రస్సు"లను వదలినచో వారికృ
త్యములకే బాధకంబగును. ఒకజాతివాని మఱియొకజాతివానిపేరుతోఁ బిలిచితి
మేని మితిమీఱినకోపము వానికి వచ్చును. మన మితరులవేషమును ధరించుటవ
లనఁగదా వీ రిట్లుపిలిచి రని తనతప్పును దానుగ్రహింపఁజాలును.

పగటిభాగవతులు వేయువేషములు జనులకు హాస్యాస్పదములుగా నుం
డును. ఆయాజాతివారల కవి సహజములుగా నుండును. అయ్యవి వారికిఁ గాని
యితరులకుఁ గాని హాస్యాస్పదములు కావు. అట్లే మనము బంగాళీలనుగాని,
తురుష్కులను గాని, యాంగ్లేయులను గాని యనుకరించితిమేని హాస్యాస్పదుల మ
గుచున్నాము. మనవేషభాషాదులే మనకు సమంజసములు- పురుషులు తమపూ
ర్వికులవేషములు త్యజించి యన్యవేషావలంబు లగుటను జూచి స్త్రీలు నటులే
యన్యదేశీయస్త్రీలవేషముల నవలంబింపఁ జూచుచున్నారు. ఇది యంతయు దేశ
గౌరవమునకు నాంధ్రజాతీయతకును భంజకము- తమపూర్వాచారములఁ గాపా
డుచు సంపాదించిన విజ్ఞానమే దేశాభ్యుదయహేతువు. తురుష్కులు వేయిసంవత్స
రములనుండి మనదేశమున నివసించి మనతో సమముగాను నింక నధికముగాను
భూస్వాము లగుచు వర్తించినను వారు గాని వారిస్త్రీలు గాని వారిపూర్వవేష
ములను మార్చుకొనుట గాని- మనవలె శిఖల ధరించుటగాని, మతము నూర్పు
గాని వారియందుఁ గనుపట్టుటలేదు. ఆనియమము వారి నితరులు గురుతించుటకుఁ
గాని వారిసంఘీభావమునకుఁ గాని ముఖ్యహేతువుగాఁ గనుపట్టుచున్నయది. స్థా
నాభిమానము, వేషాభిమానము గూడ సత్పురుషలక్షణములు. దీనిని "స్వస్థాన
వేషభాషాభిమతాః సన్తో రసప్రలుబ్ధధియః" లని నన్నయభట్టారకుఁడు సూచిం
చియున్నాఁడు.

శ్లో. చోళీపయోధర ఇవ ప్రకటో న కామం
నో గూర్జరీస్తన ఇ వాతితరాతిలీనః
అర్థో గిరా మపిహితః పిహితశ్చ కించి
దాంధ్రీపయోధర ఇ వాతితరాం సమింధే.

అని యాలంకారికు లాంధ్రస్త్రీలు ఆవికలు ధరించువిధమును దృష్టాంతముగా నుదాహరించిరి. ఇప్పటి స్త్రీలవస్త్రధారణపద్ధతి, యిది యాంధ్రాచారము కాదని చాటుచున్నది. భాషానియమము నుల్లంఘించినచో దేశములో నన్నిభాగములలోని జనులకు నాంధ్రగ్రంథములవలన నిస్సందిగ్ధార్థబోధము కలుగనేరదు. అశ్రావ్యత, యనర్థావహత్వము, మొదలగు నష్టములు కలుగును. కనుకనే శ్లో. "బాలసఖిత్వ మ కారణహాస్యం స్త్రీషువివాదోఽసజ్జనగోష్ఠీ। గర్దభయానమసంస్కృతవాణీ షట్సు నరో లఘుతా ముపయాతి" యని సంస్కరింపఁబడని శబ్దముల నుపయోగించుట యగౌరవాస్పద మని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు. ఈ విధముననే వికృతవేషధారణముకూడ నగౌరవాస్పద మనకతప్పదు. తమతమవర్ణాశ్రమధర్మముల నుల్లంఘించుట యగౌరవాస్పదమే గాక యనర్థావహము గూడ నగును. "పరధర్మో భయావహః" అని లోకాచార్యుఁడగు శ్రీకృష్ణుఁడే యానతిచ్చెను. భారతభాగవతరామాయణములే గాక కొంతకాలముక్రిందటివఱకు రచింపఁబడిన నిబంధనము లన్నియు సనాతనధర్మమును బోధించుచు నాశ్రమములయొక్కయు వనములయొక్కయు నాయికానాయకులయొక్కయు వర్ణనములందు ధర్మశాస్త్రములం బోలి వర్తించినవి- మనపూర్వపురుషులభావము లన్నియు ధర్మప్రధానములు. అన్నికళలును సాక్షాత్పరంపరయా ధర్మమునే బోధించుచున్నవి. నియమ మభ్యుదయహేతువు- అనియమము సకలానర్థహేతువు- ఇప్పటి నవలలు, సినీమాలు సహజముగా జనుల కుచ్ఛృంఖలతను బోధించుచున్నవి.

భాషానియమసంరక్షకు లగుమహనీయులు వేషనియమములను ధార్మికనియమములను సంరక్షించి దేశాభివృద్ధికిఁ దోడ్పడి కీర్తిసుకృతము లందుదురుగాక!

---

# కాశీఖండము.

— మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము. —

"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అన్న ట్లితిహాసపురాణములచే వేదార్థమును వివరింపవలెను. ఇతిహాస మనఁగాఁ బూర్వరాజవృత్తము. "సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వంతరాణి చ వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్" అను లక్షణపంచకముతోఁ గూడినది పురాణ మనంబడును. బ్రాహ్మము, మొద లగుమహాపురాణములు పదునెనిమిది. వీనిలో స్కాందపురాణమున కవయవములైన సంహిత లాఱు. అవి క్రమముగా సనత్కుమారసంహిత, సూతసంహిత, శాంకరసంహిత, వైష్ణవసంహిత, బ్రహ్మసంహిత, సౌరసంహిత. ఈసంహితలయందు, పంచనాగరఖండము, కమలాలయాఖండము, రేవాఖండము, ఏకవీరఖండము, మైలారఖండము, గోదావరీఖండము, మొదలుగాఁ గలఖండము లేఁబది కలవు. అందు-

శా. ప్రాశస్త్యంబు వహించు ద్వాదశసహస్రగ్రంథసంక్లప్తివి
శ్వేశక్షేత్రవియన్నదీవటుకఢుండీశాదిసంకీర్తనో
ద్దేశప్రక్రమశోభితాద్భుతకథాధిష్ఠానమై శ్రేష్ఠమై
కాశీఖండమఖండవైభవమునన్ స్కాందాబ్ధిమధ్యంబునన్."

శ్రీనాథుఁడు సంస్కృతకాశీఖండప్రతిపాదితము లైనవిషయములను మాత్రమే గ్రహించి లోకోత్తరస్వప్రతిభావిశేషంబును, సర్వతోముఖపాండిత్యమును, నిరర్గళకవితాప్రవాహంబును, వినియోగపఱిచి మాతృకకంటెఁ గఠినతర మైన శైలితోఁ బ్రకాశించున ట్లేడాశ్వాసముల యాంధ్రప్రబంధముగా రచియించెను. "కాశీఖండ మయఃపిండం నైషధం విద్వదౌషధమ్" అనునాభాణకము ననుసరించి నైషధము భావగాంభీర్యము,రసవత్తరత్వము, శబ్దకాఠిన్యము; రచనాచాతుర్యము మొదలగు కావ్యగుణములచే విద్వాంసుల కౌషధప్రాయమై యున్నను సంస్కృతకాశీఖండము మహాపురాణైకదేశ మగుటచే సులభశైలితోఁ గూడియున్నది గావున దీనికిఁ బూర్వోక్తాభాణకానుసారముగా నయఃపిండసాదృశ్యము చెల్ల దని యోజించి కాఁబోలు గ్రంథప్రణేత యగుకవిశేఖరుఁడు తాను రచించినయాంధ్రప్రబంధమున కిటిసితి నాపాదించెను. శ్రీనాథుఁడు రచించిన ప్రబంధములలో

శృంగారనైషధమునకుఁ దరువాతఁ జెప్పఁదగినప్రసిద్ధప్రసిద్ధులుగలప్రబంధ మిదియే యని విద్వాంసులు ప్రశంసించుచున్నారు. ఇందలి కథాసంగ్రహ మెట్లనఁగా-

ప్రథమాశ్వాసములో :—దేవర్షి యగు నారదుం డొకకాలంబునఁ దీర్థయాత్రాప్రసంగంబున భరతవర్షం బంతయుఁ గ్రుమ్మరుచు నానావిధపుణ్యతీర్థంబులఁ గ్రుంకు లిడుచుఁ, బుణ్యాయతనంబులఁ బుణ్యాశ్రమంబుల సేవించుచుఁ గాలక్రమంబునఁ గృతవర్మదానదీజలావగాహనుండై గోదావరీనదీతటంబుఁ బట్టి దండకారణ్యమధ్యంబున కాసన్నుండై పోవుచు నెదుట వింధ్యశైలంబు గాంచిన నది, "ఈభూమండలంబున నీచూడని మహీధరంబులు లేవు. ఇప్పు డీభూవలయంబున మేరువు తప్ప మఱి యెద్దియు నాతోఁ బ్రతిఘటింప నేరదు. మాయిద్దఱతారతమ్యంబు నీవెఱుంగుదువు. నాకు నగ్గిరికిని గొన్నిదినంబులనుండి స్పర్థ పెరుఁగుచున్నది. దీని నే నెట్లు సహింతును. "కంటికి నిద్ర వచ్చునె సుఖం బగునే.....కంటకుఁడైనశాత్రవుఁ డొకండు దనంతటివాఁడు గల్గినన్." అని సావష్టంభసంరంభం బతిశయిల్లఁ బలుకుటయు నమ్మానిపుంగవుండు వింధ్యోక్తుల నాత్మలో గర్హించి యేమియుం బలుకక యుస్సురనుచు వేఁడినిట్టూర్పు నిగిడించి "ఓశైలమా! నీ విపుడు నాతో నన్నట్లు తొల్లి హేమాద్రి కూడ నిజప్రాధాన్యం బపేక్షించి పలికెను. మీయుభయుల పరస్పరసంఘర్షణంబు త్రిభువనోపద్రవకారణంబు. నీకు మేలయ్యెడుఁగాక!" అని పలికి నారదుండు తనయిచ్చం జనియె. అంత వింధ్యాద్రి మేరుగిరిబద్ధస్పర్థం దనశృంగంబుల నూర్ధ్వంబుగాఁ బెంచి సూర్యచంద్రగ్రహనక్షత్రాదులగమనంబు నిరోధించె. సూర్యగమనం బుపరుద్ధం బగుట నిది రాత్రి యని యిది పగ లని యిది సంధ్యాసమయం బని కాలవ్యవస్థ యెఱుంగరాక క్రియాకలాపంబులు లోపించె.

ద్వితీయాశ్వాసము:—ఇవ్విధంబున నకాండప్రళయంబు సంభవించినబ్రహ్మ యొద్దకుం బోయి దేవతలాతని నుతియించి వాటిల్లినయాపదను దెలిపిరి. "ఇయ్యరిష్టనిరాసంబున కొకయుపాయంబు సెప్పెద. కుంభసంభవమహర్షి యవిముక్తక్షేత్రంబున భోగమోక్షప్రదుం డగువిశ్వేశ్వరునిఁ దారకబ్రహ్మోపదేశార్థంబు సేవించుచున్నవాఁడు. అతఁడు మీకార్యంబు సంఘటింపఁగలవాఁడు. మీ రమ్మహాత్మునభ్యర్థింపుఁడు." అని బ్రహ్మ వీడ్కొల్పిన వారు నెట్టకేల కగస్త్యాశ్రమంబునకుం జని లోపాముద్రాద్వితీయుం డైనయమ్మునిని వీక్షించి స్తుతిశతంబుల నాతనిం బ్రసన్నుం జేసికొని తమకు సంభవిల్లిన దుర్జాతం బాతనికి విన్నవించిరి. అందుల కాసంయమి

కాశీక్షేత్రవిరహసంతాపంబు నోర్వఁజాలక పురందరాదుల ప్రార్థనంబున కు వైఫల్యం బాపాదింపనేరక చింతించి వంధ్యవింధ్యగర్వనిర్వాపణోద్యతుండై లోపాముద్రాన్వితుండై కాశి విడిచి దక్షిణదిక్కునకుఁ బోవుచుఁ బ్రతిదినప్రయాణంబుల వింధ్యాద్రిసమీపంబునకుఁ బోవ నయ్యచలంబు దవ్వుల నతనిం గాంచి కమలసంభవాండంబు నుద్ఘాటించు స్వశరీరోచ్ఛ్రాయంబు నమ్రత్వంబు నొందించి యామునిపుంగవు నెదుర్కొనియె. ప్రపంచంబు సర్వంబును మునుపటివలెఁ బ్రవర్తిల్లె. కాలంబు లేర్పడె. అనంతరం బమ్మహీధరంబు పురుషాకారము దాల్చి కొన్ని యడుగులు ప్రత్యుద్గమించి కుంభసంభవుని బరితుష్టుం గావించి "మహానుభావా! భవదాజ్ఞాప్రసాదభావంబున ననుం గృతార్థుం జేయు" మని నుడివిన నక్కలశభవుండు-"ఓవింధ్యాచలేంద్రమా? ఈతరుణీరత్నంబుతోడ నేను దక్షిణాపథతీర్థంబు లాడఁబోవుచున్నాఁడను. జరాపరీతుండ నగుట నున్నతప్రదేశంబుల నెక్కుటకు దిగుటకు శక్తి చాలదు. నేను మరలి వచ్చునంతకు నిట్టులే యుండవలయును. ఈనాయాజ్ఞను నీవు లెస్సగా మన్నింపవలయు లేకున్న నీకుఁ గీడగు" నని పలికిన వింధ్యంబు "మహాత్మా! నీయాజ్ఞను మన్నింపనివారుం గలరే. నీవు మరలి వచ్చునంతకు నిట్లే యుండెద" ననినఁ గుంభీసూనుం డతని దీవించి దక్షిణాభిముఖుం డై చనియె.

తృతీయాశ్వాసము, చతుర్థాశ్వాసము:- ఆవింధ్యాచలంబు కుంభసంభవుని ప్రత్యాగమనంబున కెదురు చూచుచు వసుంధరాగర్భంబున నడఁగి యుండె. దిక్పాలకగణంబు హర్షోత్కర్షంబున నమ్మహర్షిం బ్రస్తుతించిరి. భువనోపద్రవంబు శాంతిం బొందించి దక్షిణకాశీసందర్శనంబునం గాని కాశీవియోగవేదనాభారంబు శాంతింప దని మందమందప్రయాణంబుల నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గృతస్నానుండై కొన్ని వాసరంబుల కగస్త్యుండు గోదావరీతీరమార్గంబున నాంధ్రదేశంబుఁ బ్రవేశించె. అచ్చట భోగమోక్షప్రదం బైనదాక్షారామబ్రహ్మసంవేద్యపట్టిస ప్రభృతిశివక్షేత్రంబులదర్శించి కొల్లాపురమహాలక్ష్మీప్రసాదంబు వడసి మరలఁ గాశీక్షేత్రప్రభావవర్ణనాప్రసంగంబున శివశర్మోపాఖ్యానముం దెలిపె. విష్ణుదూతలు శివశర్మను విమానారూఢుం జేసి నానాలోకంబులుఁ జూపుచు విష్ణులోకంబునకుం గొనిపోయి "ఓయివిప్రవర్యా! శతానందపరివత్సరం బిందుండుము. ఇటమీఁద వృత్తాంతంబు నీకుఁ దెల్పెదము. పుణ్యతీర్థమరణోపార్జిత సుకృతవిశేషంబువలనను, భూతోపకారంబువలనను, నీవు భూతలంబున జనించి నృపతివై చిరకాలంబు రాజ్యంబు-సేసి కాశి కరిగి విశ్వేశ్వరుకటాక్షంబున ముక్తిఁ గాంచెదవు" అని పలికి శ్రీమన్నారాయణని. సాన్నిధ్యంబున నుంచి రని యగస్త్యుఁడు దనభార్యకుఁ జెప్పెను.

పంచమాశ్వాసము :—అగస్త్యుండు కొల్లాపురమహాలక్ష్మి యాజ్ఞాపించి నట్లు కుమారస్వామిని సేవింపం బోయె. తన్నుఁ జూడ వచ్చిన కుంభసంభవునికి సపర్య గావించి కాశీక్షేత్రమాహాత్మ్యంబు సవిస్తరంబుగాఁ గుమారుండు చెప్పెను. ఇది యవిముక్తక్షేత్రం బనియుఁ, జూడఁబోవువారి కానందదాయకం బగుటవలన నానందకాననం బనియు మహాశ్మశానంబుల గ్రుమ్మరుచుండు రుద్రుఁ డిచట సంతతని వాసంబు సలుపుటవలన మహాశ్మశానంబనియు,నసి వరుణ యనునదీద్వయం బిచటఁ బ్రవహించుచుండుటవలన "వారాణసి" యనియుఁ దీప్తిగలదగుటఁ గాశి యనియు వ్యవహరింపఁబడుచుండె నని చెప్పి మణికర్ణికాప్రభావంబును, ధనంజయోపాఖ్యానంబును, లోనుగాఁ గలకథలను జెప్పెను.

ఆఱవయాశ్వాసము:—ఇందు సాంబాదిత్యవర్ణనము, శివుఁడు బ్రహ్మను, విష్ణునిఁ గాశికిఁ బంపుట, వినాయకుఁడు కాశికిఁబోవుట, ఓం మొదలగునవి వర్ణింపఁ బడినవి.

సప్తమాశ్వాసము:—ధర్మరాజేశ్వరతీర్థమాహాత్మ్యము, విశ్వభుజాఖ్యానము, వీరేశ్వరాఖ్యానము, దుర్వాసోలింగమాహాత్మ్యము, విశ్వకర్మేశ్వరలింగప్రాదుర్భావము, వ్యాసుండు కాశిమీఁదఁ గోపించుట, విశ్వేశలింగమాహాత్మ్యము, దేవతాయాత్రానిధానము మొదలగుకథలు ప్రతిపాదింపఁబడినవి.

ఇట్లీకాశీఖండ మంతటను మొదటినుండి చివరవఱకుఁ గాశీక్షేత్రమాహాత్మ్యము, తీర్థమాహాత్మ్యము, శివపంచాక్షరీప్రభావము, శివభక్తుల గొప్పతనము, వర్ణింపఁ బడినవి. నైమిశారణ్యమందు సూతుఁడు శౌనకాదిమహర్షులకుం జెప్పినట్లు కుమారస్వామి యగస్త్యునకు నగస్త్యుఁడు తనభార్యకు వక్కాణించెను. ఈ శ్రీనాథకవి రచించిన భీమేశ్వరపురాణము, ధూర్జటికవికృత కాళహస్తిమాహాత్మ్యము, బసవపురాణము మొదలగునవి యీకాశీఖండమువలెనే శివపరత్వప్రతిపాదకము లైన గ్రంథములు. ద్వితీయాశ్వాసములో బృహస్పతి లోపాముద్ర కుపదేశించిన పతివ్రతాధర్మములు బ్రహ్మ దేవతల కుపదేశించిన గోబ్రాహ్మణప్రభావము, పంచమాశ్వాసములోఁ గళావతీపాతివ్రత్యవర్ణనముఁ జదివితీరవలెను. పంచమాశ్వాసములో నిరూపింపఁబడిన యష్టాంగయోగము పాతంజలయోగానుశాసనము ననుసరించి యున్నది. భవభూతి, ఉత్తరరామచరిత్రములోఁ జతుర్థాంకము మొదటి "నీవారౌదనమండ ముష్ణమధురం" అనుశ్లోకమును శ్రీనాథుఁడును సరిగా నాంధ్రీకరించి తనకాశీఖండము ద్వితీయాశ్వాసములో నగస్త్యాశ్రమవర్ణన

మందు "వెండియు నవ్వనంబున నీవారోదనమండం బుష్ణమధురంబుగ గండూషించి క్రొత్త పురుటాలికిం గురంగిణి మెత్త మెత్తన" యని చెప్పెను.

శ్రీ రామాయణము- అయోధ్యాకాండ-40 సర్గ. 30 శ్లో.

"మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః।
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్"

అను దీనిని "గీ. తగవు పాటించి యల్పంబుఁ దండ్రియిచ్చు, నల్పమల్పంబు భ్రాతయు నాత్మజుండు, ప్రార్థితంబైన ధన మనల్పముగ నిచ్చు, ప్రాణనాథుని సరియె యేబంధువులును" అని తెనిఁగించి తన గ్రంథములోఁ జేర్చికొన్నాఁడు. గీర్వాణ కవుల గ్రంథములనుండి యభిప్రాయములఁ దీసి తన గ్రంథమం దుంచుకొనెను.

శ్రీనాథుని ప్రశంస:—శ్రీనాథుఁడు పాకనాఁటి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. బ్రాహ్మీసంప్రసాదలబ్ధకవితాసామ్రాజ్యపట్టభద్రుఁడు. శివపూజాపరాయణుఁడు. ఈతనితండ్రి మారయ. తల్లి భీమాంబ. తాత పద్మపురాణము నాంధ్రీకరించిన కమలనాభామాత్యుఁడు.

ఈకవిరచించిన గ్రంథములు. 1. మరుత్తరాట్చరిత్రము. 2. పండితారాధ్య చరితము. 3. శాలివాహనసప్తశతి. 4. శృంగారనైషధము. 5. భీమఖండము. 6. కాశీఖండము. 7. హరవిలాసము. 8. శివరాత్రిమాహాత్మ్యము మొదలగునవి.

ఈగ్రంథములను గవి రచియించినక్రమము కాశీఖండములోని "చిన్నారి పొన్నారిచిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర" అను పద్యమువలనఁ గొంతవఱకుఁ దెలియవచ్చుచున్నది.

పూర్వోక్తము లైన శ్రీనాథుని గ్రంథములలో మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము, ననుమూఁడును నామావశిష్టములైయున్నవి. కాశీఖండమునకుఁ దరువాత నీకవి మఱేగ్రంథమును రచించినట్లు కానరాదు. ఇతఁడు శివోపాసకుఁడైనట్లు నైషధములో నున్నది. ఈకవిపుంగవుఁ డనేక దేశములయందు సంచరించి యనేకసంస్థానాధిపతులచే మెప్పువడసినవాఁడు.

లక్షణానుసరణము:—ఇతఁ డాంధ్రచ్ఛందోవ్యాకరణలక్షణముల నుల్లంఘించువాఁడు కాఁడు. ఈతని కవిత్వమంతయు సంస్కృతభూయిష్ఠము. కవితాపాకము నారికేళపాకము. ఇతనికిఁ దెలియనిశాస్త్రములు, నాగమములు, పురాణములు లేవు.

# భాషోపాసన.

— జనమంచి శేషాద్రిశర్మగారు, కడప. —

"నిందతు నందతు వా స న్నసూయు రనసూయు రత్ర కిం తేన
య త్సన్మానసగమనాయై వేదం మమతు పాథేయమ్."

మహాత్ములారా !

భాషోపాసనయుఁ దప స్సనునదియే. తపఃఫలము దీనఁ గలుగును. విధి నతిక్రమింపక యభీష్టదేవతాసాక్షాత్కారనిమిత్తము చేయుకృషియే తప స్సనంబడు. అది సమాహితచిత్తమునఁ జేయఁబడు నేని సంపూర్ణఫలద మగును. లేకయున్న యథాశక్తిన్యాయము ననుకరించు ననుట నిర్వివాదము. జగదీశ్వరి భాషారూప ముగలదియే కాని యొకవిధమైన రూపము కలది కాదు. భగవంతునకు నతనితో నవినాభావసంబంధము గలభగవతికి భేదము కల్పించువా రనభిజ్ఞు లనఁదగుదురు. భగవతికి రూపనామములు లేవు. భగవంతున కట్లేకదా. నిర్వికారనిరంజననిర్లిప్తాదిశబ్దము లీయర్థమునే తెలుపుచున్నవి. ఆభగవంతు నిచ్ఛాశక్తియే మహాప్రకృతి యనంబడును.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అనునది క్రొత్తది కాదు. సర్వరూపములు సర్వనామములు భగవంతునకుఁ గార్యార్థము కలుగుచుండును. తదిచ్ఛాశక్తికి నట్లే యని మనము విశ్వసించుట పొరపాటు గాదు. నిర్లిప్తుఁ డగుభగవంతునకు సగుణబ్రహ్మత్వము కలుగఁగా సకలకార్యనిర్వహణము సిద్ధ మగుచున్నది. ఆయవస్థనే మన ముపాసింతము. రూపనామకల్పన లేక యుపాసన సాగదు. అట్టియవస్థ ప్రకృతి కల్పిత మని చెప్పంబడును. ఇది యంతయు భగవంతుని నిర్వికల్పత్వస్థాపనార్థ మని తేలెడిని. ప్రకృతికిఁ బ్రాధాన్య మీవిషయమున నీయఁబడినది. సర్వావస్థల నొందుట ప్రకృతిమూలముననే. కనుకనే సర్వసాక్షిత్వము సురక్షితము.

శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశల స్స్పందితు మపి
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి.

అని శ్రీశంకరభగవత్పాదులు వక్కాణించిరి. పైవిషయము నీయదియు సి

ధ్ధాంతీకరించుచున్నది. తత్సాన్నిధ్యబలమున నామహనీయునిచ్ఛయే సకలజగత్సృష్టిపాలనసంహారాదికార్యముల నొనరించు నని మనమెఱుంగుట సమంచితము.

జగత్సూతే ధాతా హరి రవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వ న్నేత త్స్వమపి వపురీశ స్తిరయతి
సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః.

అన్న శంకరభగవత్పాదోక్తి యింకుల కుదాహరణము. భగవదిచ్ఛచే త్రిమూర్తులుబో నగువారు పొడమి సకలకార్యములు నిర్వహింతు రని దీనిసారము. ఆయిచ్ఛకే ప్రకృతి యనుపేరు ప్రసిద్ధము. దీనిచే వారికి నవినాభావసంబంధము స్పష్టము. ఆదేవి భాషాస్వరూప యనుట నిస్సంశయ మనవలయు.

"భాషారూపా బృహ త్సేనా భావాభావవివర్జితా" అని సహస్రనామ స్తోత్రము. "సంస్కృతప్రాకృతాది భాషాః రూపం యస్యాః. భాషాభి ర్నిరూప్యత ఇతి వా తదుక్తమ్ "సంస్కృతేనైవ కే ప్యాహుః కేచిత్ మ్లేచ్ఛాదిభాషయా। సాధారణ్యేన కేచి త్త్వాం ప్రాకృతేనైవ కేచనేతి." అని సౌభాగ్యభాస్కరభాష్యము. భగవతిరూపము భాషయని తేలెడిని. తక్కినవి తద్రూపములు కావా యనువా రుందురు. సర్వరూపము లాజగదంబవే ఇదియు నం దొక్కండని మనవి. కావున భాషాసేవయు నుపాసనయే యని సారము గ్రహింపందగు.

భక్తుఁ డొక్కొక్కఁడు నొక్కొక్క రూపమును గల్పించుకొని ధ్యానించును. ఎల్లర కామె ప్రసన్నురా లగుచు. అం దేది యాజగదంబరూప మనవచ్చును. కాళిదాసు విద్యార్థియై మహాకాళిం గొల్చెను. ఆమె భయంకరాకారమును మాని తత్సంకల్పము ననుసరించి శారదాకృతిం దోఁచెను.

"మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజులవాగ్విలాసాం
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం మాతంగకన్యాం మనసా స్మరామి."

అని భక్తుఁడు వినుతించెను. అనఁగా దేవత భక్తుని యభీష్టనిర్వహణక్షమ మనందగు రూపమునఁ దోఁచు నని కదా దీనిభావము. అపుడు భగవంతున కెల్ల రూపములు గల వనుట సిద్ధాంత మగుంగదా!

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
న తదస్తి వినా యత్స్యా న్మయాభూతం చ రాచరమ్.

అను శ్రీభగవద్గీతావాక్యము పైని వ్రాసిన యర్థమునే తేటపఱచుచున్నది

కదా. ఏభక్తుఁడు సమాహితాంతఃకరణమున నే నామరూపములం గల్పించుకొని ధ్యానించినఁ దద్రూపమున నాపరాత్పరుఁడు తోఁచు ననుట యప్రతిహతసిద్ధాంతమని నావిశ్వాసము.

ఉపాసకుఁడు తనయిష్టదైవమును సురచిరభూషణాదుల శృంగారించును. మనోహరపరిమళనవ్యకుసుమమాలికల నలంకరించును. చతుష్షష్ట్యుపచారముల నారాధించును. ఇయ్యది బాహ్యమైనఁ గావచ్చును. మానసిక మగుచో మఱియు నుత్తమమే యగును. హృదయారవిందపీఠమున నెలకొని యుండు నాదివ్యమూర్తిని గాంచుచు మహానందము ననుభవించును.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుకణా న్పిబంతి శకునా నిశ్శంక మంకేశయాః
అస్మాకంతు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషా మాయుః పరం క్షీయతే."

అని భర్తృహరి తెల్పిన విషయసారము పైని వ్రాయఁబడినదిగాక మఱేమగును. ఇందుఁ గొందఱు మంత్రజపము చేయుచు నభీష్టదేవతను ధ్యానించువారు, మఱికొందఱు కేవలతద్రూపమునే కాంచుచుండువారు. ఇంకను గొందఱు యోగులు జ్యోతీరూపమునే కాంచుచుండువారు నగుదురు. వారివారి భక్తి ననుసరించి ఫలము గలుగుచుండును.

ఈయుపాసకులలో భాషాసేవకుఁడు నొక్కఁడనియు నందు యోగితుల్యుఁ డనియు నావిశ్వాసము.

య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి న సుఖం నపరాం గతిమ్.
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి.

అన్న భగవత్సూక్తి యెల్లరకు సువిదితమే కాని యభినవము కాదుకదా. భగవత్సేవ యెట్లుచేసిన నేమి యని పాషాణాదులఁ బ్రహరింపఁడుకదా. సర్వసముఁడుకదా భగవంతుఁడు, పాషాణపూజ కేల తృప్తుఁడు కాఁడనునట్టి దుర్విదగ్ధుఁడుండఁ డనుకొందును. ఎట్లు భగవదుపాసకుఁడు విధుల ననుసరించునో భాషాసేవకుఁడు కూడఁ బెద్ద లనువదించిన విధుల ననుసరించి భాషారూపమే యిష్టదేవతారూప మని భావించి యత్యంతభక్తితాత్పర్యమున సేవించును. ఇతఁడును

దపస్వియే యనఁబడును. కాఁడనుట కవకాశ మెట్లు? కాని యొకనియమమున నతఁ డుండవలయు. పరమేశ్వరుఁడు భాషారూపుఁడు. శబ్దబ్రహ్మ మనఁగా నిదియే. కావున నీభాషాసేవచేత నాపరమేశ్వరుఁడు తృప్తుఁ డగును. సంశయము లేదు. అనునది యే యానియమము. పరమేశ్వరీపరమేశ్వరుల కభేద మని ముందే వ్రాసి తిని గదా. కావున స్వోక్తివ్యాఘాతదోషము నారోపింపకుఁ డని మనవి."

భాషాసేవ యెట్లు? దాన దైవ మెట్టిఫలముల నొసంగును? అనునది యిటఁ బ్రశ్నింపఁదగినవిషయము.

'కలానిధిః కావ్యకలా రసజ్ఞా రసశేవధిః!

అని సహస్రనామస్తోత్రము. కలానాం నానావిధతయా పూర్వం వర్ణితా నాం నిధిః అత్రైవాస్య షోడశీకలేతి బృహదారణ్యకోక్తేరాత్మనాం జీవానాం నిధిర్వా. చంద్రమండలరూపా వా యోనివర్గః కలాశరీర మితి శివసూత్రే కలా శబ్దః కర్మపరత్వేన తద్భాష్యే వ్యాఖ్యాతః- తేన కర్మాణి నిధీయంతేస్యా మితివా. అధికరణే కిః. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' ఇతిస్మృతేః. కావ్య కలా=కవేః కర్మ కావ్యం తచ్చ నాటకనాటికభాణడిమప్రహసనాదిభేదా దనేకవిధ మగ్నిపురాణాదౌ ప్రదర్శితం, తాదృశకలా వ్యంబాయా ఏవ రూపం. ఉక్తం చ విష్ణుపురాణే 'కావ్యాలాపాశ్చ యే కేచి ద్గీతకా న్యఖిలాని చ, శబ్దమూర్తిధరస్యైత ద్వపు ర్విష్ణో ర్మహాత్మన' ఇతి. కావ్యోత్పాదకప్రతిభైవ కలా. ధ్యానవిశేషేణ కావ్యనిర్మాణసామర్థ్యప్రదత్వస్య తంత్రేషు బహుశో వర్ణనాత్. కావ్యస్య శుక్రస్య మృతసంజీవన్యాఖ్యకలారూపా వా. రసజ్ఞా= రసాన్ శృంగారాది భేదేన దశవి ధాన్ జానాతీతి రసజ్ఞా రసనేంద్రియస్వరూపా వా, రసేతి. రసస్య బ్రహ్మామృత స్య శేవధిః నిధిః. రసోవై సః రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నన్దీ భవతీతి శ్రుతేః బ్రహ్మాండేపి. 'రస ఏవ పరం బ్రహ్మ రస ఏవ పరా గతిః-రసో హి కాంతిదః పుంసాం రసో రేత ఇతి స్మృతః'-రసోవై సరసం లబ్ధ్వా హ్యానందీభవతీ త్యపి వేదప్రామాణ్యా సంసిద్ధ్యా రసః ప్రాణతయా స్థితః. 'కోహ్యేవా న్యాచ్చ కః ప్రాణ్యా దిత్యపి శ్రుతిభాషితః ప్రాణాత్మకోరసః ప్రోక్తః ప్రాణదః కుంభసంభ' వేతి॥ నిధి శ్శేవధి రితి య్యాసః-నిధి ర్నా శేవధి' రితి కోశాత్ పులింగౌ నిధిశేవధిశబ్దౌ॥ కావ్య మా పరమేశ్వరీస్వరూపముగాఁ జెప్పఁబడినది. కల యనఁగాఁ గావ్యోత్పాదకప్రతిభ. ధ్యానవిశేషముచేతఁ గావ్యనిర్మాణసామర్థ్యము కలుగును. కావ్యము రసభూయి ష్ఠము గా నుండవలయును. రసభూయిష్ఠము కావ్య మని, ధ్యానవిశేషమునఁ దత్కా

వ్యనిర్మాణశక్తి కలుగు నని, యాకావ్యమే సగుణబ్రహ్మస్వరూప మని యీభాష్య ము తేటపఱచుచున్నది. విష్ణుపురాణముకూడ నీవిషయమునే తెలుపుచున్నది కావ్యము నానావిధభాషాస్వరూపము కదా. ఈభాషాసేవయే యుపాసన యని చెప్పఁబడును. దీనఁ గలుగుఫల మెద్ది ?

"చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖా దల్పధియా మపి ।
కావ్యాదేవ యత స్తేన తత్స్వరూపం నిరూప్యతే॥"

అని విశ్వనాథకవిరాజవిరచిత మగుసాహిత్యదర్పణము తెల్పుచున్నది.

'ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ ।
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణాత్॥'

అను నీయభియుక్తోక్తి సార్వజనీనము కదా.

'నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర సుదుర్లభా ।
కవిత్వం దుర్లభం తత్ర శక్తి స్తత్ర సుదుర్లభా॥

అని యగ్నిపురాణము తెలుపుచున్నది. ధ్యానబలమునఁ గావ్యనిర్మాణశక్తి కలుగు ననియుఁ గవిసత్కర్మమే కావ్య మనియు దానికి రసమే ప్రాణ మనియు నాకావ్యమే భగవత్స్వరూప మనియు నిందలిసారము. భగవతి భాషాస్వరూప యని ప్రమాణముఁ గనఁబఱచితిని గదా. వాగ్దేవి భాషాదేవి యన్నను సరస్వతి కే నామధేయములు గదా.

ఉపాసకుఁడు మనోజ్ఞకుసుమాదికముల నిష్టదైవము నారాధించునట్లు భాషోపాసకుఁడు శాస్త్రప్రసిద్ధరసవద్వాక్యమయ కావ్యరచనచే నిష్టదైవ మగుభాషాదేవి నారాధించును. "భావనామాత్రసంతుష్ట హృదయః పరమేశ్వరః" అను నీసూక్తి ప్రాచీనమే కదా. కావ్యరచనయందే హృదయము నిమగ్నము కాఁగా నీరూపమున నాచేయు సేవ భగవతికిఁ బ్రీతిని గల్గించుఁగాక. భాషాదేవి నాయీ సేవకు నలరి నన్నుఁ దరింపఁజేయుఁ గాక యని సంకల్పము దృఢతమముగా నుండఁ దదేకాగ్రమనస్కుఁడై కృత్యము నెఱవేర్చిన ధర్మార్థకామమోక్షములలోఁ గర్మానుసార మేది యతనికి లభింపఁదగునో యది తప్పక లభియించు ననుట నిర్వివాదము. సద్భావన యొక్కఁడు మాత్రమే యుండినఁ జాలును.

"వీణావాదన తత్త్వజ్ఞ శ్శ్రుతిజాతివిశారదః ।
తాళజ్ఞ శ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి"-యాజ్ఞవల్క్యస్మృతి.

భరతాది మునిప్రతిపాదిత వీణావాదనతత్త్వవేదీ- శ్రూయత ఇతి శ్రుతిః- ద్వావింశతివిధా స్సప్తస్వరేషు తథాహి, షడ్జమధ్యమపంచమాః ప్రత్యేకం చతు

శ్రుతయః ఋషభధైవతౌ ప్రత్యేకం త్రిశ్రుతీ గాంధారనిషాదౌ ప్రత్యేకం ద్వి శ్రుతీ ఇతి. జాతయస్తు షడ్జాదయః సప్తశుద్ధాః సంకరజాతయ స్త్వేకాదశే త్యేవం అష్టాదశవిధా స్తాసు విశారదః ప్రవీణః- తాల ఇతి గతిప్రమాణం కథ్యతే తత్స్వ రూపజ్ఞశ్చ, తదనువిద్ధ బ్రహ్మోపాసనతయా తాలాది భంగభయా చ్చిత్తవృత్తే రాత్మైకాగ్రతాయాః సుకరత్వా దల్పాయాసే నైవ ముక్తిపథం నియచ్ఛతి ప్రా ప్నోతి." అని విజ్ఞానేశ్వరకృతవ్యాఖ్య. సంగీతశాస్త్రప్రవీణుఁడు భావన యించుక మార్చుకొనిన ముక్తిఁ బడయు నని కదా దీనిసారము. చిత్తైకాగ్రత యెల్లరకు సమానము. భావనయే భేదము. కావ్యనిర్మాణము భగవదారాధన మనుభావము కవికిం గలిగిన ముక్తుఁ డేలకాఁడు ?

'యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ.' అన్నసూక్తి తెల్పు నీతి యెట్టిది? ఈకావ్యము నిర్మించి రసికాగ్రగణ్యుఁడ ననిపించుకొందునన్న భావన మాని నాయీకావ్యనిర్మాణమాపసేవాతిరేకమున భాషాదేవి సంతోషించుఁ గాక, యని భావించినచో నాభావనయే భగవంతు ననుగ్రహమునకు నతనిఁ బాత్రునిగాఁ జేయఁగలుగు ననుట నిస్సంశయము. సత్సంకల్పము భాషాదేవతయం దవ్యాజభక్తి యనునీరెండు పూజాద్రవ్యములు. ఆసేవాకాలంబున బాహ్యవిషయవిస్మృతియే ధ్యానము. ఈపూజ సర్వజనక్షేమదాయక మగుఁగాక యనునదియే నైవేద్యము. ఇట్టిసాధనసంపత్తి గలిగిన కవి ముక్తుఁ డగుట నిస్సంశయము. 'కవిః క్రాంతదర్శీ.' అని శంకరాచార్యులును, కవిః 'బ్రహ్మవిత్' అని విజ్ఞానేశ్వరపండితులును వ్రాసిరి. కావున సద్భావనాయుక్తుఁ డైనకవి భగవత్కృపైకపాత్రుఁ డగును.

తపస్సునకు నియమములు గలవు. తుదకు భుక్తికిం గూడ నియమము లున్నవి. భాషకు నియమము లేల యను ప్రశ్నము సముచితము కాదు. నియమ బద్ధము కానిరాజ్యపాలన మెంతశీఘ్రమున క్షీణించునో నియమబద్ధముకాని భాష యుఁ దన్నిబద్ధ మగునాకావ్యముఁ దత్ఫలమగు యశస్సును నశించును. భగవదుక్తి ననుసరించి శాస్త్రవిహితమార్గముల వీడక భాషాపోషణము గావించుచు దానిని గావ్యరూపమున భగవత్పాదపద్మముల నర్పించు టత్యుత్తమము. తమకుఁ దోఁ చినట్లు చేయుకార్యము లెవ్వియు లోకుల కుపకరింపఁజాలవు. విశేషించి తమకుఁ గూడ నుపకరింపవు. కావున భాషోపాసకు లగుమహాత్ములు పరదేవిని నక్కనిభక్తి భావమున నారాధించి తన్మూలమున దేశమునకు మహోపకారము చేయుదురు గాక యని సవినయముగాఁ బ్రార్థించుచున్నాఁడను.

# నన్నయయాంధ్రీకరణపద్ధతి.

—: జటావల్లభుల పురుషోత్తముగారు. ఎం. ఏ. కొవ్వూరు. :—

మనస్సునకుఁ బూర్ణముగ ననుభూతికి వచ్చినభావములను జెప్పునప్పుడే వాక్కులు మిక్కిలి రసవంతములుగ నుండును. కావుననే కార్లైలు Sincerity is the soul of poetry అని చెప్పియున్నాఁడు. తెచ్చిపెట్టుకొనిన భావములను వ్యక్తపఱచుభాష చప్పగ నుండును. భాషాన్తరీకర్త సాధారణముగ మూలగ్రంథకర్తభావములను దనమనస్సునఁ నారోపించుకొని వ్రాయవలసియుండును. కావున సహజముగ భాషాన్తరీకరణములో మూలగ్రంథములోని కవిత్వము గన్పట్టదు. నన్నయాది మహాకవులు భాషాన్తరీకరణము చేయునప్పుడు కూడ నీలోపముండును. కాని వీలైనంతవఱకీ లోపమును దొలఁగించుటకే భారతము నాంధ్రీకరించిన కవిత్రయము యత్నించెను. మూలగ్రంథములోని ప్రధానాంశములకు భంగములేకుండ వీలైనంతవఱకు స్వతంత్రముగ వ్రాయవలె నను నియమమును వారు చేసికొనుటవలన వారికవితావిహంగము సంకుచితస్థలములో నైనను రెండు ఱెక్కలను విప్పి విహరింపఁగల్గినది. ఇట్టికవిపర్యులు గల్పించుకొనిన స్వాతంత్ర్యముచే వారికి భావనావకాశమును, యథార్థమైన కవిత్వమును జెప్పువీలును గల్గినవి. కనుకనే వారికవిత్వము మూలరచనవలెనే సజీవమై యున్నది. వ్యాసుని కర్ణభీమార్జునాదిపాత్రలవలెనే వీరిపాత్రలును మనల నాకర్షించుచున్నవై మన కన్నులయెదుటఁ గన్పట్టును. భాషాన్తరీకరణములో వీరిస్వాతంత్ర్యము నవలఁబింపకుండినచో వీరిరచనలును, వీరు చిత్రించిన పాత్రలును నింతసజీవములుగ నుండఁజాలవు.

కాని యొకవిషయము ముఖ్యముగ గుర్తింపవలసియున్నది. భారతము ప్రధానముగ ధర్మబోధకగ్రంథము. వేదములను, స్త్రీశూద్రద్విజబంధువులు చదువరాదు. కావున వారికి వైదికధర్మములను దెల్పుటకై వ్యాసుఁడు భారతమును రచించె నని భాగవతమునఁ గలదు.

"స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా
ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృతమ్."

కావున భారతము నాంధ్రీకరించువారు ముఖ్యముగ వైదికధర్మదృష్టితోనే దాని నాంధ్రీకరించుట న్యాయ్యము. అంతియే కాదు. వారి యాంధ్రీకరణము

మూలమునుండి భేదించుచున్నదా లేదా యనునంశముకంటె నది మూలమంత ధర్మబోధకముగ నున్నదా లేదా యనునంశమే ప్రధానమైనది. మూలమునుండి భేదించినను మూలమునకుఁ దీసిపోని ధర్మబోధ యందున్నచో మూలగ్రంథగౌరవమును నిలఁబెట్టినట్లే భావింపనగును. ధార్మికవిషయమునఁ గొఱఁతనొంది యెంత కవితాసౌందర్యమును గల్గియున్నను గూడ నాభాషాంతరీకరణము మూలమునకన్యాయము చేసినదే యగును. ఈదృష్టితోఁ జూచినచో నన్నయయాంధ్రీకరణము మూలమునకు మిక్కిలి గౌరవమును గల్గించునదియే కాని యెంతమాత్రము న్యూనతను గల్పించునదికా దని తెలియఁగలదు. ఏలన:-నన్నయ మూలములో లేని వైదికసౌరభమును, ధార్మికవాతావరణమును దనగ్రంథములో వెలయింపఁజేసినాఁడు. ఇందుల కెన్నియో యుదాహరణముల శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు తమ 'ఆంధ్రభారతకవితావిమర్శనము'లోఁ గన్పఱిచియున్నారు.

నన్నయకాలమునకుఁ గొంచెము పూర్వమే వైదికమతము పునరుద్ధరింపఁబడినట్లు తెలియుచున్నది. వైదికకర్మకలాపము యొక్కయు వర్ణాశ్రమధర్మములయొక్కయుఁ బునరుద్ధరణము క్రీ. శ. 700 ప్రాంతముననే కుమారిలభట్టుచేఁ బ్రారంభింపఁబడినది. ఈమతము ననుసరించి కర్మమే బ్రహ్మ. కర్మ వేదమయము. వేదము బ్రాహ్మణాధీనము. కావున బ్రాహ్మణుల యౌత్కృష్ట్య మీమతములో హెచ్చుగఁ గాన్పించును. రాజరాజనరేంద్రుఁ డీమతమునకుఁ బట్టుఁగొమ్మ. నన్నయభట్టారకుఁ డీమతమును బూర్ణముగ నాచరణములో నుంచినవాఁడు. కావున నాతఁడు మూలభారతములో నాధారము లేకపోయినను గూడ వేదములయు బ్రాహ్మణులయుఁ బ్రభావములను జాటుచుండును.

అర్జునుఁడు మత్స్యయంత్రంబు నేసినపిమ్మట దేవతలు పుష్పవృష్టిని గురిసి రనియు బ్రాహ్మణు లుత్సాహముతో బట్టల నెగురవేసి రనియు మంగళవాద్యములు వాయింపఁబడె ననియు సంస్కృతభారతములోఁ జెప్పఁబడియున్నది. కాని నన్నయ యీసందర్భమున మూలాధారము లేకనే బ్రాహ్మణుల ప్రభావమును బొగడుటకుఁ బ్రారంభించినాఁడు. అచటివా రీక్రిందివిధముగఁ జెప్పుకొనినారఁట!

'చ. ఫలపవనాంబుభోజనశుభవ్రతవృత్తులఁ జేసి చూడదు
ర్బలతను లయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టివారలకు భవ్యులకెందు నసాధ్యమెద్ది యుం
గలదె చరాచరాఖిలజగంబులఁ బెద్దలకారె సద్ద్విజుల్.'

ఈపద్యమునకు మూలభారతములో నేమియు నాధారము లేదు. ఇట్టిస్థలములలో నన్నయకుఁ గలబ్రాహ్మణభక్తి వ్యక్తమగుచున్నది. విప్రవేషములో నున్న యర్జునుపైఁగూడ నన్నయకు నిర్హేతుకమైన పక్షపాత మేర్పడినది. ఎట్లన: 'బ్రాహ్మణో యది చాపల్యాల్లోభాద్వా కృతవానిదం' అని క్షత్రియులనుకొనినట్లు సంస్కృతభారతములో నుండఁగా నన్నయ బ్రాహ్మణునకుఁ జాపల్యమును లోభమును నంటకట్టుట కిష్టములేనివాఁడై

'తనవిద్యపేర్మి నృపనందనఁ బడసెను విప్రుఁ డితనితప్పే'

అని యాక్షత్రియులచే ననిపించినాఁడు.

మూలములోని కొన్నిభావములను వదలివైచుట యు నన్నయభాగములోఁ జాలచోట్లఁ గాంచనగును. కొన్ని యుపాఖ్యానములు గూడ వదలివేయఁ బడినవి. మూలములో లేనిభావములుగూడ నొక్కొకచోఁ గాంచనగును. మూలములో నొకచోట నున్న కథ యిట మఱొకచోట నుండుటయుఁ గలదు. మూలగ్రంథములో యయాతిచరిత్రము శకుంతలోపాఖ్యానమునకుఁ బిమ్మట నున్నది. నన్నయ వీనిని వ్యత్యస్తము చేసినాఁడు. నన్నయ యిట్టిమార్పులను గావించుటకు రెండుహేతువులను జేర్కొనవచ్చును. నాఁడు నన్నయకు లబ్ధమైన సంస్కృతభారతప్రతిలో నివి యిట్లే యుండవచ్చు ననునది యొకటి. ఇట్లు మార్చుటలో నౌచిత్యము గలదని నన్నయ తలఁచియుండవచ్చు ననునది రెండవది. ఎట్లన: యయాతిచరిత్రము పూర్వము జరిగినది కావున దానిని ముందుగ వ్రాయుటయే సమంజసమని నన్నయ తలంచి యుండవచ్చును.

నన్నయ యీవిధముగ మూలగ్రంథములో మార్పులను గల్గించివ్రాయుట రాజరాజు కోరికి కనుగుణముగనే యున్నది. ఏలన: ౧. రాజరాజు భారతమును మక్కికిమక్కిగఁ దెనిఁగింపుమని నన్నయను గోరలేదు.

"క. జననుత కృష్ణద్వైపాయనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్"

అనియే కోరియున్నాఁడు. ౨. అంతియే కాక మూలములోఁ గొన్నిమార్పులను గావించి రచియించుటయే రాజరాజున కెక్కు డభిమత మని చెప్పుటకుఁ గూడ వీలున్నది. భారతమును భాషాన్తరములోఁ జెప్పుటయే కాక భంగ్యంతరముగఁ జెప్పుటగూడ నాతని కభిలషిత మని యీక్రిందిమాటలవలనఁ దెలియఁ గలదు.

"బహుభాషలబహువిధముల, బహు జనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు, బహుయాగంబులఫలంబు పరమార్థమగున్"

ఇట రాజరాజు 'బహువిధముల' భారతమును వినఁగోరుట చేతనే నన్నయ దానిని నూతనవిధముగ వ్రాసి యుండవచ్చును.

గ్రంథవిషయకథనములోనే కాక గ్రంథము బాహ్యరూపములోఁ గూడ నన్నయ మార్పును గావించినాఁడు. మూలభారత మించుమించుగఁ బద్యమయముగ నున్నది. నన్నయ దానిని గద్యపద్యాత్మకముగ రచించినాఁడు. అట్లుచేయుటకుఁ గూడఁ గారణము లేకపోలేదు. నన్నయ భారతము నాంధ్రీకరించుకాలమునకు సంస్కృతభాషలో విరివిగఁ జంపువులు వ్రాయఁబడుచుండెను. రామాయణచంపువు మున్నగున వీశతాబ్దముననే రచింపఁబడినవి. సంస్కృతవాఙ్మయప్రభావ మెల్లపుడును బహువిధంబుల నాంధ్రవాఙ్మయముపైఁ గన్పట్టుచునే యుండెను. నన్నయకాలములో సంస్కృత సారస్వత ప్రపంచములోఁ బ్రాముఖ్యమువహించిన చంపూవిధానమే యాతని భారతాంధ్రీకరణమునకు మార్గమైనది.

పద్యము నెట వ్రాయవలెనో గద్య నెచట వాడవలెనో యనువిషయమున నన్నయకుఁ గొన్ని నిశ్చితాభిప్రాయము లున్నట్లు గన్పట్టును. పరికించి చూడఁగా నీక్రిందినియమము లాతని కుండె నని తోఁచును. ఇవి యపవాదములు లేనినియమములు గాకపోవచ్చును. ౧. అనుకరణము ముగింపఁబడినపిమ్మట సాధారణముగ వచనము ప్రారంభింపఁబడును. "అనిన శకుంతలపలుకులు సైకొననొల్లక దుష్యంతుఁడిట్లనియె." "ఇట్లు దద్దయు దుఃఖించి" అనునవి యుదాహరణములు. ౨. వచనప్రారంభములో నెత్తికొనఁబడిన యభిప్రాయము ముగిసి నూతనాభిప్రాయము గాని నూతనఘట్టము గాని ప్రారంభము కావలెనన్నచో నపి పద్యములోఁ బ్రారంభింపఁబడును. 3. బహుకాలములో జరిగినసంగతులను సంగ్రహముగఁ జెప్పనైచుటకు సాధారణముగ వచనము వాడఁబడును. ఉదాహరణము. "అని మహానురాగంబునఁ గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలింగనంబు సేసి శకుంతలామహాదేవి నతిప్రణయగౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తనరాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుఁడు దపోవనంబున కరిగిన" ౪. రెండుభిన్నపద్యములలో నున్న రెండుముఖ్యవాక్యములకు సంబంధమును గల్పుటకై 'అంత' 'అట్టి యవసరంబున' మున్నగుచిన్నవచనములు మధ్యమునఁ బ్రవేశపెట్టఁబడును. ౫. పద్యములోని

భావములను సంగ్రహముగ వచనములో ననువదించుటయుఁ గొన్నిచోట్లఁ గాం చనగును.

అర్వాచీనకాలమునఁ గొంత తలయెత్తిన సంస్కృతాంధ్రస్పర్థ నన్నయనాఁటికి లేదు. ఆతఁడు సంస్కృతపదములను విరివిగ వాడుటకు శంకింపలేదు. ఒక్కొక తెలుఁగుపదమునకు రెండేసిసంస్కృతపదముల చొప్పున వాడియున్నాఁడు. వైదికధర్మాచారనిబద్ధమనస్కుఁడైననన్నయ సంస్కృతపక్షపాతి యగుటలో నాశ్చర్యము లేదు. గ్రంథాదిలోఁ బవిత్రమైన దేవతాస్తోత్రము చేయుటకు సంస్కృతము మాత్రమే యర్హమైన భాష యని యాతఁడు దలంచుటలోఁ గూడ వింత లేదు. సంస్కృతపదములనే కాక దీర్ఘసంస్కృతసమాసములను గూడ నాతఁడు వాడుచుండును; "సంతతసిద్ధామరయక్షసేవితసముద్యచ్ఛృంగమై" ధవళభూషణ దామానులేపనామలినాంగి'' "నరనాగాశ్వ"మున్నగు సమాసములిటీవలి యాంధ్రకవులు వాడిన సమాసములతోఁ బోల్చిచూచినచోఁ జాలఁజిన్నవే కాని సంస్కృతభారతములోని సమాసములతోఁ బోల్చి చూచుచోఁ జాలఁ బెద్దవిగనే కన్పట్టును.

కేవలముఁ గవితాసౌందర్యములో నన్నయభారతభాగము మూలమునకుఁ దీసిపోవునా యనుప్రశ్న యొండు కలదు. చాలవిషయములలో రెండుకవితలు నొకవిధముగనే యుండును. రెండును ద్రాక్షాపాకములోనే యున్నవి. రెండును గూడ సహజోద్భూతములుగనే కన్పట్టును గాని విశేషప్రయత్నజనములుగఁ గన్పట్టవు. మూలములోని మంచియుపమానములను వర్ణనలను నన్నయ చాలభాగ మనువదించియే యున్నాఁడు; కొన్నిచోట్ల మూలాధారములేని పోలికలను వర్ణనలను దెచ్చిపెట్టినాఁడు. ఇందుఁ గొన్ని మిక్కిలి స్తుత్యర్హములుగ నున్నవి. ధృతరాష్ట్రుఁడు జతుగృహదహనవార్త విని 'ఆవఱచిన ట్లఱచెన్' అని నన్నయ వాడిన యుపమాలంకారమునకు మూలములో నాధారము లేదు. మూలములో సంగ్రహముగ నున్నయంశమును విపులముగను వినసొంపుగను లలితపదములతోను గావ్యకళతోను జెప్పుట చాలచోట్లఁ గాంచనగును. మత్స్యయంత్రమును గొట్టిన యర్జునునకు ద్రౌపది పుష్పమాలిక వేయుట మూలములో నిట్లు వర్ణింపఁబడి యున్నది.

"విద్ధంతు లక్ష్యం ప్రసమీక్ష్య కృష్ణా పార్థంచ శక్రప్రతిమం నిరీక్ష్య
ఆదాయ శుక్లాంబరమాల్యదామ జగామ కుంతీసుత ముత్ స్మయంతీ"

దీనిని నన్నయ యీ క్రిందివిధముగ నాంధ్రీకరించియున్నాఁడు.

"సీ. ధరణీశనందనుల్ ద న్నతిప్రీతితోఁ జూచుచునుండంగ సుందరాంగి
తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ కమనీయగజరాజగమన లీలఁ
జనుదెంచి సురరాజసన్నిభు నభినవయౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ దనచేతిసితపుష్పదామకమునఁ
బొలఁతి ముదముతోడఁ బూజించె నట్టియుత్సవముఁ జూచి దానిసైఁపకపుడు
కౌరవేంద్రుఁ డాదిగాఁగల భూపతు, లెల్ల నలిగి కలయ నేపురేఁగి."

మొత్తముపై నెట్లున్నను గొన్నిచోట్ల నన్నయకవిత్వము మూలములోని కవిత్వముకంటె మిన్నగనే యున్న దని యాదఱు నంగీకరించియున్నారు. ఆంధ్రకవులచరిత్రములో వీరేశలింగముపంతులుగా రిచ్చిన యీ క్రిందియభిప్రాయము మిక్కిలి సమంజసముగనే యున్నది? "మూలముతో సరిపోల్పక ప్రత్యేకముగాఁ జూచునప్పుడు మాత్ర మాంధ్రభారతము మనోహరముగా నుండుటకు సందేహములేదు. కొన్నిచోట్ల మూలమునకంటెను హృద్యతరముగా నుండి రసాతిశయము పుట్టించు ననుటయు నిర్వివాదాంశమే."

ఇట్టిభేదములు మాత్రమే కాక దేశకాలపరిస్థితులను బట్టి వచ్చిన యితరభేదము లనేకములు నన్నయభారతమునకును వ్యాసభారతమునకును నడుమఁ గలవు. అర్జునుని తీర్థయాత్రావసరమున వేంగీదేశప్రశంస మూలభారతములో లేకుండుటయు నన్నయ స్వదేశాభిమానముచే నట వేంగీదేశమును ప్రశంసాపూర్వకముగ వర్ణించుటయు సుప్రసిద్ధవిషయము. మఱియు గ్రంథాదిలోఁ దనయేలిక యగురాజరాజున కేగుణములు గలవని నన్నయ చెప్పియున్నాఁడో యాగుణములను గ్రంథములో నాయామహాపురుషులకు నన్నయ బుద్ధిపూర్వకముగ నంటఁగట్టినట్లు గన్పట్టును. వివాహవిషయమున యయాతి దేవయానిని బ్రత్యాఖ్యానము చేయుచు "సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించుచున్న యేన యిట్టి యధర్మంబున కొడంబడితినేని జగత్ప్రవృత్తి విపరీతం బగు" నని నన్నయ చెప్పినాడు. కాని వ్యాసభారతములో నీయభిప్రాయ మేమియు లేదు. గ్రంథాదిలో నన్నయ రాజరాజును వర్ణించుచు "సమస్తవర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహినొప్పు సర్వలోకాశ్రయుఁ" డని చెప్పియున్నాఁడు. పైని యయాతిపరముగ వాడఁబడిన పదము లీపదములచు దలపించుచున్న వనుటలో సందియము లేదు. నన్నయకాదర్శధర్మరక్షకుఁడు రాజరాజు. గ్రంథములోని

మహాపురుషుల గుణములను బేర్కొనుటలో నీతనిగుణములు వారి కున్నట్లు చెప్పు టయే సర్వోత్తమమార్గ మని యాతనియాశయమై యుండవచ్చును.

పురాణములను దెలిఁగించుటలో యథామూలముగా వ్రాయక మూల కథకు భంగములేకుండ యథేచ్ఛముగ వ్రాయుపద్ధతిని నన్నయయే ప్రారంభించి నాఁడు. నన్నయ యాంధ్రీకరణపద్ధతినే యితరపురాణభాషాన్తరీకర్తలు గూడ నవ లంబించినారు. ఈపద్ధతి యెంత ప్రశస్తమైన దైనను గేవలము లోపము లేనిది కాదు. చారిత్రకపరిశోధకులకును ధర్మశాస్త్రవిషయకసందేహములను బాపుకొనఁ దలఁచువారికిని నిట్టి భాషాన్తరీకరణము లుపయోగింపఁజాలవు. అట్టివారికి సరియై న భాషాన్తరీకరణములే కావలెను. ఈవిషయమునఁ గృష్ణభారత మొకలోటును దీర్చుచున్నది.

---

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

— పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కాకినాడ. —

---

ఈనిఘంటురాజమునకై యాంధ్రదేశమం దున్నవిద్వాంసులు, కవులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, దేశభాషాభిమానులు మొదలగువా రందఱును జిరకాలమునుండి గంపెడాసతో నెదురుచూచుచున్నారు. ఇప్పటికి వీరిభాగ్యబీ జములు మొలకలెత్తినవి. ఈమధ్యకాలముననే ప్రథమసంపుటము ప్రకటింపఁబడి నది. ఈసంపుటమును జూచుభాగ్యము నాకు లభించినది. దీనిని జూచినతోడనే కాలవిలంబమును సహింపలేక యుప్పొంగుచున్న యావేదన యడఁగిపోయినది. నామనస్సున కిప్పటికి శాంతి చేకూరినది. నిజమైన నిఘంటు నిర్మాణమునకుఁ గాల పరిమితి లేదని గ్రహింపఁగలిగితిని. నే నీనిఘంటుసంపుటమును బరిశీలించి చూ చితిని. నాకీనిఘంటురాజములో నిదివఱ కేయాంధ్రనిఘంటువులోఁ గూడఁ గను పట్టని యనేకవిశేషాంశములు గోచరించినవి. ఇయ్యది మనయాంధ్రమాత కమూ ల్యరత్నాభరణము. దీనిమూలమున మనతల్లి స్వయంప్రకాశమానయగుటయే గా క సాటితల్లులకుఁ గూడ నాదర్శప్రాయముగా నుండఁగలదు. త న్నుపాసించు తన కుమారుల కీయమూల్యరత్నాభరణజ్యోతిస్సులచేఁ దననిజరూపమహిమ మంత యు బోధించి యన్యారాధనము మాన్పించి ధన్యులను జేయఁగల దని నానిశ్చి తాభిప్రాయము. ఈనిఘంటురాజమును, ఆంధ్రలోకమునకుఁ బ్రసాదించి మహా

పకార మొనర్చిన శ్రీ శ్రీ శ్రీ పిఠాపురాధీశ్వరులు, ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకులు, ఉభయభాషాతత్త్వాభిజ్ఞు లగునిఘంటుకార్యస్థానపండితులును ముఖ్యముగా మన కభినందనీయులు. ప్రస్తుత మీనిఘంటుసంపుటములో నాకుఁ దోఁచిన విశేషాంశములలోఁ గొన్నింటిని మాత్రమే స్థాలీపులాకన్యాయమునఁ జూపుచున్నాఁడను.

౧. దాదాపుగా నాంధ్రభాషలో గ్రహింపఁదగిన యజాదిపదము లన్నియు సప్రమాణముగా గ్రహింపఁబడినవి. ఇది యీసూర్యరాయాంధ్రనిఘంటువులోనే చూపట్టుచున్నది.

౨. శబ్దరత్నాకరములో ఏగు, అనుపదము నిరనుస్వారముగాఁ జూపఁబడెను. ఈనిఘంటువులో నట్లుగాక ఏఁగు అని సానుస్వారముగా గ్రహించి రాఘవపాండవీయభోజరాజీయకళాపూర్ణోదయములలోని సాధకప్రయోగములు ప్రమాణములుగాఁ జూపఁబడినవి. ఇట్టివిశేషము లింకను జాలచోట్లఁ గలవు.

3. తత్సమేతరాంధ్రపదములలో సజాతీయము లగునితరభాషాపదములు గూడఁ జూపఁబడినవి. నిఘంటునిర్మాణములో నీపద్ధతి నూతనము. భాషల సాజాత్యమును దెలిసికొనుట కిది మిక్కిలి యుపయోగపడఁగలదు. చూడుఁడు. ఉదా అగరు, అగలు², అగులు. వి. (సం. అగరు, అగురు, ప్రా. అగరు, అగలు. పా. అగరు. క. అగళు, అగుళు, అగిలు. త. అగల్. తు. అగెల్, అగెల.)

౪. ఔపవిభక్తిక ఆనౌపవిభక్తిక నిర్ణయము చేయఁబడినది. ఇది చాలముఖ్యవిషయము; పూర్వనిఘంటువులలో నీనిర్ణయము లేనందున సామాన్యజ్ఞానము కలవారు తెలిసికొనఁ జాలక విపరీతప్రయోగములు చేయుచున్నారు. ఇది యీవైపరీత్యమును దొలఁగింపఁగలదు. ఉదా. అట్టు, అప్పడు మొదలగుస్థలములలోఁ జూడుఁడు.

౫. భాషాశాస్త్రరీతిగా శబ్దముల యుత్పత్తిని గుఱించి గొప్పవిచారణ చేయఁబడినది. ఇది విచక్షణులకు మిగుల నావశ్యకము. విశేషపరిశ్రమమువలనఁ గాని యీవిమర్శన సాధ్యపడదు. ఉదా. అంత, అచ్చోటు. మొదలగు పదములలోఁ జూడుఁడు.

౬. సామెతలు గూడసోదాహరణములుగాఁ జూపఁబడినవి. ఈపద్ధతి సామెతల యుపయోగమును బాగుగా గుర్తెఱుఁగుటకు మిక్కిలి తోడ్పడఁగలదు. చూడుఁడు. ఉదా. అటుచేతంబండ్లు——

క. అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లువచ్చినప్పుడు మిమ్ముం
గఱచెదవు గాని.........కళాపూర్ణోదయము.

౭. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఆంధ్రభాషార్థుల కివి యెంతటి యుపయోగమో ప్రత్యేకముగా వ్రాయ నవసరము లేదు. ఉదా. అడ్డ- ము. చూడుఁడు.

౮. అడ్డ మొదలగుపదములలో అడ్డగాళ్లవైచు, అడ్డుచొచ్చు, అడ్డుదాఁకు, మొదలగు సమష్టిపదములు గూడ గ్రహింపఁబడినవి. ఈమార్గము ప్రయోగాదులకుఁ జాల ననుకూలించును: శబ్దార్థభేదములుగూడ బాగుగాఁ దెలుపును.

౯. అను, ఆను, ఎత్తు, మొదలగుస్థలములలో నర్థము లధికముగాఁ జూపఁబడినవి. అధికార్థములు చూపుటవలనను, ఉదాహరణబాహుళ్యప్రదర్శనమువలనను గలిగెడి గుణవిశేషములు పీఠికలోఁ జెప్పఁబడియేయున్నవి.

౧౦. ఆంధ్రవాఙ్మయములోఁ గలసంస్కృతపదముల నన్నింటి నెత్తి వ్రాసి తత్సమములుగాఁ జేసికొని నిఘంటువులో నెక్కించిన బాగుగా నుండు ననుకొనుచున్న మావంటివారికిఁ గూడఁ దృప్తి కలిగింపఁజాలు తత్సమపదము లీయఁబడినవి. ఈపదములలో మా కభీష్టము లగుశబ్దము లన్నియు నంతర్భూతములుగానే యుండు ననితోఁచుచున్నది. కాని హలంతపదజాలము గూడ నీవిధముగా నున్నప్పుడే పైయభిప్రాయము స్థిరపఱచుకొనవలసియుండును. ఈవిధముగా విమర్శించి చూచినచో మహత్తర మగు నీ శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువులో విద్వల్లోకము ప్రశంసించి నేర్చుకొనఁదగిన నూతనవిషయము లెన్నియో కలవు. కావునఁదక్కిన సంపుటములు గూడ నీవిధముగానే యనంతముఖంబుల నాంధ్రవాఙ్మయసాహిత్యసుధారసధారలను వర్షించి యాంధ్రభూమిని ఫలవంతముఁ జేయుంగల దని యాశించుచున్నాఁడ.

# శబ్దసాధుత్వము.

వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వాన్ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.

ఈయాంధ్రదేశమునఁ గొంతకాలమునుండి ప్రబంధనిర్మాణమునందు సాధుశబ్దములే గ్రాహ్యము లని కొందఱును, వ్యావహారికములును గ్రాహ్యము లని కొందఱును, వాదోపవాదములతోఁ బోరిరి. అందు సాధుశబ్దములే గ్రాహ్యము లని శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులును శ్రీజయంతి రామయ్యపంతులుగారును బరిషత్పాశుపతమును గొని విజయముగాంచి రనుట లోకవిదితమే. అందువలన వ్యావహారికభాష గ్రాహ్యమా? త్యాజ్యమా? అని చర్చించుట యిప్పు డనావశ్యకము. "సాధుశబ్దములే గ్రాహ్యము" లనువారిశబ్దసాధుత్వమును గూర్చి రవంత పరిశీలింతము.

కొందఱు వ్యాకరణసిద్ధములే సాధువు లనియును, గొందఱు తెలుఁగు భాషకు వ్యాకరణముతో నిమిత్తము లేదు, కవిప్రయుక్తము లెల్లను సాధువులే యనియును జెప్పుచున్నారు. ఈవిషయమున సంస్కృతభాషావిమర్శకుల మార్గము గూడఁ గొంతవఱ కనుసరింపవలసియున్నది. సంస్కృతమున వైయాకరణులును, మీమాంసకులును, శబ్దసాధుత్వ మనఁగా :- ధర్మజనకత్వరూప మనియును, నట్టిధర్మజనకతను దెలుపునది వ్యాకరణస్మృతియే యనియును, నుత్తరోత్తరవ్యాకరణములు పూర్వపూర్వవ్యాకరణమూలకము లనియును భాషావ్యాకరణములు రెండును ననాదు లనియు నును జెప్పిరి. నైయాయికులు సాధుత్వ మనఁగా :— 'శాబ్దబోధజనకత్వరూపమని పరిష్కరించి, యసాధుశబ్దమువలనఁ గలుగు బోధానుభవమును సాధుశబ్దస్మృతివలనఁ గలుగునది గాని యసాధుశబ్దమువలనఁ గలుగునది గా' దని సమర్థించిరి. వీరిమతమున వ్యాకరణానిష్పన్నశబ్దములును, వ్యాకరణనిష్పన్నము లయ్యు బోధాజనకము లగుటచే శశశృంగాదిశబ్దములును నసాధువులు. ఆలంకారికులు 'రసజనకత్వం సాధుత్వం' అని చెప్పి, 'దైవతః, శౌర్యాణి, ఈదృశాని' ఇత్యాదికము 'దైవతాని పుంసివా దేవతాస్త్రియాం' 'సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః। నిత్యాసమాసే వాక్యేతు సావివక్షామపేక్షతే' ఇత్యాదిశాస్త్రనిష్పన్న మైనను రసాజనకముగాన నసాధువు. శబ్దనిష్ఠరసజనకత్వాజనకత్వములు సహృదయైకవేద్యములు' అని చెప్పిరి. మఱియు నలంకారశాస్త్రకర్త లెల్లరును వ్యాకరణసంస్కారహీనము చ్యుతసంస్కార మని దోషప్రకరణమునఁ

చెప్పి పాణినీయము నుదాహరించిరి. సాంఖ్యయోగాదిమతములును నీవిషయమునఁ బైవాని ననుసరించుచున్నవి. నైయాయికాదులును వ్యాకరణ నిష్పన్నములలోఁ గూడఁ గొన్నిటి కసాధుత్వము చెప్పిరి. కాని వ్యాకరణానిష్పన్నములలో నొకదానికిని సాధుత్వము నంగీకరింపరయిరి. 'శాలీనా'ది శబ్దములు మహాత్ములచేతఁ బ్రయుక్తములు గాన నాకృతిగణత్వ బాహుళకత్వాదులను బట్టి సాధుత్వ మంగీకరించిరి. కాని వ్యాకరణానిష్పన్నము లైనను బ్రయోగమును బట్టి సాధువు లని నుడువ రైరి. 'ప్రయోగశరణా వైయాకరణాః' అనునది లక్ష్యైకచక్షుష్క విషయముగాని లక్షణైకచక్షుష్క విషయము కాదు. కనుకనే 'పదకారై ర్నామలక్షణమనువర్త్యం నహి లక్షణేన పదకారా అనువర్త్యాః' అని భగవత్పతంజలిపాదులు చెప్పియున్నారు. దీనింబట్టి సంస్కృతమునఁ గలసర్వశాస్త్రములును వ్యాకరణానిష్పన్నమగుశబ్ద మసాధు వని సిద్ధాంతీకరించినవి.

ఆంధ్రభాషయందును వాగనుశాసనబిరుదము నందిన నన్నయభట్టారకుండును, నీతనిగ్రంథ మగుచింతామణికి వ్యాఖ్యాతయై ద్వితీయాచార్యుఁ డనఁబడిన యథర్వణుఁడును 'అనియమా ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః' నాపభ్రంశత్వమేతస్యా నియమాభావతస్తుతత్' అని చెప్పి శబ్దసాధుత్వమును గూర్చి "వ్యాకరణమే ప్రయోజకము, కాని, ప్రయోగము కాదు." అని సూచించిరి. వ్యాకరణమే ప్రధాన మని నన్నయభట్టసిద్ధాంత మైనయెడల నన్నయభట్ట ప్రయోగము లన్నియుఁ జింతామణిచే సాధ్యము లగునా? ఒకవేళఁ బ్రయోగమునకే యాయనమతమునఁ బ్రాధాన్య మీయఁబడినయెడలఁ బ్రవర్తకము కానేరని యీవ్యాకరణమేల రచింపవలసివచ్చినది' అను సంశయములు గలుగుచున్నవి. సత్యదృష్టితోఁ బరికించినయెడలఁ జింతామణి యసమగ్రవ్యాకరణ మనుట నిజమే. కాని, వాగనుశాసనకాలమునకుఁ గొన్నివ్యాకరణము లున్నట్లు 'కవిభల్లటైః క్రియాణాః' మిత్యాదికమువలనఁ దెలియుచున్నది. వాగనుశాసనుఁ డాకవిభల్లటాదివ్యాకరణగ్రంథములోని క్లిష్టగ్రంథమునకు మాత్రము వ్యాఖ్యానరూపముగాఁ దనమతమును బ్రదర్శించుటకు నీచింతామణి రచించియుండును. ఆగ్రంథములందలి యక్లిష్టభాగమును గతార్థ మని విడిచియుండును. ఆకవిభల్లటాదిగ్రంథములతోఁ జింతామణిని నేకవాక్యత గలుగునట్లు సమన్వయము చేసినయెడల యావద్భాషానుశాసనము కావచ్చును. అవి యిపు డనుపలబ్ధము లగుటచేఁ జింతామణి యసమగ్రమని మనకుఁ దోఁచుచున్నది.

ఇఁక నథర్వణుఁడును శాస్త్రమునకే ప్రాబల్యము నొసఁగిన ట్లీక్రిందివిధ మునఁ దెలియవచ్చుచున్నది. 'సర్వే శబ్దాః ప్రయోక్తవ్యా యది దోషవివర్జితాః। అప్రయుక్తత్వ దోషస్తు న విరుద్ధో హ రేర్మతే। (దోషవివర్జితాః=వ్యాకరణనిష్పన్న ములు) ఈహరిమతమును 'అస్త్యప్రయుక్తః' అనిశంకించి 'అప్రయుక్తేదీర్ఘసత్రవత్ సర్వే దేశాంతరే' అని సమాధానముచెప్పిన కాత్యాయనమతము ననుసరించు చున్న దనుకొనవచ్చును. 'శాస్త్ర ప్రయుక్తవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే' అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హి తం' అని యథర్వణుఁడు స్వమత మును జెప్పెను. శాస్త్రమునకును బ్రయోగమునకును విరోధము వచ్చినపుడు శాస్త్రమునకుఁ బ్రాబల్యము గానఁ బ్రయుక్త మసాధు వనవలెను. 'నుయిదాఁటే వానికిన్, మొగమందను, అటుహూపిటు, ఇత్యాదులు ప్రయుక్తము లయ్యును శాస్త్రవిరుద్ధములు గాన నసాధువులు. శాస్త్రముచేత నిష్పన్నము గాని పదము విషయమై ప్రయోగాశ్రయణము హితము. కఱుకు-కఅకు, మొగము-మొహము. ఇత్యాది శాస్త్రానిష్పన్నపదముల సాధుత్వమును గూర్చి మాత్రమే ప్రయోగము నాశ్రయింపఁ దగు నని యథర్వణునిమతము. ఈమతము 'ఏతేషా మపి (ప్రాతిపది కానా మపి) స్వరవర్ణానుపూర్వీ జ్ఞానార్థ ఉపదేశః కర్తవ్యః 'శశః షష'ఇతి మా భూత్. మంచకో మంజక ఇతి మాభూత్ 'సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయా శ్చ తతః పరే' కార్యా ద్విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు" ఇత్యా ది సంస్కృతవ్యాకరణపద్ధతిఁ బోలియున్నది. ఇటఁ గొందఱు 'నిష్పన్నేపి పదే తేన' అని పఠించి శాస్త్రప్రయోగములకుఁ బరస్పరవిరోధము వచ్చినపుడు శా స్త్రమే ప్రబలము. ప్రయుక్త మసాధువే. మఱియును అశబ్దము కశబ్దము మున్న గువానికి డుజాచులు చేర్పఁగా నగు' ఉఁడు, కుఁడు, మొదలగురూపములు శా స్త్రనిష్పన్నము లైనను బ్రయోగాననుగృహీతములు గాన నగ్రాహ్యములు. శా స్త్రప్రయోగోభయానుగృహీతములే గ్రాహ్యములు కాని యం దొకదానిచే మాత్రమైన ననుగృహీతము లగ్రాహ్యములు. అని చెప్పుచున్నారు. ఈమతము 'అభిధానలక్షణాః కృత్తద్ధితసమాసాః' అను మతమును బోలి యున్నది. కాని యీపాఠ మెక్కడను గానరాదు. వారిచే గల్పితము. హరిమతమున శాస్త్రసిద్ధ మైన దెల్లను బ్రయుక్తము గాకున్నను 'ఉఁడు, కుఁడు' మున్నగునవి సైతము గ్రా హ్యములు. అథర్వణమతమున శాస్త్రవిరుద్ధము లగు 'నుయిదాఁటేవానికిన్' ము న్నగువానితోపాటుగా నప్రయుక్తములగు 'ఉఁడు, కుఁడు' మున్నగునవియు నగ్రా

హ్యము లే. ఈ రెండు మతములును 'యథాలక్షణ మప్రయుక్తే' అనుచోటం గైయటుండు చేసిన వ్యాఖ్యాద్వయమును స్మరింపంజేయుచున్నవి. నిష్పన్నేపి: అని సవరించినవారు, ఈ కారికను "విరళాః పేచోపాదికశబ్దాః ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః, ఇనాతు ప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధమేవ పదం" అను చింతామణి కారికకు వ్యాఖ్యాన మని తలంచుచున్నారు. ఇట, అహోబలపండితుండు 'యత్ర శాస్త్రేణ విశిష్య కార్య ముచ్యతే తత్ర శాస్త్రం బలవ ద్భవతి. యత్ర శాస్త్రేణ సామాన్య విధానం తత్రప్రయోగో బలవా నితి తదర్థః' అని వ్రాసెను. వీరియాశయము నా కేమియును స్ఫురించుట లేదు. సామాన్యవిశేషము లనంగా నేమి ? 'తదప్రాప్తియోగ్యే అచారితార్థ్యం, తత్కృతే వ్యచారితార్థ్యం, తత్కృతే చారితార్థ్యం వా యస్య తస్య సామాన్య శాస్త్రత్వం' అని సంస్కృతవ్యాకరణమునం గలదు. దీనినాశ్రయించినయెడలం బ్రతిసామాన్యశాస్త్రమునకును వైయర్థ్యము వచ్చును. ఏకవ్యక్తిమాత్రగత ధర్మము నుద్దేశించి విధింపంబడినకార్యము విశేషకార్యము. నానావ్యక్తిగతధర్మము నుద్దేశించి విధించిన కార్యము సామాన్యకార్య మగుంగదా! అట్లయినచో వ్యాకరణమునందు నూటికిం దొంబదితొమ్మిది విధులకు వైయర్థ్యమే కాని సార్థక్యము రాదు. కావున నిచట నహోబలునిహృదయము గోచరించుట లేదు. దీని నంతయు విమర్శింపంగా అహోబలుని మత మటుండ నన్నయాథర్వణులమతము ప్రకారముల ప్రయోగ మున్నను శాస్త్రముచేత సిద్ధింపని సర్వము నగ్రాహ్య మని తోంచుచున్నది. శాస్త్రసిద్ధమే గ్రాహ్య మని కొందఱును, శాస్త్రప్రయోగోభయసిద్ధమే గ్రాహ్య మని మఱికొందరును జెప్పిరి. కాని కేవలప్రయోగ మున్నంతమాత్రమున గ్రాహ్య మని ప్రాచీను లెవ్వరును జెప్పియుండ లే దనుకొనందగును.

ఈయాంధ్రభాషకుం బెక్కు వ్యాకరణములు గలవే. ఏది యనుసరింపందగినది యను విషయ మప్రకృత మని విరమించుచుంటిని.

---

# తెలుఁగు.

— చర్ల నారాయణశాస్త్రిగారు, పీఠాపురము. —

---

మనయాంధ్రభాషకు 'తెలుఁగు, తెనుఁగు' అనుపేరులుగూడ నున్న వను సంగతి యందఱకును దెలిసినదే. 'తెలుఁగు, తెనుఁగు' శబ్దముల వ్యుత్పత్తిని గూర్చి భిన్నాభిప్రాయములు చాలఁ గలవు. వీనినిగూర్చి కొంతపరిశీలించుట యనావశ్యకము కాదు. అథర్వణాచార్యులు మొదటఁ దాను రచించిన యాంధ్రవ్యాకరణమునకు "త్రిలింగశబ్దానుశాసనము" అను పేరు పెట్టియున్నాఁడు. దీనినిబట్టి 'త్రిలింగ' పదము తెలుఁగుపదమునకుఁ బర్యాయముగా నథర్వణుఁడు గ్రహించె నని తెలియుచున్నది. తెలుఁగుపదము త్రిలింగమునకుఁ దద్భవరూప మని యప్పకవి స్పష్టముచేసినాఁడు. ఈయభిప్రాయముతోడనే బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తమవ్యాకరణమునకు "త్రిలింగలక్షణశేష" మని పేరుంచినారని తెలియుచున్నది. ఇట్లే తక్కిన లాక్షణికులు గూడఁ దెలుఁగుశబ్దమును ద్రిలింగశబ్దభవముగనే యంగీకరించిరి. ఇట్లు త్రినగశబ్దమునుండి తెనుఁగుపదము సిద్ధించిన దని లాక్షణికులు కొందఱయభిప్రాయ మైయున్నది. కాని యీయభిప్రాయములో నొకయాక్షేపణ మాత్రము గలదు. సబిందుక మగుత్రిలింగశబ్దమునుండి సబిందుక మగు తెలుఁగు వచ్చిన దనుట సమంజస మగును గాని నిర్బిందుక మగు "త్రినగ" శబ్దమునుండి సబిందుక మగు తెనుఁగుశబ్దము సిద్ధించిన దనుట యంత సమంజసముగాదు. కాని కొన్ని యితరపదములను బరిశీలింపఁగా నిర్బిందుక మగు శబ్దములనుండి గూడ సబిందుకము లగుపదములు సిద్ధించుట మనభాషలోఁ గనుపట్టుచున్నది. నిర్బిందుకము లగు పూగ, కేతకి శబ్దములనుండి సబిందుకములగు పోఁక, గేదఁగి శబ్దములు సిద్ధించినవి. ఈశబ్దములకు మార్గాంతరము కనిపించువఱకును నీయభిప్రాయము తగియున్న దని చెప్పఁదగును. తెనుఁగుశబ్దసిద్ధిని గూర్చి మఱియొకరీతిగాఁ గూడ మనము చెప్పవచ్చును. తొల, తొలఁకు, గొలుగు మున్నగుపదములకు తొన, తొనఁకు, గొనుగు మున్నగురూపాంతరములు గనిపించుచున్నవి. అట్లే తెనుఁగుపదము తెలుఁగుశబ్దమునకు రూపాంతర మయి యుండవచ్చును.

ఈవ్యుత్పత్తులు, ఆధునికులకు సంతృప్తి నీయలేదు. తెల్ల + అగు = తెలుఁగు అనికొందఱును, తెలి + అగు = తెలుఁగు అని కొందఱును వ్యుత్పత్తి చెప్పినా

రు. బ్రహ్మశ్రీ మాకేపల్లి రామచంద్రశాస్త్రిగారు "తెనుఁగుఁదోఁబుట్టువులు" అనుపుస్తకములోఁ ద్రావిడభాషలతో నధికమగు సంబంధ ముండుటచే కోఁదఁగోండీభాషలలోని బహువచనప్రత్యయము లగు "లుఁగ" "ంగ్" అనువానికిఁ దెలుఁగు శబ్దముతో సంబంధ ముండవచ్చు నని యూహించి తెల+ంగ అని విడఁదీసి తెలంగమీఁద తెలుఁగు పదము సిద్ధించె నని వ్రాసియున్నారు. అనఁ దెలుఁగుశబ్దమునకుఁ దెల్లనివారు అని యుఁ దేటగా నుండు మనుజులభాష యనియు వ్యుత్పత్తి చెప్పఁబడినది. మఱియు నాపుస్తకమునందే తెనుఁగుశబ్దమునకు గూడఁ తేన్+ఉన్+ంగ్+ఉ—అను విభాగము చూపఁబడి తెన్నున నుండువారిభాష యని వ్యుత్పత్తి ప్రదర్శింపఁబడినది. ఇట్లు తెలుఁగు, తెనుఁగు శబ్దములను గూర్చి యనేకాభిప్రాయములు చూపట్టుచున్నవి. కాని యివి యిట్లే వచ్చిన వని నిర్ధారణముగా మాత్రము చెప్ప వీలులేదు. భాషలలోని యితరపదసాజాత్యమును బట్టి యీవ్యుత్పత్తి యనేకవిధములుగా గోచరించుచున్నది.

తెలుఁగుశబ్దము నను వలెనే యాంధ్రభాషావిషయమునఁ గూడ ననేకాభిప్రాయములు గలవు. పూర్వులు తెలుఁగుభాషను వికృతి యనియు వ్యవహరించిరి. ఈయాంధ్రము సంస్కృతప్రాకృతవికృతి యని వారి యభిప్రాయమై యున్నది. ఆంధ్రశబ్దచింతామణిలో నిట్లు చెప్పఁబడియున్నది.

"ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే త్వే షా తయో ర్వికృతిః"

"ప్రాకృతభవ సంస్కృతభవ స్సంస్కృతవ త్ప్రాకృతభవ వికృతిభవాః

వ్యతిరిక్తా భూయాంసో వ్యతిరిక్తాః సంప్రదాయతో వేద్యాః"

అని పైవాగనుశాసనుల వచనములఁబట్టి యతఁడు తెనుఁగుభాషకు మూలము సంస్కృత మనియే తలంచినట్లు స్పష్ట మగుచున్నది. అథర్వణుఁడును 'ఆద్యా మహార్హా సామూలం సర్వస్యేతి నిగద్యతే' అని చెప్పి వాగనుశాసనులయుద్దేశముతోనే యేకీభవించినాఁడు. మిగిలినలాక్షణికులు గూడ నీయభిప్రాయముసే యంగీకరించియుండిరి.

కాని యాధునికులు మాత్రము, ఆంధ్రభాష సంస్కృతప్రాకృతవికృతి యని చెప్పుట తగ దనియు ద్రావిడభాషలతో నంతకంటె నెక్కువసంబంధ మున్న దనియుఁ జెప్పుచున్నారు. తెలుఁగులోని సర్వనామములకును సంబంధవాచక పదములు మొదలగువానికి ద్రావిడభాషలతో సాజాత్యమున్నది. భాషాసాజాత్యములను, భాషాకుటుంబములను నిర్ణయించు నపుడు, ఆభాషకు సహజము లగు

సర్వనామములు సంబంధవాచక పదములును మున్నగునవి యెక్కువ సహకారు లగును. వానివల్లనే యది యే భాషతో నెక్కువసంబంధము గలిగియున్నదో మన ము తెలిసికొనఁగలము. కాఁబట్టి తెలుఁగునకును ద్రావిడభాషలకును నెక్కువ సం బంధ మున్నమాట వాస్తవము.

ఈపట్టునఁ బూర్వులచే వ్యవహృత మగు వికృతిపదము తెలుఁగుభాషకు- ఎంతవఱకు సమంజసమై యున్నదో విచారింపవలసియున్నది. ఆర్యభాషలగు సం స్కృతప్రాకృతభాషలకుఁ గాలవశమున ద్రావిడభాషలతో నెక్కువ సంబంధము గలిగినది. మఱియు నార్యభాషల ప్రభావము కూడ నధిక మయినది. అందువలన సంస్కృతపదములు తెలుఁగులోనికి మాత్రమే గాక ద్రావిడభాషలలోనికిఁ గూడ స్వేచ్ఛగాఁ బ్రవేశించినవి. మనమతమున కాధారభూతము లైనవేదములును ద దంగము లగు శాస్త్రములు సంస్కృతములోనే యుండుటవలన సంస్కృతభాషా సంబంధము తప్పనిసరి యైనది. తెనుఁగుపుణ్య మనుఁడు పాప మనుఁడు- ఎట్టు లన్నను సరే మనతెనుఁగున కాసంస్కృతభాషాసంబంధము మిగుల నధికమై యేది సంస్కృతపదమో యేది తెలుఁగుపదమో కూడ శీఘ్రముగాఁ దెలిసికొనలేకుండు నట్టి సంబంధ మారెండిటి కేర్పడిపోయినది. ఈసంబంధము నన్నయకాలమునాఁ టికే యెక్కు వైనది. కనుకనే నన్నయ యిట్లు "ఏషా తదూ ద్భవకృతిః" అని చెప్పినాఁడు. సంస్కృతపదములను విడిచినచోఁ గొన్నిటికిఁ దెలుఁగుపదములే ల భింపవు. లభింప వని చెప్పుట తెలుఁగులో నాపదములు లేనే లే వనుటకుఁ గా దు. సంస్కృతపదములు వానిరూపములను గనిపింపకుండఁ జేసినవి. నిత్యము వాడుకొనువారములపేర్లు తిథులపేర్లు తత్సమతద్భవమయములై యున్నవి. నక్షత్ర ములపేర్లు సంవత్సరముల పేర్లును సంస్కృతములే. వీనికిని దెలుఁగుపేర్లు పూర్వ ము కలవేమో సరిగాఁ జెప్పలేము. ఈమధ్యఁ దిల్లికపదమునకుఁ బత్రికలలో నె క్కువ ప్రాముఖ్యమీయఁబడుచున్నది. కొంతపరిశీలనమీఁద దీపమునకుఁ దెలుఁగు పదము తిల్లిక కనిపించినదా! ఇది దేశముతిరుగకపోవుటచేతను సర్వజనులతోడను బరిచయము లేకపోవుటచేతను వచ్చినచిక్కు. ప్రతిమనుష్యుఁడును సుఖమును గోరువాఁ డగుటచే నప్పుడు తఱచు వాడఁబడు పదమునే వాడును గాని దీనికిఁ దెలుఁగుపదమునే వాడవలయు నని పట్టుదల వహించి దానిని వాడకపోవుటయే యిన్ని తెలుఁగుపదములు లోపించుటకుఁ గారణమైనది. ఏది యెట్లున్నను గాల ప్రవాహములోఁ గొన్నిప్రాఁతవి కొట్టుకొనిపోవును గొన్నిక్రొత్తవికొట్టుకొనివచ్చు

ను. పట్టుకొండ మన్నఁ గాలమాఁగునది కాదు. ఇట్లు సంస్కృతప్రాకృతభాషలు తెనుఁగుతో నైక్యము నొంది తెనుఁగును దనదానినిగాఁ జేసికొనుటచేతనే యాంధ్రభాష వికృతి యను పేరును గూడఁ బొందినది. పూర్వులు వికృతియని వ్యవహరించుట కేవలము ప్రాయోభిప్రాయముచేతనే కాని తెలుఁగు సంస్కృతప్రాకృతమాత్రవికృతి యను నభిప్రాయముచేఁ గాదు. కావుననే దేశ్య మను నవాంతర భేదమును జెప్పఁబడినది. లాక్షణికులు నీ, నా, మన, తా, తల్లి, తండ్రి మున్నగుపదములను దేశ్యములుగ నుదాహరించియున్నారు. ఈపదములు ద్రావిడభాషాసంబంధము కలవియై యున్నవి. ఈ తెలుఁగుభాష ద్రావిడభాషాకుటుంబములోనిదే యగుటచేతను ద్రావిడభాష లేకదేశజన్యము లగుటచేతను తెలుఁగుపదములను దేశ్యములనియే వాడి స్వదేశాభిమానమును బ్రదర్శించిరి. ఇట్టియభిప్రాయముతో దేశ్యము లని చెప్పుట యొతయఁ బూర్వుల దూరదర్శితను జాటుచున్నది. మఱియు సంస్కృతప్రాకృతభవములకు దేశ్యత్వవ్యవహారము లేనే లేదు. వికృతి పదము ప్రాయోభిప్రాయముతోఁ జెప్పిన దగుటచే దానికి సంస్కృతప్రాకృతమాత్రవికృతి యనునర్థము చేయఁదగదు. ఈయభిప్రాయమునే "కేవలతయా నుసర్వత్యేచ యే యం యథాతథా భాషా" అను వాగనుశాసనసూక్తి సూచించుచున్నది. ద్రావిడభాషలలో నేది ముందో మాత్రముచెప్పుటకు సరియైన యాధారములు కనిపింపవు.

ఎ ఒ చె జె ఱ అనువర్ణములును, ఔపవిభక్తికములును, కళాద్రుతప్రకృతికవిభాగమును సంస్కృతముకంటె వైలక్షణ్యమునుమన తెలుఁగుభాష యొక్క ప్రత్యేకతను వేనోళ్లఁ జాటుచున్నవి.

వీనిని గూర్చి కొంత తెలుపుట యప్రస్తుతము గాదు. శకటరేఫమునకును సాధురేఫమునకును నుచ్చారణములో స్వల్పమాత్రభేదమున్నది. ఉచ్చారణముఁ బట్టియే వానికలఘురేఫము లఘురేఫము నను పేర్లు గలిగినవి. కాని స్వల్పమాత్ర మగు నాయుచ్చారణభేదముకూడ నిపుడు లోపించిన దని చెప్పవచ్చును. రేఫపూర్వదీర్ఘము హ్రస్వమయిన చేఱుట (చేరూదు) ఊఱక (ఊరక) మున్నగుచోట్లను, రేఫద్విత్వఘటితములగు మఱ్ఱి గొఱ్ఱె మొదలగుచోట్లను, దక్కఁ దక్కుండ్లను, గల ప్రదేశములందు శకటరేఫమును సరిగాఁ దెలిసికొనుటకు వీలులేదు. అవి ప్రయోగసంప్రదాయములఁ బట్టియు నిఘంటువుల యాధారమును బట్టియుఁ దెలిసికొనవలయును. ఇప్పటికవులు గొందఱు దీనిని సరిగాఁ బాటింపక యుభయస్థలము

లంమను సాధు రేఫమునే వ్రాయుచున్నారు. ఈభేద మనావశ్యక మనియుఁ గొందఱు వాదింతురు. కాని "అఱి=పన్ను, అఱి=నశించి; నీరు=జలము; నీఱు=భస్మము; వేరు=చెట్టువేరు, వేఱు=భేదము, అన్యము; కారు=అడవి, కాలము, మొ. కాఱు=స్రవించు, పరుషవచనము. మొ" ఇత్యాదులందు సాధు రేఫ మున్న నొకయర్థము శకటరేఫ మున్న నొకయర్థమును గలుగుచున్నవి. మఱియు శకటరేఫము తెలుఁగునకు సహజవర్ణ మగుటచేతను సంస్కృతమున లేకుండుటచేతను, శకటరేఫ ఘటితశబ్దములు దేశ్యము లని గ్రహించుట కుపయోగించును. తాటాకు మొదల గుచోట్లఁ గ్రొత్తయక్షర మున్న దని యు దాని కొక గుర్తు, ఆవశ్యక మనియు నిర్ధరించు నీకాలమున సంప్రదాయబోధకమును అర్థభేదసూచకమును నగుశకటరేఫము వలదనుట యుచితముగాదు. ఒకపదమునకే యారెండర్థములు చెప్పరాదా యని కొందఱందురు. కాని యాంగ్లాదిభాషలలో నుచ్చారణము సమము గాను న్నను వర్ణక్రమముమాత్రము వేఱుగానే యున్నది. ఇట్లుచేయుఁదలఁచిన ననేకములగు చిక్కులు తటస్థించును. అర్ధానుస్వారము కూడ ననవసర మను వాదమునకుఁ గూడఁ బైనిజెప్పినదియే సమాధాన మగును. దీర్ఘము మీఁది యరసున్నలు ప్రాచీనసంప్రదాయములను, వాని మూలరూపములను దెలిసికొనుటకై మిగుల యుపకారులగును.

కళాద్రుతవిభాగము తెలుఁగుభాషకు మిక్కిలి యావశ్యకమైనది. తెలుఁగుభాషను సామాన్యముగాఁ గళాద్రుతత్వభేదములచేత రెండువిభాగములుగ విభజింపవచ్చును. ఇవి తెలుఁగులో నెక్కువ ప్రాముఖ్యమును గలిగియున్నవి. వీనివలననే సంధ్యాదికార్యములం దనేకము లగు మార్పులు గలుగుచుండును. ఈకళాద్రుతము లర్థజ్ఞానమున కెక్కువ యుపయోగించును. కనుకనే కళాద్రుతములను సరిగాఁ బాటింపని యిప్పటికవులు కొందఱ వ్రాతలను సరిగా నర్థముచేసికొనుట గష్టమగుచున్నది.

ఇట్లు మనతెలుఁగు భాషకుఁ బైవానివల్లను మఱియితరము లగు వానివల్లను బ్రత్యేకత సిద్ధించుచున్నది. ఇది ప్రత్యేకవ్యక్తిత్వముఁబొంది సంస్కృతాదులకంటె విలక్షణమై "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని పేరెన్నిక గాంచినది. ఇట్టితెలుఁగుభాష నాదరించి తదభివృద్ధికై పాటుపడి యాంధ్రులు ధన్యు లగుదురుగాక.

---

# ముద్రితాంధ్రగ్రంథములు.

— విద్వాన్. పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము. —

---

ఆంధ్రగ్రంథములు ముద్రితములు నముద్రితములు గూడ నున్నవి. అందు ముద్రితగ్రంథములు సామాన్యముగాఁ బండితపరిష్కృతములే యైనను బండితపరిష్కృతము లైనవానిలోఁ గూడఁ జాలఁ బ్రమాదములు గన్పట్టుచున్నయవి. మఱియు మిక్కిలి శ్రమపడి వ్యాఖ్యానముచేసిన గ్రంథములలోఁ గూడఁ బ్రమాదము లనక తీరని వ్యాఖ్యాతృగృహీతపాఠములు గాన్పించుచున్నవి. అట్టివానిని బరిష్కర్తలయ్యు వ్యాఖ్యాతల యు ననవధానముననే సంక్రమించినవానినిగా మనము గ్రహించుచున్నారము. వీనిని విద్వాంసులు సావధానముగాఁ బరిశీలించి పత్రికలలోఁ బ్రకటించినఁ బాఠకులకు మిక్కిలి యుపకరించినవారగుదురు. ముద్రాపకులు గ్రంథప్రకటనవిషయమునఁ గూడఁ గేవలము వ్యాపారదృష్టినే పెట్టుటచేత ద్రవ్యవ్యయము చేసి సరియగు విద్వాంసులచే గ్రంథములఁ బరిష్కరింపఁ జేయకుండుటయు, ముద్రాపకులు పరిష్కరింపఁజేయ యత్నించినను బరిష్కర్తలు బహుజ్ఞులు కాకుండుటయుఁ బరిష్కర్తలు బహుజ్ఞులైనను ముద్రాపకులు ద్రవ్యార్జనముందే దృష్టిపెట్టుకొని శ్రమపడ నిచ్చగింపకుండుటయు, మఱికొన్ని కారణములును నిట్టి ప్రమాదములకు మూలములు. ఆంధ్రగ్రంథములు బాగుగా ముద్రించి యాంధ్రభాష కుపకారము చేయువారిలో వావిళ్లవారు ప్రధాను లనుట న్యాయదూరముగాదు. కాని వీరు ప్రకటించిన గ్రంథములలోఁ గూడఁ దప్పు లధికముగానే కాన్పించుచున్నవి. అట్టి వానిలో మచ్చునకుఁ గొన్నిటి నిటఁ జూపెదను.

తే. నాజిమాంధాత యనఁ బొల్చు రసికలోక- నరసభూపాలీయము. ౧. ౪౩.

వావిళ్లవారిమూఁడుముద్రణములలోను నిట్లేయున్నది. ఇట యతిభ్రంశ మేర్పడినది. ఇది కవితప్పు లేక ముద్రణములో నేర్పడినతప్పు యని పరిశీలింప-ఎద్దన పూఁడి సంజీవయ్యగారి ప్రాఁతప్రతిలో "రాజమాంధాత యనఁబొల్చు రసికలోక" అను సాధుపాఠము గాన్పించినది. వావిళ్లవారు గ్రంథములను పునర్ముద్రణము చేయించునప్పుడు పూర్వముద్రణప్రమాదములను బండితులచేఁ బరిశీలింపఁజేయుచున్నట్లు తోఁచదు. నరసభూపాలీయమువంటి లక్షణగ్రంథములవిషయమున నైన నిట్టిజాగరూకత వహింపమి విచారార్హము. మఱికొన్ని—

మ. చెలఁగుం గైశికి కోమలార్థరచనాశ్రీమద్ధతార్థక్రమా
చలితాడంబరమూర్తి యారభటి యీషత్ప్రౌఢసందర్భ ని
శ్చల యాభారతి పొల్చుసాత్వతియు నీషత్కోమలార్థక్రమం
బుల నీవృత్తులకున్ యథోచితరసస్ఫూర్తుల్ నిరూపించెదన్. నరస. ౨. ౭౩.

ఈపద్యమున "శ్రీమద్ధతార్థ" అనుచోట "శ్రీనుద్ధతార్థ" అని యుండవలెను. సాత్వతికి భారతియు, భారతికి సాత్వతియు వ్యత్యస్తములుగా ముద్రింపఁబడి లక్షణమును వ్యత్యస్తమును జేయుచున్నవి. ఈషత్ప్రౌఢసందర్భ సాత్వతి కాని భారతికాదు. ఇట్లే యీషత్కోమల భారతి కాని సాత్వతికాదు. నరసభూపాలీయమునకు మూలమగు ప్రతాపరుద్రీయములో నిట్లున్నది.

శ్లో. ఈషన్మృద్వర్థసందర్భా భారతీ వృత్తి రిష్యతే
ఈషత్ప్రౌఢార్థసందర్భా సాత్వతీ వృత్తిరిష్యతే.

ఇట్టిచోట్లఁ గేవలాంధ్రపండితులు ప్రమాదపడుదురు గదా? తృతీయముద్రణమున నైనను వీరు దీనిని బరిష్కరింపఁజేయలేదు. ఎద్దనపూఁడివారిప్రతిలోఁగూడ నీతప్పిట్లేయున్నది.

ఉ. పాక మదీరితార్థపరిపాక మనందగు నంను గోస్తనీ
పాకము నారికేళఫలపాక మనన్ ద్వివిధంబు గోస్తనీ
పాకము సంవృతార్థపరిపాకనివేద్యము నారికేళపా
కాకలనంబు గూడి నిబిడార్థవిచార్యము వీనిలక్ష్యముల్.

ఈపద్యమున "అంను" అనుదానిని "అద్ది" అని దిద్దవలెను. లేనిచో నన్వయము సరిపడదు. గోస్తనీపాకము అసంవృతార్థపరిపాకనివేద్యము గాని సంవృతార్థపరిపాకనివేద్యము గాదు. "గూడి" అనుచోట "గూఢ" అని యుండవలెను. ఒక్కపద్య మిన్నితప్పులతో నిండియున్నది.

చ. ......యావను, ల్మనమునఁ గ్రొవ్వుమానుఁడనఁ దద్యవనాళిని ద్రుంచు నీతఁ
డన్, ధ్వనియితరార్థసంక్రమితవాచ్యము గాఁగ ద్వితీయ మింపగున్. ౨. ౯౯.

ఈపద్యమున మూఁడవపాదమునందలి యతిభ్రంశము మూఁడవముద్రణమునఁగూడ సరిచేయఁబడలేదు. ఎద్దనపూఁడివారి ప్రాతప్రతిలోఁగూడ నిది యిట్లేయున్నది.

క. కృతి నన్నియు నేకైకో,న్నతసముచితసంఖ్య గైకొనఁగ...... ౨. ౧౧౦.

ఈపాఠమున నీపద్యార్థ మెంతమాత్రము సరిపడనేరదు. ఎద్దనపూఁడివారి

ప్రతిలో "ఏకైకో,నత" అని కలదు. ఈపాఠమున నర్థము సరిపడుచున్నది. వావిళ్ల వారు నకారమునకు ద్విత్వము ఘటించి యర్థసంగతి లేకుండఁ జేసినారు.— మఱియును మూ. ౭వయాశ్వాసమున జాడ్యమను సంచారిభావమున కుదాహరణమే వావిళ్లవారిప్రతులలో లేదు. ఎద్దనపూఁడివారిప్రాఁతప్రతిలోను వేంకటగిరివారు వ్రాయించిన వ్యాఖ్యానపుఁబ్రతిలోను దానికి నుదాహరణ మీక్రిందిపద్యమిా యఁబడినది.

క. అవవ నృపసింహుఁడు వచ్చిన, సుదతి కనుంగొనదు చెలులఁ జూడదు భాషిం
పదు మిగులఁజలింపదు త, ద్వదనామృతపారణావధానయుఁబోలెన్. ౩,౧౧౧.

ఇట్టి ప్రమాదము లీగ్రంథమున నింకను జాలఁగలవు. ఏతాదృశప్రమాద భూయిష్ఠమగుగ్రంథమునే ఆంధ్రమద్రాసువిశ్వవిద్యాలయములవారు "విద్వాన్" మొదలగు పరీక్షలకుఁ బాఠ్యగ్రంథమునుగా నుంచినారు. విద్యార్థులు విద్వాంసులు నీతప్పులు సవరించుకొనలేక మిక్కిలి బాధపడుచున్నారు.—అధునాతనాంధ్రగ్రంథవ్యాఖ్యాతలలో వన్నెక్కెక్కిన వారును గళాప్రపూర్ణ బిరుదాంకితులు నగు బ్ర. శ్రీ. వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ యాముక్తమాల్యదా బృహద్వ్యాఖ్యలో నీక్రిందిపద్య మీవిధముగా నిచ్చిరి-

గీ. వెదమొదవుకూడఁ బోలేనివెచ్చగ్రొవ్వ, కల్పమెడచాఁపవెడలెనోయనగఁనెట్ట
కేలకునుగ్రుంగితెచ్చులంకెలునిగుడఁగ, మందగతిగున్నెవృషభముల్మందపిఱుఁద.

వ్యాఖ్య. వృషభముల్=ఆఁబోతులు, వెదమొదవుకూడన్=ఋతువులోనున్న పాఁడియావుతోఁగూడ, పోలేనివెచ్చ=పోలేసందునఁ గలిగినతాపము, క్రొవ్వ=(మెడవఱకులోపలనున్న)క్రొవ్వును, కల్పన్=కరఁగునట్లు చేసినంతట, మెడచాఁపన్=కంఠమును దీర్ఘీకరించినందున, వెడలెనో=(లంకె) బయటికివచ్చినదో, అనఁగన్=అనునట్లు, ఎట్టకేలకున్=ఎంతయుఁ బ్రయాసపడి, క్రుంగి=క్రిందికితలవంచి, తెచ్చులంకెలు=బయటికిరప్పించుకొనువృషభధ్వనులు, నిగుడఁగన్=వెలువడుచుండఁగా, మందపిఱుఁదన్=పసులగుంపునకువెనుక, మందగతిన్=మెల్లనినడకతో, గున్నెన్=పోయెను. అని యర్థమువ్రాసి దీని కనుగుణముగానే భావము గూడ వ్రాసి—లంకె వచ్చుటకు తాపము క్రొవ్వును గరఁగించుట హేతువు గాదు. దానిని హేతువుగాఁ జెప్పినందున హేతూత్ప్రేక్ష. అని యలంకారమును గూడ వ్రాసినారు. కాని శ్రీశాస్త్రిగా రీపాఠమును స్వయముగాఁ గల్పించిరో లేక యెక్కడ నేని వీరి కిది కన్పించినదో తెలియదు. ఏది యెట్లున్నను, ఈపాఠమున ద్వితీ

యపాదమున యతిభ్రంశ మేర్పడి నట్లు వీరు గుర్తింపకుండుట శోచనీయము. మఱి యు "కలఁగు" ధాతువు నకు "కల్వక" అనురూప మేర్పడుట వ్యాకరణవిరుద్ధ ము. కలఁగుధాతువు- అస్మర్థ్యము కాని యుస్మర్థ్యముగాదు గదా ? ఈవిధము గా రెండుతప్పులతో నీపద్యమునకు వ్యాఖ్యచేయఁబడినది. వ్రాఁతప్రతిలో నీపద్యపాఠ మిట్లు గలదు.

గీ. వెదమొదవుకూడఁబోలేనివెచ్చఁగ్రొవ్వా,కల్పమెడసూపవెడలెనోయనఁగనెట్ట
కేలకునుగ్రుఁగితెచ్చుటం కెలునిగుడఁగ,మందగతిగున్నవృషభముల్ మందపిఱుఁద.

(......క్రొవ్వ=క్రొవ్వు, ఒకల్పము=(ఒక+అల్పము) కొంచెము, ఎడ సూపక=సందువిప్పఁగా......) వావిళ్లవారి ప్రతిలో నిట్లున్నది.

గీ. వెదమొదవుఁగూడఁబోలేమి వెచ్చఁగ్రొవ్వ,
స్వల్పమెడసూప వెడలెనో యనఁగ......॥

వ్రాఁతప్రతిపాఠమునను వావిళ్లవారిపాఠమునను యతిభ్రంశమును, "కల్వక" అనువ్యాకరణానుగుణరూపమును లేవు. ఇట్టివ్యాఖ్యాతృప్రమాదము లు మఱికొన్నిగ్రంథములలోఁ గూడఁగలవు. అప్పుడప్పుడు వానిని, ముద్రణప్రమా దములను గూడ, యథాశక్తిఁ బరిశీలించి ప్రకటింపఁగల నని విన్నవించుచున్నాను.

---

# ప్రాత్యశబ్దవిచారము.

— పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము. —

---

ఒకప్రదేశమున నొకయర్థమున వాడఁబడినశబ్దము మఱియొకప్రదేశమున మఱియొకయర్థమున వాడఁబడుచుండును.

ఉత్తరసర్కారులలో గురువారమును 'లక్ష్మీవార' మందురు. రాయలసీమయం దాలక్ష్మీవారశబ్దము 'భృగు' లేక 'శుక్ర' వారపరముగ వాడఁబడుచున్నది. 'కడప'మండలప్రాంతములో 'ద్రొబ్బు' అనుపదము 'త్రోయు' అనునర్థమున వాడఁబడుచున్నది. పోతనామాత్యుఁ డాయర్థమునందే "ముందటికిద్రొబ్బె తండ్రికి మ్రొక్కు మనియె" నని వ్రాసియున్నాఁడు. కాని యా'ద్రొబ్బు'పదము నేఁటికృష్ణామండలమున బూతుపదమై వాడఁబడుచున్నది. ఆపదమే ప్రాగ్గోదావరీమండలమున 'అపహరించు' అనునర్థమునఁ గూడ వాడఁబడుచున్నది.

గోదావరిప్రాంతమున భక్ష్యపదార్థమున వాడఁబడు 'బూరె' యనుపదము, పెన్న, తుంగభద్రా, నదీప్రాంతములలో 'నసభ్య' పదముగా వాడఁబడును. దేశభేదమునం దొకశబ్దమునకే యర్థభేద ముండినట్లు, కాలభేదమునందును శబ్దముల కర్థభేదములు కల్గుచున్నవి.

'నన్నయ, పెద్దనాది' కవులకాలమున 'కంపు' శబ్దము సువాసన యనునర్థమున వాడఁబడఁగా నేఁ డాశబ్దము 'చెడువాసన' యను నర్థమున వాడఁబడుచున్నది.

తిక్కనసోమయాజి బూరవుముక్క యనునర్థమున 'కొత్తముట్టు' అనుపదమును వాడియున్నాఁడు. దానిని నేఁతగాం డ్రిపుడు, 'కొత్తముట్టి' యని వాడుచుందురు గాని జనసామాన్యము 'నవీనరజస్సు, అనునర్థమున వాడుచుందురు.

ఆంధ్రవాఙ్మయమున దేశకాలభేదములచే శబ్దముల కర్థభేదములు కలుగుచున్నట్లే సంస్కృతవాఙ్మయమునను దేశకాలభేదములచే శబ్దములకు రూపభేదములు నర్థభేదములు కలిగినవి.

ప్రసిద్ధవైయాకరణి యగుపాణిన్యాచార్యులు తనయష్టాధ్యాయియందు 'ప్రాగుదీచ్యాదిదేశములలో శబ్దముల కర్థరూపభేదము లెట్లుకలిగెనో విస్తరించిచెప్పియున్నాఁడు.

అర్థభేదములు నిఘంటువులలో విస్పష్ట మగుచునే యున్నవి.

కొన్నిశబ్దములకుఁ బ్రాచీనకాలమునం గలిగినయర్థములు కాలాంతరమున నశించినట్లు వైదికవాఙ్మయముం బరిశీలించినఁ గాన్పించును.

మంత్రద్రష్ట యేశబ్దము నేయర్థమున వాడియున్నాఁడో భాష్యకర్తల నాఁటికే సందిగ్ధార్థస్థితి కలుగుటచే వారు తబ్బిబ్బులాడి 'యద్వా' (ఆలాగు కాకుండిన) అనుశబ్దమును బ్రయోగించినసంగతి 'సాయణ, భట్టభాస్కర' భాష్యములం జదివినవారికి విశదము కాఁగలదు.

ఋగ్వేదముయొక్క పదియవమండలమున నొక్కెడ[1] దున్నెడిజంతువులలో 'అశ్వ' శబ్దము వాడఁబడఁగా దానికి 'ప్రొఫెసర్ గ్రిఫెత్తుగారు' అశ్వశబ్దమునకు నేఁడు గుఱ్ఱ మని యర్థ ముండుటచే ఋగ్వేదార్యులు గుఱ్ఱములచే భూమిని దున్నుచుండువా రని వ్యాఖ్యానము చేసి యున్నారు. సాయణాచార్యులవారు మాత్రము, అశ్వశబ్దమునకు ఎద్దు- అనియే యర్థము వ్రాయుచు 'అశ్వః వ్యాపనశీలో బలీవర్దః' (చులుకుగా నడచు నెద్దు) అని వ్యుత్పత్తిచే నెద్దను నర్థమును సాధించిరి.

అశ్వశబ్దమున కెట్టివ్యుత్పత్తిని సాయణాచార్యులవారు సాధించినను 'నెద్ద' ను నర్థము పొసఁగునా యనుకొనవలసియుండును గాని కౌటిల్యుఁడు తనయర్థశాస్త్రమునందు వృషభజాతులను నిరూపింపుచు 'అశ్వ'నామక మైనవృషభజాతి యొకటి కల దని దానిరూపాదులను జెప్పుటచే ఋగ్వేదములోఁ బైని పేర్కొనఁబడిన స్థలమునందలి యశ్వశబ్దమునకు 'సాయణుండు' చెప్పిన వ్యుత్పత్తియే యుక్త మని తలంపవలసియున్నది. అట్లే ప్రకృతమునఁ జర్చింపఁబడఁబోవు 'వ్రాత్య'శబ్దమునకును వైదికకాలమునందు వాడుకొనఁబడిన యర్థము కాలాంతరమున మఱియొక నిందార్థముగా వాడుకొనఁబడిన దని నిరూపింపఁబోవుచున్నాను.

## — వ్రాత్యుఁడు —

వ్రాత్యః=ఉపనయనాదిసంస్కారహీనో ద్విజః. అని'శబ్దార్థకల్పతరువు' అను నిఘంటువునం గలదు. అనఁగా ఉపనయనస్నాతకవ్రతాదులు లేని బ్రహ్మక్షత్రియవైశ్యులలో నొకఁడు. అని యర్థము. అమరసింహుఁడు- తన నామలింగానుశాసనమునందు,

శ్లో. ...వ్రాత్య స్సంస్కారహీన స్స్యాత్ ॥ 2-7-53.

1. "ప్రణీతాశ్వాన్ కృణోతన" ఋ. 10-101-7.

(ఉపనయనాదిసంస్కారహీనుఁడు వ్రాత్యుఁడు) అని పైయర్థమునందే చెప్పి యున్నాఁడు. ప్రసిద్ధికెక్కిన నామలింగానుశాసనవ్యాఖ్యాత యగు 'వంగల లింగాభట్టు' తన 'పదవృత్తి' యను టీకయందు, వ్రాత్యశబ్దమున కిట్లు వ్యుత్పత్తిని వ్రాసి యున్నాఁడు.

"వ్రాతం, స్తోమం, అర్హతీతి వ్రాత్యః"

అనఁగాఁ బ్రాయశ్చిత్తము కొఱకు సమూహమునుగూర్ప నర్హమైనవాఁడు. లేక వ్రతం, ప్రాయశ్చిత్తం అర్హతీతి వ్రాత్యః లేక ప్రాయశ్చిత్తమునకుఁ దగినవాఁడు. ఏద్విజాతిజుఁడైనను, స్మృత్యుక్తోపనయనాదులు లేక కాలాతీతమైన పిమ్మటఁ దద్దోషపరిహారమునకై ప్రాయశ్చిత్తముఁ జేయించుకొనువాఁడనియర్థ మఁట.

ఈయంశమును నిఘంటుకర్తలు మనుస్మృతిలోని యీక్రిందిశ్లోకముల ననుసరించి వ్రాత్యుఁ డన నుపనయనాదిసంస్కారహీనుఁ డని చెప్పియున్నారు.

శ్లో. ఆషోడశా ద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే
ఆద్వావింశాత్ క్షత్రబన్ధో రాచతుర్వింశతే ర్విశః
అతః పరం త్రయోప్యేతే యథాకాల మసంస్కృతాః
సావిత్రీపతితా వ్రాత్యా భవం త్యార్యవిగర్హితాః. అధ్యా. 2 శ్లో.38,39.

తా. బ్రాహ్మణునకుఁ బదునాఱేండ్లకుఁ బైఁబడియు, క్షత్రియునకు నిరువదిరెండేండ్లకుఁ బైఁబడియు, వైశ్యునకు నిరువదినాలుగేండ్లకుఁ బైఁబడియు, నుపనయనము చేయరాదు. అట్లు సకాలమున నుపనయనసంస్కారము చేయఁబడనివారు వ్రాత్యు లనఁబడుదురు. వా రార్యులచే నిందింపఁబడినవారు.

ఇంతమాత్రమె కాదు. ఆమనుస్మృతి పదియవయధ్యాయమునందు, సంకీర్ణజాతులంగూర్చి చెప్పుచు వ్రాత్యజాతులను బేర్కొని యున్నాఁడు.

శ్లో. ద్విజాతయ స్సవర్ణాసు జనయం త్యవ్రతాంస్తుయాన్
తాన్ సావిత్రీ పరిభ్రష్టాన్ వ్రాత్యా నితి వినిర్దిశేత్
వ్రాత్యాత్తు జాయతే విప్రా త్పాపాత్మా భూర్జకంటకః
అవంత్యవాటధానౌచ పుష్పధశ్శైఖ ఏవచ
ఝల్లో మల్లశ్చ రాజన్యా ద్వ్రాత్యా న్నిచ్ఛివి రేవ చ
నటశ్చ కరణశ్చైవ ఖసో ద్రవిడ ఏవచ
వైశ్యాత్తు జాయతే వ్రాత్యా త్సుధన్వాచార్య ఏవచ
కారూశశ్చ విజన్మాచ మైత్ర స్సాత్వత ఏవచ.

తా. బ్రహ్మక్షత్రియవైశ్యులు తమతమజాతిస్త్రీలయందు, కనినవారు, ఉపనయనాది ద్విజసంస్కారహీనులైన యెడల వారిని వ్రాత్యు లని నిర్దేశింపవలయును.

అట్టి బ్రాహ్మణవ్రాత్యుని వలన బ్రాహ్మణవ్రాత్యునిపుత్రికయందు జన్మించినవాఁడు, 'భూర్జకంటకుఁడు' అనఁబడును. వాని నామాదేశములందు 'అవంత్యుఁడనియు, వాటధానుఁ డనియు, పుష్పధుఁ డనియు, శైఖుఁ' డనియుఁ, జెప్పుదురు.

క్షత్రియవ్రాత్యునియందు క్షత్రియవ్రాత్యునిపుత్రికయందు జన్మించినవాఁడు 'ఝల్లుఁ' డనఁబడును. వానినామాదేశములయందు, మల్లుఁ డనియు, నిచ్ఛివుఁ డనియు, నటుఁ డనియు, కరణుఁ డనియు, ఖసుఁ డనియు, ద్రవిడుఁ డనియుఁ జెప్పుదురు.

పైరీతినే వైశ్యవ్రాత్యునివలన వైశ్యవ్రాత్యజాత యగుస్త్రీయం దుద్భవించినవాఁడు, సుధన్వుఁ డనఁబడును. వాని నామాదేశములయందు, ఆచార్యుఁ డనియు, కారూశుఁ డనియు, విజన్ముఁ డనియు, మైత్రుఁ డనియు, సాత్వతుఁ డనియుఁ జెప్పుదురు.

పైశ్లోకములలోని వ్రాత్యశబ్దమునకు 'మన్వర్థప్రకాశిక' యనుప్రసిద్ధవ్యాఖ్యానమును వ్రాసిన 'కుల్లూకభట్టు' అనువ్యాఖ్యాత వలె వ్రాత్యశబ్దమునకు వ్యుత్పత్తిని సాధింపక,

"అకృతోపనయనాన్ వ్రాత్యా ఇత్యనయా సంజ్ఞయా వ్యపదిశేత్"

తా. ఉపనయనము చేయఁబడనివారిని (ద్విజులను) వ్రాత్యు లనుసంజ్ఞచే జెప్పవలయును. అని వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

ఆలోచింపఁగా కుల్లూకభట్టునకు ఉపనయనసంస్కారహీనుఁ డనిగాని, ప్రాయశ్చిత్తార్హుఁ డనిగాని వ్రాత్యశబ్దమునందు వ్యుత్పత్త్యర్థము కాన్పింపలేదు, అందువలననే 'వ్రాత్య' అనుసంజ్ఞ కలవాఁడు అని చెప్పియున్నాఁడు.

కొన్నిశబ్దములు సంజ్ఞాపరములే యై యుండును గదా! 'దేవదత్తుఁడు' అనఁగా, దేవతలచే నీయఁబడినవాఁడను వ్యుత్పత్తిచేసాధింపఁదగియుండునా? అది సంజ్ఞామాత్రమే. అట్లే వ్రాత్యపదము నైయున్న దని కుల్లూకభట్టుమతము.

ఈగోదావరీకృష్ణామండలప్రాంతములలో వైదికపండితులు 'అయోగ్యుఁడు' అనునర్థమునందు 'అవాఙ్మ్యుఁడు' అని వాడుచుందురు. ఆయర్థమునందే నలువదియేండ్లకుఁ బూర్వము జరిగినయొక యయుక్తమగు నష్టావధానముఁ గూర్చి యొక్తుల్లోకశాస్త్రజ్ఞుఁడు శ్లోకముం జెప్పియున్నాఁడు,

శ్లో. దంగేరు నామకే గ్రామే సుధీజనసభాముఖే ।
అష్టావధాన మకరో ద్ధవాడ్ఢ్యోఽ కవిబ్రువః॥

తా. అయోగ్యుఁ డగు కవిబ్రువుఁ డొకఁడు 'దంగేరు' అను పేరుగలగ్రామమునందు పండితసభాముఖమునందు, అష్టావధానముం జేసెను.

పైఁజెప్పఁబడిన 'అవాడ్ఢ్య శబ్ద మేనిఘంటువులలోను గాన్పింపదు. అదితైత్తిరీయసంహితలోను, దద్బ్రాహ్మణమునను గల రెండుపదములఁజూడిక.

(1) "అవాడ్ఢవ్యాని సురభీణి కృత్వా" తై॥ సం॥ ౨. ౬.

(2) "అవాడ్ఢవ్యా పితృభ్యఆ" తై॥ బ్రా॥ ౨, 3.

(1) పద॥ అవాట్, హవ్యాని, సురభీణి, కృత్వా॥

(2) అవాట్, హవ్యా, పితృభ్యః, ఆ॥

పైరెండుస్థలములలోను, అవాట్, అనునది 'వహించుచున్నాఁడు' అను నర్థము గల క్రియ. హవ్యాని, హవ్యా అనునది ఆజ్యాది హవిస్సులను అను ద్వితీయావిభక్తి.

అనఁగా హవిస్సులను వహించునట్టి యగ్నిదేవుఁ డని తాత్పర్యము.

అదివైదికపండితు లెట్లో అయోగ్యుఁ డనునర్థమున వాడియున్నారు.

అట్లే మనుస్మృతికారకునికాలమున నాదేశమునందు వ్రాత్యుఁడు, అనఁగా జాతిభ్రష్టుఁ డనునర్థమున నేటివైదికులు, అవాడ్ఢ్యుఁడు అనఁగా నయోగ్యుఁ డని వాడినట్లు వాడియుండుటచేఁ దనస్మృతిలోని కెక్కించియుండును. ఆవ్రాత్యశబ్దము సంజ్ఞావాచకమే యగుటను 'వినిర్దిశేత్' అను క్రియచే స్పష్ట పఱచియున్నాఁడు.

కాని, అవాడ్ఢ్యపదద్వయమునకుఁ బవిత్ర మైనయగ్ని యనునర్థ ముండినట్లు, వ్రాత్యుఁడు అనుపద మొకప్పుడు వేదవ్రతములం జేసినట్టి కాని యజ్ఞముం జేసినట్టి కాని, పవిత్రుఁడైన శ్రోత్రియబ్రాహ్మణునిపరముగా నుండెడిది. అది నాతలంపు కాదు. ఆయంశము 'అథర్వసంహిత' పదునేనవకాండమువలనను, ఆపస్తంబ ధర్మసూత్రము రెండవప్రశ్నమునాదలి, ౫, 3, వలనను స్పష్ట మగుచున్నది.

అథర్వసంహితలోని పదునేనవకాండములోని, ౧౦, ౧౧, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౬, ౧౭, ౧౮, తొమ్మిదిసూక్తములకును వ్రాత్యసూక్తము లని పేరు.

పైసూక్తములలో మొదటిదానియందు (౧౦ సూ)మహారాజు విద్వాంసుఁడైన వ్రాత్యుఁడు తనయింటికి వచ్చినపుడు ప్రభువు చేయుఁదగిన మర్యాద

లంగూర్చియు, నట్లు వ్రాత్యు నర్చించిన రాజున కగుఫలముం గూర్చియు వివరిం పఁబడియున్నది.

రెండవదానియందు (౧౧) గృహస్థునింటికి విద్వద్వ్రాత్యుఁడు వచ్చినపు డాగృహస్థుఁడు చేయఁదగిన మర్యాదలును, దానివలన నాగృహస్థునకుఁ గలు గఁబోవు ఫలమును జెప్పఁబడియున్నవి.

మూఁడవసూక్తమునందు (౧౨) వ్రాత్యుఁడే తెంచినపుడు గృహస్థుఁ డగ్ని హోత్రి గాన నంతకుఁ బూర్వము నిత్యహోమముఁ జేయకుండిన వ్రాత్యు ననుజ్ఞ నొంది హోమము నొనర్పవలయు ననియు, నాతని యనుజ్ఞనొందకుండఁగ హో మము నొనర్పరా దనియు, నట్లనుజ్ఞనొంది హోమ మొనర్చినఁ గల్గుఫలము, అనుజ్ఞనొందక హోమమునొనర్చిన మొసలఁ గల్గు నష్టము వివరింపఁబడియున్నది.

నాలవసూక్తమునందు (౧౩) గృహస్థునింట వ్రాత్యుఁడెన్నిదినము లతిథి గానుండిన గృహస్థుఁ డెట్టిఫలము నొందునో దానిఁగూర్చి వివరింపఁబడియున్నది.

ఆసూక్తమునందే వ్రాత్యబ్రువుఁ డతిథిగా వచ్చినఁ గల్గుఫలముగూడ వివ రింపఁబడియున్నది. (ఇట వ్రాత్యబ్రువుఁ డనఁగా వ్రాత్యున కుండఁదగిన లక్షణ ములు లేనివాఁ డని యర్థము.)

అయిదవసూక్తమునందు (౧౪) గృహస్థునింట వ్రాత్యుఁ డుండినకాలము నం దాయింట నేప్రదేశమునకు నడచిన నెట్టిఫలము నాగృహస్థుఁ డొందునోయా యంశములం గూర్చి కలదు.

ఆఱవసూక్తమునందు (౧౫) వ్రాత్యునికి సామాన్యన కుండినట్లు గాక, ప్రాణము, అపానము, వ్యానము, ననునవి యేడేసి యని చెప్పి, అందు సప్తప్రా ణము లెట్టివో నిరూపింపఁబడియున్నవి.

ఏడవసూక్తమునందు (౧౬) వ్రాత్యునికిఁ గలసప్తాపానము లెట్టివో వివరిం పఁబడి యుండెను.

ఎనిమిదవసూక్తమునందు (౧౭) వ్రాత్యుని సప్తవ్యానముల స్వరూపము వివరింపఁబడియున్నవి.

తొమ్మిదవసూక్తమునందు (౧౮) వ్రాత్యుని స్వరూపము దేవతాస్వరూప ముగా వర్ణింపఁబడి యట్టి వ్రాత్యునకు సదానమస్కార మని చెప్పఁబడియున్నది.

పైవ్రాత్యసూక్తములం జూచి అథర్వసంహితను విద్యారణ్యభాష్యముతో ముద్రింపించిన శంకరపాండురంగపండితుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

ఈపదునైదవకాండమున వ్రాత్యమహిమము విస్తరింపఁబడుచున్నది. వ్రాత్యుఁ డన నుపనయనాదిసంస్కారహీనుఁ డగుపురుషుఁడు. అనఁగా నట్టివాఁడు వేదవిహితము లగుయజ్ఞాదిక్రియలం జేయునర్హత లేనివాఁడు. అతఁడు వ్యవహార యోగ్యుఁడు కాఁడు; అను జనసామాన్యాభిప్రాయమును మనస్సునం దుంచు కొని, వ్రాత్యుఁ డధికారియే, ఆతఁడు దేవప్రియుఁడే, ఆతఁడు మహానుభావుఁడే, అనేకవిధములచే వ్రాత్యుఁడు దేవాధిదేవుఁడే యని ప్రతిపాదింపఁబడుచున్నది. ఎక్కడికి వ్రాత్యుఁడు పోయిన నచ్చటికి సమస్తజగత్తులును, సమస్తదేవతలును బోదురు. ఆతఁ డెక్కడ నిలిచిన నచట నవియునిలుచును. ఆతఁడు కదలినఁ గదలు ను, మొదలగునంశములతోఁగలదు. పైయంశములు సర్వవ్రాత్యులఁగూర్చి కాదు. విద్వాంసుఁ డై పుణ్యశీలుఁడై మహాధికారియై, సర్వసామాన్యుఁడై యుండియు, కర్మపరులైన బ్రాహ్మణులచే ద్వేషింపఁబడిన వ్రాత్యుని గూర్చియే యని తలంప వలయును.

పైని చెప్పఁబడిన శంకరపాండురంగపండితుని వాక్యములఁ జూచియే ప్రఖ్యాతచారిత్రకు లగు కే. వి. లక్ష్మణరావుగారు తమయాంధ్రవిజ్ఞానసర్వస్వము నందు 'అథర్వవేదముఁ' గూర్చి వ్రాయునపుడును, ఒకప్పుడు చిలుకూరి వీరభద్ర రావుగారు భారతిపత్రికలోను, ఇటీవల బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశా స్త్రీగారు తమసంస్కృతవాఙ్మయచరిత్రము మొదటిసంపుటమునను, వ్రాత్యుఁడనఁ గా నుపనయనాది సంస్కారహీనుఁ డగుద్విజుఁడే యని యర్థము చేసియున్నారు.

అందు కే. వి. లక్ష్మణరావుగారు, 'తాండ్యబ్రాహ్మణము' నందు బ్రహ్మచ ర్యముఁ జేయనట్టియు, కృషిని గాని వాణిజ్యముం గాని చేయనట్టియు వ్రాత్యు లను నొకతెగవా రుండి రని యొక యపూర్వకల్పనముఁ జేసియున్నారు.

ఇంతకును పైయథర్వవేదము పదునేనవకాండమునకు సాయణభాష్యము లభింపకపోవుటచేతనే యిట్టి యభిప్రాయ భేదమునకుఁ గారణమై యున్నది.

అథర్వవేదము పూర్తిగా సాయణాచార్యునకు లభింపలే దనియు నందువల ననే భాష్యముచేసి యుండలే దనియుఁ దలంపవలసియున్నది. దీనికి నిదర్శనముగా నథర్వవేదము, ఇరువదవ కాండములోని 'కుంతాపసూక్తము' నకును ౨౦-౧౨౭ భాష్యము లేదు. అందువలననే 'ఐతరేయబ్రాహ్మణములోని కుంతాపసూక్త విని యోగసందర్భమున 'ఇది ఖిలసంహితలోనిదై యుండును' అని సాయణాచార్యుల వారు వ్రాసియున్నారు. ఐతరేయబ్రాహ్మణములోని కుంతాపసూక్తాంశములుక-౬.

అథర్వసంహితలోని కుంతాపసూక్తములోనివియే. అథర్వవేదము పూర్తిగ సాయణాచార్యులవారికి లభింపకపోవుటచేతనే యట్లు వ్రాసియున్నారని తలంపవలసియున్నది. దాని నటుండనిచ్చి వైదికవాఙ్మయమున కత్యద్భుతము నమూల్యము నగు నిఘంటువును వ్రాసిన 'విల్లియమ్సు' పండితుఁడు వ్రాత్యశబ్దమునకుఁ గలభిన్నార్థములం జెప్పుచు 'అథర్వసంహిత' పదునేనవకాండములోఁ గల 'వ్రాత్య' శబ్దము 'అతిథి'పరముగా నున్న దని చెప్పియున్నాఁడు.

— కేశవనిఘంటువు —

వ్రాత్యః=అనుపనీతా స్సన్తః యే బ్రాహ్మణాదయో వివాహం కుర్వంతి తే వ్రాత్యా ఇతి కేచిత్, అన్యేతు సంస్కారహీనమాత్రే వదంతి, విశేషేణతు వ్రతే సాధు ర్యః తస్మిన్, ప్రతిలోమపురుషేభ్యః ప్రతిలోమస్త్రీషు యో జాతః తస్మి న్నపి.

విశేష మేమన 'స్నాతకాది'వ్రతములచే యోగ్యుఁడైనవాఁడే వ్రాత్యుఁడు (ఉత్తమశ్రోత్రియుఁడు) మఱియుఁ బ్రతిలోమజాతిపురుషులవలనఁ బ్రతిలోమజాతిస్త్రీలకుఁ బుట్టిన వారును వ్రాత్యు లనఁబడుదురు—

కేశవుఁడు 'వ్రాత్య' శబ్దమునకు వ్రతమునందు సాధువైనవాఁ డని చెప్పుట విశేషము. అట్టివాఁడే- అథర్వవేదమ్మునఁ జెప్పఁబడియుండును.

"ఆపస్తంబసూత్రములలో రాజునుగూర్చి యతిథి యేతెంచినపు డారాజు తనకు శ్రేయస్సు కలుగు ననియే యాయతిథికిఁ బురోహితులచేఁ బూజను జేయింపవలయును.

ఆహితాగ్నియింటి కట్టియతిథి (వ్రాత్యుఁడు) వచ్చినయెడల నాయాహితాగ్ని వాని కెదురేఁగి వ్రాత్యుఁడా గతరాత్రియం దెచ్చట నివసించితివి: వ్రాత్యుఁడా యిదిగో నీరు; వ్రాత్యుఁడా తృప్తి నొందుము; యజమానుఁ డగ్నిని వేల్చుకముం దతిథియై వ్రాత్యుఁ డింటికి వచ్చినయెడల యజమానుఁడు గాని, అధ్వర్యుఁడు గాని వ్రాత్యునితో నెమ్మదిగా, వ్రాత్యుఁడా నీమనస్సునకిష్టమగు నట్లగుఁగాక; వ్రాత్యుఁడా, నీకెట్లు స్వాధీనము కావలెనో యట్లగుఁగాక! వ్రాత్యుఁడా, నీకెట్లు ప్రీతియో యట్లగుఁగాక; వ్రాత్యుఁడా, నీకోరిక యెట్లో యట్లు చెల్లుఁగాక యని చెప్పవలయును.

వ్రాత్యుఁ డింటికి రాకపూర్వమె యగ్నులు వేల్వఁబడినయెడల, లేక, యెత్తివేయఁబడినయెడల, యజమానుఁ డీవ్రాత్యునికడ కేతెంచి వ్రాత్యుఁడా!

తేమ రాజ్ఞాపించినయెడల హోమముం జేయుదు నని వ్రాత్యుఁ డాజ్ఞాపించినయెడల హోమము నొనర్పవలెను. వ్రాత్యుఁడంగీకరింపనిచో హోమము నొనర్చిన దోషము కల్గు నని బ్రాహ్మణము చెప్పుచున్నది.[1]

ఒక్క రాత్రి మాత్రమే వ్రాత్యాతిథి యెవనియింట నుండునో వాఁడు పృథివీసంబంధము లగులోకముల నన్నిటిని జయించును; రెండురాత్రు లెవనియింట నుండునో యాగృహస్థుఁ డంతరిక్షలోకముల నన్నింటిని జయించును.

మూఁడురాత్రు లెవనియింట వ్రాత్యుఁ డుండునో యాయజమానుఁడు సుఖము పరమావధిగల లోకములను జయించును. అపరిమితము లగుదినము లెవ్వనియింట వ్రాత్యుఁ డుండునో యాయజమానుఁ డపరిమితలోకముల నొందు నని (బ్రాహ్మణమువలన) తెలియఁబడుచున్నది.

విద్యాదులు లేని:యతిథి[2] యింటికే తెంచి తానతిథి నైతి నని చెప్పినయెడల యజమానుఁడు శ్రోత్రియునకు (వ్రాత్యునకు) దాన మిచ్చినట్లే తలంపుచు నన్నాదికము నిచ్చిన యెడల సఫలమైనదే యగును.

అథర్వసంహితలోని వ్రాత్యసూక్తములకు సాయణభాష్యము దొరకలేనందున 'వ్రాత్య' శబ్దమున కట్టియర్థమును సాయణాచార్యులు చేసి యున్నాఁడో యని 'శంకరపాండురంగ' పండితాదులు సందేహించి పెదదారిని బడుటకుఁ గారణ మైనది. కానియాపస్తంబధర్మసూత్రములలో నాయథర్వసూక్తాంశములు సూత్రీకరింపఁబడి యుండుటచే నిటఁ గూడ వ్రాత్యుఁ డన జాతిభ్రష్టుఁడే యని తలంపవలయునా? శ్రోత్రియపరముగా వ్రాత్యశబ్దము నాపస్తంబుఁడు వాడియున్నాఁడు.

ఇంతమాత్రమె కాదు సాయణాచార్యులకుఁ బూర్వికుఁడును బెక్కుగ్రంథములను రచించిన మహాపండితుఁడగు 'హరదత్తుఁడు' 'ఉజ్జ్వలాభాష్యము' నాపస్తంబధర్మసూత్రములకు వ్రాసియున్నాఁడు. అందు 'వ్రాత్య' శబ్దమునకు "వ్రతే

1. ఆపస్తంబధర్మసూత్రములలోఁ బెక్కుస్థలములయందు 'ఇతిబ్రాహ్మణం' అని కలదు. ఆపస్తంబుఁ డుదాహరించిన యాబ్రాహ్మణ మేదియో తెలియరా దని, ఆపస్తంబధర్మసూత్రముల నాంగ్లీకరించిన, డాక్టర్ బూలరుగారు తమ యాంగ్లీకృతధర్మసూత్రపీఠికలో వ్రాసియున్నారు. ఆతఁ డుదాహరించిన బ్రాహ్మణవాక్యములు శతపథ వాజసనేయబ్రాహ్మణములోని వని యీవ్యాసకర్త యభిప్రాయము.

2. ఇదివఱకువ్రాయఁబడిన అథర్వవాక్యమున 'వ్రాత్యబ్రువాణ' అనుదాని కాపస్తంబుఁడు 'అసముదేతుఁడు' అనఁగా విద్యాస్నాతకాదులు లేనివాఁ డని చెప్పుటయు, అశ్రోత్రియుఁ డనుట యు విచారింపఁదగిన యంశములు.

 

సాధు ర్వ్రాత్య స్స ఏవ వ్రాత్యః" అని రూపనిష్పత్తిం జేసియున్నాఁడు.

'వ్రతమునందు యోగ్యుఁ డైన వాఁడు వ్రత్యుఁడు; వ్రత్యుఁడే వ్రాత్యుఁడు' అని యర్థము.

సూ. తత్రసాధుః (పా. 4-4-98) అను సూత్రముచే 'వ్రత్యః' అనురూప మేర్పడి, స్వార్థమునం దణ్ణు వచ్చుటచే 'వ్రాత్యః' అనురూపము సిద్ధించిన దని హరదత్తుని యభిప్రాయము.

ఇట వ్రత మనఁగా వేదవ్రతము లని కాని, స్నాతకవ్రత మని కాని చెప్ప వచ్చును. వ్రతి యన యజ్ఞాదులఁ జేసినవాఁ డని కూడఁ గలదు. కాన వ్రాత్య శబ్దము సర్వవిధముల జాతిభ్రష్టుని పరముగా 'అథర్వవేదమునం జెప్పఁబడలే దనియు వ్రాత్యుఁ డన సచ్ఛ్రోత్రియుని పరముగానె ప్రాచీనఋషులు తలంచి రనియు, మనుస్మృతికర్త నాఁటికాలమున వాడుకలో నయుక్తుఁ డనియు జాతిభ్రష్టుఁ డనియుఁ జెప్పఁబడువారిని గూర్చి సంజ్ఞాపితవాక్యము లుండుటచేతనే యట్లు మనువు వ్రాయ నిఘంటువుల కాయర్థమునందే వ్రాత్యపదము వాడఁబడె ననియుఁ దలంపవలసి యున్నది.

శంకరపాండురంగపండితాదు లాపస్తంబధర్మసూత్రములలోని వ్రాత్యపదము గుర్తించి యుండనందున నట్లు వ్రాత్యసూక్తములను గూర్చి యపార్థములను జేసి యున్నారు.

# రామగిర్యాశ్రమేషు.

— సాగి వేంకటనరసింహముగారు, ఎం. ఏ. రాజమహేంద్రవరము. —

---

మహాకవి కాళిదాసునామము జగద్విదిత మైనది. అతని మేఘసందేశకావ్య మాంధ్రుల కెల్లరకును బరిచితమే. సంస్కృతము రానియాంధ్రు లీమేఘదూతకావ్యామృతమును వసురాయాదికవుల యాంధ్రీకరణముల మూలమునఁ దనివితీరఁ గ్రోలియున్నారు. అందలి ప్రథమశ్లోకాంతిమచరణమునందలి "రామగిర్యాశ్రమేషు" అను పదమున కర్థనిర్ణయమును జేయుటను గూర్చి యీవ్యాసమున నేను జర్చింపఁ దలఁచుచున్నాను.

"కశ్చి త్కాంతావిరహగురుణా స్వాధికారా త్ప్రమత్తః
శాపే నాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః
యక్ష శ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు"

కాంతావిరహతప్తుఁడైనయక్షుఁడొకఁడు, సీతాదేవి స్నానముచేయుటచేఁ బవిత్రములైన యుదకములు గల రామగిర్యాశ్రమములయందు నివసించె నని యీశ్లోకమునకు ఫలితార్థము.

రామాయణమునందలి హనుమత్సందేశమును మనస్సునం దుంచుకొని యీకవి మేఘసందేశమును వ్రాసినాఁడని గొప్ప ప్రతీతి కలదు. ఆప్రతీతికి "రామగిర్యాశ్రమేషు" మొదలగు రామాయణకథాసూచకపదములు తార్కాణము లగుచున్నవి.

అది యటుంచి రామగిరి యనఁగా నేదియో మనము విచారింపవలసి యున్నది. రామునియొక్క గిరి రామగిరి. శ్రీరామచంద్రుఁ డనేకము లైనపర్వతములం దధివసించి తనప్రవాసమును గడపియుండెను. అందే పర్వతమును రామగిరి యన వలయునో యిచ్చటఁ దేల్పవలసియున్నది. ఈమేఘసందేశమునకు మనయాంధ్రుఁడైనమహామహోపాధ్యాయ మల్లినాథసూరి సంజీవిని యనుపేరుతో నొక వ్యాఖ్యానమును వ్రాసి యున్నాఁడు. ఆవ్యాఖ్యాన ముత్తమ మైన దగుటచేఁ దత్పూర్వవ్యాఖ్యానముల నన్నిటిని నిరాకరించి భారతదేశము సంజీవినీవ్యాఖ్యను శిరసా వహించినది. ఆసంజీవినియందు 'రామగిరిని'గూర్చి యిట్లు గలదు. "రామగిరే శ్చి

త్రకూటస్య ఆశ్రమేషు" అనఁగా రామగిరి యనుటవలనఁ జిత్రకూట మిటఁ జే ర్కొనఁబడిన దని మల్లినాథసూరియభిప్రాయము.

చిత్రకూట మనఁగా నేది? "శ్రీరామచంద్రుఁడు వనవాసము చేసినప్పుడు చిత్రకూటపర్వతముపైఁ గొన్నాళ్లుండుటఁబట్టి యది రామగిరి యని ప్రసిద్ధిచెం దినది. ఇది యయోధ్యకు సుమారు 3 రోజుల ప్రయాణములో నుండును. దీనివ ర్ణనము శ్రీమద్వాల్మీకిరామాయణము, అయోధ్యాకాండ ౯౨ సర్గ, ౧౦-౧౧ లోఁ గలదు. ఈరామగిరి నిప్పటికి "బుండల్‌ఖండ్ ఏజెన్సీ"లో పంచక్రోశతీర్థసేవన మొనర్చిన ప్రయాణికు లీరీతిగవివరింతురు. జి. ఐ. పి. రైల్వేలో, చిత్రకూట మను స్టేషన్ గలదు. ఇది గ్వాలియరు సంస్థానములోని'జాన్సీ'నుండి 157 మైళ్లు, చిత్ర కూటముస్టేషనునుండి పర్వతము 3½ మైళ్లు. ఇచ్చట ననేకతీర్థములు దేవాలయ ములు గలవు. 'చరణపదక' అనుదేవాలయములో శ్రీరామలక్ష్మణసీతాదేవుల పా దములు గలవు. అని పండిత హెచ్. సుబ్బరాయశాస్త్రిగారు, ఆయుర్వేదమార్తాం డేత్యాదిబిరుదాంకితులు- "కాళిదాసుని నదీనగములు" అనువ్యాసములో వ్రాసి యున్నారు. శ్రీశాస్త్రిగారును మల్లినాథునితోపాటు రామగిరిని చిత్రకూట మను కొని నట్లావ్యాసములోనే కలదు.

మేఘునిమార్గమును జక్కఁగాఁ బరికించిన యెడల రామగిరి చిత్రకూటము కా దనుట స్పష్టము కాఁ గలదు. ఈమూలసూత్రములోనే తప్పున్న యెడల వర్ణన మంతయు విరుద్ధముగ నుండును. మేఘుఁడు కైలాసపర్వతముకడ నున్న యలకా పట్టణమునకుఁ బోవలసియున్నది.

ఉత్తరహిందూస్థానమునం దున్నచిత్రకూటమునుండి మార్గము సరాసరి హిమాలయములమీఁదుగ, కైలాసమునకుఁ బోవును. అట్టిసందర్భమున మేఘ సందేశములోఁ జెప్పఁబడిన మేఘునిమార్గములోని వింధ్యపర్వతములు, మాలా క్షేత్రము, ఆమ్రకూటము, నర్మదానది, ఉజ్జయిని మొదలగునవి యెంతమాత్రము తగుల వని యెల్లరకును స్పష్టము కాఁగలదు. "అసా వాదిత్యోబ్రహ్మ" యని చిత్రకూటమునుండి దక్షిణప్రదేశము లన్నియుఁ దిరిగి మరల నుత్తరహిందూస్థా నము చేరి కైలాసమున కేఁగుట యనుచితము కాదా?

విలాసార్థము- చిత్రకూటమునుండి వింధ్య, నర్మద, ఉజ్జయి న్యాదులను జూచె నందుమా ? అటు విరహవేదనచే యక్షునిభార్య చావ సిద్ధముగ నున్న ది. అలస్యము చేయవల దని యక్షుఁడు మఱిమఱి ప్రార్థించుచున్నాఁడు,

"మేఘునిమార్గమును జక్కఁగాఁ బరికించిన యెడల రామగిరి చిత్రకూటము కా దనుట స్పష్టము కాఁగలదు."




చూ. రామగిర్యాశ్రమేషు పు. ౧౪౮.

"మందాయంతే నఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః" ఇది యక్షుని వాక్యము- మిత్రుల కార్యముల నెఱవేర్పఁ దలఁచినవా రాలస్యము చేయరు. అని దీని తాత్పర్యము. ఉజ్జయిన్యాది పట్టణములను, ఆమ్రకూటాది పర్వతముల ను జూడు మని చెప్పుట కేవలము విశ్రాంతికొఱకును మార్గమునం దుత్సాహ మున్నచోఁ ద్వరగ వెళ్లవచ్చు ననుభావముచేతనే గాని, ఆలస్యము చేయవచ్చు నని కాదు. దీనిని బరిగణించియే, "సారోద్ధారిణీ" యను వ్యాఖ్యలో నిట్లు వ్రాయఁ బడియున్నది. "రామగిరి ర్దండకారణ్యే ప్రసిద్ధః" అనఁగా, రామగిరి దండకారణ్య మునందుఁ బ్రసిద్ధమైనది యని యర్థము.

కొంద ఱాధునికపరిశోధకు లీరామగిరి నాగపురప్రాంతములం దున్న దని చెప్పెదరు. నాగపూరువద్ద "రామటేక" అనునది యొక కొండపై నున్నది. ఇప్పు డు దానిపేరు "రామటేకడీ" యని యందురు. "రామటేకడీ" యను మహా రాష్ట్రపదమునకు "రామగిరి" యని యర్థమఁట. ఇది గూడఁ దీర్థస్థానమే. ఇది కొంతవఱకును జిత్రకూట మనుటవలన వచ్చు దోషములను వారింపఁగలుగు చు న్నది. ఏలన, ఇది దండకారణ్యమం దున్నది. దీనితరువాతఁ గూడ వింధ్యపర్వ తము లున్నవి. సర్వదా, ఉజ్జయిని మొదలగునవి దీనికి నుత్తరముగ నేయున్నవి.

కాని రామగిరి యను సుప్రసిద్ధనామము నాకొండ ధరించుటలేదు. ఇట్టి సుప్రసిద్ధనామమును దాల్చినది మఱియొక కొండ యున్నచో నది సందర్భము నకుఁ గుదిరినచో దాని సూచనను శిరసావహింపవలసి యుండును గదా. అట్టి దాంధ్రదేశమున గోదావరీతీరమునం దొకరామగిరి కలదు. ఇది భద్రాచలము నకును బంచవటికిని సమీపమున నున్న ప్రసిద్ధతీర్థము. అచ్చట సీతారాములు విహరించిన ట్లనాదిగాథలు గలవు. ఇది వింధ్యపర్వతములకు దక్షిణమున నున్నది. ఇటనుండి మేఘునిమార్గము చక్కఁగ సరిపోవును. ఇంక నేమి కావలయును ?

దండకారణ్యమునం దని చెప్పఁబడిన పంచవటి మున్నగునవి మహారా ష్ట్రమునందలి నాసికాక్షేత్ర ప్రాంతములందలివే యని భండార్కరు మొదలగు మహారాష్ట్రచరిత్రకారులు వ్రాసిరి. అట్టియూహలను బటాపంచలుచేసి భద్రాద్రి ప్రాంతములే రామాయణనిర్ణీతస్థలములు లని న్యాయముగ వాదించి నిర్వహింప శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావు వంటి చరిత్రకారులు కావలసియున్నారు. వెద కినచో నిందులకుం బ్రబలకారణములు లేకపోలేదు. అవి యీసందర్భమునఁ దెచ్చి వ్రాయుటకష్టము, అవకాశమును లేదు. ఒక్కయంశము మాత్రము చెప్ప

దును. రామాయణవర్ణనలును, ఉత్తరరామచరిత్ర నాటకమునందలి వర్ణనలును సీతారాముల విహారస్థానమైన గోదావరీతీరములను బేర్కొనుచు నచ్చట గోదావరి గంభీర మైన దనియు, భయంకర మైన మహాప్రవాహ మనియు విశదము చేయుచున్నవి. నాసిక గోదావరికిఁ బుట్టినచోటు. అక్కడ నానది కేవలము పిల్ల కాలువ వంటిది. కాఁబట్టి యీవర్ణనల కాగోదావరి తగి యుండదు. మఱియు శ్రీరాముని మార్గము నాసికద్వారా నుంచినచో మిక్కిలి వక్రమై రామాయణ వర్ణనలకు విరుద్ధ మగును.

అక్కడనున్న యాపేరులు రామాయణమునందలి గౌరవముచే వచ్చినవే. ప్రజలభక్తిచే నిర్మితము లైనవి. అట్టిపేరులు బలిద్వీపములోను, యీజిప్టులోను గలవు. అందువలనఁ గేవలము పేరు లుంచినంతమాత్రమున నవియే రామాయణ స్థలము లనుట యసమంజసము.

భద్రాచలప్రాంతమం దున్న "రామగిరి" యన్నివిధముల యక్షుని వర్ణనము నకుఁదగియున్నది. "పుణ్యోదకేషు" అనుమాటలో నుదక సమృద్ధియును సూచిత మైనది. చిత్రకూట రామటేంకడేలయం దిట్టిజలసమృద్ధి లేదు. ఈ రామగిరిని, అనాదినుండియు రామగిరి యనియే పిలుచుచున్నారు. కాఁబట్టి మేఘసందేశ కావ్యములోని రామగిరి మల్లినాథుఁడు చెప్పిన చిత్రకూట మెంతమాత్రముఁ గా దనియు, రామటేంకడే కూడఁ గా దనియు మనభద్రాచలప్రాంతరామగిరియే యని యు సహృదయులు గ్రహించినచో నాయీవ్యాసము సార్థకమగును.

రామగిరినిగూర్చి మఱికొన్ని విషయములు-ఇది భద్రాచలమునుండి 40 మైళ్లలోను రాజమహేంద్ర వరమునుండి 60 మైళ్లలోను నున్నది. పర్ణశాలనుండి 65 మైళ్లు. అక్కడ వాలిసుగ్రీవుల కొండ లను పేరున రెండుకొండలు గలవు. ఇం దున్న రాముని యోగరాముఁ డందురు. భద్రాద్రిరాముఁడు భోగరాముఁడు. పర్ణశాలరాముఁడు శోకరాముఁడు. ఈ మూఁడు తీర్థములు నైజామువారి పాలనలో నున్నవి. యాత్రికు లీమూఁడిటిని దర్శింతురు. సీతారామవిహారమును గూర్చిపెక్కుచిహ్నము లిందుఁగలవు.

ఈవ్యాసము శ్రీమత్ప్రజ్ఞానానంద స్వామివారి సహాయముచే రచియింపఁబడినది. ఈరామగిరిని గూర్చినభావము వారిదే.

# తంజాపురాంధ్రవాఙ్మయము.

## ఆంధ్రనాయకరాజపరిపాలనము: (1535-1673)

— నిడుదవోలు వేంకటరావుగారు బి. ఏ., కాకినాడ. —

---

తంజాపురాంధ్రవాఙ్మయ మనఁగనే తెలుఁగువారికి విజయవిలాసకృతి, కృతికర్త చేమకూర వేంకటకవి, కృతిభర్త రఘునాథనాయకుఁడుఁ దలఁపునకు వత్తురు. మేలిమి తెలుఁగుపలుకుబడిని చన్నెమీఱు విజయవిలాసమువంటి రసవత్ప్రబంధములే గాక, యాంధ్రవాఙ్మయమునకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము నొడఁగూర్చిన ద్విపదలు- యక్షగాననాటకములు- గేయరచనములు- పదకవితలు- మున్నగు జాతీయవాఙ్మయశాఖ లపారముగ విలసిల్లిన తంజాపురాంధ్రవాఙ్మయ ముపలబ్ధమగునంతదనుక నాంధ్రు లెఱింగినచోఁ బ్రమోదాశ్చర్యమనస్కులు గాకమానరు. సాహితీవిషయముననే గాక చారిత్రకముగ, తంజపురాంధ్రవాఙ్మయ మధునాతనాంధ్రవాఙ్మయమున ముఖ్యఘట్టము- దక్షిణాంధ్రసారస్వతచరిత్రమునఁ దొలియధ్యాయము.

పదునాఱవశతాబ్దమధ్యమున విజయనగరసామ్రాజ్య విచ్ఛిన్నానంతరమునఁ జిరకాలమునుండి దాక్షిణాత్యరాజ్యము లని పేరెన్నికఁ గన్న పాండ్యచోళరాజ్యము లాంధ్రవాఙ్మయమునకుఁ బట్టుఁగొమ్మ లయినవి. ఆంధ్రసాహిత్యాభివృద్ధికనుకూలము లగుపరిస్థితు లేర్పడినకతన-తంజాపూరు- మధుర-పుదుక్కోట, సేలము-కార్వేటినగరము- మైసూరు మున్నగురాజాస్థానము లాంధ్రవాఙ్మయరంగములైనవి. అందుఁ దొలిరంగ మగుతంజాపూరున క్రీ. శ. 1535 మొదలు క్రీ. శ. 1673 వఱకుఁ బరిపాలించిన నాయకరాజులకాలమున నాంధ్రవాఙ్మయచరిత్రము నీవ్యాసమునఁ దెలిపెదను.

తంజాపూరును నాయకరాజ్యసంస్థాపకుఁడగు చినచెవ్వప్పనాయఁకుఁడును, ఆవెనుక నాతని కొమరుఁడు, అచ్యుతప్ప నాయకుఁడును క్రీ. శ. 1614 వఱకుఁ బరిపాలించిరి. అచ్యుతప్పనాయఁకునివెనుక రాజ్యమునకు వచ్చినవాఁడు తంజాపురాంధ్రనాయకరాజశిరోమణి రఘునాథుఁడు.

### రఘునాథనాయఁకుఁడు (1614-1633)

దక్షిణహిందూదేశసారస్వతచరిత్రమున కృష్ణదేవరాయలవెనుక రఘునా

ఘుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. కృష్ణదేవరాయలవలెఁ బరాక్రమశాలియై, సంగీతసాహిత్యవిద్యావిశారదుఁడై కవిపండితపోషకుఁడై, కృతికర్తయై, కృతిభర్తయై యాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడైన నాయకరాజు- రాయలకు నల్లసాని పెద్దన మనుచరిత్రము-రఘునాథనాయకునికి వేంకటకవి విజయవిలాసము[1]-రాయలకు భువనవిజయసభారంగము- రఘునాథనాయకునికి విజయభవనసభారంగము- రాయలకు తిమ్మరసుమంత్రి, రఘునాథనాయకునికి గోవిందదీక్షితుఁడు. ఇరువురు వైష్ణవమతప్రవిష్టులు- ఇరువురు సంస్కృతాంధ్రకవితారచనావిశారదులు-ఇరువురు నశ్వకళారేవంతులు-ఇరువురు సంగీతవిద్యారసికులు[2]. చూపినకొలఁది నిట్లెన్నియేని పోలికలు గలవు- ఒక్కొక్కపుడు కృష్ణదేవరాయలే రఘునాథనాయకుఁడై జన్మించెనా యనుసందియము పొడముచుండును. విజయనగరమున కృష్ణరాయలనాఁటి వైభవము తంజాపురమున రఘునాథనాయకుని కాలమునఁ గొంత పునరుద్ధరణముఁ జెందినది.

కృష్ణదేవరాయలకాలముకన్న రఘునాథనాయకుని కాలమునఁ గవయిత్రులు పేరుఁజెందుట విశేషము- తంజాపురాంధ్రవాఙ్మయచరిత్రమునఁ గవయిత్రులకు నున్నతస్థానము గలదు. రఘునాథరాయనికాలమున రామభద్రాంబయు, మధురవాణియు నను నిరువురు కవయిత్రులే గాక సాహిత్యవిద్యావిశారదలు పెక్కు రాస్థానమున నున్నట్లు తెలియుచున్నది. రఘునాథనాయకుఁడు సంస్కృతమునఁ గేవలకవియే గాక శాస్త్రజ్ఞుఁ డగుపండితుఁడు. రామభద్రాంబ సంస్కృతమున రఘునాథాభ్యుదయమను పంద్రెండుసర్గల మహాకావ్యమును రచియించెను. మధురవాణి యనుకవయిత్రి రఘునాథనాయకుఁడు తెలుఁగున రచియించిన

1. విజయవిలాసమను నీసభాభవనము పేరును బట్టియు, రఘునాథరాయలు నేపాళచోళగుల యుద్ధమున విజయములఁ గాంచుటచేతను 'చేమకూర వేంకటకవి భావస్ఫోరకముగఁ దనకావ్యమునకు విజయవిలాస మనిపేరును బెట్టియుండును. ఈభవనము రఘునాథనాయకునిచే విజయచిహ్నముగఁ గట్టింపఁబడినది.

2. కృష్ణదేవరాయలు సాహిత్యవిద్యా విశారదుఁ డగుటయే గాక సంగీతవిద్యాప్రియుఁడు. అభినవభరతాచార్యుఁడు; బండారులక్ష్మీనారాయణ రాయలకుఁగృతిగా "సంగీతసూర్యోదయము" అనునైదధ్యాయముల సంగీతశాస్త్రగ్రంథమురచియించినాఁడు- అందు రాయలకాలమున సంగీతశాస్త్రజ్ఞులు పెక్కురుపేర్కొనఁబడిరి. మధ్వయతి శ్రీకృష్ణాచార్యుని యొద్ద రాయలు వీణావాదనము నేర్చెను. రఘునాథనాయకుఁడు ప్రవీణుఁడనుట సార్థకమే!

రామాయణమును సంస్కృతీకరించెను.[3] ఈమె తొలిపేరు శుకవాణి యనియు, నీమెను మధురకవిత్వమువలన మధురవాణి యనుపేరు వచ్చె ననియు నామె రామాయణమునఁ జెప్పుకొన్నది.

సంస్కృతమందు రఘునాథనాయకుఁ డపారపాండితీప్రకర్ష గలిగినవాఁ డనుటకు, సాహిత్యరత్నాకరకృతికర్తయగు యజ్ఞనారాయణదీక్షితుఁ డీతనిశిష్యుఁ డగుటయే చాలును. సంగీతశాస్త్రమున నూతనదృక్పథమును గల్పించి రఘునాథనాయకుఁడు సంగీతసుధ యనియు భరతసుధ యనియు రెండుగ్రంథములు వ్రాసెను. ఇందు, తొలిదానియం దపూర్వగ్రంథము లుద్ధరింపఁబడినవి. రెండవది కానవచ్చుటలేదు. మహాభారతతాత్పర్యసంగ్రహ మను నింకొక సంస్కృతగ్రంథము నీతనిరచనమే. పదవాక్యప్రమాణజ్ఞుఁడై యద్వైతవిద్యాచార్యుఁడై, సర్వతోముఖయాజియైనగోవిందదీక్షితుఁడును, నలంకారరత్నాకరము, సాహిత్యరత్నాకరము, రఘునాథభూపాలీయము మొదలగు గ్రంథములు రచియించిన గోవిందదీక్షితుని కొమారుఁడు యజ్ఞనారాయణదీక్షితుఁడును, గోవిందదీక్షితుని రెండవ కుమారుఁడు వేంకటమఖియు, కమలినీకలహంసనాటిక, రుక్మిణీపరిణయము, ఆనందరాఘవము, కావ్యదర్పణము, తంత్రశిఖామణి మున్నగు పెక్కుగ్రంథములు రచియించిన రాజచూడామణియు, పారిజాతాపహరణనాటకకర్త కుమారతాతాచార్యులును నీతని యాస్థానము నలంకరించిన సంస్కృతకవులు.

రఘునాథనాయకుఁ డాంధ్రమున రచియించిన గ్రంథములలోఁ గొన్ని వినఁబడుచున్నవి. కొన్ని కనఁబడుచున్నవి.

(1) పారిజాతాపహరణము-(2) గజేంద్రమోక్షణము (3) రుక్మిణీకృష్ణవివాహయక్షగానము-(4) జానకీపరిణయము- (5) అచ్యుతాభ్యుదయము- ఇవివినఁబడుచున్నవి.

(1) వాల్మీకిచరిత్రము- (2) సావిత్రి- (3) నలచరిత్రము- (4) రఘునాథరామాయణము- ఇవి కనఁబడుచున్నవి.

పారిజాతాపహరణప్రబంధమును యామద్వయమున నత్యాశువుగ రచియించినట్లు యజ్ఞనారాయణ రాజచూడామణిదీక్షితులు చెప్పుచున్నారు. ఈరచ

3. తంజాపురాంధ్రనాయక రాజచరిత్రమున నిందులకు వ్యత్యస్తముగా రఘునాథరాయలు సంస్కృతమున రామాయణము రచింప మధురవాణి దానిని తెనుఁగునకుఁ బరివర్తన మొనర్చెనని చెప్పుదురు” అని యున్నది. చూ. పుట. 237. ఇది పొరపాటు. రఘునాథనాయకుఁడు తొలితెలుఁగున రచియింప మధురవాణి యావెనుక దానిని సంస్కృతీకరించెను.

నకు మెచ్చి రఘునాథనాయకుని కాతనితండ్రి కనకాభిషేక మొనరించినాఁడు. మనదురదృష్టమున నిది యలభ్య మగుచున్నది. అచ్యుతాభ్యుదయమునఁ దనతండ్రిచరిత్రమును రఘునాథుఁడు తెలిపియుండవచ్చును. తా నీగ్రంథము రచియించినట్లు రఘునాథనాయకుఁడతఁడు రామాయణమునను, నలచరిత్రమునను గూడఁ జెప్పికొనినాఁడు. ఇదియు నలభ్యమే.

కనఁబడిన గ్రంథము లన్నియు ముద్రణభాగ్యము నందినవి- వాల్మీకిచరిత్రము, తొల్లిసరస్వతీపత్రికయందుఁ జాలభాగమును నా వెనుక చిత్రాడ యముద్రితాంధ్రగ్రంథసర్వస్వమున మిగిలినభాగమును ముద్రింపఁబడినది. ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము- సావిత్రి- శృంగారసావిత్రి యనుపేర శృంగారగ్రంథమాలలో ముద్రింపఁబడినది. ఇదియుఁ బద్యకావ్యమే. నలచరిత్రము- చిత్రాడ శ్రీరామవిలాసగ్రంథమాలలో ముద్రితము. ఇది ద్విపదకావ్యము. ఏడాశ్వాసములు, ఎనిమిదవయాశ్వాసములోఁ గొంతభాగము గలదు. రామాయణమిపు డాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడుచున్నది. ఇది పద్యకావ్యము. నాల్గవయాశ్వాసము కొంతభాగముమాత్రమే గలదు. ఉన్నంతవఱకీగ్రంథముద్రణమునకుఁ బరిషత్తువారు పూనుకొనుట మిక్కిలి శ్లాఘాపాత్రము- కప్పురములు కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమ పైపై గుప్పినగతి విరిపొట్లము విప్పినరీతి కవితఁ జెప్పిన యీకవిరాజుకవితావైశద్యమును వివరించుట గ్రంథవిస్తరభీతి విరమించినాఁడను.

రఘునాథునియాస్థానమున నున్న తెలుఁగుకవులలోఁ దొలివాఁడు-

—: చేమకూర వేంకటరాజకవి :—

వేంకటరాజకవి కృతులు రెండు, విజయవిలాసము- సారంగధరచరిత్రము- తెలుఁగుపలుకుల యొడికమును, ప్రతిపద్యచమత్కృతియుఁ దెలుపు విజయవిలాసము నెఱుఁగనివా రుండరు- ఇందలి జాతీయములకు నిప్పటికిఁ బుస్తకసహాయమక్కఱ లేకుండ నర్థస్వారస్యమునుఁ దెలుపఁగలవారు పల్లెలలో నచ్చటచ్చటఁ గలరు- దీనికి క్రీ. శ. 1831 వ సంవత్సరమున నాంధ్రభాషోద్ధారకులు బ్రౌనుదొరవారు బ్రహ్మశ్రీ జూలూరు అప్పయపండితులచే టీకవ్రాయించినారు.[1] కృతిరచనాకాలము క్రీ. శ. 1615-1620 ప్రాంతమధ్యము కావచ్చును.

1. దీనికీ తరువాత వేదము వేంకటరాయ శాస్త్రిగారును నాంధ్రవిశారద తాపీ ధర్మారావునాయఁడుగారు వ్యాఖ్యలు వ్రాసియాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులైనారు.

—: కృష్ణాధ్వరి :—

ఈతఁడు నైషధపారిజాతీయ మను శ్లేషప్రబంధమును, రచియించి రఘునాథునకుఁ గృతిగా నొసంగినాఁడు. ఇది మైదాశ్వాసముల కావ్యము. రఘునాథ నాయకుఁ డీకృతికి[1] ముందు, పెక్కుకృతు లందినట్లు కృష్ణాధ్వరి యిట్లు తెలుపుచున్నాఁడు.

సీ. నవరసశ్రీరఘునాథభూపాలీయనామభామాభీష్టనాయకుండు
పారిజాతకథావతారికాహృదయకావ్యస్వయంవరవరవల్లభుండు
కల్యాణకౌముదీకందర్పనాటకకన్యోద్వహనబద్ధకంకణుండు
యమకకాహంకార? హారిభంగిక శృంగారసంజీవినీకాముకుండు
తాళచింతామణీవధూతల్పుఁడు, మంచిజామాత రఘునాథమనుజనేత
తెలియ నైషధపారిజాతీయకృతియు, నేఁడు రక్కల చెల్లెలై హెచ్చువనుచు.

— కవిచౌడప్ప —

ఆంధ్రవాఙ్మయమున హాస్యరసము వెల్వరించిన కవిచౌడప్ప రఘునాథనాయకుని యాస్థానమున నున్న ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. నేరుతు నని మాటాడఁగ, వారిజభవునంతవాని వశమా! తంజాపూరిరఘునాథరాయని,గా రెఱుఁగఁగఁ గుందవరపుకవిచౌడప్పా!

ఈతఁడు తెలుఁగుదేశమం దంతట ప్రఖ్యాతిఁజెందిన చౌడప్పశతకమే గాక, చౌడప్పసీసములను పేర ముప్పదిసీసములలోఁ జిన్నతెలుఁగునిఘంటువును రచియించినవాఁడు. ఈతఁడు కకుత్ స్థవిజయమును రచించిన మల్ల అనంతరాజాస్థానమున నున్నవాఁ డగుటచేతను, అనంతరాజును, రఘునాథనాయకుఁడును సమకాలికు లగుటచే నీతఁడు రఘునాథరాయని యాస్థానములో నుండుట సమంజసముగనే యున్నది.

విజయరాఘవనాయఁకుడు:—(1633-'73).

రఘునాథనాయకుని వెనుక రాజ్యమునకు వచ్చిన యాతనికొమరుఁడు విజయరాఘవనాయకుఁడు. నలువదేండ్లు తంజావూరును బరిపాలించినాఁడు. ఈతని

1. తంజాపురాంధ్రనాయకరాజచరిత్రమున పుట 237 లో కృష్ణయజ్వకూడా తెనుఁగున శృంగారనైషధపారిజాత మనుద్వ్యర్థి కావ్యము రచియించెను' అని వ్రాయఁబడియున్నది- గ్రంథనామమునం దెక్కడను ముందు శృంగారపదము గన్పట్టుటలేదు. ఇది శ్లేష కావ్యము- ద్వ్యర్థికావ్యముగాదు-దాని గద్య యిది- "ఇతిశ్రీమద్రఘునాథపాలనానుభవనిష్ఠాత కృష్ణాధ్వరివిరచితంబైన నైషధపారిజాతీయం బనుపుణ్యశ్లేషప్రబంధమునందు...ఆశ్వాసము"

కాలమున, తంజావూరురాజ్యము మహారాష్ట్రులవశ మైనది. ఈతఁడు పరాక్రమ శాలియే గాని దైవభక్తిపరుఁడు. విద్యావ్యాసంగములఁ బ్రీతిగలవాఁడు. తాత తండ్రులెంతయేని శ్రమించి సంపాదించిన రాజ్యము హాయిగ ననుభవించినవాఁడు. కావున నీతని కాలమున నాంధ్రవాఙ్మయ మపారముఁగఁ బెరిఁగినది. మఱియు నాంధ్రకవయిత్రులు, నట్టువరాం డ్రీతనికాలమున నెందఱో కీర్తి గడించిరి. లెక్కకు మిక్కిలిగ నాఁడువార లీతని యోలగమున నుండుటచే నీతని విషయలాలసుఁ డని చెప్పుదురు. కాని యీ కాలపు చరిత్రముఁ జదివినవారికి స్త్రీవిద్య యెంతఁగ నప్పుడు పెంపొందినదో తెలిసికొనవచ్చును. కేవలప్రబంధకవులే గాక, యక్షగాననాటకములుపదములు మున్నగు వానిని రచియించినకవు లీతని యాస్థానమున నుండిరి.

విజయరాఘవనాయకుఁడు స్వయముగఁ గవి. ఈ క్రింది గ్రంథము లీనాయకరాజకృతములు, చిత్తగింపుఁడు.

నాటకములు:-

1. రాజగోపాలవిలాసము.
2. చెంగమలవల్లిపరిణయము.
3. గోవర్ధనోద్ధరణము.
4. రతిమన్మథవిలాసము.
5. రాసక్రీడానవనీతచోరము.
6. పారిజాతాపహరణము.
7. రుక్మిణీకల్యాణము.
8. రాధామాధవవివాదము.
9. ధనాభిరామము.
10. సత్యభామావివాహము.
11. ఉషాపరిణయము.
12. దక్షిణద్వారకావర్ణనము.
13. కాళీయమర్దనము.
14. రఘునాథాభ్యుదయము.
15. మోహినీవిలాసము.
16. ప్రహ్లాదచరిత్రము.
17. పూతనాహరణము,
18. విప్రనారాయణచరిత్రము.
19. సముద్రమథననాటకము.
20. కృష్ణవిలాసనాటకము.
21. ప్రణయకలహము.
22. కంసవిజయము.
23. జానకీకల్యాణము.
24. పుష్యకవ్రతము.

ద్విపద కావ్యములు:-

1. రఘునాథాభ్యుదయము.
2. మోహినీవిలాసము.
3. పాదుకాసహస్రము. (శ్రీవేదాంతదేశికులవారి సంస్కృతగ్రంథమునకుఁ దెలుఁగుచేత.)
4. గోపికాగీతలు.
5. భ్రమరగీతలు.

విజయరాఘవనాయకుఁడీ గ్రంథములను గాక, పదకవితను, గేయరచనను నపారముగ వెలయించినాఁడు.

ఏలపాటలు, వేఁడుకోలువిన్నపములు, దరువులు, కీర్తనలు, అధ్యాత్మసంకీర్తనములే గాక, ఫాల్గునోత్సవవర్ణనము రగడలతోడను, చౌపదములతోడను, రచియించినాఁడు. రాజగోపాలదండకము గాక కొఱవంజి మొదలగు యక్షగానములఁ గూర్చినాఁడు. ఇంకను, నాట్యమున కాయారాగముల కనుకూలముగ గుజరాతి, దేశి, చౌపదము, జక్కిణి, దురుపదము, మదనపదదూత్యము, జోగిపదచాళి, శారదాసామ్రాజ్యము, నవరత్నమాలిక మొదలగునాట్యగేయము లెన్నియో రచియించెను. ఇవి యాతఁడు రచియించుటయే గాక వీనిలో నొక్కొక నాట్యమునం దాఱితేఱిన యొక్కొకనట్టువరాలు వీనిని సభలో నాడి పాడి వెల్లడించుచున్నట్లీతని యాస్థానమున నున్న చెంగల్వ కాళకవి యిట్లు వర్ణించినాఁడు.

సీ. చౌపదంబులు సీత రూపవతీకాంత, శబ్దచూడామణి చంపకాఖ్య
చెలువగు జక్కిణి చెలువ మూర్తివధూటి, కొరదముకోమలవల్లి గుజరాతిఁ బ
నవపదంబులు లోకనాయికాలోలాక్షి, యలదేశి శశిరేఖికాబ్జనయన
దురుపదంబులు రత్నగిరినితంబినియును, పేరణివిధము భాగీరథియును
మదనపదదూత్యనవరత్నమాలికాది, బహువిధాలక్ష్యనాట్యప్రపంచమెల్ల
ఘనతవిలసిల్లఁ దక్కిన కాంతలెల్ల, నభినయించిరి తమనేర్పు లతిశయిల్ల.

భరతశాస్త్రమును, నభినయమును నీమహారాజుకాలమున నెంతవఱకభివృద్ధిఁ జెందెనో మనము తెలిసికొనుటకు నివి మిక్కిలి యుపయోగించును. కాని మన మీశాస్త్రసంకేతికముల నంతకంతకు మఱచుచున్నమాట మఱవవలదు.

విజయరాఘవనాయకుఁడు కాలికి సాహిత్యరాయ మనుపేరుగల గండపెండేరమును తలపై శారదాధ్వజమును ధరించుచుండెడివాఁడఁట. వీనిని కాళకవి మిక్కిలిగ వర్ణించినాఁడు. ఉదాహరణమున కొక్కొక్కటిఁ జూపుదును.

శారదాధ్వజవర్ణన:—

నవరసోల్లేఖనవనయోగ్యము గానిపద్యంబు జనులకు హృద్యమగునె
ఘనతరాలంకారకారణంబులు గానివాక్యవైఖరులు నెవ్వారు వినరు
శ్లేషభాషితవాగ్విశేషాన్వితము గానిపదము విద్వత్ప్రేమపదము గాదు
ఘనసారసారంబు గానిసందర్భంబు లర్భకులైనను నాదరింప
రంచు వివరింపఁ జూపు నలినాసనరాణి ఛదనిల, చాలితచలాచలాగ్రహస్తంబుచేత

విజయరాఘవమేదినీవిభుసభను, తనమహిమంబుచే శారదాధ్వజంబు-గండపెండారనర్తనః—

ఫణిరాజబహుముఖఫణితిశాణితములమ్మార్గంబు లాత్మీయమహిమఁ బొగడఁ
ద్వరకగర్జతవాగ్విశ్వకర్మప్రభావంబు నిజశక్తియుక్తి వర్ణింపుచుండ
నవ్యకావ్యవిశేషనాటితోన్మేషంబు స్వకవైభవముల సన్నుతింప
లక్షితాలంకారలక్షణస్ఫురణంబు నాత్మచాతుర్యధుర్యత నుతింప
మధురమధురసశింజితమంజుమములఁ, దత్తమచితోపచారముల్ దానొనర్ప
విజయరాఘవమేదినీవిభునియంఘ్రి, యారసాహిత్యరాయపెండార మమర-

విజయరాఘవనాయకుని గ్రంథములలో కాళియమర్దనము, ప్రహ్లాదనాటకము, పూతనాహరణము, విప్రనారాయణచరిత్రము, రఘునాథాభ్యుదయ మను నాటకములును, రఘునాథాభ్యుదయ మను ద్విపద కావ్యము మాత్రమే లభ్య మగుచున్నవి.

విజయరాఘవనాయకుని యాస్థానమున నాంధ్రకవులు.

— 1. చెంగల్వ కాళకవి. —

ఈతఁడు పాకనాటి యార్వేల నియోగిబ్రాహ్మణుఁడు- శ్రీవత్సగోత్రుఁడు. తాత కాళయమంత్రి- తండ్రి వేంకటయ్య. ఈతఁడు పార్వతీపరిణయ మనుప్రబంధమును రచియించె నఁట- తల్లి రావినూతుల తిరుమలయ్యతనూజ కృష్ణమాంబ. ఈతఁడు రాజగోపాలవిలాసమను నైదాశ్వాసముల ప్రబంధము రచియించి విజయరాఘవనాయకుని కంకితము గావించి యున్నాఁడు. ఇందలి యవతారిక తంజావూరినాయకరాజచరిత్రమున కత్యంతోపయుక్తము- ఈయవతారిక గ్రంథమునుండి విడఁదీసి విజయరాఘవవంశావళి యనిపే రుంచిరి. కాని యిది, చివరషష్ఠ్యంతము లున్నకతన నిది గ్రంథావతారికయే యగుట స్పష్టము- నే నిదివఱకు నుదాహరించిన పద్యావళి యీగ్రంథములోనిదే.

రాజగోపాలవిలాసము దక్షిణద్వారక యనఁబడు మన్నారుగుడిస్థలమాహాత్మ్యము- ప్రౌఢప్రబంధము-

రఘునాథనాయకాభ్యుదయము రచియించిన రామభద్రాంబయు, విజయరాఘవనాయకుని కాలమునఁ గృష్ణాంబయుఁ దెలుఁగుకవిత్వము నీతనివద్ద నేర్చినట్లు విజయరాఘవుఁ డీతనిఁగూర్చి యిట్లు ప్రశంసించినాఁడు-

సీ. ఘటికాశతగ్రంథఘటనోత్కటనవీనపాండిత్యగరిమలు భళియనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాదికోద్దామరసగర్భసందర్భ మానని సన్నుతింప

మాకందమంజరీమధురుసుమాధుర్య, రచనావిశేష మారా యనంగఁ
బరిహృతేతరయుక్తిభాగనూతనకథాచాతుర్యధుర్యత సంస్తుతింప
అయ్యదినముల రామభద్రస్సుకాడు, నేఁడు కృష్ణాజి కవితచే నేర్పుమెఱసి
వినికి సేయుట యెల్ల మిాఘనత గాదె, కవివినుతచర్య! చెంగల్వకాళనార్య!

మఱియు నీతనికవిత్వముఁ గూర్చి యిట్లు ప్రశంసించినాఁడు.

ఉ. భూనుతకీర్తులైన కవిపుంగవు లందఱుమెచ్చ నిచ్చలుఁ
దేనియసోనలై కసటుదేఱిన చక్కెఱపానకంబులై
వీనులవిందులై రసికవేద్యములై యలవాగ్వధూటి కిం
గానుక లయ్యె చెంగలువకాళకవీ! భవదీయకావ్యముల్.

ఈతని గ్రంథ మముద్రితము.

2. కామరసు వేంకటపతిసోమయాజి.

ఈతఁడు విజయరాఘవచంద్రికావిలాసమను నాటకము రచియించినాఁడు. ఈతఁడు విజయరాఘవుని పట్టపుఁగవి యని యందుఁ జెప్పుకొనినాఁడు- ఈనాటకము విజయరాఘవనాయకుని చరిత్రముఁ దెలుపును- గ్రంథ మముద్రితము.

3. కోనేటి దీక్షితచంద్రుఁడు.

ఈతఁడు విజయరాఘవకల్యాణమను నాటకమునకుఁ గర్త. రాజగురు వగు శతక్రతు చతుర్వేది శ్రీనివాసతాతాచార్యుల శిష్యుఁడు- రామానుజాచార్యతనయుఁడు. ఈతనిగ్రంథ మముద్రితము.

4. పురుషోత్తమదీక్షితుఁడు.

ఈతఁడు విజయరాఘవనాయకుని కాలమునఁ దంజాపురాన్నదానమహా నాటకమును రచియించినకవి- తంజావూరునాయకరాజు లన్నదానమునకుఁ బ్రసిద్ధిఁ జెందినవారు.[1] 'నిరతాన్నవారితాన్నసత్రసంతోషితపంచాశత్సహస్రభూసుర'యని రఘునాథనాయకుని వాల్మీకిచరిత్ర గద్యయందుఁ గలదు. విజయరాఘవనాయకుఁడు నిరతాన్నదాత- ఈనాటకమన్నదానమహిమఁగీర్తించును. ఇదియు నముద్రితమే.

ఇఁక విజయరాఘవనాయకుని యాస్థానమునఁ గల కవయిత్రులఁ గూర్చి తెలిపెదను.

—: రంగాజమ్మ :—

విజయరాఘవునాస్థానమున నెన్నికఁ గన్న కవయిత్రి రంగాజమ్మ. ఈమె

1. తంజావూరు సత్రము లను సామెత లోకములోనున్నదే!

రచియించిన గ్రంథములలో మన్నారుదాసవిలాస మను యక్షగాననాటక మొక్కటి మాత్రమే యాంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత మయినది- వారిముద్రణమూలము ననే యాంధ్రలోకము రంగాజమ్మ వృత్తాంత మెఱిఁగినది- పరిషత్తువారు గ్రంథమును వెలువరించినవెనుక నీమెనుఁ గూర్చి కొన్నివిశేషములు తెలియుటచే వానినింకఁ జేర్చినాఁడను.

రంగాజమ్మ తెలుఁగునెలఁత. వారవనిత- ఇంటిపేరు పసుపులేటివారు-తండ్రి వేంకటాద్రి, తల్లి మంగమ్మ- ఈమె విజయరాఘవనాయకునియాస్థానకవయిత్రియై యీక్రిందిగ్రంథములు రచియించినది.

1. మన్నారుదాసవిలాసము- నాటకము.
2. మన్నారుదాసవిలాసము- ప్రబంధము.
3. ఉషాపరిణయము- ప్రబంధము.
4. రామాయణసంగ్రహము.
5. భారతసంగ్రహము.
6. భాగవతసంగ్రహము.

ఈమెకవనము, పాండిత్యము మున్నగువాని విశేషము లెఱుంగుటకు నుషాపరిణయ మన్నారుదాసవిలాస ప్రబంధములందలి యీగద్య తిలకింపుఁడు- "ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన సారస్వతధురీణయు, విచిత్రతరపత్రికాశతలిఖితవాచికార్థావగాహనప్రవీణయు, తత్ప్రతిపత్రికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు, శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతిస్ఫూర్తియు, అతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషవిశారదయు, రాజనీతివిద్యావిశారదయు, విజయరాఘవమహీపాలవిరచితకనకాభిషేకయు, విద్వత్కవిజనస్తవనీయవివేకయు, మన్నారుదాసవిలాసనామమహాప్రబంధనిబంధనకృతలక్షణయు, మహనీయరామాయణభాగవతభారతకథాసంగ్రహవిచక్షణయు, పసుపులేటి వేంకటాద్రిబహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును రంగద్గుణకదంబయు నగురంగాజమ్మ వచనరచనాచమత్కృతిం జెన్నుమీఱు ఉషాపరిణయంబను మహాప్రబంధంబునందు-తృతీయాశ్వాసము"

పైగద్యమువలన నీమె రాజగోపాలదేవుని దయవలనఁ గవయిత్రి యయ్యెననియు, వాచకత్వమునందేగాక చిత్రవిచిత్రపత్రికాలేఖనమున నాఱితేఱినదనియు, ఎనిమిది భాషలలోఁ గవన మల్లఁగలనేర్పరి యనియుఁ బదకవిత్వమునఁ బ్రవీణ

యనియు, రాజనీతి నెఱింగిన చతురురాలనియు, సరసహృదయంగమం బగుశృం
గారరసస్ఫూర్తిపదకవితయందు జాణ యనియు, విజయరాఘవనాయకునిచేఁ గన
కాభిషేక మహాగౌరవమునుఁ బొందినది యనియుఁ దెలియుచున్నది. లోకోత్తర
ప్రతిభాశాలి యగుమహాకవికిఁ జేయఁదగినగౌరవము లన్నింటిలోఁ గనకాభిషేక
మే ప్రధానమైనది- ఆంధ్రకవులలో శ్రీనాథుఁ డీమహాసత్కారమును, ప్రౌఢదేవ
రాయనిచేఁ గాంచినవాఁడు. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథుఁడు సర్వజ్ఞసింగమ
హీపతిచేఁ గనకాభిషేకముఁ బొందినవాఁడు గాని స్త్రీ లెవరు నిట్టిగౌరవమును
బొందినటులు మన మెఱుంగము.

కవయిత్రి యగురంగాజమ్మ యిట్టిగౌరవమును బొందుటచే, నాంధ్రలోక
మును నందు ముఖ్యముగ నాంధ్రమహిళామండలియు గర్వింపఁదగిన విషయము.

ఈమె 'లలితఫణితిని మృదురసాస్పదములుగ శృంగారపదములు' పెక్కు
రచియించిన ట్లుషాపరిణయావతారిక తెలుపుచున్నది. కాని యవి కానరాలేదు.
కాలక్రమము ననుసరించి చూడ నీమె గ్రంథములలో నుషాపరిణయమే కడపటి
దిగాఁ గన్పట్టుచున్నది. ఉషాపరిణయమున విజయరాఘవనాయకుఁడు తన్ను గ్రం
థము రచియింపు మని కోరుసందర్భమున నీవిధముగఁ బలికినది. "ఇంపుమీఱ నే
నును శృంగారరసంబులఁ జెన్నుమీఱు మన్నారుదాసవిలాసంబు వినిపింపుచున్న
సమయంబున,

సీ. వేంకటేంద్రునిపుత్రి! వినుతసద్గుణధాత్రి! ఘనయశోరాజి! రంగాజి! వినుము
మాధుర్యమున మించు మన్నారుదాసవిలాసప్రబంధంబు లలితఫణితిఁ
గావించి, మిగుల శృంగారంబు గన్పట్టఁ బదములు మృదురసాస్పదము లగుచు
రాణింప రచియించి, రామాయణంబును[1] భాగవతంబును, భారతంబు
సంగ్రహంబుగ రచియించి సరసరీతి, మమ్ము మెప్పించితివి చాల నెమ్మిఁ దనరఁ
బరఁగ హరివంశముననుషాపరిణయకథ, తెనుఁగుగావింపుమిఁకనీవు తేటగాఁగ.

ఉషాపరిణయమున మొదటి మూఁడాశ్వాసములును నాల్గవ యాశ్వాస
మునఁ గొంతభాగముమాత్రమే గలవు—

వీనిలో నుషాపరిణయము, మన్నారుదాసవిలాసనాటకప్రబంధములు మా
త్రమే మనకు లభ్యమగుచున్నవి- తక్కినవి యలభ్యములు-

1. గద్యయందును పద్యమునందును రామాయణభాగవతభారతము లనుటచే నీక్రమముననే యీమె గ్రంథరచనను చేసియుండవచ్చును.

21

ఆంధ్రసాహిత్యపరిషత్తు పుస్తకాగారమునఁ బ్రతియొకటి గలదు. ఈమె కాలమున విజయరాఘవనాయకుని యాస్థానమున, చేమకూర వేంకటకవి యున్నటులుపాపరిణయావతారిక తెలుపుచున్నది.

"విబుధసన్నుత మతి యగువిజయవేంకటపతియు, మహితప్రభావుం డగు మన్నారుదేవుండును దతయశోధనుం డగు తాతఘనుండును రంగద్గుణవిలాసుం డగుచెంగమలదాసుండును మొదలగునిఖిలజనమిత్రు లైనపుత్రులును" అవతారిక:

ఇందు విజయవేంకటపతి చేమకూర వేంకటకవి యని విజయశబ్దపూర్వకముగ నుండుటచేఁ దలంచుచున్నాఁడను- వేంకటకవి రంగాజమ్మకు బంధు వని వదంతి.

## — 2. కృష్ణాజి. —

ఈమె చెంగల్వ కాళకవివద్ద కవిత్వము నేర్చె నని యీవఱకుఁ దెలిసినది. మఱియు నీమె ప్రజ్ఞావిశేషములను కాళకవి యిట్లు వర్ణించినాఁడు.

సీ. ప్రస్తారసంఖ్యను బదుమూఁడుకోటులు నలువదిరెండులక్షలుఁ బదేను
వేలునేన్నూఱును వింశతియును నాఱు వృత్తంబులందు నీవృత్తమునకు
నీవర్ణన సమస్య నీవు గూర్పు మటన్న నావృత్తమున సమస్యను రచించి
యందఱకు శ్లోకంబు లాశువుగాఁ జెప్పి యవి తెనుంగునను బద్యములు చేసి
యిరువదాఱును ఛందంబు లెఱిఁగి యిట్లు, కవిత చెప్పినవార లీభువిని గలరె
యనుచు నందఱు వినుతింప ఘనతగాంచెఁ, గీర్తనీయగుణాలంబ కృష్ణమాంబ.

ఈమె రచియించినగ్రంథములు గానవచ్చుటలేదు.

విజయరాఘవనాయకుని సభయందు 'భరతసంగీతసాహితీప్రముఖవిద్యలాకృతులు గన్నచందాన సభ్యముఖులు' విలసిల్లి యుండిరి. అందు చంద్రరేఖ యనునట్టువరాలు విజయనగరరాజ్యాధీశుఁడగు వీరవేంకటపతిరాయలచే బిరుదము పొంది సమ్మానింపఁబడె నఁట. ఈమె నటనాకౌశల మిట్లు వర్ణింపఁబడినది.

సీ. తీఁగెమెఱుంగులు తీరున నిరుగడ వరుస బంగారుపావడలు మెఱయఁ
బరపుగా వలఁగొన్న భానుమండలముల హరువున యపరంజియరిగ లమర
మొగిలుమొత్తంబులు మోహరించినరీతి పమ్మి సాంబ్రాణిధూపమ్ము లలర
విద్యావిశేషముల్ వేర్వేర వెలయించు హవణిక బిరుదువాద్యములు మెఱయ
వీరవేంకటరాయపృథ్వీమహేంద్ర, దత్తబహువిధబిరుదముల్ దనరుచుండ
సమ్ముఖమ్మున నిల్చి యాచంద్రరేఖ, వివిధవిద్యలు వినిపించె వింతయనఁగ.

విజయరాఘవునాస్థానమునఁ మఱియుఁ గొండ అలివలు బహువిధవాద్యములు సభారంజకముగ వినిపించుచుండి రని యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. వీణ వాయించెను వీణాధర యొకర్తు కిన్నెర పలికించెఁ గన్నె యొకతె
చపలలోచన యొకర్తు ద్విపదలు చదివెను పక్షిస్వరగముఁజేసెఁ దరుణి యొకతె
ముఖవీణె నొకతె మురిశ రాగముఁజేసె కొమ్మయొకతె పిల్లఁగ్రోవి యూఁదెఁ
దంబురా మొరయించె ధవళాక్షి యొకతె స్వరమండలమునిాటె సవతియొకర్తు
యక్షగానంబు రావణహస్త ముకుకు, దండె మిాటులు చెంగులు తాళములును
జోల సువ్వాలధవళంబు లీల లమరఁ, గొండ అలివలు వినిపించి రందముగను.

గీ. దండెమిాటు మఢళిగాణదండి యనఁగ, నొమకుగమకంబు శక్తియుఁ బొదివికొనఁగ
స్థాయి రాగప్రబంధముల్ తాయములును, గీతములుఁ బాడె నొకరాజకీరవాణి.

శా. విద్యామూర్తమ లాగులెత్తు విధముల్ విద్యాధరుల్ మెచ్చఁగా
విద్యుద్వల్లులు మింటనుండి విని యుర్విం డిగ్గి మేలైనయా
విద్యల్ తాము నభ్యసింప రమణీవేషంబులం బూనెనా
వాద్యంబుల్ మెఱయఁగఁ దక్షిణసతుల్ వర్తిల్లి రాలాగునన్.

మహాప్రతిభాశాలి, రఘునాథనాయకుఁడు నూతనముగఁ గనిపెట్టిన రఘునాథమేళను, తాళములను విజయరాఘవుని కాలమునఁ బెంపుఁజెందినవి. సంగీతశాస్త్రము తెలుఁగున నెట్లభివృద్ధినందినదియుఁ దెలిసికొనుటకుఁ దంజాపురాంధ్రవాఙ్మయము మన కెంతయేని యుపయోగపడుచున్నది.

## — క్షేత్రయ —

మువ్వగోపాలపదము లని ప్రసిద్ధిఁజెందిన పదముల రచియించిన క్షేత్రయకవి విజయరాఘవనాయకుని సమకాలికుఁడై యాతనిపై పదములఁ జెప్పెను. ఈక్షేత్రయపదము లిప్పటికి నాంధ్రులకుఁ బ్రియతమములై యున్నవి.

## — మన్నారుదేవుఁడు —

విజయరాఘవునికి రాజగోపాలాంబికయందు జన్మించిన నాయకరాజు. ఈతఁడు తండ్రితోఁగూడ మహారాష్ట్రులతో యుద్ధమున మడసెను. తండ్రితాతలవలెఁ గవి- తొలుత విజయరాఘవాభ్యుదయమును, నావెనుక హేమాబ్జనాయికాస్వయంవరమును రెండుగ్రంథములు రచియించెను. విజయరాఘవాభ్యుదయ రచనము వంశాచారానుసరణము- రఘునాథనాయకుఁడు తనతండ్రిని గూర్చి య

చ్యుతాభ్యుదయమును, విజయరాఘవనాయకుఁడు రఘునాథునిఁగూర్చి రఘునాథనాయకాభ్యుదయమును రచియింప మన్నారుదేవుఁడు తనతండ్రిపేర విజయరాఘవాభ్యుదయము రచియించెను. గ్రంథము దొరకకపోయినను నిది ప్రబంధమని యీక్రిందిగద్యవలనఁ దెలియుచున్నది.

హేమాబ్జనాయికాస్వయంవరము నాటకము- రాజగోపాలుఁడు రక్తాబ్జనాయికను పెండ్లియాడుట యిందువర్ణితము- ఇందలిభరతవాక్య మిది.

"ఇవ్విధంబున చినచెవ్వయచ్యుతాధిపప్రపౌత్రుండును, రఘునాథజననాథపౌత్రుండును, విజయరాఘవభూపాలకప్రియపుత్రుండును, రాజగోపాలాంబికాగర్భకలశజలధికువలయమిత్రుండును, అతులకనకతులాప్రముఖనిఖిలమహాదానదీక్షాధురీణుండును, అనేకాగ్రహారప్రతిష్ఠాపనప్రవణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధనచాతుర్ధౌరేయుండును, అతులితపితృభక్తిగురుభక్తిభాగధేయుండును మహితానుభావుండగు మన్నారుదేవుండు భువనస్తవనీయంబుగా హవణించిన హేమాబ్జనాయికాస్వయంవరమను నాటకము."

సంస్కృతభాషాంతరీకరణములుగాక, తెలుఁగునఁ దొలుత నాటకములు రచియించి, యక్షగానముల నక్షయముగాఁజేసి, ద్విపదకావ్యములఁ జారిత్రకవిషయములు తేటతెల్లముఁ గావించి, సంగీతశాస్త్రమును సంస్కరించి, యభినయశాస్త్రము నభివృద్ధిపఱిచి, గేయవాఙ్మయమునుఁ గీర్తనీయముఁ గావించిన తంజాపురాంధ్రవాఙ్మయ మాంధ్రవాఙ్మయమునకు నూతనోత్తేజము గల్పించి వాఙ్మయప్రత్యేకవ్యక్తిత్వము వెల్లడించినది.

నాయకరాజులవెనుకఁ దంజావూరును బాలించిన మహారాష్ట్రరాజులు వీరి ననుసరించి భాషాపోషకులై, కవులై, వన్నెగాంచిరి. తంజాపురాంధ్రవాఙ్మయచరిత్రము సంపూర్ణముగఁ బ్రకటితమగునేని చారిత్రకసాహితీపరిణామము నాంధ్రవిమర్శకులు చక్కగఁ దెలిసికొనఁగలుగుదురు.

---

# పాలకురికి సోమనాథకవి - అనుభవసారము.

— బండారు తమ్మయ్యగారు - రాజమహేంద్రము. —

ఉ. తేనియసోనలం జిలుకు తేటగు జానుతెనుంగుఁబల్కుల
న్వీనులఁ దన్పుకబ్బముల నిక్కపు దేసితెనుంగుఁగైతకుం
బ్రాణము వోసినట్టి బుధవంద్యుని శ్రీబసవేశచింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికి సోమకవీంద్రుని సంస్మరించెదన్.

దేశభాషలందు లెస్స యనిపేరు మోసి, తీయతీయములు గలిగి వాసికెక్కిన మనతెలుగుబాస తొలితెలుంగు నెలుంగఁ గోరువారికిఁ దగిన పరికరము లిప్పటికి వలసినన్ని లభింపకుండుట శోచనీయము. కాలనిర్ణయవిషయమున నింకను వివాదగ్రస్తమయియున్న నన్నెచోడుని కుమారసంభవము మాట విడిచినచో గ్రంథరూపమున మన కుపలభ్యమయిన యాంధ్రవాఙ్మయమునకు నన్నయభట్టారకవిరచితమయిన యాంధ్రమహాభారతమే మూలకందమని యాదట నంగీకరింపవలసివచ్చుచున్నది. నన్నయభట్టునకుఁబూర్వము తెలుగునందుఁ బద్యరచనము వృత్తరూపమున వెలసినను వెలయకున్నను, మాత్రాగణబద్ధములగు గద్యగేయరచనములును, అక్కరలు, ద్విపదలు, సీసములు మున్నగు జాతీయరచనములును నన్నయకుఁ బూర్వము చిరకాలమునుండియే కొంతవఱకు నెలకొనుచుండినట్లు మనకు దొరకిన యానాఁటి శాసనసామగ్రియు, పాలకురికి సోమనాథుని గ్రంథపరికరమును సాక్ష్య మొసంగుచున్నవి.

"ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగాసర్వసామాన్యంబుగామి,జాను తెనుఁగువిశేషముఁబ్రసన్నతకు.(పండి)
ఉరుతరగద్యపద్యోక్తులకంటె, సరసమైపరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగాసర్వసామాన్యమగుటఁ,గూర్చెదద్విపదలు కోర్కెదైవాఱ.(బసవ)

అను సోమనాథునివాక్యములవలన జనులవ్యవహారవ్యాపారములందును, ద్విపదలు మొదలగు జాతీయకృతులందును జానుతెనుఁగు వాడుకలో నున్నను భావగభీరతాప్రధానములగు పద్యప్రబంధరచనములును, పద్యరచనము కన్న ముందుగా వెలసినట్లు తలంపఁదగు మాత్రాగణబద్ధములగు గద్యరచనములును జాలఁగాలమునుండి సంస్కృతపదభూయిష్ఠములుగఁ గూర్పఁబడుచుండినట్లు తలంప నవకాశము కలుగుచున్నది. క్రిందచిన నాల్గైదుసంవత్సరములనుండి యాంధ్ర

పత్రిక యుగాదిసంచికలలో నేఁ బ్రకటించుచువచ్చిన పంచప్రకారగద్య, నమస్కార గద్య, అక్షరాంకగద్య మున్నగుగద్యకృతు లీవిషయమును విస్పష్టపఱుపఁగలవు. కావుననే నన్నయభట్టారకుని యాంధ్రమహాభారతమందలి పద్యరచనమునందు ముఖ్యముగ వృత్తరచనము మూఁడుపాళ్లు సంస్కృతపదములతో జరగుటకుఁ గారణమయినది. అట్లయ్యును నన్నయ్యకూడఁ బ్రసన్నత జాతీయత వలయు నలఁతియలఁతి పద్దియముల రచించునెడ జాను తెనుఁగుపయి మక్కువను గనుపఱుపక పోలేదు.

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు, బేల నీకుఁ జెప్ప నేల వలసెఁ
జఱుతవాని కిట్టి తఱుసంటిపల్కులు, సన్నె వృద్ధజనము లున్నచోట.

క. అఱపొఱపు కుఱుచచేతులు, నొఱవశరీరమ్ము గలిగి యొయులకుఁ జూడం
గొఱగా కుండియు మన్మథు, నొఱపులబఁడియొను నితఁడు యువతీప్రియుఁడై.

క. ఒక్కొక కన్నును జెవియును, జెక్కును జను బొడ్డు మూఁపు చెలువగు చేయుం
బ్రక్కయు బిఱుఁదును గాలును, నక్కజముగ మనుజశకల మపుడుదయించెన్.

కాని తెలుంగుఁగవిత జీవము చక్కందనము నిక్కమయిన తెలుఁగుఁబలుకుబడులలోనే గల దని గుర్తెఱిఁగి సోమనాథునివంటి శివకవులు జాను తెనుంగుపయి వలపు గొని దాని యున్నవతో నన్నయ ప్రారంభించిన యాంధ్రకవిత్వశైలికి సంస్కారములు నెలకొలిపి ముందవతరింప నున్న తిక్కనాదిమహాకవుల జాతీయకవితానిర్మాణమునకయి మార్గమును దీర్పఁగడఁగిరి.

పూర్వోక్తము లయినసోమనాథుని వాక్యములును,

చ. సరళముగాఁగ భావములు జానుదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లాహ్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగన్.

అను నన్నెచోడుని పద్యమును, దదనుగుణముగ వారు తమగ్రంథముల వెలయించిన రచనాసంస్కారమును నీవిషయమును విశదీకరింపఁగలవు.

శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథుమనముల్ భేదిల్లెఁ గల్పాంతసం
జాతప్రోద్ధతబాడబానలశిఖాశంకాధికాతంకమై.

మ. మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొని వచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుల్ ధర్మజుఁ దత్సభాస్థితుఁ జగత్పూర్ణప్రతాపోదయుల్.

ఉ. దారుణమై వృకోదరు గదాకులిశాహతి నన్యవాహినీ
వారణసంచయం బభినవక్షతశోణితధార లొప్ప సం
చారితధాతునిర్ఝరవిశాలశిలోచ్చయసంచయాభ మై
వీరరణంబునం బడియె విక్షతహస్తిపవృక్షపఙ్క్తితోన్. (అ. ౬. ౧౪౩.)

అని నూటికిఁ దొంబదివంతులు సంస్కృతపదములతో నన్నయ ప్రారంభించిన వృత్తరచన మాతనికిఁ దిక్కనకు నడుమగతించిన రెండువందలయేండ్లకాలమునకు-

చ. కడుఁ బసిబిడ్డ వీఁ డొకటి గా దవు నా నెఱుఁగండు ముందరె
య్యెడ నొకపా టెఱుంగఁ డెద యొత్తయఁ గోమల మెప్పు డైననేఁ
గుడువఁగఁ బిల్తుఁ గాని తనకుం గలయాఁకటిప్రొ ద్దెఱుంగఁ డీ
కొడుకు కిటుపోకకుర్ మనము గుందెడు నిన్నని యాఁడిల్లెదుర్.

చ. ఎఱిఁగి యెఱింగి నన్నడుగ నేమిటి కప్పు డెఱింగి యింతకుర్
మఱచుట గల్గెనే నది వినం బనిలే దటుగాక, యున్న
రూపెఱిఁగియు నేన చెప్ప వినఁ నిష్టము గల్గుట చాల లెస్స, య
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్.

ఉ. డప్పి జనించె వ్రేళులపుటంబులు ప్రాకఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁగడున్ వశంబుగా
దప్పురమిచ్చుటచ్చటను నాసలవచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి న్క్రొడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్.

చ. ఇది గడు ముద్దరాలు పనులేమి యుఁ జేయఁగనేర దెంతయున్
మృదు వొకకీఁ పాటునకు మేకొనఁజాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదానికోర్వ దొకటిం దనుదా సవరించుచో న్పెఱుం
గదు తగ నొడ్లనుం గొలువఁ గా వెర వెమ్మెయిఁగల్గు స్వక్షత్గా.

అని నూటికిఁ దొంబదివంతులు తెలుఁగుఁబలుకుబడులతోడ వెలసి, జాతీయత జాలువాఱఁ దీరుతీయములతో వెల్లివిరియుటకు ముందు జరిగినక్రమపరిణామమును గుర్తెఱుంగఁ దలంచినచో నీమధ్యకాలమున వెలసిన వాఙ్మయమును

సవిమర్శదృష్టితోఁ దిలకించుట యావశ్యకమగును. కాని యీ కాలమున వెలసిన కావ్యములు వ్రేళ్లపయి లెక్కింపఁదగినంత తక్కువగ నున్న వనుట నిక్కువమునకు దూరము కానేరదు. దొరకినయాకొలఁదికబ్బములలోఁ బావులూరి మల్లన గణితము శాస్త్రగ్రంథము. కందపద్యాత్మక మగు మల్లికార్జునపండితారాధ్యుని శివతత్త్వసారము శతకవాఙ్మయమునఁ జేర్పఁదగినది. పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము, బసవలింగశతక మనునామాంతరమునఁబరఁగు చతుర్వేదసారము కూడ నట్టిదే. ఇఁక సోమనాథుని ప్రధానగ్రంథము లగుబసవపురాణపండితారాధ్యచరిత్రములును, ఆతనిశిష్యుఁడు సమకాలీనుఁడు ననఁదగు రంగనాథునిరామాయణమును జనవశీకరణమునకు మతప్రచారమునకు ననువగు రీతిని జాతీయచ్ఛంద మగుద్విపదలతోఁ గూర్పఁబడినవి. ముద్దుమురిపెములు గురియు జానుతెనుంగును జాలువార్చి యీకవివరు లీద్విపదకృతులలోఁ బాఠకుల మనంబులఁ ద్రవింపఁజేయు తావులను గూర్చి ముచ్చటించుటకు నా కిచ్చట నవకాశము లేదు. ఇఁక మిగిలిన పద్యకృతులు సమగ్రముగ లభించినవి, నేనెఱిఁగినంతవఱకు నన్నెచోడుని కుమారసంభవము, సోమనాథుని 'అనుభవసారము'ను మాత్రమే. వీనిలో రెండవది యీ నా ప్రస్తుతవ్యాసమునకు విషయము. గ్రంథనామమును బట్టి భ్రమపడి కొందఱు మహానుభావులు సోమనాథుఁడు శివతత్త్వానుభవమున నాఱితేఱిన తరువాతఁ జరమదశలో నీగ్రంథమును రచించియుండు నని తలంచుచున్నారు. కాని యిది సత్యమునకుఁ జాల దూర మని మనవి చేయుచున్నాఁడను. గ్రంథమందలి యంతస్సాక్ష్యమును బట్టియు, సోమనాథుని యితరకృతులకును దీనికినిఁగలరచనాశైలీవిభేదములను బట్టియుఁ జూడ నిది యాతఁడు తనప్రథమవయస్సులో రచించిన ప్రాథమికకృతిగా గోచరించును. సోమనాథుఁ డాంధ్రుఁడు. ఓరుగంటి ప్రాంతమున నున్న పాలకురికి యాతని జన్మస్థలము. అల్లయ్య నాతఁడు కర్ణాటదేశమున జన్మించి కళ్యాణపట్టణమునఁ బశ్చిమచాళుక్యచక్రవర్తి యగుబిజ్జలుని యొద్ద మంత్రియై వీరశైవ మతోద్ధారణ మొనర్చిన బసవేశ్వరుని యెడ నపారభక్తిగౌరవములఁ బ్రకటించి, బసవశబ్దశ్రవణమాత్రముననే మైమఱచునంతటి భక్తిపరవశస్థితికి వచ్చినట్టు లాతఁడు తరువాత రచించిన బసవపురాణాదికగ్రంథములను దిలకించిన వారికిఁ దెల్లము కాకమానదు. కాని యాతఁ డీయనుభవసారమునఁ గర్ణాటదేశమున బసవేశ్వరునివలె నాంధ్రదేశమున వీరశైవమతప్రచారమునకయి పాటుపడిన యాంధ్ర వీరశైవుఁ డగుమల్లికార్జునపండితారాధ్యునెడ భక్తిగౌరవములఁ బ్రకటించి యాత

ని మూఁడుసీసపద్యములలో నుతించియు బసవేశ్వరుని పేరయిన నెత్తకుండుట యా శ్చర్యము కాకపోదు. ఇందులకుఁ గారణము బుద్ధిమంతులకు వేఱ చెప్ప నక్కఱ లేదు. ఈగ్రంథము రచించు ప్రథమవయస్సునాఁటికి సోమనాథునకుఁ గర్ణాటుఁ డగుబసవేశ్వరునిఁ గూర్చి యంతగాఁ దెలిసియుండదు. అప్పటి కీతఁడు కర్ణాటభా ష నభ్యసించుట గాని బసవేశ్వరుఁడు కన్నడమున రచించిన గ్రంథములను, జదు వుట గాని జరగి యుండదు. తరువాతఁ దరువాత నాయాభాషలఁ జదివి యష్ట భాషాకవితాప్రవీణుఁ డయినపిమ్మట నే యుత్కృష్టవేదాంతబోధకము లగుబసవే శ్వరుని కన్నడవచనములు మున్నగుగ్రంథములను స్వయముగఁ జదివియు నాతని మహిమలను భక్తగణములవలన వినియు రానురా నాతనియెడ భక్తిపారవశ్యము ను నెఱపు పరిణతస్థితికి వచ్చెను. సోమనాథుఁడు తనసహజకులగోత్రముల నీయ నుభవసారముననే యిట్లు పేర్కొనెను.

క. భృంగిరిటిగోత్రుఁడను గురు,లింగతనూజుండ, శివకులీనుఁడ, దుర్వా
సంగవివర్జితచరితుఁడ, జంగమలింగప్రసాదసత్పాత్రుండన్.

బసవభక్తి మితిమీఱిన తరువాత వీరశైవులలో బసవగోత్ర మనునది వ్యవ హారమున లేకున్నను, పండితారాధ్యచరిత్రములో "బసవని పుత్త్రుండ బసవగో త్రుండ, బసవేశు శ్రీపాదపద్మశేఖరుఁడ, బసవనిఁబొగడఁబొల్పుడు కవీంద్రుండ, బస వన్నఁబొగడఁబొల్పుడు పాఠకుండ, బసవన్నదూతనే బసవన్నబంట, బసవనయిలు పుట్టుబానిసకొడుక,బసవన్న లెంకనే బసవన్నలింగి, బసవన్న వన్నలపన్నగావునను" అని వ్రాసికొని తనకు బసవనయెడఁ గలభక్తి పారవశ్యమును బ్రదర్శించెను.

అనుభవసారము రమారమి రెండువందలయేఁబదిపద్యములు గల యొక లఘుకృతి. ఇది ముద్రిత మయినను బరిశుద్ధముగఁ బరిష్కృతమయి తగిన ప్రచా రమందు లేనందున నముద్రితకృతులలో లెక్కింపఁదగినదే. ఇందుఁ గథారూపక మగునితివృత్త మేదియును లేదు. గురుమహిమ, భక్తిస్వరూపము, భక్తలక్షణము, భక్తమహిమ, భావక్రియార్చనావిధి, ఇష్టలింగార్చనావిధి, షట్స్థలస్వరూపము, ము న్నగువిషయములఁ గూర్చి తాను గ్రంథముఖమునను, భక్తజనములవలనను గని వినిన యనుభవములను సోమనాథుఁ డిందు వర్ణించును. దేశభాషాగ్రంథముల లోఁగూడ గ్రంథాదిని సంస్కృతశ్లోకమును రచించునాచారము ప్రాచీనకాలమున నుండినట్లు నన్నయభారతము, పావులూరి మల్లనగణితము, తిక్కన నిర్వచనోత్తరరా మాయణము మున్నగుగ్రంథములవలనఁ గాననగును. ఈయాచారమును సోమ

నాథుఁడు పంచప్రకారగద్య మున్నగుతనగద్యకృతుల రచించుటలోఁ బాటించిన దక్షిణగ్రంథములలోఁ బాటించినట్లు కనఁబడదు. నన్నెచోడుఁడు గూడ నట్లే యొనరించెను. శ్రీగురులింగజంగమముల కభేదముచు దెలుపుతెలుఁగుపద్యముతో సోమనాథుఁ డనుభవసారకృత్యాది ని ట్లుపక్రమించెను.

ఉ. శ్రీగురులింగజంగమవిశిష్టమహామహిమంబు వేఁడెదన్
శ్రీగురులింగజంగమము చెప్పఁ ద్రిమూర్తినిగూఢమైచనున్
శ్రీగురులింగజంగమవిశేషము లేకముగాఁ దలంచి యా
శ్రీగురులింగజంగమవశీకృతమూ మదిఁ గొల్చి సమ్మతిన్.

సోమనాథుని కృతిరచనాదికములలో నొకపరమరహస్య మిమిడి యున్నది. అతఁడు సాధారణముగాఁ దనమిత్రు లగుభక్తవరుల నెవరినో దనతోపాటు వారి నామములు గూడఁ జిరస్థాయు లగుటకుఁ గాఁబోలు తనకృతులకుఁ గథాశ్రోతలుగాఁ గూర్చుకొనెను. బసవపురాణమునకు గొబ్బూరి సంగనామాత్యుని, పండితారాధ్యచరిత్రమునకుఁ బొల్లురికి సూరనార్యునిఁ గూర్చుకొనినట్లే యీయనుభవసారమునకుఁ దనమిత్రుఁడు భక్తికళత్రుఁడు నగు గోడగి త్రిపురారి నొడయనిగాఁ గూర్చికొని చాలవఱకుఁ బద్యము లాతనిసంబోధించుచునే రచించెను. ఈక్రింది పద్యములు సోమనాథున కీవిషయమయి కలయాశయములను బ్రకటింపఁగలవు.

క. గురులింగజంగమస్థల, శరణస్తోత్రప్రసాద సంవిత్పదమున్
గురుభక్తిపూర్వకంబుగ, విరచింతు మదీయభక్తి వినుతిం బడయన్.

చ. గురు నుతియింతు సంతతము ఘోరభవాంబుధితారణార్థి నై
హరుఁ బ్రణుతింతు. లింగమథనార్థసముద్భవచిత్సుఖార్థి నై
శరణుల గీర్తిసేయుదుఁ బ్రసన్నకటాక్షనిరీక్షణార్థి నై
యిరవుగ నొందుభంగి నుతియింపమి నాకు నిజవ్రతంబుగన్.

క. మదనారి భక్తమండలి, నుదరార్థము పొగడువాని యుక్తి దలంపన్
సదమలరత్నవితానముఁ, బదరున్ సరిపోల్చునట్టి పగిదిమె కాదే.

కావున నీతఁడు భక్తులవర్ణించి వారిని కృతికర్తలుగనో కథాశ్రోతలుగనో గూర్చికొనుట ధనైకవాంఛాపరు లగు కొందఱు సామాన్యకవులవలెఁ బొట్టకూటికిఁ గాదు. భక్తానందమే బ్రహ్మానంద మని యాతని యభిప్రాయము. అందుచేతనే
"క. కావున భక్తానందము, వావిరి నీప్సితముగాఁగ వర్ణింతు లస
ద్భావనఁ గృతి సత్పాత్రక,శావేశులు పొగడఁ గావ్యలసనము నెగడన్."

క. అనుభవసారం బనఁగా, మనసిజహరు శుద్ధభక్తిమార్గము వేదో
క్తనిరూఢిఁ బురాణరహ,స్యనియుక్తిని విన్నవింతు నది యె ట్లనినన్.

క. వారక వేదపురాణ,ప్రారంభార్థముల నెల్లఁ ద్రవ్వక హంస
క్షీరమివాంభసి యను గతి, సారమె గొని తెలుపువాఁడ సద్గురుకరుణన్.

క. చెప్పుదు సద్భక్తావళి, యెప్పుడు గొనియాడుచుండ నిల సత్కావ్యం
బొప్పు శివానుభవంబన, లెప్పాఱఁబై వెలయు లింగలీలల నొలయన్.

అని చెప్పి కావ్యప్రయోజనమును వివరించెను. బసవపురాణ పండితా రాధ్యచరిత్రముల రచించునాఁటికి జాను తెనుంగుపైఁ గలిగిన వల పీతని కీయను భవసారమును రచించునాఁటికిఁ గలిగినట్లు కాన్పింపదు. పద్యరచనావిధానమున నీతఁడు నన్నయత్రోవను గొంతసంస్కరించినట్లు గోచరించును. పద్యములలోఁ జాలవఱకుసంస్కృతపదబాహుళ్యమున్నను నన్నయపద్యములలోని సమాసపాట వ మిందుఁ గానరాదు. అచ్చటచ్చట జాను తెనుంగుమీఁది మక్కువను గూడఁ గొంతవఱకు గనబఱచెను. ఈతనిపద్యముల నడక ధారాళమై మత్తేభగమనమువలె మనోహరముగ సాగుచుండును. సీసపద్యరచనమున నన్నయ పాటించిన యతిని యమముల నీతఁడు తనచతుర్వేదసారమునఁ బాటించె నని శ్రీప్రభాకరశాస్త్రి గారు బసవపురాణపీఠికలో వ్రాసినారు. కాని యీయనుభవసారమును చతుర్వే దసారమును సవిమర్శముగఁ బరికింప శాస్త్రిగారివ్రాతలు నాకు సత్యసమ్మతము గ గోచరింపలేదు. నన్నయ యతినియమముల నీతఁడు కొంతవఱకు సడలించె న నియే నాయభిప్రాయము నన్నెచోడతిక్కనాదు లీవిషయమున నతనిమార్గమునే యవలంబించిరి. కాని సీసపద్యరచనమున నీతఁ డొనర్చినముఖ్యసంస్కారములు— ఏపాదమున కాపాదమునకుఁ బదములు తెగిపోయి ముందుపాదమందలి పదము లతోఁ గలియకుండ రచించుటయు నాయాపాదములందుఁ గూడఁ జాలవఱకుఁ బూర్వోత్తరార్థములు విడివడునట్లు రచించుటయుఁ బాటింపఁదగినవి. సీసపద్యర చనమున కిట్టిసంస్కారము శ్రీనాథునితోఁ బ్రారంభమైన దని పలువుర విశ్వాస ము. కాని యది నిజము కాదు. శ్రీనాథునిసీసరచనమునకు మనసోమనాథుని సీస ములే మార్గదర్శకములు, జీవనౌషధములు నని యాతనియనుభవసారచతుర్వే దసారములను సవిమర్శముగఁ జదివినచో నంగీకరింపక తప్పదు. శ్రీనాథుఁ డీతని యెడ నపారభక్తిగౌరవములు కలిగి యాతనిగ్రంథములను బాగుగాఁ జదివి చాల వఱకు నాతనిద్విపదపంక్తులనే పుడికిపుచ్చుకొని యాతనిపండితారాధ్యచరిత్రమును

బద్యకావ్యముగా రచించిన సంగతి పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారికలోని—

సీ. "హరభక్తి వైదికం బని శ్రుతు లిడి చెప్పెఁ బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డాచరితఁ బద్యప్రబంధము చేసె ద్విపదలు తఱచు నిలిపి"

అనువాక్యము వలనను,

క. జగము నుతింపఁగఁ జెప్పితిఁ, బ్రెగడయ్యకు నాయనుంగుఁబెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ, మగు నారాధ్యచరిత యాదిగఁ బెక్కుల్.

అను శ్రీనాథుని నైషధపద్యమువలనను దెల్లము గాక మానదు.

ఈవిషయమునకు దృష్టాంతముగా సోమనాథునియనుభవసార, చతుర్వేదసారములందలి యీక్రిందిసీసములను జిత్తగింపుఁడు.

సీ. అఖలవేదాతీత మగుమూలమంత్రాక్షరములకు నతనివాక్యములు తేట
అయ్యక్షరాత్మకుం డగులింగమూర్తి కాతని మనోభావంబు జనితభూమి
ఆలింగమూర్తికి నాశ్రయం బైనశరణుని కాతనికరాగ్రంబు తల్లి
అమ్మహాశరణున కాభరణం బైన భక్తి కాతనిపదాబ్జములె యూఁత
అట్టి భక్తి కాదియైన జీవన్ముక్తి, కతని ఘనదయామృతావలోక
నమ్మె పరమపదవియమ్మహాతరకీర్తి,నొప్పుగురువుమహిమచెప్పఁదరమె. (అను.)

సీ. అచ్యుతబ్రహ్మాసురాగోచరుం డయ్యు వరశుద్ధభక్తైకవత్సలుండు
అన్నాదబిందుకళాతీతుఁ డయ్యు నాశ్రితశిష్యవర్గసంతతికుటుంబి
స్థిరసత్పరవ్యోమసింహాసనుం డయ్యు సాధకాత్మాంభోజమధ్యనుండు
పరమాణుతరమహత్తరమూర్తి యయ్యు సల్లింగజంగమప్రాణిలియ్యమూర్తి
యనఁగ వినఁగ నాది కాదియై స్సతి, నెగడఁ బొగడ మహిమఁ దగిలి మిగిలి
యున్న యసదృశప్రసన్నైకసద్గురు, మూర్తిఁ గొలవ కెట్లుముక్తి దొరకు.(అను.)

సీ. మహితశివాచార మార్గానువర్తు లై నడుచువారును దప్పి నడుచువారు
జంగమారాధనల్ సల్పుచుండెడువారు నోలి దుర్భవవార్ధిఁ గూలువారు
సిద్ధప్రసాదసంసిద్ధిఁ బొందెడువారు నర్పితానర్హులై యణఁగువారు
భక్తిసంపదఁ దేలి ప్రఖ్యాతు లగువారు పాయని నిందలఁ బడెడువారు
అయ్య నిన్నుఁ గొల్చి నయ్యలు కొలువని, కొయ్యలే గదయ్య జియ్యదేవ!
వినుతనిర్మలాంగ! విరహితవ్యాసంగ!, పటుదయాంతరంగ! బసవలింగ. (చతు.)

సీ. శివశివా! కర్ణుఁడు కవచ మిచ్చియుఁ జెడె వస్త్ర మిచ్చిన దాసి వరమువడసె

అక్కట! ఖచరేంద్రుఁ డంగమిచ్చియుఁ జెడెవ్రేలిచ్చిమునయ్య విజయుఁడయ్యెఁ
గటకట! శిబి తనకండలిచ్చియుఁ జెడె మృగమాంసమర్పించి మెఱసెనెఱుకు
చెల్లఁబో! బలి భువి యెల్ల నిచ్చియుఁజెడెఁ జోళుఁడొక్కూరిచ్చి సుగతిఁబొందె
నట్ల లింగవిముఖ మగుదానధర్మవ్రతోపకారవిక్రమోద్ధతములు
నిష్ఫలంబు గాక నెట్టన శరణుల, భక్తియుక్తి కెనయె బసవలింగ. (చతు. ప 167)

సోమనాథుని వృత్తరచన మందలి ముఖ్యలక్షణములు సమత్వము, చక్కందనము. ఈక్రిందిదృష్టాంతములు తిలకింపుఁడు.

చ. నిక మిది భక్తియుక్తి యన నేరక నోటికి వచ్చినట్టు తా
నొకటికి వేయుఁ బన్నుచును నొడ్డరి యడ్డరి మాటలాడుచుం
బకపక నవ్వుచుం గెలని భావము తూలఁగ బల్కునట్టి యు
వ్వికలునిగోష్ఠికిన్ సొగసి వింతురె సజ్జనమార్గ మంచురే. (ప. ౬౩)

చ. హరుఁ డనుకల్పవృక్షము, మమృతాంశుధరుండను కామధేను, వీ
శ్వరుఁడను పెన్నిధాన, మహివల్లభకుండలుఁ డన్ సుధాబ్ధి, శం
కరుఁ డనుమేరువుండుఁ దమకన్నులఁ గానక వాంఛితార్థముల్
సురపతిఁ గొల్చినన్ దమకుఁ జొప్పడునే శివభక్తశేఖరా. (ప. 90.)

శా. వ్రాలున్ వ్రాలు శివార్చనాపరవశవ్యాప్తిన్ భ్రమోహంబునన్
గ్రాలున్ గ్రాలు నహర్నిశంబు శివలింగధ్యానసంపన్నుఁడై
సోలున్ సోలు నపారసారవివిధస్తోత్రప్రలాపంబునన్
దేలున్ దేలు మహానుభావసుఖవార్ధిం భక్తుఁ డుద్యద్గుణా. (ప. 165.)

చ. హరు మది నిల్పినిల్పి యనయంబును బూజలు సల్పిసల్పి, శం
కరు మును జూచిచూచి తమకంబు దలిర్పఁగ నేచియేచి, యీ
శ్వరు నుతిఁ జేసిచేసి స్వవశస్థితి చేష్టలఁ బాసిపాసి, త
త్పరవశభావ మంది చనుభక్తుఁడు లింగము నొందుసన్మతిన్. (ప. 167.)

సోమనాథుఁడు సీసపద్యరచనమునందు వలెఁ గందపద్యరచనమునందుఁ గూడ మంచిసంస్కార మొనర్చినాఁడు. కవిచౌడప్ప కందరచనమున మును దిక్కన సోమయాజిని ఘనుఁడందు రనియు నటుతరువాతఁ దానే ఘనుఁడ ననియుఁ దన కందములు రసవన్నాకందము లనియును జెప్పికొనినాఁడు. కాని తిక్కనకు మును ముందే మనసోమనాథుఁ డెట్టి సంస్కార మావిష్కరించెనో యీక్రింది పద్యములవలనఁ దెలియనగును.

క. కొలుచుటయె భక్తి భక్తికిఁ, దలఁకమియె వ్రతంబు వ్రతముఁ దవులుటయే ని
శ్చలకృప, శివునిశ్చలకృప, కలుగుట యది ముక్తిపథము కరుణాభరణా.

క. కలనాఁడె, ధనము ప్రాయము, గలనాఁడె, జవంబు బలము గలనాఁడె, విని
శ్చలమతియు గతియుఁ దనకుం, గలనాఁడె భజింపవలయుఁ గరుణానిలయా.

క. గురుసన్నిధి గర్వించుట, గురుసన్నిధిఁ దన్నుఁ దాన గొనియాడుట యున్
గురుసన్నిధి శంకింపమి, గురుపాతకమండ్రు బుధులు గురుభక్తినిధీ.

క. అడుగమి యిచ్చుట యుత్తమ, మడిగినయెడ నీగి యున్న నగుమధ్యమ మ
ట్లడిగిన మెయ్యొఱపులఁ దా, నిడుటయె యధమంబు భక్తియెడఁ ద్రిపురారీ.

మఱియు ద్వంద్వప్రాసకందములఁ గూడఁ గొన్నిటి వ్రాసి సోమనాథుఁ డీ యనుభవసారమునఁ జిత్రకవిత్వపుఁ దెరువులఁ గూడఁ గొన్ని ద్రొక్కినాఁడు.

క. కన్నిడునే పరసతులకుఁ, దన్నిడునే భక్తుఁ డన్యదైవంబులకున్
వెన్నిడునే భవములకును, మున్నిడునే మనము విషయములకు మహాత్మా.

క. కొనునే నిషిద్ధపాకము, వినునే శివదూషణంబు వేఱొక త్రోవం
జనునే, సద్భక్తుఁడ నే, ననునే గర్వించి భక్తియందు మహాత్మా.

తెలుఁగు నుడికారమునకుఁ దీయందనమునకు నెలవు లగు బద్దెన సుమతి శతకపద్యములకు మఱియు నాతనినీతిసారమందలి కందపద్యములకు సోమనాథుని కందములే మూలకందము లయియుండు నని నాయనుమానము. బద్దెన సోమనాథుని గ్రంథముల బాగుగాఁ జదివి యాతని ననుకరించె ననుట క్రిందిదృష్టాంత మొక్కటి చాలును.

ద్వి. నల్లవోభామల యుల్లం బెఱుఁగక, గొల్లవాఁడైనను గోరునే కవయ
నొల్లనివెలయాలి నొల్లనినృపతి, నొల్లనిచెలిఁ బాయ నొల్లఁడేనియును
గొల్లఁడు వాఁడుగా కెల్లెడ జాతి, గొల్లఁడు గొల్లఁడే గొల్లఁడేనియును. (పండి)

క. ఒల్లనిసతి, నొల్లనిపతి, నొల్లనిచెలికాని, విడువ నొల్లనివాఁడే
గొల్లండు గాక ధరలో, గొల్లండును గొల్లఁడవునె గుణమున సుమతీ. (సుమ)

సందర్భానుసారముగ జాతీయము లగులోకోక్తులను గూడ నీసోమనాథుఁ డందందుఁ జొనిపినాఁడు.

క. వంటని దుర్వ్యసనంబుల, పెంటగుఁగా కీశుభక్తి పెంపునకుం గా
కుంటఁ జెడుభక్తి వాసల, రెంటికి నెడతాఁకి చెడ్డ రేవనిభంగిన్. (ప. 112.)

క. తాను శివైక్యుఁడ యేనిన్, దానెతి ననంగఁ బలఁదగునే యహహా

యేనాఁటనైనఁ జచ్చియుఁ, బీనుఁగు నని పల్కు నట్టి పీనుఁగు గలదే.

క. ప్రస్తుతకీర్తీ! "గ్రామో, నాస్తి కుత స్సీమ" యనిన యాస్మృతిక్రియ న
ప్రస్తుతము భక్తి వెలిగా, నస్తన్య స్తమె యగుర్ల శివైక్యము గలదే.

వీనిలో మొదటిపద్యము ముద్రితప్రతిలో నున్న దున్నట్టు లొసంగితిని. వ్రాఁతప్రతులఁ బరిశోధించి సరియైన కవిపాఠమును గుర్తింపవలసి యున్నది. రేవనికథఁ గూర్చి మనవిద్వాంసులలోఁ గొన్ని వివాదము లున్నవి. రేవఁడను చాకలివాఁడు బట్ట లుతుకుచుండఁగా వెల్లువ రాఁగా నతని తెలివిలేమిచే నుతుకుచున్న బట్టలను నుదికి రేవునొడ్డున జాగ్రత్త పఱచిన బట్టలను రెండింటిని గూడఁ బోఁగొట్టికొనిన కథనుబట్టి పయిసామెత యేర్పడిన దని కొందఱయభిప్రాయము. రేవఁడను పాఠము తప్పనియు 'రేవణ' యని యుండవలె ననియు-

శ్లో. ఉంబేకః కారికాం వేత్తి। తంత్రం వేత్తి ప్రభాకరః
మండన స్తూభయం వేత్తి। నోభయం వేత్తి రేవణః॥

అనుశ్లోకములో శ్లోకవార్తికము తంత్రవార్తికము రెండు నెఱుఁగక చెడినట్టు చెప్పఁబడిన రేవణుఁడే పయిసామెతకుఁ గారణభూతుఁ డని మఱికొందఱ తలంపు.

"రెంటికిం జెడినరేవఁడ నౌచు నే నీరజేక్షణా" అని పెద్దన మనుచరిత్రము నందును, "రెండు వోనాడిన రేవని రీతి, నుండ బాలకునిన్ను నోరంతప్రాప్తు" అని గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములోను నీసామెత యుదాహరింపఁబడినది. నేనెఱిఁగినంతవఱ కాంధ్రవాఙ్మయములో నిది మనసోమనాథుని యనుభవసారమునందే మొదట నుదాహరింపఁబడినది. "వాసలరెంటికి నెడతాఁకి చెడిన రేవనిభంగిఁ" అనుచో 'వాసల' అనుదానికి సరియైన కవిపాఠము "బానలు" లేక "బానలు" (చాకి బానలు) అయి యుండు నని నాయభిప్రాయము. వ్రాఁతప్రతులంబట్టి సరియైన పాఠము నిర్ణయించినచో దీనిని గూర్చిన వివాదము పరిష్కృతము కాఁగలదు. విజ్ఞు లీవిషయమున శ్రద్ధవహింతురుగాక.

ఈచిన్నికావ్యములో సోమనాథుఁడు క్రౌంచపదము, వనమయూరము, మాలిని, మానిని, మున్నగువృత్తములఁ గూడఁ గొన్నిటి రచించినాఁడు. బసవపురాణపీఠికలో శ్రీప్రభాకరశాస్త్రిగారు సోమనాథుని క్రౌంచపదమునకు, నన్నెచోడుని క్రౌంచపదమునకుఁ గలవిలక్షణత్వమును సూచించిరి. సోమనాథునిపద్యములో నేదళమున కాదళము విడిపోవుటయు మొదటిదళమునఁ బ్రాసయతియు

రెండవదళమున వర్గయతియుఁ బాద మంతట ననుప్రాసమును బాటింపఁబడుట గ్రహింపఁదగినవి. ఈక్రిందిపద్యముఁ జిత్తగింపుఁడు.

—: క్రౌంచపదము :—

భక్తివినీతుల్ యుక్తిసమేతుల్ భవభయవిరహితపశుగుణపూతుల్
వ్యక్తసుబుద్ధుల్ శక్తిసమృద్ధుల్ వ్యపగతకులచయపరసుఖసిద్ధుల్
సూక్తిరసజ్ఞుల్ భక్తివిధిజ్ఞుల్ సురుచిరశుభకరసుకృతమనోజ్ఞుల్
భుక్తివిరక్తుల్ ముక్తినియుక్తుల్ పురహరభక్తుల్ బుధనుతసక్తుల్.

గ్రంథాంతమున,

క. శివమస్తు భక్తినిత్యో,త్సవ మస్తు కుటుంబమిత్ర సకలాశ్రితసం
భవపూర్తి రస్తు విభవో,ద్భవ మస్తు సుసీలకంతు దయఁ గృతిపతికిన్.

అని కృతిపతి యగు గోడగి త్రిపురారికి శివమును జెప్పి, "నవరసాంచిత భక్తి నానాప్రయుక్తి, నవిఁ బాల్కురికి సోమనాథుండు చెప్పెఁ, బ్రవిమలంబవు ననుభవ సార మనఁగ, శివభక్తులెల్ల మించినవేడ్కఁ బొగడ" అను తరువోజతో సోమనాథుఁడు తనకావ్యమును ముగించినాఁడు. ఈప్రాచీనపద్యకావ్యము పరిశుభ్రముగఁ బరిష్కృత మయి ప్రకటితమయినచో నాంధ్రవాఙ్మయపరిణామస్వరూప మెఱుంగఁగోరువారికిఁ జాల నుపకరింపఁగల దని నావిశ్వాసము. భాషాభిమాను లిందులకుఁ బ్రయత్నింపఁ బ్రార్థించెదను.

---

# భాసనాటకప్రాశస్త్యము.

—: కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్. కాకినాడ :—

భాసుని వని తిరువనంతపురసంస్కృతగ్రంథావళియందుఁ బ్రకటింపఁబడిన నాటకము లేకకర్తృకము లనియు, నవి ప్రాచీననాటకకర్తయై కాళిదాసాదులచే వినుతింపఁబడిన భాసునిరచనము లనియు నిదివఱలో[1] విమర్శింపఁబడినది. 'భాస సౌమిల్లకాదీనామ్ ప్రబంధా నతిక్రమ్య' యను మాళవికాగ్నిమిత్ర ప్రస్తావనా వాక్యమువలన నాతనిప్రాచీనత్వమును, నగ్రస్థానమును మనకు విశదమగుచున్నది. ఈనాటకచక్రము బాణరాజశేఖరాదులచేఁ బేర్కొనఁబడినది. అందు స్వప్నవాసవ దత్త ముత్తమ మని ప్రసిద్ధిని గాంచినది. దండి, భామహ, అభినవగుప్త, శారదాతన యాదులీస్వప్నప్రతిజ్ఞానాటకములందలి విషయములఁ దమగ్రంథముల నుదాహ రించినసంగతి స్పష్టము.

మనకు లభించిన భాసనాటకములు పదుమూఁడు. ఇంకను గల వేమో భావివిమర్శనములవలనఁ దేలవలసియున్నది. పెక్కుగ్రంథములనుండి తననాటక ముల కనుగుణము లగుకథాసందర్భములను గైకొనుటచేత నాతని నాటకరచనా నైపుణ్యము విస్పష్ట మగుచున్నది. అందుఁ బ్రతిమాభిషేకములు రామాయణేతి వృత్తముపై నాధారపడియున్నవి. ప్రతిజ్ఞాస్వప్నవాసవదత్తము లుదయనకథావిష యికములు. పంచరాత్ర, మధ్యమవ్యాయోగ, దూతవాక్య, దూతఘటోత్కచ, కర్ణభార, ఊరుభంగములలో భారతకథ వర్ణితము. బాలచరితమున శ్రీకృష్ణునిబా ల్యక్రీడాభివర్ణనమును, గంసవధయుఁ గలవు. అవిమారకము చాలభాగము కల్పిత ము. కథాసరిత్సాగరమునఁ గలకురంగీవృత్తాంత మభివృద్ధిని జెంది నాటకరూపము నుగాంచినది.

చారుదత్త మసంపూర్ణము. అందలికథకు మూలము గన్పడుటలేదు. కథా వాఙ్మయమున నట్టికథ యుండియుండు నని విమర్శకులు తలంచుచున్నారు. ఇన్ని వివిధవిషయములను గూర్చిన కథలను గైకొని నాటకముల రచించిన భాసునిప్ర తిభ యసామాన్యము. కాని రామనాటకములయందు మూలానుసరణమువలన నాతనిరచనానైపుణ్యము కొంతవడిన దనియు, భారతనాటకములయందు విశేష ముగఁ గలదనియు 'కీత్'గారు తమనాటకచరితమున వ్రాసియున్నారు.

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక- సంపు- 24, 25.

 

కాళిదాసునినాటకములఁ గలకథాసంవిధానము (Plot), పాత్రపోషణము (Characterization) భాసనాటకములలోఁ దక్కువ. ఇతివృత్తము చక్కఁగఁ జిత్రింపఁబడియుండును. కథ శ్లోకములచే నడ్డుపడక యతిత్వరితముగ సాగుచుండును. సగముభాగ మాతనినాటకముల యనుష్టుప్ శ్లోకములే గన్పడుచున్నవి. కథ త్వరితముగ నడచుటకై 'నిష్క్రమ్య, ప్రవిశ్య'మున్నగు సూచనలు, నాకాశభాషితములుఁ గలవు. పాత్రములు విశేషముగ నుండును. 'బహుభూమికైః'అను బాణోక్తి దీనివలననే యని తెలియునది.

ఈనాటకములఁ బలుతావుల హాసము బాగుగఁ బోషింపఁబడినది. "భాసో హాసః" అను జయదేవునిసూక్తి సార్థకతను గాంచినది. మధ్యమవ్యాయోగమున ఘటోత్కచుఁడు బ్రాహ్మణుఁడని భ్రమించి భీముని హిడింబకడకుఁ గొనిపోవుటయుఁ, బ్రతిజ్ఞానాటకమున గాత్రసేవకప్రసంగమును, బ్రతిమానాటకమున సీతారాముల ప్రణయసంభాషణమును హాసమునకుఁ జక్కనియుదాహరణములు. భాసునివనఁబడు చాటువులలో 'కపోలే మార్జారః పయ ఇతి' అనుచంద్రికావర్ణనము కూడనట్టిదే.

భాసుఁడు గద్యరచనమున మేటి. 'గద్యం కవీనాం నికషం వదంతి' యనున తీతనికవిత కున్నతస్థానమును ఘటింపఁజేయుచున్నది. చిన్నవాక్యములతో సంభాషణములు ముగియుచున్నవి. పాత్రము లెంతవఱకు సంభాషింపవలయునో యంతవఱకు సంభాషించినట్లు గన్పడుచున్నవి. వర్ణనములు రసోచితములై యవసరమగుస్థలముల మాత్రమే యుపయోగింపఁబడినవి. స్వప్ననాటకమున ద్వితీయ తృతీయాంకములును, జారుదత్తమున ద్వితీయాంకమును సంపూర్ణముగ గద్యమయములే. భాసునిగద్యరచన మనోహరముగ నుండుటకుఁ గారణ మాతనికాలమున సంస్కృతభాష వాడుకభాషగా నుండుటయే యని గణపతిశాస్త్రిగారియాశయము.

భాసుని శైలి రమణీయమై లలితమై యుండును. కఠినపదములు విరళముగ నుండును. శైలియం దాదికవి యగువాల్మీకి ననుకరించినటుల భాసనాటకములఁ జదివినవారికి స్పష్ట మగును. కాళిదాసుని శైలి నాతికఠినమై వైదర్భీరీతి నలరారుచు నాగరకతను సూచించుచున్నయది. ఆతనివాక్యములు వివిధాలంకారయుతములై పానదీరినయటులు భాసిలుచుండును. భాసునిరచనయం దలంకారములు తక్కువ. ఉపమ, దృష్టాంతము, అర్థాంతరన్యాసము, రూపకము, నిదర్శనము నచటనచటఁ

గలవు. సమాసములు సులభసాధ్యములు. పంచరాత్రాదులం గొన్నిదీర్ఘసమాస ములు, దీర్ఘవృత్తములును గలవు.

భాసనాటకములు వీరరసప్రధానము లని కర్ణ, ఘటోత్కచ, అభిమన్యు, దుర్యోధనాదిపాత్రములవలన స్పష్టపడఁగలదు. నాట్యశాస్త్రవిరుద్ధము లగువిష యములు పెక్కులు గలవు. రంగస్థలముపై యుద్ధము- దశరథుఁడు, వాలి, దుర్యో ధనుఁడు, చాణూరముష్టికులు, కంసుఁడు మున్నగువారి మరణము- బాలచరిత దూతవాక్యాదులందు, కాత్యాయని, సుదర్శనుఁడు మొదలగు పాత్రములును, హల్లీసకనృత్యమును దానిని విశదీకరించుచున్నవి. ఇతిహాసములందు వలె వీరరస ప్రధానము లగుకృత్యములు వర్ణింపఁబడినవి. ఒకవిషయమే పలుతావుల నొకవిధ ముగనే వర్ణింపఁబడినది. నాటకములప్రస్తావనయు, వాలిదుర్యోధనులు మృతినొం దుటకుఁ బూర్వము గంగాదిపుణ్యనదీదర్శనమును గాంచుటయు, నవిమారకప్రతి జ్ఞానాటకములందువలెఁ బాత్రములు మరణోద్యుక్తము లగుటయు నిందులకుఁ దార్కాణము. కొన్నిస్థలముల భావివృత్తాంతసూచకము లగువర్ణనములు గలవు. ఇట్టిదానిని పాశ్చాత్యులు Dramatic Irony యందురు. స్వప్ననాటకమున వాసవదత్త యజ్ఞాతవాస మొనర్చుచుఁ బద్మావతీపరిణయమునకుఁ గౌతుకమాల యు నందు సపత్నీమర్దనావ్యౌషధులను గ్రుచ్చుటయు, మధ్యమవ్యాయోగమున ఘటోత్కచుఁడు తల్లి యగుహిడింబకడకు భీముని గొనివచ్చుటయు, నభిషేకనాట కమున రావణుఁడు సీతకు రామలక్ష్మణుల మాయాశిరములఁ జూపఁ గొనితెచ్చి యారంగముననే రామలక్ష్మణులు దనపుత్త్రుం వధించి రని వినుటయు, దీనికి నిద ర్శనములు.

భాసనాటకములఁ బెక్కులోకోక్తులు, సుభాషితములుఁ గలవు స్థాలీపులాక న్యాయమున వానిలోఁ గొన్నింటినిమాత్ర మిటఁ జూపుదును.

(1) కులద్వయం హంతి మదేన నారీ కూలద్వయం క్షుబ్ధజలా నదీవ— ప్రతిజ్ఞానాటకము.

(2) హస్తిహస్తచంచలాని పురుషభాగ్యాణిభవంతి ,,

(3) సర్వ మలంకారో భవతి సురూపాణాం ,,

(4) నహిధృతవచనేన పిత్తం నశ్యతి ,,

(5) ఇష్ట మాగంతుకస్య భోజనదానమ్ ,,

(6) ప్రద్వేషో బహుమానో వా సంకల్పా దుపజాయతే— స్వప్న.

(7) దుఃఖం న్యాసస్య రక్షణమ్ స్వప్న.

(8) ఆగమప్రధానాని సులభపర్యవస్థానాని పురుషహృదయాని భవంతి-,,

(9) కః కం శక్తో రక్షితుం మృత్యుకాలే, రజ్జుచ్ఛేదే కే ఘటమ్ ధారయంతి

ఏవం లోక స్తుల్యధర్మావనానాం, కాలేకాలే ఛిద్యతే రుహ్యతే చ.

(10) సదాక్షిణ్యస్య జనస్య పరిజనోపి సదాక్షిణ్యో భవతి.

(11) శుష్కే_ణైకేన వృక్షేణ వనం పుష్పితపాదపమ్

కులం చారిత్రహీనేన పురుషేణేవ దహ్యతే. పంచరాత్ర.

(12) అన్యత్ ప్రస్తుతమ్ అన్య దాపతితమ్.

(13) అకాలే స్వస్థవాక్యమ్ మన్యు ముత్పాదయతి.

(14) రూపేణ స్త్రియః కథ్యంతే; పరాక్రమేణ తు పురుషాః.

(15) రాజ్యం నామ నృపాత్మజైః సహృదయై ర్జిత్వా రిపూన్ భుజ్యతే

తల్లోకే నతు యాచ్యతే నతు పున ర్దీనాయ వా దీయతే. దూతవా.

(16) పిష్టపేషణ మేతావత్ పర్యాప్తం ఛిద్యతాం కథా.

(17) జ్యేష్ఠో భ్రాతా పితృసమః కథితో బ్రహ్మవాదిభిః. మధ్యమవ్యాయో.

(18) మాతా కిల మనుష్యాణాం దైవతానాం చ దైవతమ్. ,,

(19) పూజ్యతమః ఖలు బ్రాహ్మణః. ,,

ఇంక భాసుని నాటకములఁ బ్రత్యేకముగ విమర్శింతును. అందు స్వప్న ప్రతిజ్ఞానాటకములు ముఖ్యములు.

## స్వప్నప్రతిజ్ఞానాటకములు.

ఈరెండు నుదయనుఁ డనువత్సరాజునకు సంబంధించినవి. ప్రతిజ్ఞానాటకమున వాసవదత్తాపరిణయమును, స్వప్ననాటకమున మంత్రి యగు యౌగంధరాయణుఁడు లావాణకమున వాసవదత్త దహింపఁబడియె ననుప్రతీతిం బుట్టించి రాజ్యప్రాప్తికొఱకు వత్సరాజునకుఁ బద్మావతిం బరిణయ మొనర్చుటయు వర్ణితములు. ప్రాచీనహిందూస్థానమున రామాయణమహాభారతముల నటుంచినచో నుదయనచరిత్ర మెక్కువ ప్రచారమును గాంచినది యనుటలో నతిశయోక్తి లేదు. అతనిదేశకాలాదుల నిదమిత్థ మని చారిత్రపరిశోధకులు నిర్ణయ మొనర్చియుండ లేదు. క్రీ. పూ. 6 శతాబ్దమువాఁడని చరిత్రకారుల వాదమై యున్నది.

బౌద్ధజాతకకథలయందును, జైనవాఙ్మయమునందును వత్సరాజగు నుదయనుని ప్రశంస గలదు, ఈతనిచరిత్రము సామాన్యజనులకుఁ గూడఁ దెలియు

టచే గాళిదాసుఁడు మేఘసందేశమున 'ప్రాప్యావంతీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్' అనియు, 'ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే' అనియు నీతని వర్ణించియున్నాడు. 'యౌగంధరాయణ ఇవోదయనస్య రాజ్ఞః' అని శూద్రకుని మృచ్ఛకటికమునఁ గలదు. ఈతని చరితమునకు ముఖ్య మగు నాధారము గుణాఢ్యవిరచిత మగు బృహత్కథయే. ఇది మన కలభ్యము. కాని దీనిననుసరించి రచియింపఁబడిన సోమదేవుని కథాసరిత్సాగరమును, క్షేమేంద్రవిరచిత మగు బృహత్కథామంజరియు మనకు లభ్యములు.

బృహత్కథోపలబ్ధ మగు నితివృత్తమునకై కొన్ని మార్పుల నొనర్చి కవులు వేర్వేఱు గ్రంథముల రచియించియున్నారు. అందు స్వప్నప్రతిజ్ఞానాటకములును, రత్నావళీప్రియదర్శికలును, తాపసవత్సరాజము, వత్సరాజచరితము, వీణావాసవదత్తము, ఉన్మాదవాసవదత్తము మున్నగునవి ముఖ్యములు.

భాసనాటకములం దెల్ల స్వప్నవాసవదత్తము మిన్న. అందుననే యగ్నిపరీక్షయందు దహింపఁబడ లేదను నైతిహ్యము గల్పింపఁబడినది. ఇందు ముఖ్యపాత్రము ప్రతిజ్ఞానాటకమునవలె యౌగంధరాయణుఁడు. ప్రథమాంకమున బ్రహ్మచారి ప్రవేశించుటయును, యౌగంధరాయణాదులతో సంభాషించుటయు నుత్తరరామచరితమున ద్వితీయాంకమునఁ గల యాత్రేయీసంభాషణమును దలపించుచున్నది.

ఆశ్రమవర్ణనము—

విస్రబ్ధం హరిణా శ్చర న్త్యచకితా దేశాగతప్రత్యయా
వృక్షాః పుష్పఫలైః సమృద్ధవిటపాః సర్వే దయారక్షితాః
భూయిష్ఠం కపిలాని గోకులధనా న్యక్షేత్రవత్యో దిశో
నిస్సందిగ్ధ మిదం తపోవనమయం ధూమోపి బహ్వాశ్రయః.

అను శ్లోకమునఁ జక్కఁగఁ జేయఁబడి, శాకుంతలమున ద్వితీయాంకమునఁ గవిసార్వభౌముఁ డొనర్చిన-

గాహంతాం మహిషా నిపానసలిలం శృంగై ర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథ మభ్యస్యతు
విస్రబ్ధం క్రియతాం వరాహపతిభి ర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రామం లభతా మిదం చ శిథిలజ్యాబంధ మస్మద్ధనుః.

అను వర్ణనమునకు మూలముగ నున్నది.

ప్రథమాంకాంతమునఁ గంచుకి యొనర్చిన సాయంకాలవర్ణన మతిహృద్య మైనది.

ఖగా వాసోపేతాః సలిల మవగాఢో మునిజనః
ప్రదీప్తోఽగ్ని ర్భాతి ప్రవిచరతి ధూమో మునివనమ్
పరిభ్రష్టో దూరా ద్రవి రపిచ సంక్షిప్తకిరణో
రథం వ్యావృత్త్యా సౌ ప్రవిశతి శనై రస్తశిఖరమ్.

ద్వితీయాంకమునఁ బద్మావతి సపరివారయై కందుకక్రీడ నొనర్చుచుఁ బ్రవేశించును. పద్మావతీపరిణయమును గూర్చి చేటీవాసవదత్తల సంభాషణము స్వాభావికమై చక్కగనున్నది. (ఛాయ)

వా- అథ కేనఖ ల్విదానీ మభిలషతి.
చే- అస్తి వత్సరాజ ఉదయనో నామ-తస్య గుణాన్ భర్తృదారికా భిలషతి.
వా- (ఆత్మగతమ్) ఆర్యపుత్రం భర్తార మభిలషతి-(ప్రకాశమ్) కేనకారణేన.
చే- సానుక్రోశ ఇతి.
వా- (ఆత్మగతమ్) జానామి జానామి అయమపి జన ఏవ మున్మాదితః.
చే- భర్తృదారికే యది సరాజా విరూపో భవేత్.

వాసవదత్త దీనిని సహింపలేక స్త్రీస్వభావానుగుణముగ వత్సరాజు దర్శనీయుఁ డని వాదించుచున్నది.

వాస- నహి నహి దర్శనీయ ఏవ.
చే- ఆర్యే కథం త్వం జానాసి.
వాస- (ఆత్మగతమ్) ఆర్యపుత్రపక్షపాతే నాతిక్రాంతః సముదాచారః
కి మిదానీం కరిష్యామి, భవతు దృష్టమ్ (ప్రకాశమ్) హాళా ఏవ
ముజ్జయిన్యా జనో మంత్రయతే.

ఇట్టి సంభాషణములే భాసనాటకములయొక్క ప్రాశస్త్యము నుద్ఘాటించుచున్నవి. కవియు ద్వితీయతృతీయాంకములను గద్యమయముగ రచియించినాఁడు. తృతీయాంకమునఁ బద్మావతినిమిత్తము వాసవదత్త కౌతుకమాలికను గ్రుచ్చుటయు నందు సపత్నీమర్దన మను మూలికను గ్రుచ్చుటయు విధివిలసిత మనవలయును. తనసపత్నివివాహమునకుఁ దానే కౌతుకమాలికను, సపత్నీ మర్దనము గ్రుచ్చుటయా ?

చతుర్థాంకము శేఫాలికాంకము. అందు విదూషకుఁడు సహజచాపల్యముతో వత్సరాజును బద్మావతీవాసవదత్తలయం దెవ్వరుప్రియు లని యడుగుటయు, నది పద్మావతీవాసవదత్తలు లతామండపాంతర్గతలై తత్తఱపాటుతో వినుటయు బహురమ్యము. వాసవదత్తాబద్ధ మగుహృదయమునుఁ దనరూపశీలాదులచేఁ బద్మావతి యాకర్షించుట లేదని రాజు నుడువ, చేటి రాజునకు దాక్షిణ్యము లేదని నిందించును. కాని పద్మావతి యౌదార్యముతో-

'హలా! మా మైవం। సదాక్షిణ్య ఏవ ఆర్యపుత్రః। య ఇదానీ మప్యార్యాయా వాసవదత్తాయా గుణాన్ స్మరతి' అని యుత్తర మొసఁగును. వాసవదత్తావృత్తాంతమును స్మరించుచుండినరాజునకుఁ గనులు బాష్పపూరితము లయినవి. పద్మావతి ప్రవేశించి రాజునకు ముఖోదక మొసఁగును. విదూషకవత్సరాజసంభాషణమును, బద్మావతి విని యున్నది. అది రాజునకు విస్పష్టమయినది. అశ్రుపాతము కాశపుష్పరేణువులవలనఁ గలిగినదని రాజు పద్మావతితోఁ బలుకుటసహృదయరంజకము.

"శరచ్ఛశాంకగౌరేణ వాతావిద్ధేన భామిని
కాశపుష్పలవే నేదం సాశ్రుపాతం ముఖం మమ."

పంచమాంకము స్వప్నాంక మనఁదగును. పద్మావతికి శీర్షవేదన కలిగె నని విని రాజు సముద్రగృహమున కరుగుటయు నందు నిద్రఁజెందుటయు, వాసవదత్త ప్రవేశించుటయు, రాజు 'వాసవదత్తే! అవంతిరాజపుత్రి! ప్రియశిష్యే' అని వలవించుటయు మొద లగువిషయములు శృంగారరసాన్వితములు. వాసవదత్తాకరస్పర్శముచే రాజామె జీవించియుండెనని గ్రహించును. షష్ఠాంకమున యౌగంధరాయణుఁడు పద్మావతీవాసవదత్తాసులసమావేశ మొనర్చును. స్వప్నవాసవదత్తమున ముఖ్య మగునది విప్రలంభశృంగారమే యయినను సర్వానందుని యమరటీకాసర్వస్వమునఁ దెలిపినటులు నర్థశృంగారమును గలదు.

ఈనాటకమునందలి కథయుఁ గథాసరిత్సాగరమున మూఁడవదగులావాణకలంబకములోని రెండవతరంగమునందలి కథయు సమానేతివృత్తములు. భాసమహాకవి యుదయనవృత్తాంతమును బృహత్కథనుండి గైకొని నాటకమునకు వలయు మార్పులఁ గావించి హృద్య మగురూపకమును మనకుఁ బ్రసాదించియున్నాఁడు. స్వప్నేతివృత్తమును, పద్మావతిశీర్షవేదనయు, విదూషకుని పరిహాసవాక్యములును నూతనముగఁ జేర్పఁబడినవి. మూలమున వత్సరాజు, అమ్లానమాలా

తిలకములచే వాసవదత్త జీవించియున్న దని గ్రహించి పద్మావతి నడుగ నామెయుఁ దనచెలి యగుయావంతికచే నవి రచింపఁబడిన వని తెలుపును.

అథ వాసవదత్తాస్యా శ్చక్రే దేవ్యాః ప్రసంగతః
అమ్లానమాలాతిలకౌ వత్సేశా త్ప్రాప్తశిక్షితౌ- లావాణ- 2-31

అథాసన్నవివాహాయాః పద్మావత్యా మనస్వినీ
అమ్లానమాలాతిలకౌ దివ్యౌ భూయ శ్చకారసా- 55

తస్యాశ్చ మాలాతిలకౌ దివ్యౌ వాలోక్య తౌ నిజౌ
ఏతౌ కృతౌ స్యా ఇత్యేవం విమమర్శ సభూపతిః- 63

తచ్ఛ్రుత్వా తేషు యాతేషు రాజా పద్మావతీం రహః
పప్రచ్ఛ మాలాతిలకౌ కేనేమౌ తౌ కృతా వితి. 86

సా వోచ దథ మద్గేహే న్యస్తా విప్రేణ కేనచిత్
అవంతికాభిధా మైషా తస్యాః శిల్ప మిదం మహత్- 87

స్వప్నవాసవదత్తమున వాసవదత్తాకరస్పర్శము వలన నది సిద్ధించుచున్నది. ఈమార్పు రసపోషకము. కాని కవియు వాసవదత్త నిపుణతను సూచించియే యున్నాఁడు. 'అస్మాకం భట్టినీ భణతి- మహాకులప్రసూతా స్నిగ్ధా నిపుణేతి ఇమాం తావత్ కౌతుకమాలాం గుంఫ త్వార్యా' అంక- 3. శారదాతనయుని భావప్రకాశమున వాసవదత్తములోని దని తెలుపఁబడిన విశేషకవృత్తాంతము దీనినే దృఢపఱచుచున్నది. మఱియు మూలకథయందు వాసవదత్త తననిర్దోషిత్వమును వెల్లడింప నగ్నిప్రవేశ మొనర్పఁబూనుటయు, యౌగంధరాయణుఁడు లోకపాలుర నుద్దేశించి శపథ మొనర్చుటయు, నంత లోకపాలు రామెపాతివ్రత్యమునుఁ బ్రకటన మొనర్చుటయు, వత్సరాజు సంతసించి యామెను గైకొనుటయును వర్ణింపఁబడినవి. వాసవదత్తశీలము విషయమై వత్సరాజెట్టిసందేహమునుఁ గనఁబఱచియుండలేదు. ఈయితివృత్తము కథాపోషకము గాదు. అందుననే భాసుఁ డీ కథాభాగమును విడచి నాటకమును ముగించియున్నాఁడు.

మఱియుఁ గథాసరిత్సాగరమునఁ బద్మావతితండ్రి ప్రద్యోతుఁడు. స్వప్నవాసవదత్తమున దర్శకుఁడు. వాసవదత్త యుజ్జయినీపురపాలకుఁ డగుమహాసేనుని కూఁతురు. అతనినే ప్రద్యోతుఁ డనియు, సేనాబాహుళ్యముచే మహాసేనుఁ డందు రనియుఁ గవి తెలిపియున్నాఁడు. ప్రథమాంకమున-

చేటీ- అస్తి రాజా ప్రద్యోతో నా మోజ్జయిన్యాః। సదారకస్య కారణాత్ దూతసంపాతం కరోతి-

వాసవ- భవతు భవతు ఏషా చా త్రిగేదానీం సంవృత్తా. అనియు, ద్వితీయాంకమున-

వాసవ- అస్తి ఉజ్జయిన్యాం రాజా ప్రద్యోతో నామ- తస్య బలపరిమాణ నిర్వృత్తం నామధేయం మహాసేన ఇతి- అనియుఁ గలదు.

ఈమార్పునకుఁ గారణ మూహ్యము. కాళిదాసుఁడు తనమేఘసందేశము నందు 'ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరా జోత్ర జహ్రే' అని వత్సరాజును వర్ణించియున్నాఁడు. ఒకవేళ బృహత్కథయం దిట్టినామధేయము లుండ, సోమదేవాదులు మార్చిన మార్పి యుండవచ్చును.

ఇట గ్రంథనామమును గూర్చి ముచ్చటించుట యప్రస్తుతము కాదు. భాసవాదనిరసనమునకై ప్రతికక్షు లీనాటకమునకు వ్రాతప్రతులయందు స్వప్న వాసవదత్త మనుపేరు మృగ్య మనియు, నాటకకథ ననుసరించి చూచినచో నట్టిపేరు సరిపడదనియును, నందువలన నిది భాసనాటకము కా దనియును వాదించుచున్నారు. కొన్నివ్రాతప్రతులయం దీనాటకము స్వప్ననాటక మని పేర్కొనఁబడినది. కొన్నింటిలో వాసవదత్త మనికలదు. అందువలన సంపూర్ణనామము స్వప్నవాసవదత్త మనియు, గ్రంథాంతమున సంక్షేపింపఁబడి యుండవచ్చు ననియు, లేక నామైకదేశగ్రహణముచే నట్లువ్రాయఁబడిన దనియు మన మూహింపవచ్చును. గ్రంథమును సూక్ష్మదృష్టి నరసిన నిది స్పష్ట మగును.

స్వప్నమునఁ గూడ నామెను ధ్యానించుచు వాసవదత్తాకరస్పర్శనముచే బోధితుఁ డగు వత్సరా జామె జీవించియున్న దనియు, రుమణ్వంతాదులు తన్ను గారణాంతరములచే మోసపుచ్చి రనియుఁ దెలిసికొని, తుదకు వాసవదత్తాసమాగమము నొందును. స్వప్నవాసవదత్తమున స్వప్నవృత్తాంత మెటులు ప్రాముఖ్యతను గాంచినదో దీనివలన మనకు స్పష్టము. నాటకమునకు స్వప్నవాసవదత్తాఖ్య మన్వర్థాభిధానము. ఈనాటకములోని పెక్కువిషయములను శ్రీహర్షుఁడు తనరత్నావళి ప్రియదర్శికానాటకములఁ గైకొనెను.

ప్రతిజ్ఞాయౌగంధరాయణమునందలికథ కథాసరిత్సాగరమునఁ గథాముఖలంబకములోఁ గలదు. మార్పులు బహుస్వల్పము. యౌగంధరాయణాదులు బ్రహ్మరాక్షసుని సహాయముచే నున్మత్తవేషమును ధరియించినటులఁ మూలకథలోఁ గలదు.

అది యౌగంధరాయణుని పాత్రపోషణమున కుపకరింపదని భాసమహాకవి దానిని వదలియున్నాఁడు. ప్రథమాంకమున యౌగంధరాయణుఁడు మహాసేనునిచే నాగవనమున వత్సరాజు బాధింపఁబడె నని విని యాతని విడిపింపఁ బ్రతినఁ బూను టయు, నున్మత్తవేషమును ధరింప నిశ్చయించుటయు వర్ణితము. ద్వితీయాంకమున మహాసేనుఁడు వాసవదత్తవివాహమును గూర్చి దేవితోఁ బ్రసంగించుచు, నాతరుణమున వత్సరాజు బాధితుఁ డయ్యె నని విని సంతసించును. దేవియు మీరు లందఱు వాసవదత్తాపరిణయోత్సుకులై తమతమ దూతల నంపుచుండ వత్సరా జేలపంప లే దని ప్రశ్నించును. మహాసేనుఁడును—

'మహాసేనశబ్ద మపి నగణయతి - కిం సంబాధ మభిలషతి - ఉత్సేకయ త్యేనం ప్రకాశరాజర్షి నామధేయో వేదాక్షరసమవాయప్రవిష్టో భారతో వంశః। దర్పయ త్యేనం దాయాద్యాగతో గాంధర్వో వేదః। విభ్రమయ త్యేనం వయ స్సహజం రూపం। విస్రమ్భయ త్యేనం కథ మప్యుత్పన్నో౽స్య పౌరానురాగః—

అనిపలుకును. ఇందువలన నుదయనుని విఖ్యాతవంశమును, గీర్తియు, నందుల కనుగుణము లగువయోరూపములును, పౌరజనానురాగమును మనకు విశదము లగుచున్నవి. తృతీయాంకమున యౌగంధరాయణుఁ డున్మత్తుఁడై రుమణ్వాంతాదులతో మంత్రాలోచన మొనర్చును. చతుర్థాంకమున భటగాత్రసేవకుల ప్రసంగము హాస్యరసమును బోషించుచున్నది.

గాత్రసేవకుఁడు సురాపానమత్తుఁడై జపాపుష్పములఁ బోలినరక్తలోచనములతోఁ బ్రవేశించును.

గాత్ర-(ఛాయ)

ధన్యాః సురాభి ర్మత్తా ధన్యాః సురాభి రనులిప్తాః
ధన్యాః సురాభిః స్నాతా ధన్యాః సురాభిః సంజ్ఞాపితాః.

అథవా ఆత్మనః పుత్రదారాణాం కష్టం శృణ్వంతో యే మూఢా నరాః సుసమృద్ధాః సురాతటాకం న స్మరంతి.

వత్సరాజు వాసవదత్తతో భద్రవతీగజారూఢుఁడై పలాయన మగును- సంగ్రహముగ వత్సరాజచరిత మీనాలుగంకములయందునుఁ దెలుపఁబడినది. బుద్ధిమంతుఁ డగువత్సరాజు మాయాగజముచే గృహీతుఁ డయ్యెననుట, రుమణ్వాదులు దానిని గుర్తెఱుఁగకుండుట మున్నగువిషయము లసంభవము లని భామహుఁడు తనకావ్యాలంకారమున విమర్శించియున్నాఁడు.

ప్రాచ్యపరిశోధకసంఘమువారిచేఁ బ్రకటింపఁబడిన వీణావాసవదత్తమను గ్రంథమును బరిశోధింప నేతద్గ్రంథము ప్రతిజ్ఞానాటకమును గైకొని రచియింపఁబడెనని తోఁచుచున్నది- వీణావాసవదత్త మెవరు రచియించినది తెలియదు. ఒకవేళ నిది చూడామణికర్త యగుశక్తిభద్రవిరచిత మేమో యనియు, నున్మాదవాసవదత్తము దీనికి నామాంతర మనియుఁ బీఠికలోఁ గుప్పుస్వామిశాస్త్రిగారు వ్రాసియున్నారు. అ దెట్లున్నను, వీణావాసవదత్తకర్త భాసనాటకముల ననుసరించి ముఖ్యముగఁ బ్రతిజ్ఞానాటకమునుండి చాలవిషయముల గ్రహించె నని చెప్పఁగలము. శక్తిభద్రుఁడును భాసనాటకముల ననుసరించి యున్నాఁడు.

వీణావాసవదత్త మసంపూర్ణము. ప్రథమాంకమున మహాసేనుఁడు వాసవదత్తాపరిణయమును గూర్చి ప్రసంగించును. ద్వితీయమున వత్సరాజు నీలగజమును గొనుటకుఁ జని తానే పట్టువడును. తృతీయాంకమున యౌగంధరాయణుఁడది విని వత్సరాజు మరణించె నని నగరమునఁ జాటించి తానుఁగూడఁ జితినిఁ బ్రవేశించుకొని మాయచేఁ జారులను మోసపుచ్చి యున్మత్త వేషమును బూని యుజ్జయినీనగరమున కరుగును. ఇంతకుఁ దరవాతి గ్రంథ మలభ్యము.

(1) త్వద్గీతప్రసాదితేరంగే—వీణావాసవ.
తవగీతప్రసాదితే రంగే.—ప్రతిజ్ఞా.
(2) వాసవదత్తాం ప్రత్యతిస్నేహాతా—వీణా.
అతిస్నేహాచ్చ వాసవదత్తాయాం—ప్రతిజ్ఞా.
(3) నగణయతి నరేశ్వరాణ్ క్షితౌ—వీణా.
మహాసేనశబ్ద మపి నగణయతి—ప్రతిజ్ఞా.

రెండు గ్రంథముల నిట్టిసామ్యములు పెక్కులు గలవు. వీణావాసవదత్తములోని కథయుఁ గథాసరిత్సాగరమునకు భిన్నముగ నున్నది. భవభూతివిరచిత మాలతీమాధవమునందలి ద్వితీయాంకమున సంజయుఁ డనురాజున కీఁదలంచిన తనతండ్రిమాటను నిరసించి వాసవదత్త యుదయనునిఁ బ్రేమించినట్లుఁ గన్పట్టుచున్నది.

'వాసవదత్తాచ రాజ్ఞే సంజయాయ పిత్రా దత్త మాత్మాన ముదయనాయ ప్రాయచ్ఛత్' అంక-2.

ఇది కథాసరిత్సాగర, ప్రతిజ్ఞాయౌగంధరాయణాదులలోని కథకు భిన్నముగ నున్నది. ప్రథమమునుండియు ఘనరూపసంపన్నుఁ డగువత్సరాజునకే వా

సవదత్త నీయఁదలఁచినటు లీగ్రంథములలోఁ గననగును. ఆతనివశపఱచుకొనుటకు సామమునచే విఫలీకృతుఁడయి, నీలగజంబుమిషచే నాతని బంధించి వాసవదత్త నా తనికి శిష్యురాలుగ నొనర్చి కృతకృత్యుఁ డయ్యె నని యవి దెలుపుచున్నవి.

భారతనాటకములు :—భారతకథకు సంబంధించిననాటకము లాఱు. పంచరాత్రము, దూతవాక్యము, దూతఘటోత్కచము, మధ్యమవ్యాయోగము, కర్ణభారము, ఊరుభంగము. రామనాటకములకంటె నీనాటకముల భాసుఁడు తన కవితానైపుణ్యము నధికముగ గనఁబఱచియున్నాఁ డని పలువుర యభిప్రాయమై యున్నది. ఇవి రసపోషకములై, ప్రయోగానుకూలములై యున్నవి. అందూరుభంగము మిన్న.

పంచరాత్రము:—ఇందు దక్షిణగోగ్రహణవృత్తాంతము భారతకథకు భిన్నముగ వర్ణింపఁబడినది. పాండవు లజ్ఞాతవాస మొనరింపుచుండఁ, బాండవపక్షపాతి యగుద్రోణుఁడు వారి కెటులయిన దుర్యోధనునిచే నర్ధరాజ్య మిప్పింపవలయు నని యోజించి యాతని నొకయజ్ఞ మొనర్పఁ బ్రోత్సహించును. దుర్యోధనుఁ డవభృథస్నానుఁడై ద్రోణాచార్యుని యజ్ఞదక్షిణనుఁ గైకొను మని వేఁడ, నాతఁడు పాండవుల కర్ధరాజ్యమును గోరును. దుర్యోధనుఁడు ప్రతిజ్ఞాభంగభయముచే శకునిమున్నగువారలతో యోజించి, యజ్ఞాతవాసమున నుండు పాండవుల నయిదుదినంబులఁ గనఁబఱచిన వారి కర్ధరాజ్య మొసంగుట కంగీకరించును. విరటునినగరంబునఁ గీచకులమరణమును విని యుంట నాచార్యుఁ డందుల కియ్యకొనును. విరటుఁడు జన్నంబునకురామి, నతనిపై దాడివెడలి గోగణంబులఁ బట్టుద మని భీష్ముఁడువలుకనందఱంగీకరింతురు. ద్వితీయాంకమున గోగ్రహణము, అర్జునవిజయము, భీమునిచే నభిమన్యుఁడు బంధింపఁబడుటయు వర్ణితములు. అభిమన్యుఁడు కౌరవపక్షమునఁబోరుట భారతకథకు విరుద్ధము. విరటుఁడు ధర్మరాజాదుల నెఱుఁగుటయు నుత్తరాభిమన్యుల వివాహనిర్ణయమును నీయంకముననే గలవు. తృతీయాంకమున భీష్మాదులకు ధర్మరాజు సందేశ మంపుటయు, దుర్యోధనుఁడు ధర్మబుద్ధితోఁ బాండవుల కర్ధరాజ్య మొసంగుటయు వర్ణింపఁబడినవి. ఇదియు భారతకథకు భిన్నమే.

సమయానుసారముగఁ బంచరాత్రంబులఁ బాండవు లన్వేషింపఁబడుటచే నీరూపకము పంచరాత్రమనఁబడినది. దశరూపకముల నిది సమవకార మనఁజెల్లును.

ఇందు దేవతుల్యు లగు భీష్మద్రోణాదులు, పాండవులు, దుర్యోధనాదులు నాయకులు. దుర్యోధనుని సత్యపరిపాలనఫలంబునుఁ బాండవుల కర్ధరాజ్యప్రాప్తి

యు, ద్రోణునకు శిష్యానుగ్రహార్థసిద్ధియుఁ బృథక్ఫలంబులు. వీరరసప్రధానము. దుర్యోధనునియందు ధర్మవీరమును ద్రోణునియందు దయావీరమును విస్పష్టము. దీర్ఘహ్రస్వహ్రస్వతరములగు మూఁడంకములు గలవు. ఇతివృత్తమును గపటాశ్రయము. సమవకారలక్షణము లన్నియు నిటఁ గన్పడుచున్నవి.

ప్రథమాఙ్కమున యజ్ఞశాల దహింపఁబడుట రమణీయముగఁ బదునాలుగు శ్లోకముల వర్ణింపఁబడినది. (అంక-1 శ్లో 6-19) దీనివలన మహాకవి భాసునికి జ్వలనమిత్రత్వమును సార్థకమగుచున్నది.

'వల్మీకమూలమునుండి భుజంగములు విపన్నుఁడగు నరునిశరీరమునుండి విని స్సృతము లగు పంచేంద్రియములరీతి వెడలుచున్నవి. మఖాగ్నిచే వృక్షములు దహింపఁబడుటఁ గోటరాంతరితము లగుఖగములు ప్రాణంబులభాతి వెలువడుచున్న వి. చారిత్రహీనుఁడగుపురుషుని సంసర్గమువలనఁ గులంబు దూషితంబగువటుల శుష్కవృక్షసాహచర్యముచే బుష్పితపాదపంబులు నశించుచున్నవి. వాతోద్ధతములై వంశనాళంబులు మానవులభాగధేయములవలె నుచ్చనీచావస్థల నొందుచున్నవి. స్త్రీదోషంబువలనఁ గళంకిత మగు సాధుకులంబురీతి శుష్కలతావేష్టితంబు లగుతరువులు గూలుచున్నవి.'

పాండవాదుల పాత్రములు చక్కఁగఁ బోషింపఁబడినవి. 'ఊషరేష్వపి సస్యం స్యా ద్యత్ర రాజా యుధిష్ఠిరః' అను శకునివాక్యమున యుధిష్ఠిరుని ధర్మపరాయణత్వమును,

పరాఙ్ముఖైః శ్లోకమిరనై ర్నివారయన్ వినాపి బాణాన్ రథ ఏవ జేష్యతి- అను యుధిష్ఠిరవాక్యముచే నర్జునునిశౌర్యమును,

సహజా మేప్రహరణమ్ భుజౌ పీనాంసకోమలౌ

తావాశ్రిత్య ప్రయుధ్యేయం దుర్బలై ర్గృహ్యతే ధనుః-"అను భీమునివచనమున నాతని బాహుబలంబును గవి బాగుగ వర్ణించియున్నాఁడు. అభిమన్యుని పరాక్రమము, పితరులయందు భక్తివినయంబులు హృద్యముగ వివరింపఁబడినవి. విరాటుని పాత్రపోషణమునకై మూలమునఁగల బృహన్నలాశౌర్యవర్ణన జనితామర్షమున యుధిష్ఠిరు నాతఁడు సారెతోఁ గొట్టుట విడువఁబడినది.

దూతవాక్యము:—భారతోద్యోగపర్వమునందలి శ్రీకృష్ణరాయభారమే యిందలి యితివృత్తము. కాని రూపకోచితముగ మార్పులు గావింపఁబడినవి. దుర్యోధనుఁడు తన యష్టాదశాక్షౌహిణీబలంబునకు సేనానిని నియమింప శ్రీకృష్ణ

రాయభారమునకు బూర్వమే యత్నించును. ఆలోచనామందిరమున దుర్యోధ నుఁడుండ శ్రీకృష్ణుఁడు వచ్చె నని కంచుకి సుమపుటయు, నతనికిఁ బ్రత్యుత్థాన మొ నర్చినవారిని దండింతునని దుర్యోధనుఁడు పల్కుటయు, దానటులఁబ్రత్యుత్థాన మొ నర్చనవసరము లేకుండ ద్రౌపదీకేశాంబరాకర్షణచిత్రపటమునుఁ జూచుచుండుట యు, భారతకథకు భిన్నములు. ద్రౌపదియవస్థయు, భీమాదుల యుద్ధప్రయత్న మును, యుధిష్ఠిరుని సాంత్వవచనములును జక్కగ వర్ణింపఁబడినవి. 'సంబాధో బంధుభిః శ్రేయాన్ లోకయో రుభయోరపి' 'దేశకాలావస్థాపేక్షీ ఖలు శౌర్యం నయాను గామినామ్' యిత్యాదిలోకోక్తులు గలవు. పితృభుక్తమును, వీర్యగుప్త మునగు స్వరాజ్యముదృణమాత్రము నైన నీయఁజాలనని దుర్యోధనుఁడు పలుక, శ్రీకృష్ణుఁ డాతని 'వయం కిల తృణాంతరాభిభాషకాః' అని యధిక్షేపించుట, సీతా రావణుల ప్రసంగవర్ణనసందర్భమున 'తృణమంతరతఃకృత్వా' అను వాల్మీకి రచన మును జ్ఞప్తికిఁదెచ్చుచున్నది. సుదర్శనశార్ఙ్గకౌమోదకీపాంచజన్యాదులు బాలచరి తమున శూలనీలాదులవలెఁ బాత్రత్వమును దాల్చినవి. ఈరూపకము వ్యాయోగ మనఁజెల్లును. ఈనాటకమునందలి రసము వీరము,ఇతివృత్తము ఖ్యాతమగు శ్రీకృష్ణ రాయభారము. ధీరోద్ధతుఁడగుదుర్యోధనుఁ డీనాయకుఁడు. దీనినేగాక భాసమహా కవి మధ్యమవ్యాయోగమను మఱియొక వ్యాయోగమును రచించియున్నాఁడు.

మధ్యమవ్యాయోగము :—పాండవమధ్యముఁడగు భీమసేనుఁ డీనాటక మున నాయకుఁడగుట నిదిమధ్యమవ్యాయోగ మనఁబడినది. పాండవు లడవుల గ్రుమ్మరుచు నొకనాఁడు ధౌమ్యునాశ్రమమునకుఁ జనిరి. పాండవాశ్రమమున భీముఁ డొకఁడే యుండెను. హిడింబసూనుఁడగు ఘటోత్కచుఁడు తనతల్లిపారణమునకై యొకబ్రాహ్మణకుటుంబమును నిరోధించి, బ్రాహ్మణకుమారులలో నొకరిని గోరును. తండ్రి జ్యేష్ఠుని తల్లి కనిష్ఠుని విడువఁజాలరయిరి. అంత మధ్యముఁడు ఘటోత్కచు నితోఁ బోవనంగీకరించి, పిపాసానివారణార్థము చేరువనున్న జలాశయమున కరు గును. ఘటోత్కచుఁ డాతని మధ్యమనామముతో సంబోధింప భీమసేనుఁడు ప్రవే శించి బ్రాహ్మణకుటుంబరక్షణార్థము మధ్యమునిస్థానమునం బోయి హిడింబాస మాగమము నొందును. బ్రాహ్మణాదులు ఘటోత్కచునితో సంభాషణ మొనర్చుట యు, భీముఁ డాతనితో యుద్ధ మొనర్చుటయు బాగుగ వర్ణింపఁబడినవి. ఘటో త్కచుఁడు తానుజేయుకార్య మధర్మమని యెఱింగియు మాతృనియోగముచే నట్లు చేయుట యాతని ధర్మపరాయణత్వమును వ్యక్తీకరించుచున్నది.

జానామిసర్వత్ర సదాచ నామ ద్విజోత్తమా, పూజ్యతమాః పృథివ్యామ్
అకార్యమేతచ్చమయాద్య కార్యం మాతుర్నియోగా దపనీతశఙ్కమ్. శ్లో-9.

దూతఘటోత్కచము :—అభిమన్యువధానంతరము ధృతరాష్ట్రుఁడును గాంధారియు శోకించుటయు, వారియుపదేశమును దుర్యోధనాదులు సరకుసేయమియు శ్రీకృష్ణునాజ్ఞచే ఘటోత్కచుఁడు దూతయై కౌరవశిబిరమున కేఁగుటయు, దుర్యోధనాదు లాతని నధిక్షేపించుటయు నిందలి యితివృత్తము. ఈనాటకములోని 'యాం త్వర్జున ప్రత్యభియానభీతా' అనుశ్లోకము 'శాకుంతలచర్చా'యను నవీన వ్యాఖ్యానమున నుదాహృతము. ధృతరాష్ట్రుని పాండవపక్షపాతమును, దుర్యోధనాదుల వైషమ్యమును వర్ణింపఁబడినవి. ఘటోత్కచుఁడు శకుని నీక్రిందిశ్లోకమునఁ జక్కఁగ నుపాలంభన మొనర్చును.

అక్షాన్ విముఞ్చ శకునే కురు బాణయోగ
మష్టాపదం సమరకర్మణి యుక్తరూపమ్
నహ్యత్ర దారహరణం నచ రాజ్యతన్త్రమ్
ప్రాణాః పణోత్ర రతి రుగ్రఫలాశ్చబాణాః. శ్లో-45

కర్ణభారము :—ఇందుఁ గర్ణుఁడు విషాదగ్రస్తుఁడై ప్రవేశించి శల్యునికిఁ దనశాపవృత్తాంతమునుఁ దెల్పుటయు, నింద్రునికి సహజౌదార్యముతోఁ దనకవచ కుండలముల దాన మొసంగుటయు వర్ణింపఁబడినవి. ఈనాటకమునఁ గర్ణపాత్రము న దానవీరత్వము ప్రధానతను గాంచినది. ఇంద్రశల్యులతోఁ బలికినవాక్యము లాతనియౌదార్యమును ఘోషించుచున్నవి.

అంగైస్సహైవజనితం మమ దేహరక్షా దేవాసురైరపి నభేద్యమిదం సహాస్త్రైః
దేయంతథాపి కవచం సహకుండలాభ్యామ్ ప్రీత్యా మయాభగవతో రుచితం యదిస్యాత్. శ్లో-21.

శిక్షాక్షయంగచ్ఛతి కాలపర్యయాత్ సుబద్ధమూలా నిపతంతి పాదపాః
జలం జలస్థానగతంచ శుష్యతి హుతంచ దత్తంచ తథైవతిష్ఠతి. శ్లో. 22

హతోపి లభతే స్వర్గమ్ జిత్వాతు లభతే యశః
ఉభే బహుమతే లోకే నాస్తి నిష్ఫలతా రణే. శ్లో. 12

ఈశ్లోకరచనమున భాసుఁడు భగవద్గీత (2-37) యందలి 'హతోవాప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్' అనుదాని ననుకరించెను. ఈరూపకమునకుఁ గర్ణభారమని యేల పేరిడఁబడినదో తెలియుట లేదని గణపతిశాస్త్రిగారు

వ్రాసియున్నారు. యుద్ధమున దుర్యోధనుని సేనానివహమున కధిపతియై యర్జునుని తోఁ బోరి కౌరవులకు జయమొసంగుభారము నాతఁడు వహించి, యర్జునునిపై రథమునుఁ బోనిమ్మని శల్యుని కాజ్ఞనొసంగుటచేఁ గర్ణభార మని కవియుపయోగించియుండును.

కర్ణుని వంచించి లజ్జితుఁడైయింద్రుఁడు 'విమల' యనుశక్తి నాతని కొసంగె నను నితివృత్తము భారతకథకు భిన్నము. మఱియు నీనాటకమునఁ గొంతభాగము నశించినదనియు, నందు గర్ణుని వీరకృత్యములు వర్ణింపఁబడియుండు ననియు గణపతి శాస్త్రిగారు వ్రాసిరి. అందులకుఁ దగిన యాధారము మృగ్యము.

ఊరుభంగము :—ఇందు విష్కంభకమున రసానుగుణ్యమగు గౌడీయరీతిని యుద్ధభూమి వర్ణింపఁబడినది. అధర్మయుద్ధమునుగాంచి క్రుద్ధుఁడగు బలదేవుని దుర్యోధనుఁడు శాంతింపఁ బ్రార్థించుటయు, గాంధారీధృతరాష్ట్రులకును, బుత్రుఁడగు దుర్జయునకును, మాళవి, పౌరవి యను తనపట్టపుదేవేరులకును దత్కాలోచితోపదేశముల దుఃఖోపశమనం బొనర్చి దుర్యోధనుఁడు దివంగతుఁ డగుటయు, నశ్వత్థామ పాండవులతో నిశాసమర మొనర్పఁ బ్రతినఁ బూనుటయు నిందలి కథాంశము. భరతనాట్యశాస్త్రవిరోధముగ రంగస్థలమున దుర్యోధనుఁడు మృతిఁజెందును. దుర్యోధనునిపాత్రమును మహాకవియగు భాసుఁ డెట్లు పోషించెనో యీక్రిందియుదాహరణములవలన స్పష్టమగును. వీనివలన నతనియభిమానమును, మాతాపితృభక్తియుఁ, బుత్రవాత్సల్యమును సువ్యక్తమగును.

1. హృతం మే భీమసేనేన గదాపాతకచగ్రహే
   సమ మూరుద్వయే నాద్య గురోః పాదాభివందనమ్. శ్లో-41.
2. యేనైవ మానేన సమంప్రసూతః.
   తేనైవ మానేన దివం ప్రయామి. శ్లో-47.
3. గాంధారినిగూర్చి-'అన్యస్యా మపి జాత్యాం మే త్వమేవ జననీభవ.' శ్లో-50
4. పట్టపురాణి యగు మాళవితో
   భర్తా తే నపరాఙ్ముఖో యుధి హతః కిం త్వంక్షత్రియే రోదిషి. శ్లో-51

భారవియుఁ దనకిరాతార్జునీయమున దుర్యోధనుని గుణాతిశయమునుగీర్తించియున్నాఁడు. మహాభారతరచనానంతరము కౌరవపక్షమే ధర్మపక్ష మనువాదము ప్రబలియుండుటచే భాసుఁడును భారవియు నిట్టికావ్యముల రచించి రనవలయును. ఈచిన్నినాటకము చక్కని శైలితో రమణీయమై నేఁడు ప్రదర్శింపఁబడినను జూపఱకు హృదయరంజక మై యుండు నని వింటర్నిట్జిగారు వ్రాసియున్నారు. ఇది యతిశయోక్తి కాదు. ప్రతిమాదుల ముందు విమర్శింతును.

# దేశీయవైద్యవిజ్ఞానచరిత్ర-ఆంధ్రవాఙ్మయము.

— డాక్టరు డి. వి. సుబ్బారెడ్డిగారు, ఎం. బి., బి. ఎస్. విశాఖపట్టణము.—

మనపూర్వీకుల చికిత్సాపద్ధతులను, వారివైద్యసిద్ధాంతములను, వేలు వేలుశతాబ్దములందుఁ బ్రజలలోఁ బ్రబలియుండిన వ్యాధులను గుఱించి సమకాలికుల యూహాపోహలను, చారిత్రకదృష్టితో, విమర్శించుట యత్యవసరము. వైద్యవిజ్ఞానచరిత్రనిర్మాణమునకు వైద్యగ్రంథములనే యాధారములుగ నెంచుట పొరపాటు. దేశీయవాఙ్మయము, గాథలు, పురాణములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, సమకాలికాభిప్రాయములను, ప్రజలసాంఘికాచారములను, ప్రతిబింబించునట్టి రచన లయినయెడల, నట్టిగ్రంథము లన్నియు, వైద్యగ్రంథములవలె, నీచరిత్రనిర్మాణమున కెంతయో యుపకరించును. ఇఁక శిలాశాసనములు, రాగిపత్రములు, ప్రాచీనవంశావళులు, మనదేశమునఁ బర్యటనముచేసిన విదేశీయులవ్రాఁతలు, స్వదేశచరిత్రకారులకథావళులు, తరతరములుగఁ బ్రజాసామాన్యమున నాటుకొని యుండునమ్మకములు, ఆచారములు, చక్రవర్తులచారుచర్య, నవాబులవైద్యాభిమానము, సూచించుచున్నవి. తుదకు, ప్రాఁతపాటలు, పదములు, సామెతలును, నితరసామాన్యచారిత్రకవస్తుసామగ్రి యంతయు, వైద్యవిజ్ఞానచరిత్ర వ్రాయుటకుఁ గొంత తోడ్పడును. దేవదానవులు, అమృతమునకై, క్షీరసాగరమున నసంఖ్యాకము లగునోషధుల వేసి, మందరపర్వతమును, కవ్వముగనుంచి, మథించిరఁట. అట్లే, సర్వగ్రంథసంచయమును, జనశ్రుతి (Tradition) ఆచారములు, శ్రౌతకర్మలు, పారంపర్యవైద్యజీవనరహస్యములు మొ॥ లగునవి యన్నియుఁ గ్రోడీకరించి, చిలికినఁ గాని, వైద్యవిజ్ఞానచరిత్ర యనునమృతకలశము మన కబ్బుట దుర్ఘటము.

ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవసందర్భమున ఆంధ్రవాఙ్మయమును సర్వవిధములఁ బోషించుట భారతిని సూత్నాభరణాలంకృతను జేయుటయే గాక, మనభాషామతల్లియొక్క నిరుపమానసౌందర్యమును, ఆమెహంసయానములు, నాట్యవిలాసములు, మృదుమధురగానము, తనివితీర స్మరించుటయు మన 'జన్మహక్కు' వైద్యగ్రంథసంచయములపట్టీలను, తద్గ్రంథకర్తల నామనిరూపణము, వారి కాలనిర్ణయమును, సకారణముగ, సంపూర్ణముగ నేర్పడువఱకు, నీయాధారము

లజోలికిఁ బోకుండుటయే మేలు. ప్రస్తుతపరిస్థితులలో వైద్యగ్రంథములతోఁ జరిత్రనిర్మాణమునకుఁ గడఁగుట, పునాదులు నలుదెసలఁ బూర్తి గాకమునుపే, ప్రక్కగోడలు కొన్నిచోట్ల సగమెత్తునకు లేవఁగనే, యట్టిగృహమున వసింపఁబూనుటం త హాస్యాస్పదమును, ప్రమాదకరమును. ఇఁక, చరిత్రపరిశోధనలు చాల నసంపూర్ణముగ నున్నవి. భూగర్భముననుండియు, అజ్ఞానాంధకారమున నుండియు, చారిత్రకవస్తుసామగ్రిని, త్రవ్వి, తీసి, రక్షించుటయు, మన కంటఁబాటులోనుండు శాసనాదులను తదేకాగ్రదృష్టితోఁ బరీక్షించి, గుప్తరహస్యముల గుర్తించుటయు, ప్రాక్ప్రతీచీపుస్తకభాండాగారముల మూలఁబడియుండు తాళపత్రగ్రంథసంచయములను, వాణిజ్యసంఘములదినచర్యను, మంత్రాలోచనలు, ఉత్తరప్రత్యుత్తరములు మొదలగు 'రికార్డు'లను, సముద్ధరించుటయు, క్రమక్రమముగ జరుగుచున్నను, ఆంధ్రచారిత్రకపరిశోధకుల ప్రతిభాప్రదర్శనమున కవకాశములు మెండుగనున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు, అందలియధ్యాపకులకు, విద్యార్థులకును, విధ్యుక్తధర్మములలో నగ్రగణ్యముగ నెంచఁదగినకృషి యిది. కాఁబట్టి, మధ్యయుగమునను, ఆధునికయుగారంభమునను మనదేశమున వెలసిన వైద్యసాంప్రదాయముల నిర్ణయించుటకుఁ బ్రస్తుత మాంధ్రవాఙ్మయమే మనకుఁ బట్టుఁగొమ్మ. ఆంధ్రభాషావేత్తలు, వాఙ్మయోపాసకులు, సారస్వతప్రియులు, వైద్యవిజ్ఞానచరిత్రనిర్మాణమున కనుకూలించు రచనలను, చాటువులను, పాటలను, సంపాదించి, విమర్శింపఁ బ్రార్థించుటకే యీవ్యాసము వ్రాయ సాహసించితి.

"వాఙ్మయమునకు, వైద్యమునకును, నెక్కడిసంబంధము ? సర్వలక్షణోపేత, సౌందర్యోపాసకురాలు, ఆనందాభిలాషిణి- దుఃఖభాజనుని, వికృతాంగుని, వ్యాధిగ్రస్తుని-ఏల తడవ నుంకించును ?" అని సంకోచించువా రుందురు. సృష్టివైచిత్ర్యములను, మానవప్రకృతిని, గమనించిన సూక్ష్మబుద్ధులు లౌకికజ్ఞానధురంధరులు, అహోరాత్రములకు జననమరణములకు, కష్టసుఖములకు, నెట్టిపరస్పరసామీప్యము కలదో, యట్టిబంధుత్వము వాఙ్మయమునకును, వైద్యసంప్రదాయములకును గల దని తెల్పుచున్నారు. ప్రపంచమున నేఁ డత్యున్నతస్థాన మలంకరించు కొన్నిపాశ్చాత్యజాతులు తమవాఙ్మయమును, ఈదృక్పథముతోఁ బరిశీలించి, నిర్ణయింపఁ గలిగిన నట్టి చారిత్రకాంశములు మెండు గలవు. పాశ్చాత్యప్రపంచమునకు గురుపీఠముగ గణింపఁబడుచు, నాప్రాంతముల- ప్రప్రథమమున, దేదీప్యమాన మయినవిజ్ఞానజ్యోతిని వెలిగించిన గ్రీకుదేశమునకు, ఆదికవిపుంగవుఁ

మైన 'హోమరు' (Homer) గ్రంథములందలి వైద్యవిజ్ఞానమును మిగుల విపులముగ వ్యాఖ్యానముచేయుచు, తద్గ్రంథముల మూలమున సమకాలిక వైద్యవిజ్ఞానపరిమితిని నిర్ణయించు నుద్దేశముతో, పదిపండ్రెండు గ్రంథములు రచియింపఁబడి యున్నవి. క్రైస్తవవేద మనఁబడు బైబిలునందలి వైద్యసంప్రదాయములను, రోమను సామ్రాజ్యమునాటికవుల వైద్యజ్ఞానమును, లోకమునకు విశదీకరింపఁబడుచున్నవి. చాసర్ (Chaucer) మహాకవి వర్ణించినవైద్యవర్ణన, బ్రిటిష్ దేశమున నాబాలగోపాలము వల్లించుట వాడుకయయినది. పాశ్చాత్యనాటకచక్రవర్తి యని పేరెన్నికఁ గాంచిన షేక్సుపియర్ (Shakespeare) రచనలయందలి వైద్యవిజ్ఞానస్ఫోరకములకు భాగములను బ్రత్యేకించువారును, విమర్శించువారును, బెక్కుపండితులు గలరు. ప్రాచీనాంగ్లేయనాటకరచయితలయొక్కయు, కవులయొక్కయు, గ్రంథములందలి వైద్యపరిచయము నుగ్గడించు గ్రంథములును నచ్చుగుచున్నవి ఫ్రాన్సుదేశమున, రెబెలే, (Rabelais) మొదలగు సుప్రసిద్ధ రచయితల వైద్యవిజ్ఞానమును వెల్లడించుగ్రంథములును వెలువడినవి. గతసంవత్సరమున, రోలెస్టన్ (Rolleston) అనునాంగ్లేయభిషగ్మణి 'వాఙ్మయమున సుఖవ్యాధులవర్ణన' యనుశీర్షికతో నొకవ్యాసమును బ్రకటించియుండెను. దినదినము నిట్టి వెన్నియో, వైద్యవిజ్ఞానప్రదర్శకము లగువాఙ్మయవిమర్శనలును బ్రకటింపఁబడుచున్నవి.

ఆంధ్రవాఙ్మయమున నానారీతుల విమర్శనలు ప్రకటింపఁబడుచుండినను వైద్యచరిత్రపునర్నిర్మాణమునకుఁ బ్రోద్బల మొసఁగునుద్యమ మెచ్చటను గోచరింపదు. అందులకుఁ గారణముల వివరించుట కిచట వ్యవధి చాలదు. ఎచ్చటనో యొకచోట మాత్రము, వేమనయొక్క రసతంత్రవిజ్ఞానము ప్రశంసాపాత్రముగ వర్ణింపఁబడియుండుటను గమనించియుంటిని. పరిషత్పత్రికయం దొకసంపుటమున, నిఘంటుచరిత్రయందు, ధన్వంతరి నిఘంటువు, ఔషధవర్గము మొదలగు వాని ప్రస్తావనయు, మఱియొక సంపుటమున ఆముక్తమాల్యదయందలి నృసింహావతార ఘట్టమునఁ గవి చూపిన శారీరనిర్మాణశాస్త్రపరిజ్ఞానమును విమర్శించుటయు, నాకనుమేరలోనికి వచ్చినవి. 'వర్ణనరత్నాకరము'న మాత్రము- ఆయుర్వృద్ధిక్షయకారణములు, నాడులు, శ్లేష్మాదిరోగములు, నేత్రరోగములు, పుంసవశ్యౌషధములు, వైద్యులవేషభాషలు వర్ణించు కొన్నిపద్యములను బహుగ్రంథములనుండి సంకలించి ప్రచురించియుండుటఁ గని కొంత తృప్తి కలిగెను. చారిత్రకదృష్టితోఁ

బరిశీలింపఁదగిన గ్రంథముల సేకరించుటయు, వానిని సవ్యాఖ్యానముగ విమర్శించుటయు మహాపండితులసాయమునఁ గాని సాధ్యము గాదు. సర్వగ్రంథముల సమకూర్చుట యొకయెత్తు! అందు, చరిత్ర కుపయోగించువానిని నిర్ణయించుట మఱియొకయెత్తు! పండితులప్రోత్సాహమునను, చారిత్రకపరిశోధకుల సూచనానుసారముగను, గొంతకృషి జరిగించుటకు వీలయ్యెను. సామాన్యప్రజల కష్టసుఖములను, దైనికజీవనమును, సమకాలికసాంఘికస్థితులను, అనల్పప్రజ్ఞతోఁ, దేటతెలుఁగులో, సర్వకాలము నిలుమనట్లు వర్ణించిన మహాకవి వేమన! ఆంధ్రదేశమంతయుఁ బ్రతిధ్వనించు నీపద్యములలో వైద్యవిజ్ఞాన మెన్నిభిన్నముఖముల విలసిల్లుచున్నదో సూచించుచు 1933 సం॥ర వేమనజయంత్యుత్సవసందర్భమున, రెడ్డిరాణిపత్రికకుఁ గానుకగ నొకవ్యాసమును సమర్పించితిని. ఆంధ్రవిశ్వకళాపరిషత్ కళాశాల తెనుఁగుసంఘపత్రిక యువసంవత్సరాదిసంచికయందు సోమనాథుని "బసవపురాణమందలి వైద్యపరిజ్ఞానము" అనుపేరిట నొకవ్యాసమున, ఆకాలపువ్యాధులను, సామాన్యజనులు వాడుకచేయు చుండిన చికిత్సాక్రమములను, ప్రజలలో "చలామణి" యగుచుండిన భావజాలమును, వైద్యులయౌషధప్రయోగములను, వర్ణించు విమర్శనను బ్రకటించియుంటిని. ఈమాసముననే, వేంకటనాథుని పంచతంత్రమందలి యగాధ మగువైద్యవిజ్ఞానమును, ఆశ్చర్యజనకము లగుకొన్నివైద్యసంప్రదాయవర్ణనలను, ఉదాహరించుచు, మఱియొకవ్యాసమును భారతికిఁ బంపియున్నాను. పండితవయస్యులప్రోత్సాహమునను, పుస్తకభాండాగారముల సహకారమునను, అపరిమితపరిశ్రమవలనను, ఇట్టివ్యాసములు, విమర్శనలు, వివిధకేంద్రస్థానములనుండి యనేకమాసపత్రికలయందును, సంవత్సరాదిసంచికలందును, వెలువడినఁ గాని యాంధ్రవాఙ్మయరత్నాకరమందలి ముత్తెపు రాసులు లభించునా? ఆంధ్రుల కత్యంతాదరణీయము లైనయుద్గ్రంథములు కొన్నింటినుండి వైద్యవిజ్ఞానస్ఫోరకము లగుప్రయోగంబులను, రోగవర్ణనలను, చికిత్సాపద్ధతులను, వైద్యవర్ణనలను, దిక్సూచకముగ, మచ్చున కొకటిరెండు వర్ణనల నుదాహరించితిని. పరిశీలించి యానందింతురుగాక!

వాగనుశాసనునికంటెను బ్రాచీనతరుఁ డని యెంచఁబడు నన్నెచోడుఁడు, కుమారసంభవమునఁ జూపినరసవాదశాస్త్రపాండిత్యము ప్రశస్త మని మానవల్లి రామకృష్ణకవిగారిమతము. ఇమ్మహాకావ్యమున "మంత్రంబు లౌషధముల్, భూరిరసాయనంబు, రస మాస్పర్శాదివేధుల్" అనియు, "మంత్రవాదులు, దివ్యౌషధ

వశ్యధాతురసవాదముల్" అనియు నౌషధప్రసక్తి గలదు. సంగ్రామవర్ణనమున నొక విచిత్రవర్ణన గన్పట్టెడిని. Blood Transfusion భావ మిందులేదా?

సీ. కడుఁ జెక్కుపోటులఁ బడిరక్త మిమ్ముగా వడిసి సొమ్మలువోయి వ్రాలుచోట
బయలపైఁ గ్రమ్మెడు నరుణధారలు దమమేనిక్రొంగంటులలోనఁ జొచ్చి
తెప్పరి లావెక్కి యప్పటికంటెను గాయ్వునఁ బోరాడఁ గడఁగి యాడఁ
బోవక నెత్తురుపొత్తెంతగలిగిన వా రెంతప్రాణోపకారు లైనఁ
బతుల ప్రస్తవంబ బంట్లకుఁ దీర్పంగ, వలయు ననుటఁ దెలుపువార పోలె
నిరుబలంబులందుఁ బెరిఁగి పోరాడిరి, విజయదోహలమున వీరభటులు.

పండ్రెండవశతాబ్దాంతమునుండి, బసవపురాణమును ద్విపదగ రచించిన సోమనాథుఁడును "శిశురోగములు" "నేత్రరోగములు" "చర్మరోగములు" "జ్వరములు" వీనిచికిత్సాక్రమములు తేటతెనుఁగున వర్ణించినాఁడు. కన్నులజబ్బుల నిర్ణయించుట యెంత సహేతుకముగ నుండెనో వినుఁడు.

ద్వి. సారకటాక్షవీక్షణజాల మైన, గారుణ్యజలములు గావు, యుష్ణములు
ఘర్మజలంబుల క్రమ మందెనేని, ఘర్మజలంబులు కన్నులఁ గలవె?
ఒండుదుఃఖంబేని యూహించి చూడ, రెండుకన్నులఁ గాఱకుండునే నీరు?
తా నొక్కకంటనే ధారపర్వెడిని, కానోపు నక్షిరోగంబయే మేని...
..............రెప్పపెర్గినదొ? తప్పరోనోపునో? తడికంటివిధమొ?
నొవ్వియో? పొరగప్పెనో? మాద తెవులో? పువ్వువట్రిల్లెనో? పుపుకంటిపోటో?
మయిలపడ్డదియొ? దుర్మాంసదోషంబొ? అయిరమో? వేఁడి యునక్షిరోగంబొ?

కవిబ్రహ్మ తిక్కయజ్వ, ఆయుర్వృద్ధిక్షయకారణముల వర్ణించుటయే గాక, ప్రశస్తము దానములలో నౌషధదానమును శ్రేష్ఠనియె నని మనలో నెంత మంది కెఱుక?

"తెవుళులు గొన్నవారి కవి దీరుట కౌషధమీఁగి దుర్గతుల్
దివురు జనాలిఁ బ్రోపు సుపథంబుగఁ దైర్థికకోటినన్ను బాం
ధవరహితత్వదీనశవదాహము దుఃఖితులైనవారి చే
ర్పు వెరవు నోర్పు గల్మియును బ్రస్తుతికెక్కిన మేటిధర్మముల్.
(భారతము. అను. శా. ఆ 5. వ 214).

శ్లేష్మాదిరోగవర్ణనయుఁ జొప్పించినాఁడు:-

" వినుము తెలియంగ శ్లేష్మ, బ్రస్తుదోషం బార్థఃభరఁగి యవయవములు జా

ద్యనిమాధంబులుగాఁ జే, యును లోపలబయలు నెల్ల నొయ్యనఁగప్పన్
" స్రోతోమార్గములు గఫము, చేత నిరుద్ధంబులైనఁ జెడు నింద్రియజా
తాతతశక్తులు దానను, వీతను లగు జేష్టితములు విను మనుజులకున్.
" వాయు వంగంబులందు దుర్వ్యాప్తి గదిరి,
నొవ్వుఁ దెవులునుబుట్టించుఁ గ్రొవ్వు సెరచు
సంధు లెడలించుఁ గ్రమమున నొదుఁబరఁగి
తనువు స్రానుగఁ జేసి జీవుని వెలార్చు. (భారతము. అశ్వ. ఆ. 1)

ఎఱ్ఱాప్రెగ్గడ, తెనిఁగించిన భాగమునను, మందుల నొడవ కొంత గలదు. స్త్రీవశ్యౌషధములు కామసూత్రములలోనుండునవిగదా? పురుషవశ్యౌషధముల ప్రయోగము సామాన్యముగ నుండినట్లు ధ్వనించు నీపద్యములఁగాంచుఁడు.

" అలయక మంత్రతంత్రవిధౌషధభంగులఁ జేసి యొంతయున్
వలతురు నాథు లంట మగువా!...............

" మగువ యొనర్చు వశ్యవిధిమందులు మాయలు నొందఁజూదనై
మగనికిఁదెచ్చు రోగములు మానకమూకజడాది భావముల్. (భా.అరణ్య.ఆ.5.)

కేతన జాతకర్మాదులఁ జేర్కొనుచు, శుచియై, బొడ్డుకోయుమన్నాఁడు :-

" సుతుఁ డుదయించుఁ పుడు పరిశుద్ధసమంచితశీతలోదక
ప్లుతసకలాంగుఁడై శిశువుబొడ్డటు కోయకముస్న, భక్తితో. (విజ్ఞా.ఆచా.ప.15)

మంత్రియప్పన యాంధ్రీకరించిన "చారుచర్య" యొంత యారోగ్యబోధకమో, చదివిచూడుఁడు. ఈకాలమున Dental Hygeine ప్రబోధముచేయువారు ప్రార్థనాపద్యముగఁ జదువఁదగినది యీపద్యము:-

" ప్రియపచ్యము కఫపైత్య,క్షయకారి మనఃప్రసాదకారణము శ్రుతి
ద్వయనాడీశుద్ధకరము, నయనహితము దంతధావనము మనుజులకున్.

ప్రత్యేకముగ, ఒక్కొక్కచెట్టుపుల్లయొక్క గుణమును వివరించినాఁడు, కాని మనము నేఁడుపయోగించు 'బ్రష్'ల నూహింపలేకపోయినాఁడు.

" ఆయురారోగ్యములకు మద్దిమామిడి" అఁట.

" అపచిహరము జాడ్యహరము నగుఁజండ్ర, సిద్ధించు నతుల వాక్సుద్ధి జువ్వి.

భీమకవి చాటువులలో నొక్కటిగఁ బరిగణింపఁబడు పద్యమున, తత్కాలపువైద్యసంప్రదాయము తోఁచుటలేదా?

" ఘనరోగంబులబలమా, కనుఁగొనఁగాఁ జన్మమాంబకర్మపుఫలమా

నిను బ్రార్థించెద వినుమా, మునుకొనియోగండమాల మునగకుఁజనుమా."

పదునాల్గవశతాబ్దమున నుండిన ప్రౌఢకవి మల్లనార్యుఁడు, నరకలోకము లేనిపుణ్యాత్ము లెవరో వర్ణించుచున్నాఁడు, ఏనుఁడు :-

" నైవేద్యములులేని దైవంబులకు నుపహారముల్ గల్పించునతఁ డొకండు
పగవానిరాజ్యంబుపై దండుచన్నచో భూరి గారింపనిపుణ్యుఁ డొకఁడు
వ్యాధిచేఁ బలవించువారి కౌషధ మిచ్చి యారాట మడిపిన యతఁ డొకండు.
(రుక్మాంగదచరిత్రము. ఆ. 2)

సహజపాండిత్యశోభితుండగుబమ్మెర పోతన, భాగవతమున, వైద్యశాస్త్ర జ్ఞానస్ఫోరకంబు లగుప్రయోగంబులను, వర్ణనలను, సమయోచితముగఁ జొప్పించి యున్నాఁడు. హిరణ్యకశ్యపుఁడు కులద్రోహి యగుప్రహ్లాదుని జంపుట, తననిధి యని నిర్ణయించుకొనుట కుదాహరణముగ శస్త్రవైద్యమును స్మరించినాఁడు. "అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి, శేషాంగశ్రేణికి రక్ష సేయుక్రియ'' తాను వంశమును రక్షింపఁబూనినాఁడు. భృత్యు లొప్పనిపని చేసి నయెడల రాజులయశము చెడుట యెట్లుండును ?

" తనువునఁ బుట్టినట్టి బెడిదం బగుకుష్ఠమహాగదంబుచే
వసరి తదీయచర్మము వివర్ణత నొందిన రీతి"-అట !

రోగకారణములు, పిండోత్పత్తిక్రమము, శరీరతత్త్వజ్ఞానమును, తడపుట యేగాక, చికిత్సాసూత్రములఁగూడ సూచించినాఁడు :-

" ఒకకాలమునఁబండు నోషధిచయము వేఱొకకాలమునఁ బండకుండునంద్రు."

"ఏద్రవ్యంబువలననేరోగంబు జనియించె, నాద్రవ్యం బారోగంబు మాను పనేరదు. ద్రవ్యాంతరంబులచేత నైనచికిత్స మానుపనోపు.''

ఈహాలికునకు "Anaesthesia'' పరిచిత మని తోఁచెడి:- "వాసనామూలంబున నిద్రించువాఁడు గలలు గను తెఱంగున'' అన్నవాక్యమందలి గూఢార్థ మది కాదా ? రతీదేవి "సూతికాశాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రించు'' చుండిన దఁట కాని మన 'హెల్తుఆఫీసరులు' ప్రదర్శించు పేడకొట్టములలోఁ బ్రసవింపలేదు. పోతనకాలమునను, తల్లిపాలు చాలకనో, వీలులేకనో బిడ్డలకు, ఆవుపాల నిచ్చుపద్ధతి యుండెనేమో! "బాలురకుఁ బాలు లే వని బాలెంతలు మొఱలుపెట్టి''నారఁట! శిశువ్యాధులు, వానియధిదేవతల పేర్లఁ దెలుపు పట్టీ నొసఁగినాఁడు. కంసుని "Neurasthenia'' "Hallucinations''

మొదలయినవానిని నేఁడు మనోవ్యాధులనిదానమును నేర్పు గ్రంథములకువలె విపులముగ వర్ణించియున్నాఁడు.

కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని పాండిత్యమునకుఁ, బ్రజ్ఞకును సరిహద్దులు గలవా ?

"ఉలమిరిచెక్కయుఁ మిగులనుక్కయు......" అనుపద్యము, మసర రాజ్యమందలి "వాయుతైలములఁ జూర్ణపుమందులు"ను బ్రతిపండితునకుఁ బరిచితమే! స్వాభావికవర్ణనలుకొన్ని మనవిచేసెద.

వార్ధక్యము :- "పొడిదగ్గు కంఠంబుఁ బొరిపుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొందకయమున్న. (కాశీ)

పిశాచరాజులు:- "గూనివీఁపులమీఁద గోడియై బొటెత్తి
తటివడ్డ కంకాళతండములును" (కాశీ)

మరణసూచకములు:- "మతిభ్రంశంబు చంద్రద్వయసూర్యద్వయ
దర్శనంబు పగలు తారకావీక్షణంబు"
"అసితాదివర్గంబు నామ్లాదిరసమును నన్యథాభావంబు నందెనేని"

కలిపుకాలమున సామాన్యవ్యాధి "మోఁములుఁ గాళ్లు వాయుట" నేఁడు శాస్త్రసమ్మతముగదా !

ఇఁక, వేమననాఁటివిజ్ఞానము పరికింపుఁడు :-

"మలము బిగిసెనేని మఱిప్రాణహానియా" (Intestinal obstruction)
తనదు కాలు గోయఁ దనతమ్ముఁ డేడ్చునా? (Amputations)
"ఉక్కు శుద్ధిచేసి యుంచి తినెడువాఁడు
ఉక్కుదిటవువలెనె యుండు జగతి.
"ఉక్కుసున్నము దిన నుడుగు క్షయము" (Iron and calcium)
"ఎంత చేసిచేసి యేపాటు పడినను
రాచకురుపు నమ్మరాదు సుమ్ము. (Carbuncle)

వేమన తనదివ్యజ్ఞానమహిమవలనఁ గాఁబోలు, శాస్త్రజ్ఞులు నిన్న మొన్న కనుఁగొనఁగల్గిన రహస్యముల కరతలామలకముఁ జేసికొనియుండెను :-

"ఈఁగ మెట్టి దనిన నీశ్వరువంటిది (God of destruction)
వ్యాధితెలియలేని వైద్యుఁడు మఱియేల?(Importance of diagnosis)

పదునేనవశతాబ్దప్రాంతములవాఁడైన వల్లభరాయని క్రీడాభిరామమందలి

"మందు లమ్మెడు" వానిగొడవ ను వదలుదము. మఱికి సింగన పద్మపురాణమునఁ బొగడిన ధర్మములు చూడుఁడు.

"......గోవుఁ, బంకమున బ్రాహ్మణుని రోగపంకమునను
మునుఁగకుండఁగఁగాంచిన యనఘులశ్వ, మేధలోకంబుగాంతు రమేయచరిత.

బైచరాజు వేంకటనాథుని పంచతంత్రము సమకాలికవైద్యవిజ్ఞానభాండాగార మనవచ్చును:- "ఆరోగ్యసదృశం బగులాభంబును, శీలసదృశం బగు భూషణంబును లేదుగదా !" అని యారోగ్యదేవతా ప్రతిష్ఠ చేసినాఁడు. ఆకాలమునను, ఔషధములప్రయోజనము జను లెఱుంగకపోలేదు.

" ధనమున ఋణశేషము సా, ధనమున రిపుశేష మౌషధంబున దనుసం
జనితగదశేషము" అశేష మగునఁట !

ఈగ్రంథమందలి పద్యమొక్కటి రోగులపంక్తుల వర్ణించుటయేగాక "సవాభవాని" యనుప్రయోగమువలనఁ జరిత్రాంశకవిషయనిర్ణయమునకుఁ జాలఁ దోడ్పడున ట్లున్నది :-

" చవులవేడబములు చాలించి తల సారె దఱలక చప్పిళ్లు ద్రావువారుఁ
గాయసంధుల మహోగ్రగ్రంథు లొదవిన బెట్టిదంబుగ నూలఁబెట్టువారు
రసధూమ మఖిలగాత్రచ్ఛిద్రములఁ బ్రాఁక నుబ్బలఁబడి మూల్గుచుండువారు
ఛీ సిగ్గు గాదొకో చేర మా కాఁటది యన్నఁజెల్లెలివావి యనెడువారుఁ
గోరి వాలుకుతైలంబుఁ గ్రోలువారుఁ, గుములుకుంపటి శాకముల్ గోరువారు
నైరి యొకకొంద ఱచ్చలి నలసవాభ, వానిఘాటివిహారంబు బూనుటయును.

ఇఁక విజయనగరసామ్రాజ్యచక్రవర్తి, కృష్ణదేవరాయని యుద్గ్రంథమున నిమిడియున్న శరీరనిర్మాణజ్ఞానము కేవలజంతుశాస్త్రవేత్తలకే గాని కఠినగ్రాహ్యము. ఆముక్తమాల్యదయందు రాజనీతినివర్ణించుఘట్టమున భిషజ్జనులప్రసక్తి లేశము కలదు.

" సాఖశాయనికభిషక్పూర్వకము కాల్యవేళఁ గార్తాంతికద్విజులగోష్ఠి."
" హితులు భిషగ్గ్రహజ్ఞబుధబృందకవీంద్రపురోహితుల్."

శ్లేషోపమాలంకారము ప్రయోగించి వైద్యవిజ్ఞానపరిచయము ప్రదర్శించునట్టి సీపద్యమును జదివి యానందింపుఁడు :-

సీ. తజ్జ్ఞమండలిఁ గూర్చి ధాతువుల్ దెలిసి హేమాదులఁగొని ప్రకృత్యనుగుణాల్ప
జీవనాహృతులచేఁ జెలఁగి మహాబలోద్రేకంబు మర్దన రిత్తఁజేసి

స్నేహార్ద్రుఁడగుచు నశేషంబుఁ బోషించి నరవర్ణములు తప్పూసరణు లుడిపి
సతతద్విజప్రతిష్ఠాశాలివై బలియించుపట్టులు బలియించి పలుచఁ
జేయుపట్టులు పలుచగాఁ జేసి తేజ, మెసఁగ శోధన మఱవక యెసఁగవలయు
సాంగరాజ్యము కెత్తుగ స్వాంగరాజ్య, మొక్క యెత్తుగ నృపతి యాయుష్యపరత.
(ఆముక్త. ఆ. 4. ప. 270)

ధూర్జటిమహాకవిరచితమైన కాళహస్తిమాహాత్మ్యమున, నేత్రరోగచికిత్స వై
ద్యగ్రంథములందువలె విపులముగ వర్ణింపఁబడియున్నది. (ఆ. 3. ప. 110) ఎన్ని
మందులో పేర్కొన్నాఁడు.

"విన్నమందులు తానయి కన్నమందు, లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసిన మానక యిందుమౌళి, కన్ను తొడిఁబడి నెత్తురు కాఱుటయును.

అద్దంకి గంగాధరుని కాలమున జ్వరమునకు రసౌషధము మర్యాదగాఁబోలు!

" అరవిరిదమ్మి చందమున నాననవాసన సోఁకుముట్ట న
య్యరుణసుతానుతాధరసుధాఖ్యరసౌషధసేవ చేయఁగా
దొరకినఁ గాక మిన్నకయ తొమ్మిదవస్థలతోడి మన్మథ
జ్వరము శమించునే దివిజవైద్యుఁడు వైద్యము చేసెనేనియున్.
(తపతీసంవ- ఆ. ౨. ప ౯౨.)

రుద్రకవి నిరంకుశోపాఖ్యానమునందలి "బ్రహ్మరాక్షస నివేశ భర సుదు
ర్నివార బహువిధచేష్టావికారశూరుఁ," డగుజననాథునివర్ణనయు, మంత్రు లతని
యుక్తిచేత నంతఃపురమునకుఁ గొని వచ్చుటయు, "ఎంతమాత్రం బిది?" అనుచు
నాడంబరముతో మంత్రముల జపించుమాంత్రికశ్రేష్ఠుల గుంపులను, ఆరాక్షసా
వేశంబు సకలమంత్రతంత్రముల కసాధ్యంబగుఁడు లజ్జాపరత రహస్యముగ 'పరారి'
యగుమాంత్రికులమానహానిని, అసమానకవితాప్రతిభతో వర్ణించియున్నాఁడు.
రెండుపద్యములం జదివిన, పిచ్చివానిమూర్తి మనయెదుటఁ దాండవమాడునట్లు
స్వాభావికముగఁ గవిత్వ మల్లినాఁడు.

పదునేడవశతాబ్దముయొక్క యపరార్థమున మనిన కొఱవి గోపరాజప్రణీతం
బగు"సింహాసనద్వాత్రింశిక"యందుఁగొంత వైద్యవిద్యాపరిచయము తోఁచుచున్న
ది. First-aid యెట్టిదో చూడుఁడు:-

"...కోపించి కాల్సేయి గోయించి వెడలించె, నాలోన నొకవైశ్యుఁ డతనిఁ బ్రోవఁ
గరుణ నుదుకునూనె గాపించి వగయార్చి, కూడు నీళ్లు నొసఁగి వాడుదేర్చె"

ఐశ్వర్యారోగ్యములు పరస్పరవిరుద్ధములఁట! పండితులు కాదందురా?

"...ధనవంతుఁడైనను దగులువ్యాధి, రోగహీనుండైనఁ ద్రాగ గంజియులేదు."

ముసలిరోగిని వర్ణించు పద్యమును బరికింపుఁడు:-

" పదములుఁ జేతులున్ ముడిఁగి పండులుడుల్లి నిజస్వరంబు గ
ద్గదికఁ బెనంగ నంగమున గ్రంథులువాఱఁగఁ గుష్ఠరోగమున్
ముదిమియుఁ గూడి రూపు బలుపుం బొలియింపఁగ దైన్యజీవనా
స్పదమగు బ్రాహ్మణుడు జనపాలున కడ్డమువచ్చి యిట్లనున్. (ఆ. 5. ప. 32.)

"హంసవింశతి" జీవకళ గలకావ్యములలో మిన్న. వైద్యకవర్ణనల సర్వస్వ మనినను నతిశయోక్తి గాదు. శుకసప్తతికథలు, హేమసుందరోపాఖ్యానము, విశ్వగుణాదర్శము, చాటుపద్యరత్నాకరములు, శతకసముచ్చయములు, వైద్యసంప్రదాయములఁ గొన్నిటిని జూచాయఁగఁ దెల్పుచున్నవి. లేదా విపులముగ వర్ణించునవి. వైద్యగ్రంథములు-అపరిమితమగునష్టాంగపాండితిని వెల్లడించుఁగాక. వైద్యునిహావభావముల, "సినీమాటాకీ"లవలె రూపశబ్దయుతముగఁబ్రతిబింబించుటకుఁ బూనుకొనుటకు- కవిబ్రహ్మలు, శ్రీనాథులు, ప్రబంధపరమేశ్వరులు, వారి వరప్రసాదమును బొందిన శిష్యబృందమును దప్ప నితరులు సాహసింతురా? అదిగో వచ్చెడు నాంధ్రవైద్యచింతామణిని దేఱిచూడుఁడు:-

" మెలివడుతీఁగచుట్టుజిగి, మించినపాగ జినుంగుపచ్చడం
బలబిటిప్రేలముద్రిక, యొయారపుగందపుఁబూఁత డొల్లుపో
గులు, మణిముద్రిక ల్వలపుగుల్కెడు వీడ్యము చంకవట్రమం
ద్రములతుదముచ్చెలున్ వెలయగుప్తగణుండగు వైద్యుఁడొప్పగన్. (హంసవింశతి)

ఆకాలమున సర్పవైద్యులు, విషవైద్యులు, భూతవైద్యులు మొదలగు ప్రత్యేకశాఖలపండితులు (specialists) వర్ధిల్లుటయే కాక, తమతమ యభిమానవృత్తుల సూచించు హావభావములును భిన్నముగ నుండినట్లు తోఁచెడిని. భూతవైద్యుని (Psychiatrist) మూర్తిని కవి యెంతస్వాభావికముగ, భావానురకముగ వర్ణించినాఁడో పరిశీలింపుఁడు:-

" భూతియుఁ, నావుబొట్టు మెయిఁ బూనినమూల్కెలు నుక్కుకల్కెముల్
చేతఁ గడెంబుఁ దాయెతులఁ జేర్చినమందులు మంత్రతంత్రకో
పేతపునాగబెత్త మరబెట్టెలు నొప్పగ, కాద్రకర్మఁడన్
భూతచికిత్సకుం డొకఁడు పొల్పుగ నచ్చట నుండు మానినీ. (హంసవిం)

భిషక్ప్రశంస వైద్యగ్రంథములలోనఁ దప్పనిసరి గదా! ఆదర్శప్రాయము లగుసద్వైద్యవర్ణనమునకు శుద్ధవైద్యసంగ్రహములలోఁ దావెక్కడిది? ఇఁక వైద్య దూషణ, మందులవానిమోసపుమాటలు, అర్థాభిలాష, ఆరోగ్యనాశకరౌషధ ప్రయోగప్రసక్తి, వసుకటింటిగుట్టును గూడ బయటఁబెట్ట వెనుదీయని కవిపుంగ వులకల్పనలందుఁ దక్క స్వాభిమాను లైనవైద్యులవ్రాఁతల వెతకినను దొరకునా? మానవజీవిత మనునాటకమున నంత్యరంగమున మృత్యు వను తెర వ్రాలుటకు ముందు, వైద్యుఁడు రోగిపాన్పుపార్శ్వమున నిలిచి యాక్రందనములమధ్య జరిగిం చుచికిత్సాక్రమమును (Doctor at the Bed side) వర్ణించుపద్యమును బ ఠింపుఁడు :-

సీ. బహువిధవేదనాపాటవంబున నుత్తమాంగము గబళిత మగుచునుండ
ధ్వని బైలువెళ్లక తనువైగళమువోలె మిక్కిలి బద్ధమై మెలఁగుచుండ
నాపాదమస్తక మైనదేహము మహోజ్జ్వలవహ్నిశిఖలచే బడలియుండ
విషయేంద్రియమ్ములు వివశభావమునొంది విహితస్పృహలు గల్గివేగుచుండ
నెల్లబంధులు దూరాన నేడ్చుచుండ, నార్త లగువారికెల్ల ధైర్యములు దెలిపి
మందులనుబోసి, రుజలనుమాన్ప నిందు, వైద్యకులుదప్ప దక్షులెవ్వారుగలరు.

(హేమసుందరోపాఖ్యానము).

---

# శ్రీమద్రామాయణము.

—కోమాండూరి శఠకోపాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్. కాకినాడ—

---

వాల్మీకి రచించిన సంస్కృతరామాయణము హిందువు లందఱచే గౌరవింపఁబడుచున్నది. దానిని జాలమంది నిత్యపారాయణ చేయుదురు. అది సంస్కృతమం దాదికావ్యము; అది రచింపఁబడి కొన్ని వేలయేం డ్లయినను నందలి సారస్వతచారిత్రక నైతికాధ్యాత్మిక విశేషముల ప్రాముఖ్యము నేటికిని బోలేదు.

సంస్కృతమునఁ గావ్యవాఙ్మయమునకు శ్రీమద్రామాయణమే యుపజ్ఞము. వేదసంహితలందును నుపనిషత్తులందును గలక్లిష్టక్రియారూపములు గాని, ప్రత్యేకార్థపు గూఢశబ్దములు గాని రామాయణమునఁ గానరావు. ద్రాక్షాపాకమున నతిసులభగ్రాహ్యమగు ననుష్టుప్ శ్లోకరూపమున విశేషాంశములఁ గూడఁ దేటతెల్లముగఁ దెల్పుటలో లౌకికవాఙ్మయకర్తలకు వాల్మీకియే మార్గదర్శి యాయెను. (అనుష్టుప్శ్లోకములు వచనవాఙ్మయమువలె సులభమై, వృత్తరూప మగుటచే జ్ఞప్తియం దుంచుకొనుటకుఁ జాల సుకరముగ నుండును).

రామాయణమున వాల్మీకి యచ్చటచ్చటఁ బాణినీయవ్యాకరణమునకు వ్యతిరిక్త మగునార్ష ప్రయోగములను గొలఁదిగఁ బ్రయోగించెను; అవియైనను గ్లిష్టము కాకుండ సులభగ్రాహ్యముగనే యున్నవి. అంతటి సులభశైలిని గంభీరభావముల నతిమధురముగ వెల్లడించిన మహాకవి మఱి యొకఁడు లేఁడు. మహాభారతము కేవల చారిత్రకగ్రంథపద్ధతిని వ్రాయఁబడినది; అందుఁ గావ్యలక్షణ మగుభావచిత్రణమునకుఁ బ్రాముఖ్య మీయఁబడలేదు. భాసుని దృశ్యనాటకములు చాల సులభశైలినే యున్నవి; కాని యవి భావగాంభీర్యమున రామాయణమునకును గాళిదాసీయములకును దీసిపోవు నని తోఁచును. కాళిదాసుని భావచిత్రణ మద్భుతమే; కాని యావైదర్భీరీతి వాల్మీకిశైలియంత సులభము కాదు.

నదీపర్వతాదిప్రకృతిదృశ్యముల రామణీయకమును జిత్రించుటలో వాల్మీకి యసమానుఁడు; నైసర్గికసౌందర్యపు వర్ణనమున నతిచతురుఁ డని పాశ్చాత్యపండితులచేఁ గూడ మెప్పువడసిన కాళిదాసుని రఘువంశ, కుమారసంభవ, ఋతుసంహారములలోని ప్రకృతిచిత్రణములకు రామాయణములోని వర్ణనలు మార్గదర్శకమ్ము లాయె నని తోఁచును. కొన్నిచోటులఁ గాళిదాసుని గ్రంథములందు వాల్మీకి ఛాయలు స్పష్టముగఁ గాన్పించును. వననదీగిరివర్ణనలను గథాసంవిధానములోనికి

సందర్భోచితముగ మేళవించి, కథావిషయము ననుకూలావరణమం దుంచి యా కర్షకముగఁ జేసి పాఠకుల యాహ్లాదము వృద్ధిఁజేయునైపుణికి వాల్మీకీయము మహా ఖని. మఱియు, నాయావ్యక్తుల గుణగణాములను వారివారిసంభాషణ వాగ్వాద ములమూలమున నత్యంతమధురముగ వివరించుటలోను గాళిదాసాదులకు వాల్మీ కియే దారిఁజూపెను. కవిసార్వభౌముఁ డనఁబడు కాళిదాసుఁడే కావ్యనైపుణికి భావములను రామాయణమునుండి గొనినచో, నితరుల సంగతి చెప్పనేల ? అందులకు-

"అపి కథ మృషా దైవ్యో వాచః స్వతః ప్రచకాశిరే సుచరితపరీపాకః సర్వ ప్రబంధకృతా మయమ్"అను మురారిమహాకవి యొప్పుఁదలయే చాలును. శృంగా రవీరశోకాదిరసములను సందర్భోచితముగ నొకకథయందే యనుగుణముగఁ బోష ణచేసి సమన్వయించుటలోను వాల్మీకిప్రజ్ఞ యఖండము. ఆకర్షకతకు లోటులే కుండఁగనే, ఆదర్శగుణయుతములగుపాత్రలతోను గథతోడను సూచనలరూపమున సద్గుణముల బోధించుట రామాయణమందలి ప్రత్యేకవిశేషము. అందువలననే "కావ్యం......కాంతాసమ్మితతయోపదేశయుజే" యనులక్షణము ముఖ్యముగ రామాయణమునకే యొంతయుఁ దగియున్నది. ఈవిషయమునఁ దరువాతవచ్చిన గ్రంథము లేవియు నాదికావ్యమును మీఱలేవు. పరమార్థవిషయ మటుండఁ గావ్యత్వరమణీయతను బట్టియు, ననేకులకు రామాయణపారాయణము ప్రీతికర ముగ నున్నది.

రామాయణముయొక్క చారిత్రకప్రాముఖ్య మిటీవలిపరిశోధనవలన విశద మైనది. శ్రీరాముని జీవితకథలోఁ జారిత్రకముగ ముఖ్యవృత్తాంతము రావణపా లితు లగురాక్షసుల జయించుట. ఈరాక్షసు లెవరో తెలిసికొనవలసియున్నది. శ్రీరామచరిత్రకాలమునాఁటికి హిమాలయపర్వతప్రాంతమందును, ఆర్యావర్తమం తటను, ఆర్యనాగరకత వ్యాపించుచుండినట్లు కనఁబడును. వింధ్యపర్వతముల ప్రాం తమున వానరులను మఱియొకజాతివా రుండిరి. ఆర్యావర్తమం దచ్చటచ్చటను మహాటవులలోను దక్షిణదేశప్రాంతమందును లంకలోను వేఱొకజాతివారు సర్వాధి కారులుగ వసించుచుండి రనితోఁచును. పురాతత్త్వవేత్తలు (archæologists) జాతిశాస్త్రజ్ఞులు (ethnologists) గూడ భారతీయనరదేహముల పరీక్షచే భరతఖండమున మూఁడు వేర్వేఱుజాతులవా రుండినటులు దెలుపుచున్నారు. ఈ జాతులను ఆర్య, ద్రావిడ, తురేనియను లనుట వాడుక, ముఖవర్చస్సులోను,

శిరోనిర్మాణమందును, దేహాకారమందును, ఈమూఁడుజాతులమధ్యను స్పష్టమగు భేదము లుండెను. (అప్పటినుండి చాల జాతిసాంకర్యము కలిగినది ; ఐనను నప్పటికి నచ్చటచ్చట నీమూఁడురకములవారును గనఁబడుదురు) ఇట్లే మనదేశమందు జనులు(philologists) మాటలాడుకొను వివిధభాషలు మూఁడు ప్రత్యేకకుటుంబములలోని వని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించి యున్నారు. (ఇందు సంస్కృత, ప్రాకృత, హిందీ, బంగాళీ మున్నగునవి 'ఆర్య' భాషలు; అరవము, కన్నడము మొదలైనవి ద్రావిడములు; ఇవిగాక కొండతాటవికులు మాటాడుకొండభాషలు 'ముండా' అనఁబడు మూఁడవజాతిలోనివి. మనయాంధ్ర మసలు ద్రావిడకుటుంబముదయ్యుఁ జిరకాల మార్యసంపర్కమునఁ బెరిఁగి 'ఆర్య' మిశ్రిత మైనది.) అప్పటి యార్యులకు ద్రావిడాదుల ప్రత్యేకాచారములును విచిత్ర వేషభాషాదులును వికృతముగను దుర్బోధముగను, గన్పట్టి యుండవచ్చును. వారలమధ్య సంఘర్షము నధికమై యుండెను. ఆర్యులు వారిని దిరస్కారభావములతోఁ జూచుచు, వారల దస్యు లనియు రాక్షసు లనియు వానరు లనియుఁ బిల్చుటలో నాశ్చర్యము లేదు.

రాక్షసులు నల్లనివారనియుఁ గ్రవ్యాదులు నిశాచరులు నరాశనులు ననియు రామాయణమున వర్ణింపఁబడినది. తురేనియనులు మిక్కిలి నల్లగను బలిష్ఠులుగను వికృతదీర్ఘకాయులు మహాభుజులుగను, ముఖాకారమున నితరజాతుల కంటెను గేవలభిన్నులుగను నుండి, కొండలలోను, మహాటవులందు వసింపుచు, నర్ధరాత్రి వేళలఁగూడ స్వేచ్ఛగఁ జరియించుట కలవడి కామచారులై, పచ్చిమాంసమును దినుచుండి రనియు, వివాహాదిసాంఘికవిషయములందు వీరికిని నితరజాతులకును జాల భేద ముండె ననియును, ప్రాచీననరశాస్త్రజ్ఞులు(Anthropologists)వివరించియున్నారు. ఇట్టిజాతినరాశననరులు (cannibals) ఇప్పటికిని మనదేశమునకు సమీపమం దున్నసుమిత్రా బోర్నియో మున్నగు నాగ్నేయదిశాద్వీపములందును మధ్యాఫ్రికాలోను గొంచెముగ మిగిలియున్నారు. వారిలోఁగొందఱు నేటికిని నరాశనులుగనే యున్నారు. ఈజాతిలో స్త్రీలను నిర్బంధముగ నెత్తుకొనిపోయి వారల వివాహమాడు నాచార మచ్చటచ్చట నిలిచియున్నది. ఈసంప్రదాయ పద్ధతిని 'రాక్షసవివాహ' మని యార్యు లనుట సహజమే. పూర్వ మొకప్పుడు లంకయు, నాగ్నేయద్వీపములును దక్షిణమధ్యాఫ్రికాలును మనదక్షిణభారత దేశముతోఁ గలసి యొకమహాభూమిగ నుండియుండె ననియు, మహాప్రళయభూకంపాదులవలనఁ గ్రమముగఁ గొన్నిభూభాగము లణఁగిపోయి, యందు సముద్ర

మావరింపఁగాఁ గాలక్రమమునఁ దుదకుఁ బ్రస్తుతస్థితి యేర్పడిన దనియు, నీప్రాంతములన్నిటిలోని పురాతనవస్తువులను జీవజాతులను భూస్వభావములను బరీక్షించిన భూతత్త్వజ్ఞు (geologists) లభిప్రాయపడుచున్నారు. ఈసందర్భము లన్నింటిం బట్టి రామాయణభారతకాలములనాఁటి రాక్షసు లీమోటు (తురేనియను) జాతివారై యుండు రని తోఁచును. కావ్యగ్రంథముగ రచింపఁబడిన రామాయణమున రసపుష్టికై కవి కొంతవఱ కతిశయోక్తి మున్నగు నలంకారముల నుపయోగించి, యార్యవిరోధులుగ నుండినరాక్షసుల నమానుషులుగను నతిక్రూరులుగను జిత్రించుటలో నాశ్చర్యము లేదు.

ఈజాతులనడుమ నాహారవిహారాదులందు మొదటఁ జాలభేద ముండినను, జిరకాల మొకదేశమం దుండుటచే వారలతోఁగొంతసంపర్కము కల్గుట సహజము. పూర్వకాలమందే యక్షగంధర్వకిన్నరాదులకును రాక్షసజాతికిని గూడఁ గాలక్రమమున సంబంధ బాంధవ్యము లేర్పడినటు లుత్తరకాండ రామాయణభారతభాగవతములందలి కైకసీ, హిడింబా, జరాసంధాదుల గాథలవలనఁ దెలియుచున్నది. రాక్షసనివాసిత మగుప్రాంతము లనార్యు లాక్రమింపఁదొడఁగినప్పు డుభయజాతులకును సంఘర్షము కల్గెను. ఆర్యఋషులు వింధ్యము దాఁటి దక్షిణాపథమున వలసకు బయలుదేఱి 'యాశ్రమ'ములను స్థాపించినకొలఁది నాప్రాంతపు జాతులతో నీసంఘర్షము తీవ్రము కాక తప్పదయ్యెను. అచటి దేశీయజాతులలోఁ గొంద ఱార్యు లనాగరకత నవలంబించి, వారికి లోపడి యనుచరులై దేశమంతటను సంఘములలోఁ గలసి వసించుచుండి రనియు, మఱికొందఱు మాత్ర మట్లు చేయక యార్యులకు దూరముగఁ గొండలలోను నడవులలోను వసించుచు, నార్యసంపర్కము లేకుండి రనియుఁ, బెక్కండ్రు చారిత్రకులభావము. ఈరాక్షసజాతి మనదేశపు టాదిమనరజాతియే యనియు, వారిలో నితరప్రాంతములందు మనభారతదేశమందును, జిరకాలము క్రిందనే నరాశనత్వాదులుపోయి మార్పులు కల్గెననియు, నూహింపవచ్చును. నేఁటి 'యాదియాంధ్రులు', నాదిద్రావిడులు మొదలగువా రాయాదిమజాతిసంతతివారు కావచ్చును. వా రార్యద్రావిడులను, వార లనార్యద్రావిడులును బరస్పరము బహిష్కరించుటచే నుభయకక్షులమధ్యమునను నస్పృశ్యత యేర్పడి యుండవచ్చును.

మనదేశమున శ్రీరామునికిఁ బూర్వ మనేకచక్రవర్తు లుండినను, దక్షిణదేశమంతను బూర్తిగ జయించి, యచటిపాలకులను సామంతులుగఁ జేసికొని, దేశ

మంతటపైని లంకపైని గూడ సామ్రాజ్యమును స్థాపించుట శ్రీరాములవలననే జరిగినది. ఒక్కభారతజాతి యేర్పడుటయు, భరతఖండ మేకరాజ్య మగుటయు, శ్రీరాములజీవితముయొక్కయుఁ బాలనయొక్కయు ముఖ్యఫలితములు. ఆగర్భశ్రీమంతుఁడు చక్రవర్తిజ్యేష్ఠపుత్రుఁడునయ్యుఁ బాదచారియై దేశమందలి వివిధప్రాంతములందు సంచరించి జనుల కష్టసుఖముల గ్రహించి స్వయముగ ననుభవమునొంది, సమరమున నాయకుఁడై రాజ్యమును విస్తరింపఁజేసి, శాంతి నెలకొల్పి, తరువాతనే రాజ్యాధికారము వహించుటచే, రామరాజ్య మాదర్శరాజ్యము కాఁగల్గెను.

ఇం కొకవిశేషము. అమెరికా మున్నగు నితరదేశములఁగూడ నార్యజాతీయులు పూర్వ మాక్రమించి, జయించిరి. కాని యాయార్యు లాప్రాంతములదేశీయు లగునాదిమజాతుల ననేకవిధములఁ జిత్రహింస చేసి, వారలను నామావశిష్టులఁ జేసినసంగతి చరిత్రలోఁ బ్రసిద్ధము. శ్రీరామనాయకత్వమున భారతీయార్యులు రాక్షసుల నోడించి జయించినను, యుద్ధానంతరమున సామ్రాజ్యమును స్థాపించినమీఁదట, రాక్షసవంశీయు లగువిభీషణాదులు సామంతరాజులుగ నిలిచిరి. ఇట్లే మధ్యప్రాంతపు సుగ్రీవాదులు వానరరాజ్యపుసామంతరాజు లైరి. అందుచే, నార్యేతరు లగురెండుజాతులవారును నశింపక ప్రజాసామాన్యములో భాగముగ నుండుచువచ్చినటులు గన్పడును.

శ్రీరాముని సంచారసందర్భమునను దిగ్విజయసందర్భమునను రామాయణమున వర్ణింపఁబడిన యుత్తరప్రాంతపుఁ గోసలము మొదలు దక్షిణమున లంకవఱకుండినదేశములందలి రాజ్యములు జాతులు నదీపర్వతములు మున్నగువాని వివరము లప్పటి మనదేశపు పరిస్థితులను దెల్పును. రామాయణమందలి వివిధసంగతు లప్పటిభారతచరిత్రను నిర్మించుటకుఁ జారిత్రకపరిశోధకుల కెంతయు నుపయోగించును.

రామాయణమందలి నైతికసూచనలును ముఖ్యములే. పితృవాక్యపాలనము, ఏకపత్నీవ్రతము, భ్రాతృవాత్సల్యము, దీనజనోద్ధరణము, ప్రజారంజనపరత, దుష్టశిక్షణము, సాహసము, మున్నగు యోగ్యగుణములచే శ్రీరాముఁ డాదర్శపురుషుఁడు, ఆదర్శచక్రవర్తి. ఇట్లే సీత యాదర్శస్త్రీ, లక్ష్మణాదులు నట్లే పరిగణింపఁబడుచున్నారు. కైక కేవల దుష్టస్త్రీ యని కొంద అందురు; మఱికొంద ఱామెకు వివాహకాలమున దశరథరాజు చేసిన వాగ్దానమునుబట్టి యామె చర్యలో దోషములే దందురు. యువరా జగు శ్రీరాముఁ డంతఃపురమున విషయలోలుఁడై

మంత్రి సేనానులపై నాధారపడనక్కఱలేకుండ, గొన్నియేం డ్లన్నిప్రాంతములందు ను సామాన్యనరుఁడుగఁ దిరిగి విశేషానుభవము సంపాదించి, శాంతి నెలకొల్పి, తరువాతనే చక్రవర్తియై యనన్యసామాన్యముగఁ బాలింపఁగల్గుటకుఁ, గొంతవఱ కైనను గైకయే కారణ మని తెలిసికొనవలెను. రావణునియందును సాహసము, లోకపరిజ్ఞానము, పాలనశక్తి మొదలగు నున్నతగుణము లనేకములు గన్పించును. కాని యెట్టిమహాబలధీసంపన్నుఁ డైనను నరుఁడు కించిద్జ్ఞుఁడే యనియు, మాన వుఁడు ప్రకృతిధోరణికి నీశ్వరేచ్ఛకును లోపడియుండక తప్ప దనియు, లోకక్షే మమునకుభిన్న ముగఁదానే సృష్టికీశ్వరుఁడ నని గర్వించివిజృంభించువానికిఁ దుదకు హాని కల్గి తీఱు ననియు రావణపాత్రవలన మనము గ్రహింపఁగల్గుచున్నాము.

ఎన్నినీతుల నైనను బ్రత్యక్షముగ బోధించుట కంటెఁ గథారూపముగఁ గనఁబఱచి సూచించినచో నది జనుల కెక్కువ యంగీకార్య మగును. ఇట్లు కాం తాసమ్మితముగ సూచనలవలననే చక్కని యుపదేశ మొనరించుట యుత్తమకావ్య లక్షణము. వాల్మీకి యిట్టిపద్ధతి నవలంబించుటచేతనే శ్రీరామకథ మనదేశీయవాఙ్మ యము లన్నింటిలోను నాగరకప్రపంచమునను శాశ్వతస్థాన మలంకరించినది.

రామాయణకథయందు నిగూఢముగ నున్నయాధ్యాత్మికవిశేషములఁ బెక్కండ్రు పండితులు వివరించియే యున్నారు. ముఖ్యపాత్ర లగుసీతారాములచే లౌకికస్త్రీపురుషులే గాక, జీవాత్మపరమాత్మలు గూడ నుద్దేశింపఁబడియుండవచ్చు ను. భక్తాగ్రేసరు లగు చైతన్య, రామకృష్ణపరమహంసాది జీవన్ముక్తులు, తాము భార్యగను, ఈశ్వరుఁడు భర్తగను భావించుకొని భక్తి నిమగ్నులై రని వారలచరి త్రలలో ననేకనిదర్శనములు గలవు. రాధాదిగోపికలకుఁ గృష్ణునియందుఁ గలిగిన ప్రేమ కట్టిభావమే కల దని యుఁ బెద్ద లందురు. అట్లే సీత జీవాత్మ యనియు, జీవాత్మ మారీచుఁ డనునజ్ఞానముచే నాకర్షింపఁబడి, స్వస్థితిం గోల్పోయి, దశశిర స్సులు, దశేంద్రియములు గలరావణుఁ డనురజోరూప మగునహంకారబలమున సముద్ర మనుసంసారముచే నావృత మగు లంక యనుశరీరమున బాధింపఁబడు టయు, నాలంకాశరీరమం దధికారము గలరావణకుంభకర్ణు లను రజస్తమోగుణ ములు విభీషణుఁ డను(వానితోఁబుట్టువగు)సత్త్వగుణసహాయముననే జయింపఁబడి, జీవాత్మ త్రిగుణాతీతుఁడై మోక్షమునొంది, తిరుగ శ్రీరాము లను పరమాత్మసాన్ని ధ్యమును జేరుటయు, నిందులకు సుగ్రీవాంజనేయాదు లను జ్ఞానభక్త్యాదులు సహ కారు లగుటయును, మొదలగు నంతరర్థములు సూచింపఁబడుచున్నవి. మఱియు

సాటిలేని దని వర్ణింపఁబడు రామరావణయుద్ధము భౌతికమే కాదనియు, భగవద్గీత పదునాఱవయధ్యాయమునం జిత్రింపఁబడిన దైవప్రకృతి యాసురీప్రకృతుల నిత్యసంఘర్షణ కిది లక్ష్య మనియుఁ దోఁచును. 'అసత్య మ ప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం......'ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽశుభాః; 'అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః' 'ఈశ్వరోహ మహం భోగీ... కోన్యోస్తి సదృశో మయా' అని గీతలోఁ జెప్పిన యాసురీప్రకృతులు రావణునియందు వర్తించుచున్నవి. ఇట్లే యహింస, సత్యము, త్యాగము మున్నగు దైవీప్రకృతిలక్షణములు శ్రీరామునికి వర్తించును. దైవీప్రకృతికి నాసురీప్రకృతికిని సంఘర్షణ మెప్పుడును నిరంతరము జరుగుచునేయుండును. ఈయుద్ధమున మొదట నాసురీప్రకృతి విజృంభించినను, దైవీప్రకృతియే తుదకు జయించు నని రామాయణకథ స్పష్టపఱచుచున్నది.

ఇట్లు కావ్యముగను నితిహాసముగను నాధ్యాత్మికగ్రంథముగను గూడ రామాయణము వాఙ్మయమం దగ్రస్థానము వహించుచున్నది.

---

# పిష్ఠపురచరిత్ర.

—వడ్డాది శ్రీరామచంద్రమూర్తిగారు, B. A. (Hons.) కాకినాడ.—

పిష్ఠపురము, (నేటిపిఠాపురము) క్రీస్తుశకారంభమునుండియు, సుప్రసిద్ధమగు రాజధానీనగరమయి యుండెడిది. మొదటఁ బిష్ఠపురము ప్రఖ్యాతబౌద్ధక్షేత్రమై యుండెననుటకుఁ బ్రబలప్రమాణము లగపడుచున్నవి. పిఠాపురమునకు సమీపముననున్న కొడవలియొద్ద, నాంధ్రరాజగు చందసాతిరాజు రెండవరాజ్య సంవత్సరమున, శశియను నాతనిమంత్రి యచ్చటి బౌద్ధస్తూపములకుఁ గొన్ని రాతి నూతులఁ గట్టించినట్లు శాసనాధారములు కలవు. (Ep. Ind. XVIII, 316)

నేఁడు గూడఁ బిష్ఠపురమున రెండు బౌద్ధస్తూపములు భూగర్భమున దాఁగియున్న వని నాయనుమానము. మొదటిది దివానుబహద్దూరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారి పొలములో నున్నది. స్తూపముయొక్క శిఖరము మాత్రము మనకిప్పుడు కనఁబడుచున్నది. అచ్చటి యిటికలయొక్క పరిమాణము, చేసినవిధానము చూచినయెడల, నాకట్టడము క్రీస్తుశకారంభము నాఁటి దని నిర్ణయింపవలసియున్నది. ఈకట్టడమున కుపయోగించిన యిటికలమాదిరి యిటికలాంధ్రదేశమందలి యితరబౌద్ధస్తూపములయొద్దమాత్రమే కలవు. బౌద్ధస్తూపములన్నియు నేకారణముననో తెలియదు కాని, నేఁడు 'లంజదిబ్బ' లని వ్యవహరింపఁబడుచున్నవి. పిష్ఠపురమందలి యీబౌద్ధస్తూపమును గూడ నేఁడు 'పింజర్లసాని దిబ్బ' యని వ్యవహరింతు రని నా కచటివారు చెప్పిరి. ఇదిగాక పైస్తూపశిరమును గప్పిన దిబ్బను జేరియున్న శ్రీమల్యాల కామేశ్వరరావు గారి పొలములోఁ గొంత మెరకప్రదేశమును వారు 1931 వ సంవత్సరమునఁ ద్రవ్వించుచుండఁగాఁ బెద్ద యిటికలు, స్తంభములకుఁ బైనున్న గుండ్రని తెల్లని మలుపురాళ్లు, మఱికొన్ని కట్టడపుఁబనిముట్లుఁ గానవచ్చినవి. దీనిని బరీక్షించుటకై 1933సం. లోఁ బురాతత్వశాఖాధికారి (Director of Archæology, Mr. H. H. Khan) వచ్చి కొమ్మిరెడ్డివారి పొలములోని దిబ్బనుజూచి యదియొక బౌద్ధస్తూపమనియుఁ బిఠాపురపుబజారులోనున్న సన్న్యాసిరాళ్లు స్తూపమునొద్ద నుండెడిబుద్ధవిగ్రహము లనియునభిప్రాయపడి రఁట. (ఆంధ్రపత్రిక 1936 సం. ఆగస్టునెల, 5 వ తేది) ఇట్టిదే వేఱొకటి మిషన్ హాస్పటల్ ప్రాంతమున ములుకొట్లవారి మాన్యములోఁ గలదు. వీనిని శ్రీశ్రీశ్రీ మహారాజావారు త్రవ్వించి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులవుదురుగాక!

సుప్రసిద్ధబౌద్ధక్షేత్రమై, 15 వ శతాబ్దమునఁ గవిసార్వభౌముని పొగడ్తఁగాంచి, నేఁ డాంధ్రభోజునిచేఁ బరిపాలింపఁబడుచున్న యీపిష్ఠపురచరిత్ర క్రీస్తుశకారంభము

నుండి తూర్పుచాళుక్యులవశమగువఱకు వ్యాసమునఁ గ్లుప్తముగా వ్రాయఁబడినది. (ఇదినా Thesis లో నింతకంటెవిపులముగను, నేఁటివఱకును వ్రాయఁబడినది.) *

ప్రప్రథమమునఁ బిష్ఠపురమనునామము సముద్రగుప్తుని యలహాబాదుశాసనమందుఁ గనవచ్చుచున్నది. (C. I. I. Vol) III. P. 7) దానినిబట్టి పిష్ఠపురమును మహేంద్రుఁడు లేక మహేంద్రగిరియను రాజు పాలించినట్లు తెలియుచున్నది. (Indian Culture Vol. III, Part I, P. 230) ఈమహేంద్రవర్మ యాంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమయిన తరువాత, పిష్ఠపురమును స్వతంత్రముగఁ బాలించిన యొకసామంతుఁ డని భావింపవలసియున్నది. మహేంద్రుఁడు లేక మహేంద్రవర్మ సముద్రగుప్తుని సమకాలికుఁ డగుటచే, క్రీ. శ. నాల్గవశతాబ్దాది నుండి యుండును.

శాసనలిపి పరిణామములవలన సముద్రగుప్తుని యలహాబాదు శాసనము తర్వాతి వనఁదగిన రెండుశాసనములు పిష్ఠపురరాజధానీనగరమునుండి యాజ్ఞాపింపఁబడినవి. మొదటిది మగధవంశీయుఁడును, వాసిష్ఠీపుత్రుఁడును, గలింగాధిపతియునైన శక్తివర్మది. (Ep. Ind. XII P. 1.) రెండవది దేవరాష్ట్రాధిపతియు ననేక సమరసంఘట్ట విజయాధిగతయశస్కుఁడును, వాసిష్ఠీకులచంద్రుఁడును నగు మహారాజగుణవర్మపౌత్రుఁడును, శ్రీమహారాజ ప్రభంజనవర్మప్రియపుత్రుఁడును, స్వబలవిక్రమోపార్జితభూర్నయవినయ సత్వసంపత్త్యాధిగతయశస్కుఁడును గళింగాధిపతియునగు శ్రీమహారాజ అనంతవర్మయొక్క కిందొప్పశాసనము. (J. A. H. R. S. VIII, P. 160) పై రెండును విజయపిష్ఠపురాధిష్ఠానమునుండి శాసింపఁబడినవి. మహారాజ అనంతవర్మ శాసనము వేఱొకటి విజయదేవపురమునుండి యాజ్ఞాపింపఁబడినది. ఈశిరిపురము తామ్రశాసనమును క్రజోత్పత్తి భాద్రపదమాసభారతియందు మండ నరసింహముగారు ప్రకటించిరి. వారీశాసనకాలమును జర్చించి శిరిపురము శాసనము 86 A. D. నాఁటి దనియు, కిందొప్పశాసనము దానికి 10 యేండ్లు వలిదనియువ్రాసియున్నారు.(Bharati, Sept. 1931 and J. A. H.

* ఈదిబ్బలను ద్రవ్వించినచో నివి రెండు విఖ్యాతబౌద్ధస్తూపము లని నాదృఢవిశ్వాసము. మైసూరులో నాకు Archaeological Survey of India Asst. Director గారగు K. N. Dikshit గారి పరిచయభాగ్యము లభించినది. వారితో నీస్తూపములవిషయమై ముచ్చటించి, వీనిని ద్రవ్వించి యాంధ్రదేశమునకిప్పుడు ప్రభుత్వపురాతత్వశాఖవారు దర్శింతు రని ప్రశ్నించితిని. వారు, గవర్నమెంటువారిప్పట్టున నీకార్యమునకుఁ బూనుకొన రనియు, శ్రీశ్రీశ్రీ మహారాజావారో, లేక యాంధ్రవిశ్వవిద్యాలయమువారో పూనుకొనినచో, దమడిపార్టుమెంటువారొకరికి ద్రవ్వించుటకుఁ దగిన శిక్షణ నీయఁగల మనిచెప్పిరి.

R. S. VIII, P. 153) కాని గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు Annual Report of South Indian Epigraphy for 1931—32 లో నీశిరిపురపుశాసనమునుగూర్చి వ్రాయుచు, ఈశాసనము క్రీ. శ. 528 సం. నాఁటిదని నిశ్చయించెను. లిపిపరిణామమునుఁబట్టి చూచినచో రాగోలు, కిందొప్పశాసనములు క్రీ. శ. నాలుగు, ఐదవశతాబ్దివానివలెఁ గన్పట్టును. ఈశాసనములకు క్రీ. శ. 86, 528 సంవత్సరములు రెంటినుగూడఁ దప్పునినాయభిప్రాయము. లిపిపరిణామము ననుసరించి శక్తివర్మ రాగోలు శాసనము, అనంతవర్మకిందొప్ప, శిరిపురము శాసనములు క్రీ.శ. నాల్గవశతాబ్దాంతమునఁనో, అయిదవశతాబ్దాపైనోనిర్ణయించినబాగుండును.

వాసిష్ఠీవంశము—పై రెండుశాసనముల ననుసరించి, మనకు నాల్గుతరములరాజులు, వాసిష్ఠీవంశమున నున్నటులు తెలియుచున్నది. సముద్రగుప్తుని శాసనమునఁ జెప్పఁబడిన మహేంద్రుఁడు లేక మహేంద్రవర్మ కూడ నీవంశపువాఁడై యుండవచ్చును. ఆతఁడావంశజుఁడై ననుగాక పోయినను, అనంతవర్మయు, నాతనితండ్రి, తాతలును, మహేంద్రవర్మతరువాత పిష్ఠపురరాజ్యమేలిన ప్రభువు లని చెప్పకతప్పదు.

కిందొప్పశాసనములో గుణవర్మయు నాతని కుమారుఁడు, ప్రభంజనవర్మయు, నాతని కుమారుఁడు, అనంతవర్మయుఁ జేర్కొనఁబడిరి. ఇఁక రాగోలు శాసనమునఁ జేర్కొనఁబడిన శక్తివర్మ వీరికిఁ బూర్వపువాఁడా లేక తరువాతివాఁడా యనునది నిశ్చయింపవలసియున్నది. కిందొప్పశాసనమునందు గుణవర్మ దైవరాష్ట్రాధిపతియని వర్ణింపఁబడెను. కనుక ప్రథమమునఁ గళింగరాజ్యమును పాలించినది, యనంతవర్మవలెఁ గనిపించును. కళింగాధిపతి శక్తివర్మ వీరితరువాతివాఁ డని నాయభిప్రాయము. క్రీ. శ. 350 ప్రాంతమున మహేంద్రవర్మరాజ్య మంతరించి, వాసిష్ఠీవంశము పాలన మారంభించియుండును. ఈవంశపురాజులు నలుగురును గలిసి నూఱు వత్సరములు లేక 80 సంవత్సరములకాలము రాజ్యమేలియుందురు. అనఁగా క్రీ. శ. 450 ప్రాంతమున వీరిపరిపాలన మంతరించియుండును. ఈనాఁటికి వేంగీదేశము శాలంకాయనుల పాలనమునుండి తరువాత విష్ణుకుండి వంశపురాజుల వశ మాయెను. శాలంకాయనులు పిష్ఠపురప్రాంతముఁ బాలించియుండలే దనుటకు వారి శాసనములే సాక్ష్యము కాని విష్ణుకుండినులు మాత్రము గోదావరిని దాఁటి తమరాజ్యమును వ్యాపింపఁజేసినట్లును, వారికిని (కళింగాధిపతి యగు మొదటి) ఇంద్రవర్మకును, యుద్ధము జరిగినట్లు మనకుఁ బృథ్వీమూలుని గోదావరిశాసనమువలనఁ దెలియుచున్నది. కనుక వాసిష్ఠీవంశపరిపాలన మంతరించిన తర్వాత పిష్ఠపురము విష్ణుకుండి వంశజుల వశ మైనట్లు మన మూహించవలసియున్నది. ఒకవైపునఁ

గళింగాధిపతులు కళింగనగరము రాజధానిగా గోదావరివఱకును దమ రాజ్యము వ్యాపింపఁ జేయుటకును, మఱియొకవైపున విష్ణుకుండి వంశజులు కళింగాధిపతులను విజయనగరము, సింహాచలప్రాంతముల నాఁపుచేయుటకును బ్రయత్నించి ఘోరమైన యుద్ధముల నొనర్చినట్లు మన కానాఁటి శాశనములఁ బరీక్షించినఁ దెలియును. (Ref. my paper on the Genealogy of the Vishnu Kundins read before the General Body of the Andhra Historical Research Society, Rajahmundry) కాని వీరిరువురును బరస్పర మీరాజ్యమునకై పోరాడుచుండ వేఁగీదేశము సింహాచలమువఱకును దూర్పుచాళుక్యరాజుల వశమాయెను. మనము తూర్పుచాళుక్య రాజులపాలనమునఁ బిఠాపుర మెట్లుండెనో విమర్శించుటకుఁబూర్వ మిది, విష్ణుకుండి వంశజులక్రింద నెట్లుండెనో చూడవలసియున్నది. విష్ణుకుండివంశజుల శాసనములఁ బట్టి వారికిని గళింగనగరాధిపతులగు కళింగరాజులకును యుద్ధములు జరుగుచుండెనని పైనిఁజెప్పియుంటిని. పిఠాపురము నామ మాత్రమున విష్ణుకుండివంశజుల వశమైనను దాని నొక ప్రత్యేక రాజవంశము పరిపాలించుచు విష్ణుకుండివంశమున బలవంతుఁడైన రాజున్నచోఁ గప్పము గట్టుచు లేనిచోఁ దమ స్వాతంత్ర్యము నెలకొల్పికొనుచుఁబిఠాపురము నేలుచున్నట్లు మనకు శాసనాధారము లగపడుచున్నవి. (పృథ్వీమహారాజు తాణ్డివాడశాసనము. Edited by Dr. N. Venkata Ramanayya in భారతి) పైశాసనము ననుసరించి పృథ్వీమహారాజు పిఠాపురము రాజధానిగా నేటి తూరుపుగోదావరి జిల్లాప్రాంతమును బాలించుచున్నట్లు తెలియుచున్నది. ఇది నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసినట్లు...6 వ శతాబ్దాంతముననో లేక 7 వ శతాబ్దాదినో యుండియుండు నని నా యభిప్రాయము. పృథ్వీమహారాజు శాసనమువలన మనకు మూఁడు తరముల రాజులు లభించుచున్నారు. పృథ్వీమహారాజుతాత రణదుర్జయుఁడు. ఈతఁడు మహారాజు. ఈతని కుమారుఁడు విక్రమేంద్రుఁడు. ఈతని కుమారుఁడు ప్రవర్ధమాన ప్రతాపావనత సమస్తసామన్త మణ్డలనిజభుజవిజయోదయాధిగత యశోవిశేషభూషణుఁడు. శ్రీ రమాకాశ్యపగోత్రుఁడు. పరమబ్రాహ్మణ్యుఁడు. మాతాపితృపాదానుధ్యాతుఁడు.

"పృథ్వీమహారాజు జనకుఁ డగు విక్రమేంద్రునిపేరు నామసాదృశ్యముచే విష్ణుకుండివంశపు రాజులను స్మరణకుఁ దెచ్చుచున్నది. వేంగినేలిన రాజవంశములందు విష్ణుకుండిరాజులలో మాత్రము విక్రమేంద్ర నామధారు లగపడుచున్నారు. పిఠాపురమునేలిన రమాకాస్యపసగోత్రజులకును విష్ణుకుండిప్రభువులకును నెద్ది

యేని సంబంధ ముండిన నుండవచ్చును.

సామంతులు తమ రాజులపేర్లఁ దమ బిడ్డలను బిలుచు నాచారము కలదు గనుక పృథ్వీమహారాజు తండ్రియగు విక్రమేంద్రున కాపేరు కలిగెనని తలఁచితి మేని, రణదుర్జయుఁడు విష్ణుకుండి రెండవవిక్రమేంద్రుని సామంతుఁడై యుండునని యూహింపఁదగియుండును. ఇతఁడు తనరాజుపైఁ దిరుగుఁబాటుచేసి స్వతంత్రుఁడా యెనని యెంచవలసియుండును. ఇతఁడు కళింగాధిపతియుఁ బూర్వగంగవంశీకుఁడును నగు నింద్రవర్మచే నిహతుఁడైనట్లు పృథ్వీమూలుని శాసనమువలనఁ దెలియు చున్నది. తరువాతి విష్ణుకుండిచుల యధికారము (మూఁడవమాధవవర్మ కాలము వఱకు) గోదావరి కుత్తరమున సాగిన చిహ్నము లేమియుఁగానరావు. రణదుర్జయ విక్రమేంద్రుల యనంతరము పృథ్వీమహారాజు స్వామిద్రోహియై స్వాతంత్ర్యము వహించె నని యూహింపవచ్చును. పిష్ఠపురమున నితఁడు రాజ్యము సేయుచుండఁ గా నష్టమైన విష్ణుకుండినుల దొరతనమును గళింగమున మఱలఁ బ్రతిష్ఠించుటకు మూఁడవమాధవవర్మ ప్రయత్నము సల్పెనని యాతని యాంధ్రసాహిత్యపరిషచ్ఛా సనములోని 'ప్రాగ్గిజ్జగీషయా ప్రస్థితః గోదావరీ మతీతరన్' అను వాక్యమువలన నూహింపవచ్చును." (భారతి 1935 తాన్దివాడశాసనము.)

మూఁడవమాధవవర్మ విజయము చిరస్థాయి కాలేదు. గోదావరిని దాఁటిన తరువాత నాతఁడు పొలమూరు శాసనమును దానముచేసెను. అటుపైని కొలఁది కాలమునకే యాతఁడు మృతుఁడాయెను.

ఆనాఁటి కప్పుడే తూర్పుచాళుక్యవంశము స్థాపింపఁబడినది. రెండవపుల కేశివల్లభుఁడు పిష్ఠపురమును సాధించెను.

పిష్ఠం పిష్ఠపురం యేన జాతం దుర్గమదుర్గమమ్,
చిత్రం యస్య కలేర్ వృత్తిం జాతం దుర్గమ దుర్గమమ్.

అని పులికేశి తన అయిహోలుశాసనమున వ్రాసికొన్నాఁడు. ఈశాసనము క్రీ. శ. 610 నాఁటిది. విష్ణుకుండిమాధవవర్మ దానముచేసిన పొలంబూరునే, యాతఁడు దానముచేసిన వానికొడుకునకే తూర్పుచాళుక్యులలో మొదటి జయ సింహవల్లభుఁడు దానమిచ్చెను. కనుక పిష్ఠపురప్రాంత మంతయుఁ దూర్పుచాళు క్యుల వశమాయెనని చెప్పవలసియున్నది. తూర్పుచాళుక్యుల యనంతరము పిష్ఠ పురము రెడ్డిరాజులక్రిందఁ గొంతకాలమును, గజపతులక్రిందఁ గొంతకాలమును, విజయనగర రాజులక్రిందఁగొంతకాలమును, దదుపరి మహమ్మదీయులవశమై నేఁడు పద్మనాయక ప్రభువుల పాలనములో నున్నది.

# "ఇట్టిసంబంధ మెచ్చటనేనిఁ గలదె."

శ్రీపిఠాపురము యువరాజుగా రగు

శ్రీరాజా రావు గంగాధర రామా రావు బహద్దరుగారు.

---

సీ. ఆనందలహరులో యమృతంపుధారలో చల్లనివెన్నెలల్ చల్లువేళఁ
గలకంఠిమాటలో కవిచంద్రుపాటలో యాగాలి యాతావి యలమువేళఁ
జూపులచెలువులో చొక్కించుమెఱుపులో వలతేని యారేయివలచువేళఁ
గలయికసుఖములో కలలోనితలఁపులో పువ్వులశయ్యల నవ్వువేళ
భావయుతపరీరంభసంభ్రాంతవేళ
మనసువృత్తులె తెలియనిమగత గలిగె
బ్రహ్మసాయుజ్యసోపానపంక్తిలోన
నది మొదటిమెట్టొ చివరదో యరయఁదరమె? ౧

సీ. నక్షత్రపంక్తులు నక్షత్రపతిఁ జూచి కనుగీఁటె మముఁజూచి కరఁగిపోయి
పుష్పసందోహముల్ పుష్పంధయునిజూచి తలలూఁచె మముఁజూచి పులకరించి
మేఘమాలలగుంపు మేరునగముఁ జూచి చెయిచాఁచె మముఁజూచి సిగ్గువిడిచి
వాహినీజాలముల్ వాహినీపతిఁ జూచి పరుగెత్తె మముఁజూచి భ్రమలఁజెంది
ప్రణయనాట్యకళల రంజిల్లు మము మేమె
చూచుకొనుచుఁ జొక్కి సొమ్మసిల్ల
మాదునాట్యకళయె మమ్ములఁ గ్రమ్మఁగా
భేద మంతరింప వెలసినాము. ౨

సీ. ఏమేమొ చూచినా మేమేమొ పలికినా మేమేమొ చేసినా మెఱుక లేక
యేమేమొ తాఁకినా మేమేమొ రేఁపినా మేమేమొ క్రోలినా మెఱుక లేక
యేమేమొ పాడినా మేమేమొ యాడినా మేమేమొ వీడినా మెఱుక లేక
యేమేమొ తలఁచినా మేమేమొ వలచినా మేమేమొ కలఁచినా మెఱుక లేక
ఘోరవిఘ్నతరంగముల్ ఘోషచేయ
మేలుతెప్పపైఁ జల్లఁగా దేలినాము
ముంపుతుంపురుల్ మమ్ముల నింపకుండ
వలపుఁదెరచాఁపచాఁటున వాలినాము. 3

సీ. చూపులోఁ జూపును జొనిపినారమొ లేదొ మనసును మనసును మాటలాడెఁ
జేతిలోఁ జేతిని జేర్చినారమొ లేదొ భావమ్ము భావమ్ము పర్వుకొనియెఁ
బెదవితోఁ బెదవిని బెనఁచినారమొ లేదొ ప్రణయమ్ముఁ బ్రణయమ్ముఁ బ్రబలమయ్యెఁ
దనువుతోఁ దనువును దార్చినారమొ లేదొ యాత్మయు నాత్మయు నైక్యమందె
సఖుల మైన మేము శాశ్వతజీవన
దివ్యమార్గమందుఁ దేలిపోవ
నిశ్చయించి ప్రేమ నిర్దగ్ధవారుల
మునిఁగినాము చాల మునిఁగినాము. ౪

సీ. పర్వతశిఖరాగ్రపార్శ్వభాగంబుల మెఱసెను మా ప్రేమ మెఱుపులందు
సాగరవాహినీసంగమస్థలముల స్రవియించె మా ప్రేమ సలిలమందు
మాలతీమల్లికామండపంబులలోనఁ బుష్పించె మా ప్రేమ పుష్పలందుఁ
గలకంఠకులకలకలనినాదంబులఁ బాడెను మా ప్రేమ పాటలందు
విశ్వ మంతయు మా ప్రేమవికసనంబె
శబ్ద మెల్లను మా ప్రేమసారరవమె
సర్వకాలంబు నిది యిట్లె శాశ్వతంబు
'ఇట్టిసంబంధ మెచ్చట నేనిఁగలదె ?' ౫

---

# భారతభారతీస్తుతి.

—విద్వాన్ నేంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు, పిఠాపురము.—

---

సీ. ముమ్మరం బగుపూలకమ్మఁదావులఁ జిమ్ము మందానిలముసౌకుమార్య మెనసి
పండువెన్నెల వెల్లువగ జాలువాఱుచంద్రశిలామృతంబుసారళ్య మొంది
చిన్నిపూఁదేనియల్ చిక్కనియానవాల్ తొలఁకించు నతులమాధుర్య మూని
యామనిలేమావి నంకురించు నవీనకిసలయమ్ములకాంతివిసర మరసి
సంస్కృతసరస్వతికి సహజాతవయి త్రిలింగరాజ్యసర్వస్వంబు లీలఁ గేలఁ
గమిచిపట్టిన లోకైకాకార! యాంధ్రసాహితీదేవతా! నమస్కారమమ్మ! ౧

శా. విశ్వశ్రేయము గోరి కబ్బముల నుర్విన్ నిల్పి త్వద్రూపముల్
విశ్వంబును సదాతనం బగుక్రియం జిత్రించి, నీయంఘ్రులన్
శశ్వత్ప్రీతి భజించు నెల్లకవిమందారంబులం గొల్చి, నీ
యైశ్వర్యంబు స్మరింతు నించుక మదంబా సాహితీదేవతా! ౨

గీ. భాస్కరజ్యోతి బాహ్యప్రపంచమునకు, నక్షి యగునట్ల యస్తమయం బెఱుఁగని
తావకజ్యోతిగాదె నేత్రంబు తలఁప, జనని యాభ్యంతరప్రపంచమున కెల్ల. 3

శా. ఏనాఁ డెచ్చటఁ బుట్టిరో యెటు జగం బెల్లన్ రసాస్వాదజా
తానందస్థితిఁ బ్రోచిరో సుకవు లాయావృత్తముల్ నేఁడు న
మ్లానప్రక్రియ డాఁచి నీసుతులకున్ మాధుర్యధుర్యోక్తులం
గానం జేయు త్వదీయవత్సలతకుం గై మోడ్పు లర్పించెదన్. ౪

ఉ. నన్నయతిక్కనాదికవినాయకు లుజ్ఝితభౌతికాంగులై
యన్నిరుపద్రవంబును సనాతనమైన యశశ్శరీరముల్
వన్ని భవిష్యదాంధ్రసుతవర్గ ముపాసన సేసి తృప్తిఁ జెం
ద న్నిరతంబు జూపెడునుదారదయార్ద్రవి వీవ యంబరో. ౫

సీ. గోదావరీవిమలోదకసేవాపవిత్రితత్రికరణవిశ్రుతుండు
రాజరాజాస్థానరాజీవవికసనోద్యోగకిశోరసూర్యోదయుండు
స్వానుష్ఠితాధ్వరహవిరన్నసంప్రీణితాఖిలామర్త్యమర్త్యవ్రజుండు
సకలభాషాశబ్దశాసనబిరుదాభిరామపాండిత్యవిభ్రాజితుండు

సంహితాభ్యాసపూతరసజ్ఞుఁడు సహపాఠి నారాయణాప్తత్వబద్ధబుద్ధి
యాంధ్రకవితాకుమారిఁగన్నయ్యనన్న, యామ్యుఁడస్మత్కృతాంజలులందుఁగాత.

ఉ. ఆంధ్రము నొక్క దేశ మని యాంధ్రము భాషల కెల్ల మిన్న యం
చాంధ్రకవిత్వ మన్న నియమాధికదీక్షిత యంచు నిత్యనీ
రంధ్రయశంబు గాంచునటు రాజనరేంద్రుని ప్రాపునం జదల్
రంధ్రమువోవఁ జాటిన పురాతను నన్నయ ప్రొక్కఁ జెల్లదే. ౭

చ. అతనిపురోహితత్వము తదాశ్రయుఁడైన నరేంద్రుఁగాక, సం
తతవిభవాభిరామ మగుతావకసంతతి భవ్యమార్గసం
గతుల నొనర్పుచుణ్ భరతఖండమహోదయకారకంబునై
క్షితి నెసలారెఁ గాదె పఠింప ననశ్వరవృత్తి భారతీ. ౮

ఉ. అంతకుమున్న యమ్మకును నబ్బకుఁ బుట్టని కొన్నికైత లిం
తింతలు దోఁచుఁగాక యవి యేటికిఁ? జక్కగ సంస్కరించి భూ
కాంతుల సత్సభాంతరవికాసినిగా నొనరించి నిన్ను రో
దోంతరపూర్ణఁ జేయఁడె బుధౌఘ మహో యన నాంధ్రభారతీ. ౯

చ. అఖిలమహాపురాణహృదయజ్ఞుఁడు వేదనిపాఠవిస్ఫుర
న్ముఖుఁడు తపస్వి బుద్ధిసుమనోగురుఁ డాంధ్రకవిత్వపుంజతు
ర్ముఖుఁ డగునన్నపార్యుఁడు పురోధసుఁడై నడపింప సంక్రియల్
నిఖలము గాంచి మించు నిను నెమ్మదిఁ గొల్చెద నాంధ్రభారతీ! ౧౦

ఉ. శ్రోత్రియవంశసంజననసూచక మైనయవక్రభాషణ
క్షేత్రమవై రసప్రచురజీవనవై ఘనుఁడైన రాజరా
జత్రిదశేంద్రుపూజ లనిశంబును గాంచి తదీయకీర్తి క
ద్ధాత్రి స్థిరత్వ మూన్చిన కృతజ్ఞకు నీకు నమస్సహస్రముల్. ౧౧

ఉ. అంతటినన్నపార్యుసుత వయ్యు నొకంట నరణ్యమధ్యమం
దింతిరొ తండ్రిఁబాసి తపియింపవె పెద్దయుఁ బ్రొద్దు దిక్కు లే
కెంతటివారికైనఁ దరియింపఁ దరంబె విపత్పరంపరా
క్రాంతిని దానికిం దగినకాలముఁ గర్మముఁ గూడకుండఁగన్. ౧౨

గీ. అప్పు డుత్తరరామాయణాఖ్యకృతిని, దెలుఁగొనర్చి గంటము దించుతిక్కనకును
నాంధ్రభారతభారతి యటవినపుమఁ, జిక్కైననుమాట కొలవిగాఁజెవులసోఁక.

ఉ. దిగ్గనవచ్చి యాసుకవిదిగ్గజమే కద, యీయరణ్యమం
దిగ్గతిఁ గుందనేల జననీ యని క్రన్ననఁ గొంచుఁబోయి స
మ్యగ్గతిమై విరాటనగరాదులఁ బర్వములం బొనర్చి నీ
కగ్గలమైన రూప మిడినట్టిఁడు స్వర్గము ముట్టునట్లుగన్. ౧౪

సీ. కొమ్మనామాత్యునికూరిమితనయుఁడు కేతనామాత్యునికృతికి భర్త
మనుమసిద్ధిమహీశ్వరునకుఁ గవిత్వసంబంధబాంధవమూను మామగారు
వైదికమార్గప్రవర్తిష్ణుశీలుఁడై సరివారిలో నడిసన్నయజ్వ
సంస్కృతాంధ్రోభయసారస్వతాంబుధులొకగ్రుక్కఁ గొన్నకుంభోద్భవుండు
సూర్యగతియట్లకుంఠితసూక్తిరచన, గలుగుమేధావి గంటము ఖడ్గమును గ
రంబునం బూననేర్చు శూరప్రవేకుఁ, డనుయశంబుదు వాఁడు తిక్కన యనంగ.

గీ. తాను దిగకంటివానికీ పౌనుగాక, యాంధ్రకవితావిశారదుఁ డంచు నన్న
పార్యుఁ దలఁపకగంటమునందుకొనఁడు, తద్బుధవిధేయతాబుద్ధిఁదరమెపొగడ.

శా. ఒకటా? రెండ? పదేనుపర్వములుఁ దా నొక్కొక్కగుక్కన్ రస
జ్ఞకు నెట్టెట్టుల వచ్చునట్ల రచనన్ సాఁగించి వైయాసకో
క్తికి నద్దంబటు భారతమ్మును ధరిత్రి న్నెక్కొనంగూర్చి తీ
ర్చుకొనె న్నిబ్బుణ మాంధ్రభారతి యతంద్రుండై యశస్సాంద్రుఁడై. ౧౬

చ. జిలిబిలిమాటలన్ మదికిఁ జిక్కనిభావము లేనిహేలగాఁ
దెలుపుచు, వీర మద్భుతగతిం గనుదోయికిఁ గట్టినట్లుగాఁ
బలుకుచు, జాతికైతనెఱవాదుల కెల్లర కొజ్జబంతియై
నిలిచిన తిక్కయజ్వ స్మరణీయుఁడు గాఁడె తెలుంగువారికిన్. ౧౭

ఉ. బాహులతోనె పంచదశపర్వమహాంబుధి నీఁదునమ్మహా
సాహసియైన తిక్కనకె జాకుఘటించు నరణ్యమాదు ని
ర్వాహకవృత్తిఁ జొచ్చి యవురా యన నిన్ను వెలార్చి తెచ్చి స
మ్మోహనరూపఁ జేయు కవిపుంగవు నెఱ్ఱన నెంతు భారతీ! ౧౮

సీ. గిరిశాంఘ్రిపద్మబంభరితచేతస్కుఁడై "శంభుదాసుఁ"డనన్ యశంబు గాంచె
సూక్తివైచిత్రీపయోధి యయి "ప్రబంధపరమేశుఁ" డనుమహాబిరుద మొందెఁ
బండితప్రభువేమపార్థివాస్థానమందిరమ్మున బుధరత్నదీప మయ్యె
హరివంశనారసింహపురాణవనపర్వశేషరామాయణకథల్ రచించి మించె

భువిఁ గవిత్రయవిఖ్యాతిఁ బూర్తిసేసె, నరససాహిత్యసౌష్ఠవచతురతరగ
భీరభావాంబురాశినాఁ బేసమోసె, నెఱ్ఱనార్యుండు సామాన్యుఁడే తలంప.

ఉ. నన్నయ రత్నభూషణగణంబున నీ కగియించెఁ దెంచి, తి
క్కన్న సుమస్రజంబుల నిరంతరభూషితఁ జేయఁ గాంచి, యె
ఱ్ఱన్న మణీమయంబు సుమనోంచితమా నటు హారవల్లరుల్
గ్రన్నన నీకుఁ గూర్చి నిజకౌశలిఁ జూపెఁ గదమ్మ భారతీ! ౨౧

క. నన్నయ తిక్కనఫణితుల, నన్నిటఁ దలపించు నెఱ్ఱనార్యుఫణితి మై
న, న్నన్నయఫణితిదెసకె, యెన్నఁగ ములుసూపు నందు రెల్లరు రసికుల్. ౨౨

ఆ. కాదు సోమయాజిగమనికె గల దని, కొంద ఱంచు రదియు నందమ యగు
నిరువు రతనిగురువు లెవరివాఁ డన్న గుణం బెకాని యవగుణం బదెట్లు? ౨౩

మ. "హరివంశావధి భారతం"బనుసుధీవ్యాహార మన్వర్థ మై
వరలం దిక్కన దృష్టిసోఁకని వనీపర్వావశేషంబుతో
హరివంశంబు తెనుంగుసేసియు నృసింహం బన్పురాణంబు సూ
క్తిరుచుల్ మించ రచించు నెఱ్ఱనకు భక్తిం గూర్తుఁ జిత్తాబ్జముల్. ౨౪

ఆ. కన్నవాఁడు నిన్ను నన్నయ్య పెంచిన, వాఁడు తిక్కయజ్వ వన్నెమీఱ
నైన నేమి యెఱ్ఱనార్యుఁడే కద మకుటమ్ముఁ గడకుఁ బూన్చె నమ్మ నీకు. ౨౫

ఆ. ఆత్రిమూర్తిరూపు లైనత్రిమూర్తుల, కరుణ నవతరించి కడలుక్రమ్మి
సకలకావ్యరూపసామ్రాజ్య మేలునీ,వైభవంబు నెంచువాఁడఁ దల్లి! ౨౬

ఉ. భారతభారతీ! భవదపారకృపారసధార గాదె యా
ధార; ముదారభావపరతం గవితాధ్వవిహారశీలురై
పేరుఁ బ్రతిష్ఠయుం గనినపెద్దలకుం, గనుచున్నపెద్దలా
వారికి, ముందుఁ గాంచఁగలవారికి సైత మభిన్నరూప మై. ౨౭

ఉ. భాసురదివ్యభవ్యతరవాక్కున నఁ బల్కఁగదమ్మ! మంగళా
శాసన మాంధ్రభారతి! రసంబు సుశబ్ద మెఱింగి దోసముల్
రోసి గుణంబు నారసి యలౌకచమత్కృతిఁ జూపి శాశ్వతో
ల్లాసయశంబుఁ గాంచి వరలంగఁ భవత్స్తుతు లైనయందఱున్. ౨౮

# ఆశీస్సు!

—: వడ్డాది సుబ్బరాయకవిగారు, రాజమహేంద్రవరము. :—

---

మ. మకిలన్ భాషకుఁ బాపఁగాదె గనె జన్మం బాంధ్రసాహిత్యప
త్రిక ? తద్రాజతవార్షికోత్సవము వర్తిల్లున్ శరత్కాలచం
ద్రికరీతిన్ సుమనశ్చకోరతతి కెంతేఁ బ్రీతిగా ధాత; మే !
లకలంకం బిటు యాత ధాతకృప నిందాచంద్రతారార్కమున్.

---

# రజతోత్సవసందర్భచంపకమాలిక.

— క్రొత్తపల్లి సుందరరామయ్యగారు- ఏలూరు. —

---

ఇరువదియైదువత్సరము లేకమనీష సునిశ్చలంబుగా
నిరుపమరీతి నేకపదనిష్ఠను నిల్చి, వచోవిలాసభా
సురయుఁ, బవిత్రయున్, విమలసూరిచరిత్రయు, సత్యవాదబం
ధురయు, జగత్ప్రసిద్ధయు, ననూనని జాంగమనోభిరామయున్,
గురుతరదీర్ఘదృగ్వలయకుంతలఫాలయు, శబ్దశాసన
స్థిరమతియున్, బహూకృతివిశేషకృతిప్రకృతిప్రచారదు
ష్కరవివిధార్థసారసుమసారపరిగ్రహణానుమోదయున్,
సురుచిరశీలభాగ్యయు, విశుద్ధమనస్కయు నౌనిఘంటుసుం
దరి నిరుబాసలం దెలివిఁ దద్దయు మించినదానిఁ దెల్లతా
మరలను నవ్వుమెత్తని సుమాళపు మైమఱు వొప్పుదాని, న
బ్బురముగఁ బల్కుపల్కున గుబుల్గొనుతావుల వెల్గుదాని, ము
ప్పిరిగొను సంతసంబు సరవిం బ్రజ కిచ్చెడు దాని, మేటిని
బ్బర మగునడ్డదానిఁ, గనుపండువ విద్దెగలట్టివారికిం
దిరముగఁ గూర్చుదాని, సుకృతిం దపియించుచు రామధాత్రుమే
దురకరుణావిశేషమున దొడ్డగొనంబులబిడ్డఁ గాంచి, రా
జ్యరమకుఁ దోడుగాఁగ, విలసద్గతిఁ బీఠపురీశుఁగూర్చి నీ
భరమును బాపుకొంటివి; శుభం బగునీ కిఁక ధాత్రి నాంధ్రస
త్పరిషదదభ్రకీర్తిపర ! భారతి ! ధన్యుల ధన్య వెన్నఁగన్.

---

# భావకవులు.

—శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు- పిఠాపురము.—

---

ఉ. కావ్యములైన నారయక గ్రంథము లేవియుఁ జూడఁబోక సం
భావ్యములైనపూర్వకవిమార్గములన్ గమనింపరాక య
శ్రావ్యము శ్రావ్యముం దెలియఁజాలక యేటికి మాటిమాటికిన్
నవ్యము నా లిఖింతు వధునాతనభావకవీ! కవిత్వమున్. ౧

చ. నియమము లేదు లేదు పరిణిష్ఠితవాక్యసుధారసంబు లో
భయమును లేదు పెద్ద లనుభావము లేదు స్వశక్తి యన్యశ
క్తియుఁ గనునేర్పు లేదు విలిఖింతువు పద్దెము లంచు నేవొ నీ
కయినను నర్థమేర్పడనియట్టివి భావకవీ! బళీబళీ. ౨

ఉ. అర్థములేనిగీతముల నల్లి యెదోయొకరీతి వానిలో
నర్థము గూఢమంచు నది యాత్మకె గోచరమంచు నేవియో
వ్యర్థములైనభాషణము లాడుటె భావకవిత్వమేమొ గూ
ఢార్థవిదుల్ వచింపుఁడు తదన్య మటంచు వచింపఁగల్గినన్. ౩

చ. పదములసౌష్ఠవంబొ రసభంగియొ రీతివికాసమో కథా
భ్యుదయమొ భావగౌరవమొ యుత్తమలక్షణమో మతేమియొ
ప్పిదమొ నవీనగీతమునఁ బేర్కొనరాదొకొ భావవేత్త ల
య్యది బుధసమ్మతం బయిన నందఱు మూర్ఖములంచుఁ దాల్పరే. ౪

ఉ. భావములేనిచోట బహుభావము లున్నవటంచుఁ బల్కుటే
భావమొ పద్యభావమును బల్కుమనంగను బల్కరామి మా
త్రోవలు వేఱు మామదికె తోఁచుచునుండు నటంచు నాడుటే
భావమొ దాని నాధునికభావకవుల్ తెలుపంగరాదొకో. ౫

ఉ. నాయిక యుత్తమాన్వయమునన్ జనియింపక యెడ్డెమడ్డియై
యేయెడ నుండునట్టిదియె యేర్పఱుపంబడుచుంట యొండు పై
నాయకుఁడన్న నీచజననంబునవాఁడుగ నుండు టొండు నీ
తోయము నేఁటిభావకవిధూర్వహు లెక్కడ నేర్చిరోకదా. ౬

ఉ. డోలికలందుఁ దూఁగుటలు డోలికలుం దమపైనిఁ దూఁగుటల్
మాలలుఁ బూవుపందిరులు మబ్బులలోపలమాయమౌట లీ

గోలలె తప్ప గ్రంథ మనుకోఁదగుపద్ధతి యొండు నుండఁగాఁ
జాలని నేఁటి భావకవిచాటువు లెట్టులు కావ్య మయ్యెడిన్. ౭

సీ. గ్రంథవిజ్ఞానంబు గలుగక చెప్పెడి కైతలో భావముల్ గలుగు టెట్లొ
భావ మం చనఁగ నభావంబుగా నొప్పునవి భావకావ్యంబు లగుట యెట్లొ
భావలక్షణ మేమొ పరికింపలేనివారలు భావకవులు గాఁగలుగు టెట్లొ
యధమనాయకులును నధమగాథలుఁగల్గునధమవృత్తము కావ్యమగుటయెట్లొ
భాషలకు నన్నిటికి మూలభాషయైన, మాతృభాషకు పంగనామములువెట్టి
హీనభాషను దా నాశ్రయించుకతనఁ, గలిగె నీదశ మనభావకవికి నేఁడు. ౮

గీ. నేఁటిబీఱకాయరీతిని భావకా,వ్యం బటన్న నామ మమరె నేమొ
నేఁటిభావకవులు నిర్మించుకైతకుఁ, గాకయున్న వ్యంగ్యకావ్య మగునె? ౯

---

# భా ర తీ !

వ్యాకరణవిద్యాప్రవీణ, పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము,

---

ఉ. ప్రాసముఁ దీసివైచిన రసాభ్యుదయంబు నడంచినం గళా
న్యాసము మాపివైచిన గుణాఢ్యతఁ బాపిన గ్రామ్యవీథులన్
దోసము నాక త్రిప్పినను దొల్లిటినుండి యశం బుగన్న నీ
వాసి దొలంగఁజేయఁగలవారలె వీరలు తల్లి భారతీ! ౧

ఉ. భావకవిత్వమం చనుచుఁ బల్కెడివల్లుల కర్థమేది మే
ల్భావము లుండవో మును ప్రబంధములందు ను నంతకన్నసొం
పావహిలంగఁ జేసెదరొ యారయఁ బ్రాసము విశ్రమంబుఁ దా
మావలఁ ద్రోసిరాజనెడి యాటలె గాక మఱేమి భారతీ! ౨

ఉ. కాకవు లేరొ నీసొబగుఁ గానఁగలేనికతాన నేదియో
గీఁకినఁ బత్రికల్ చెడఁగ గీఁకెద రంతటఁ బోవకున్న వా
చాకలహంబు సల్పినను జల్పెద రంతియ గాక త్వత్స్వరూ
పాకలనంబు సేయుటకు నర్హులె వారలు తల్లి! భారతీ! ౩

# శుకోపదేశము.

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.

---

నేను—

క. "ఫలముల మెక్కుచు ముద్దుగఁ, బలుకుచు మదిఁ గోరునట్లు పై నెగిరెదు నో
పలురంగులరామచిలుక ! నిలుమా నాచెంత నొక్కనిముసము వినుమా!

క. మృతి యనఁగొందఱు వెఱతురు, మృతియనుచోఁగొందఱింపు కెదనుంచరు గా
మృతియనఁ గొందఱు కీరమ! యతులితపరమాభిలాష నందుదురుగదా !

క. పసితనమున నొకకొందఱు, వెసఁ బోదురు, కొందఱు కడువృద్ధాప్యమునన్
వసుధన్ బ్రదుకుచునుందురె! ఇసి! యెన్నఁడుగల్గుఁదమకుమృత్యువటంచున్.

క. రోగములో యమితము లగు, భోగములో లోకముపయిఁ బుట్టెడుదోషా
రాగములో ప్రాణములన్, వేఁగొని పోయెదు నెచటికో! వింతగుఁ గంటే !

క. ఎక్కడికిఁబోవువారలు ? ఎక్కరణిని నుండు వారి మృతశేషంబుల్ ?
చిక్కునె? మత్తి యటంచును, మక్కువ మఱిఁ గోరుచుంట మంచియె? చెప్పుమా!

క. కనుచుందువు నీవెన్నో, వినుచుందువు నీవు చాల వికలితమై నా
మన మిటు నిన్నడుగంబ్రే, రణ నొనరించెడు సముత్తరము వలుకఁగదే!"

చిలుక—

ఉ. "ఎన్నఁడు నాకు నెమ్మదిని నిట్టివి తట్టఁగలేదు, కాని నీ
వన్నది మాత్ర మెల్ల నిజ మారయ మృత్యువు సేయుచేఁతలన్
విన్ననుఁ గన్నఁ జిత్రము నవేద్యము; నీ విపు డిట్టు లింతయున్
నన్నడుగంగ జ్ఞప్తికి ఘనమ్ముగ నెన్నియొ వచ్చుచుండెడిన్.

క. నే జనియింపకపూర్వము, నే జనియించిన వెనుకను నే నెఱుఁగని యా
యాజామములందు నెఱిఁగిన, యాజాములయందు మనుజు లెందఱొ సుమ్మా!

కి. బంధుగులలోన స్నేహిత, బృందమ్మునఁ జుట్టుపట్ల మృత్యువుపట్టుం
బొందుట నెఱుఁగుదు వారిఁ, డెందంబునఁ దలఁచుకొన్న నీ రగుచుండెన్.

మ. కనుమా! మజ్జనయిత్రి యెక్కుడగు రోగం బంది స్వర్గంబునుం
గనె నంచుం బ్రజ లాడుచుండెదరు; ఆ నారీమణీమానసం
బనయంబుం మని భర్తపాదపరిచర్యల్ చేయ మే మెంతయుం
ఘనతం బొందఁగఁ జూడఁగోరె నఁట, శక్యంబాయెనే నిల్వఁగన్ ?"

నేను—

గీ. "ఎఱుఁగవా నీదుతల్లిని? ఏమి? చిలుక !",

చిలుక—

"చిన్నతనమందె పోయె మాకన్నతల్లి
పెద్దవారలమైతిమి ప్రేమమీఱ, మమ్ముఁ బెంచిన బామ్మ, యమ్మమ్మకతల.

గీ. ఎట్టులుండునొ మాయమ్మ యెట్లు మమ్ముఁ, గాంచి పెంచెనొ యెఱుఁగము కాని వింత
మామె పని సేప్పఁజాలుకును సరయువారి, కెంతయును నచ్చెరువు మది నెసఁగఁజేయ.

సీ. అత్తపై నాపెకు నతిభక్తి యనుమాట యత్తయే యిప్పటి కనుచునుండు
భర్తపై నాపెకుఁ బరమప్రేమ మనిచెప్పి భర్త యిప్పటికిని బ్రస్తుతిసేయు
బంధుగులకు నామె పచరించు మర్యాద బాంధవు లిప్పుడుఁ బలుకుచుంద్రు
సేవకులకు నామె కావించు నెనరును సేవకు లిప్పుడుఁ జెప్పుకొంద్రు
ఇరుగుపొరుగువారికి నామె యిచ్చినట్టి, స్నేహభావంబు వారిప్డుఁ జింతసేతు
రింక మాపొంబె నామె కష్టించుటెల్ల, మాకుఁ దలఁపఁగ రాకున్న మఱవఁబోము.

సీ. ఆఁకలియైనప్డు డరసి యెంచుననున్నఁ బఱతెంచి యన్నంబుఁ బాలు నిచ్చి
యటునిటు నాడుచు నపరిశుభ్రతఁ గన్న నులివెచ్చనీళ్లను నొడలు గడిగి
పరమోత్సవంబులు పండుగు లని యన్నఁ జక్కనివస్త్రులు చాలఁ దొడిగి
యల్లరి సేయుచుఁ గల్లలాడుచు నున్న మంచి కాదంచును మందలించి
పెంచినటువంటి యమ్మచు బ్రేమమీఱ, నమ్మయంచును బిల్చు భాగ్యమ్ము లింక
లేవుచూచితె మాకయొ లేవుసూవె, పిలుచుకొనవలె మనమునఁ దలఁచుకొనుచు.

సీ. ధాన్యరేకుల నెంతొ జోకంబుగాఁ గూర్చి వింతగాఁ జేసెను విసనకఱ్ఱ
గోడకు వరుసగాఁ గొమరొప్పఁ దగిలించి చెలువొంద నుంచెనుఁ జిత్రతతుల
ననుదిన ముదయాన నతిశుభ్రముగఁ దోమి కగ్గకుండఁగ నుంచుఁ గంచుచెంబు
అప్పుడప్పుడు దీసి యొప్పుగ వైచుచుఁ బెట్టెలోఁ దాఁచెనుఁ బట్టుజందె
మనుచువానిని నింటకుజనులు చూపఁ, జూచి యిటువంటి యమ్మను జూచుకొనఁగఁ
బెట్టిపుట్టఁగ లేదె యెప్పట్టుమే మ్మటంచుఁ బలుమఱు మనమునఁ దలఁచుకొందు"

నేను—

గీ. "మంచివారలు బ్రదుకరు మహిని జాల కాలమో చిల్క !"

చిలుక—

"అట్లననేల ? యోయి !
అంతయన్యాయముగ మృతి నందకున్నఁ
బోయె మత్పితామహుఁడు తమ్మునిని గలియ.

గీ. వా రిరువు రన్నదమ్ములు నూరువందుఁ, బేరుకీర్తులు వెలయించినారు మిగులఁ
బెద్దతాతయ్య కంఠంబు పెద్దది యఁట, చిన్నతాతయ్యకంఠంబు చిన్నదియఁట.

క. ఏమో యడిగితి విపుడది, యేమో యీరీతిఁ బలుక నెదఁగొలిపె ననున్
నీమంబున వింటివి నీ, వామాత్రము చాలు నింక నడుగుదు సెలవున్."

నేను—

క. ఏలా వెళ్లెద ననుచును, నాలాగున సంభ్రమింతు వడిగిన దానిన్
మేలా పూర్తిగఁ జెప్పక, యీలాగున నన్ను విడువ? నిటు మఱలఁగదే."

చిలుక—

తే. "విందువా యింగ నీమది విసుగుపుట్టె, నేమొ యంచును నీరీతి నేఁగఁబోతి.

నేను—

"చాలుఁ జాలింకఁ గావలె నాలకింతు, నూరకే నిన్నుఁ బిలుతునే యోశుకంబ!"

చిలుక—

క. "అటులైన వినుమ ! యొకచీఁ, కటిరాత్రిన్ నాకుకుక్షిఁగడుఁగలచెడు నాఁ
కటికిని నోపఁగలే కొక, చోటనే నొకకొమ్మమీఁద సుందరవనిలో.

చ. ఫలముల నాహరించి మొదఁ బావనరాముఁ దలంచుకొంచు, భూ
తలమున దృష్టినిల్ప నట దాపునఁ గ్రిందఁ గనంగఁగల్గితిం
గొలఁకును నొంటి, దట్టముగఁ గొమ్మలు చుట్టును బ్రాలి మొత్తము
దెలివిని బాసి యేడ్చె నన నీరకణంబులు గార్చుచుండఁగన్.

తే. కొలనిలోపల వడివడిఁజలనమంది, వెలుఁగుచును నాటిపోయెను వెలుఁగులెన్నొ
కంటఁబడె నేను బరికింపఁగానె యిట్టు, లవ్వి పలుకంగ సాగెను సరసి నన్ను.

ఉ. మమ్ముల నేలచూచెదవు మాన్యశుకంబ! కనంగఁబోను భ
గ్నమ్ములునేసికొంటిమి యకాలపుమృత్యువుగోరి మాదుజ
న్మమ్ములు మేము మర్త్యుల కమర్త్యులకుం బొనరించినాము దో
షమ్ముల నయ్యయో! కనము శాశ్వతసౌఖ్య మొకప్పుడేనియున్.

క. చంచలములు మాకాంతులు, వంచితములు మాబ్రదుకులు పాపుల మయ్యో!
యంచితమగు వయసుండ నొ,కించుక తలపోయ కిట్లు మృతినందితిమే.

క. అదివిని యాశ్చర్యమునం, బొదలుచు నలుదెసలుచూడఁ బొడకట్టెఁ గదా
చదలను విడి యిలఁ బడియెడు, సదమలద్యుతు లెన్నియెన్నొ సంఖ్య కమితమై.

క. ఏమీ మీరలు వడివడి, భూమికి డిగుచున్నవారు పో యని యడుగన్
మేమింకఁ గీర్తి వడయఁగ, నీమహిఁ జేయంగవలయు నెన్నియొ పనులన్,

ఉత్సాహము. కనుమి మింట నల్లధవళకాంతితతుల నవి మహా
ఘనకృతులను ధరణిఁ జేసి కరము చాలకాలమున్
మని మఱి చనిపోయినట్టి మానవమృతశేషముల్
మనములందుఁ గలదు కోర్కి మాకునట్లు మునుగఁగన్.

తే. వెతుక వ్యాధుల నాధులఁ జెవక లేక, పుడమి విడిచితి మిప్పుడు పుట్టుచుంటి
మిట్లు వెండియు, మిగిలిన డెల్లఁజేసి, పూర్ణసత్కీర్తి వడయంగఁ బూజ్యశుకము!

క. అని వాక్రుచ్చుచు వడి నడు
మనె యాజ్యోతు లొకటొకటి మాయంబాయెన్
మనమున విస్మయ ముంచుచు
గనులను బైకెత్తు నంతఁ గంటిన్ మింటన్.

ఉ. నిశ్చలశుభ్రకాంతిరమణీయముగా వెలయించు దివ్వెలం
బశ్చిమదిక్కు సూడ నవి ప్రక్కనె పొల్చెడు తారలట్టులన్
నిశ్చయ మింక సంశయము నేఁగొననేటికి నవ్వి యెవ్వియో
కశ్చిదపాపదేహములు కాంచిన సన్నుతకీర్తిశేషముల్.

ఉ. కావున మిత్రమా! యిటు లిఁకం దలపోయకు మెట్టివేళలం
జావును గూర్చి యించుక విషాదముఁబొందకు నెమ్మనంబునన్
నీవు ప్రసిద్ధకార్యతతులే శతవత్సరజీవితుండవై
యీవసుధం బొనర్పఁ దగు నెంతయుఁ దద్విధిఁ గీర్తినిల్పఁగన్."

నేను—

ఉత్సాహము. "చిలుక యిపుడు నీవు నాకుఁ జెప్పినట్టిపల్కులన్
నిలిచి ధైర్య మిట్లు నన్ను నిలుపు నని యెంచకే
దలఁచినప్పు డెల్ల నాదు దాపునకును వచ్చుచుం
బల్కుచుండ వేఁడుకొందుఁ బరమవాక్యరత్నముల్."

# వివేకము

—కొమరవోలు వేంకటసుబ్బరావుగారు బి. ఏ. కాకినాడ.—

---

ఉ. స్వర్మధురప్రశాంతసుఖసౌధముఁ జేరఁగఁ గోరుచున్న యో
కర్మఠవీరులార ! ఘనగాఢతమఃపిహితంబులైన మీ
మర్మపథప్రదర్శి యగుమంగళదీపముఁ గొంచుఁబోవుఁడీ
ధర్మవివేకపద్ధతిఁ గృతాంతనిశాంతనవోల్ముకోద్ధతిన్. ౧

చ. పడఁతి సుధాధరవ్యథకుఁ బాల్పడి, విత్తమదంబుఁ గతుల్
మఱిఁగి నశించి చన్నమునులున్ ఘనులుం గలరంతె కాని, యొ
క్కఁడును దురంతదుఃఖపరికల్పితజాల మటంచు మోహమున్
విడిచి నితాంతనిర్మలవివేకముత్రోవను బోవఁ డక్కటా ! ౨

గీ. మాయ నెఱుఁగనిమృగమె యపాయశంకఁ, గనకవృకకుటీరప్రాంతఘాసమునకు
మోసపోవంగ, హానికై పోవఁ డెట్లు, మాయచేఁగన్ను వోయినమానవుండు. 3

మ. ప్రమిదం దైలము సూఱుబొట్లునిచి జీవజ్యోతి వెల్గించు నా
కమలాత్మోద్భవుఁ డేడుమారములధాకం బోయినం బోవు దీ
పము సంవత్సర మొక్కటొక్కటియె పైఁబడ్డం బ్రమోదింతు రా
చము రంతంతగ నింకుచున్న దని యోచంబోకయే మానవుల్. ౪

గీ. దుస్తరమురంతవేగాన దొరలుచున్న, కాలచక్రము నాఁపఁగాఁ గలఁ డెవండు
పోవుదానిని బట్టుకోఁబోయియుండె, యడఁగి నలిగి కాలగ్రస్తుఁ డగును గాని. ౫

గీ. జడను రాతిరి ముడిచినజాజిపూలు, వాడిపోయిన వని పాఱవైచుఁ గాని
పుష్పసుకుమారమగుతనముద్దుమేను, నంతియే యని యెఱుఁగదో యలరుఁబోణి.

గీ. గాలిపూబాలికలను నుయ్యాలలూఁపు, చుంటి ననుప్రేమ యతని కేబంటికలదో
పాపమవి యట్లు నేలపై వ్రాలుచున్న, ననెడి వెఱ్ఱూపు వానికి నంతెకలదు. ౭

గీ. శతశతాధికనవవనోషశ్చయమ్ము, నుం గనుంగొన్న యనుభవజ్ఞుండె యైన
నేయుషస్సునయమ్మునఁ దోయదమ్ము, గప్పునో తన్నుఁ దెలియఁగాఁ గలఁడె సవిత?

---

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాప్రశంస.

— స్నేహలతాకవితాసంఘసభ్యులు-కొల్లాపురము —

---

చ. గొనబగు తీయమావిచిగురుగున్నల సొన్నపు గ్రొన్ననల్ చవుల్
దనియ మెసంగి మంజులలతాకుసుమాసవపానకేళిఁ దే
లినమదకోకిలంబు మృదులీలలఁ బాడెడు మోహగానని
స్వనములు చూనె యాంధ్రపరిషద్భవపత్రిక ! నీప్రసంగముల్. ౧

సీ. నడపించుచున్నావు నన్నయ్యసుకవితా వాగ్విలాసోదయప్రభలు కొన్ని
చూపించుచున్నావు సోమయాజులతెన్గు నడకలఁ జూపుపోకడలు కొన్ని
కురిపించుచున్నావు విరివిగా శ్రీనాథు ప్రౌఢకవిత్వతత్త్వములు కొన్ని
కావించుచున్నావు కాళిదాసునివచస్సౌరభ్యసద్విలాసములు కొన్ని
ఇరువదైదువత్సరములు నేఁగె నిట్లు, నిన్ను నీప్రచారమును వర్ణింపఁ దరము
గాదు; నీఋణ మాంధ్రలోకంబు దీర్పఁ,గలదె ? కైకొను మానమస్కారశతము.

ఉ. నీ వొనరించుకార్య మవనిన్ రుచిచూడనివారు లేరు, నీ
సేవకు నీప్రసక్తికి వశీకృతు లైరి నృపాలు రెందఱో
చేవఁగలట్టి వ్యాసములచేత నలంకృతిసేయు నీగుణ
శ్రీవిభవాతిరేకమును జెందవు వే ఱొకతెన్గుపత్రికల్. ౩

గీ. ఆంధ్రసాహిత్యపరిషదుద్యానజాత, పత్రికాకల్పవల్లి ! నీవ్యాసకుసుమ
సాంద్రమకరందధారలు సహృదయాళి, నంచితానంద జలనిధి ముంచితేల్చె. ౪

గీ. భద్ర మగుత మాంధ్రపరిషత్పత్రికామ, తల్లి కెపుడు శుభంబగుఁ దత్ప్రచార
కులకుఁ; గమ్మని తేనియలొలుకు తెలుఁగు, భాషఁ బోషింపఁగంకణబద్ధులగుట.

ఉ. తెలుఁగురచించువారలకు దీపమువోలె రహించు నెప్పుడుం
బలుక వొకప్పుడుం బరుష వాక్యము లేమెడఁ దేఱిచూచినన్
లలితపదార్థసౌరభవిలాసవికాసము లే కనంబడుం
గలుగుఁ జిరాయురున్నతు లఖండశుభంబులు నీకుఁ బత్రికా ! ౬

## -: పరిషత్ప్రశంస. :-

— శ్రీ కొత్తపల్లి సూర్యరావుగారు, కాకినాడ. —

మ. రజతస్వచ్ఛతరాంధ్రభాషకును దుర్వర్ణాప్తిఁ గాలుష్యముం
గుజనత్వంబునఁ గూర్ప వారిఁ గని లోకుల్ వాకు లామాటయే
నిజ మన్నా ఖ్యాతికి రాఁ దొలంచితివి పాండిత్యంబు రాజిల్ల నీ
విజయద్యోతక మీమహోత్సవము "సిల్వర్జూబిలీ"నాఁ దగుఁ. ౧

ఉ. పండితులే యపండితుల భంగిని వాద మొనర్ప దానిలో
నుండెడు చల్లనౌ విషయ మొక్కొక పట్టునఁ గొందఱెంచి యు
ద్దండముగా మెలంగ వితథం బొనరించితి వారిపూన్కి నీ
దండితనంబు మెచ్చి రజతప్రథితోత్సవముం బొనర్తురా. ౨

చ. ఇరువదియైదు వత్సరము లేకముగా నతిదీక్ష నీవు భా
సురముగ భాషఁ బెంచితివి, సుజ్ఞులు, నీప్రు నజ్ఞు లెన్ను న
ర్థరహితదోషము ల్దొలఁచి రాజితరాజతమన్మహం బొన
ర్తువు, ముద మొందు మింతకు నురుద్యుతి నో పరిషద్వతంసమా. ౩

గీ. అయ్యె నుద్ధవ మిది రజతాఖ్య మగు మహారజతనామకమ దేబదబ్దములకుఁ
బొసె దుర్వర్ణకీర్తి సువర్ణకీర్తి, వఱలుమా భాష నభివృద్ధిపఱిచి ముందు. ౪

---

శ్రీరామా.

# ఉభయభాషార్థకకందములు.

వీనికి-కీ. శే. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిరచిత మయినటీకలు.



## 1. కళాపూర్ణోదయములోనిది:-

క. మాయమ్మానసునీవే, రాయలవై కావదేవరా జేజేజే
మాయాతుమలానినయది, పాయకసంతోసమున్న పలమిలసామీ.

తెనుఁగు పదవిభాగము:-

మాయమ్మానసు, నీవే, రాయలవు, ఐ, కావన్, దేవరా, జేజేజే, మా యాతుమలు, ఆనినయది, పాయక, సంతోసము, ఉన్నపలము, ఇల, సామీ.

తెనుఁగుటీక:-

సామీ=ఓస్వామీ, దేవర=నరదేవ; జేజేజే=నీకు నమస్కారములు; మా యమ్మానసు-మాయమ్మ=మాతల్లియొక్క, ఆనసు=ఆజ్ఞ సుండి. అనఁగా మాతల్లి యాజ్ఞకుఁ దప్పినట్లని యొట్టుఁ బెట్టుకొనుట. ఇచట 'వాతః' అను సూత్రముచే, అమ్మాన యనెడు సంధి కలిగెను. సూ అనునది నిర్దేశార్థకము. "సూ ముసలఘాత నిర్దేశయోః, కాక్వేలా సూరాదిషు చ వా హ్రస్వః''అను బార్హస్పత్యసూత్రము చే సు అని హ్రస్వము వచ్చెను."సు మ్మనెడు ప్రత్యయమునకు సు వ్వెసూవె, సూసు సుఁడి యంచుఁ గృతులలోఁ జొనుపవచ్చు" అని కవిలోకచింతామణి యందు. "అతఁడే సు డెందాన నలచేయి మోపి యొంతే సుఖావాప్తి నిద్రించు వాఁ డు" అని ధర్మఖండ మందు ప్రయోగము. నీవే=నీవే, రాయలవై=ప్రభుపవై, కావన్=కాపాడఁగన్, పాలింపుచుండఁగా ననుట. మాయాతుమలు=మాయా త్మలను, ఇచట, "అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా" అను సూత్రమునఁ బ్రథమకు ద్వితీయార్థము. ఆనిన=పొందిన, "పూనె నూనెను దాల్చె నానెను మోచెనా వహియించె ననుటకు వఱలుఁ బేళ్లు" అని నామసంగ్రహమందు. అది=ఆవి చారము, పాయక=విడువక, తొలఁగకుండ నేని యనుట. సంతోసము=సంతో షము, ఉన్న=కలిగినట్టి, పలము=ఫలము, కార్యసిద్ధి యనుట. ఇల=ఇల్ల, లేదను ట. "లుగ్వా ద్విత్వం హి దేశ్యేషు" అను సూత్రమున ద్విత్వలోపము గలిగెను.

అనఁగా, నోరాజా! నీవు భూపాలనము సేయుచుండఁగా మామనోవ్యథ తొలఁగినదేగాని నీధర్మపాలనకు సంతసించుచున్న మాకు ఫలముగలుగ దని తాత్పర్యము-

సంస్కృతపదవిభాగః :—

మాయం, మా, అన, సునీవే, రాయలవా, ఏకా, ఆవత్, ఏవ, రాజే, అజేజే, మా,ఆయాతు, మలాని, న, యది, పాయక, సంతః, అసముత్, న, పల, మిల, సా, అమీ.

సంస్కృతాన్వయః :—

మాయం=లాభద్రవ్యం, మయసయచ ఋగతౌ, మయస్య ఇదంమాయం, యద్వా, మాయాః లక్ష్మ్యా సంబంధీ ఆయః, మాయః-తం, మా అన=మాగణయ, తంలక్ష్యంమాకు ర్విత్యర్థః, అణశబ్దే ఇతిధాతోర్ణ్ణణయోరభేదః, సునీవే-శోభనా నీవీమూలధనం యస్య తస్య సంబుద్ధౌ సునీవే-కృదికారాదక్తిన ఇతి ఇకారాంతత్వం(?)ని-నీవి మూలధనే గ్రంథౌ స్త్రీణాం జఘనవాససి-ఇతి రత్నమాలాయాం అలవాచ సారాశ్చ రాయలవా, రైశబ్దస్యఏచోయవాయావఇతిఆయాదేశః, రాయలవాఇతి విశేషణోత్తరపద కర్మధారయః।యద్వా సరాః మూలధనం ఇషు సామాన్యప్రయోజనేషు- అలవా అచ్ఛిదా=వ్యయరహితా. ని. ఇకారః ఫణిరత్నార్చిష్వగ్రతోర్థ గుహార్థయోః, లవో రామసుతే లేశే విలాసే ఛేదనేపి చ- ఇతిరత్నమాలా. ఇ అలవా ఇతి స్థితే ఇకో యణచీతి యత్వం. యలవా అఖండితేత్యర్థః- ఏకా=ముఖ్యా- ఏకే ముఖ్యాన్య కేవలే- ఏతాదృశీ రాః=ధనం, తదధిపతిం, ఆవదేవ= అరక్షదేవేత్యర్థః- అవరక్షణ ఇతి ధాతోశాడాగమః- అజాః=బ్రహ్మాణం, యజత ఇతి అజేట్- యజపూజాయా మితిధాతో రిడాదేశః-ఇష్టికృదిత్యర్థః-తస్మై అజేజే, యాగకర్త్రే, రాజే=ప్రభవే, అత్ర రాజ్ఛబ్దచతుర్థీ, మా=లక్ష్మీః, ఆయాతు=ఆగచ్ఛతు, మలాని=పాపాని, న, నా యాంతు=నప్రాప్నువంత్విత్యర్థః. పాయక=హేరక్షక, పారక్షణే, ఇతిధాతో రకప్రత్యయే పకే ల్యుడిత్యయాగమః. దాయక ఇత్యాదివత్. సంతః=విద్వాంసః, వసన్తియది నికటే ఇతి శేషః, ముదా సహిత స్సముత్, సముత్ న భవతీత్యసముత్, త్వం అసముత్=అప్రీతస్సన్, నపల=నవల. నబహిర్గచ్ఛేత్యర్థః. వలవరాచలనే. అత్రవపయోరభేదః. వపయోర్వబయోశ్చైవ లరయోర్డలయోస్తథా......శ్శసయోశ్చైవసస్యాదభేదేనకల్పనమ్. ఇతిభోజరాజః. త్వత్సన్నిధౌ విద్వాంసః వసన్తి చేత్తే ష్వప్రియో భూత్వా నచల ఇతిభావః. కిన్తు తైస్సహ, మిల=సంశ్లిష్టో భవ, గోష్ఠీంకు ర్విత్యర్థః. మిల సంశ్లే

షే. ఇతి ధాతో ర్లోట్. సా=లక్ష్మీః, అమీ విబుధాః మిళం త్వితి శేషః. య ద్వా సా లక్ష్మీ రేవ అమీ విబుధా భవ న్తీతి వా న్వయః. భోరాజన్ భవాన్ మూ లద్రవ్యరక్షాపర స్సన్ లాభద్రవ్యం యాగకరణార్థం విద్వత్సంరక్షణార్థం చ విని యోజ్య త ద్గోష్ఠీష్వనురక్తో భూత్వా లక్ష్మ్యా కీర్త్యా సహ సర్వోత్కర్షేణ వర్ధస్వేతి తాత్పర్యార్థః.

## 2. లంకావిజయములోనిది.

క. రామముదేవరకావవ, యామాజేజేయనయతుయాముస్నలజే
జేమదిని నారదేమయి, తేముద్దామోదరయది తేలందార్నిఁ.

తెనుఁగు పదవిభాగము:—

రా, మము, దేవర, కావవయా, మాజేజే, యనయము, ఆము, ఉన్నల జేజే, మదిర్నిఁ, ఆరదు, ఏము, అయితే, ముద్దా, మోదర, అది, తేలఁ, దార్నిఁ.

తెనుఁగుటీక:—

మాజేజే=మావేలుపా, దేవర=ఓదైవమా, రా=రమ్ము, మము=మమ్ము ను, అనయము=ఎప్పుడును, "ఏవార్థేస్యా దేత్వమత్వం" అనుటచే నత్వము వచ్చె ను. కావవయా=రక్షింపవయ్యా, ఆమున్న=గర్వము గలిగిన, అలజేజే=ఆనమ స్కృతి, మదిర్నిఁ=మనసునందు, ఇచట "ద్రుతా ద్ద్రుతం క్వచి చ్చాత్ర దృశ్యన్తే కవిభాషితే" అను నాథర్వణవచనముచే రెండునకారములు వచ్చినవి. ఆరదు= సంభవింపదు, గర్వితుని మతియందు నీకు నమస్కరించు నిచ్ఛ గలుగదనుట. ఏమయితే=మేము నీకు భక్తులమైనను, ముద్దా=ఇష్టమగునా, గర్వించుట ప్రియ ముగా దనుట, అది=ఆనమస్కారబుద్ధి, తేలఁ=స్ఫుట మగుటకు, దార్నిఁ=ఆగ ర్వమును, మోదర=కొట్టివేయురా, అని యర్థము. "తాడన మొనర్చె ననుటకు దనరుఁ బేళ్లు కొట్టె మొత్తెను మోదెనాఁ గుధరచాప" అని యాంధ్రనామ సంగ్రహము.

సంస్కృతపదవిభాగః:—

రామ, ముదా, ఈశ్వర, కౌ, అవ, యా, మాజే, అజేయ, నయమయ, ఆముత్, చలజే, అజే, మదిని, నారదే, మయి, తే, ముత్, దామోదర, యది, తే, అలం, దార్నిఁ.

సంస్కృతాన్వయః—

రామ=శ్రీరామస్వరూప, దామోదర=ఉదరే దామ యస్య తథోక్తః, కౌస్తుభవనమాలాకలితోదర, దానిక్=దానవక్, నయమయ=న్యాయస్వరూప, అజేయ=జేతుమయోగ్య, ఈవర=లక్ష్మీవర ని. "ఈ రిందిరా లోకమాతా మా క్షీరోదతనయా రమా" ఇత్యమర శేషః. కౌ=భూమౌ, ని. గోత్రాకుః పృథివీ పృథ్వీత్యమరః. ముదా=ప్రీత్యా, అవ=రక్ష, మా మిత్యధ్యాహారః; తే=తుభ్యం, నమ ఇతి శేషః. మాజే=మన్మథే, నలజే=పద్మసంభవే, అజే=బ్రహ్మణి, మదిని=గజేంద్రే, నారదే=నారదమునౌ, చ, తే=తవ, యా ఆసముత్=యాఽత్యన్తప్రీతి రస్తి, సాముత్=యత్తదో ర్నిత్యసంబంధాత్, తాదృగ్విధప్రీతిః, మయి, అస్తి, యది, అలం=తుష్టోభవామీ త్యర్థః. "అలంభూషణ పర్యాప్తి శక్తివారణ వాచక" మిత్యమరః.

---

# ఉద్వాసన.

—అనంతపంతుల రామలింగస్వామిగారు, పార్వతీపురము—

ఉ. నీ వాఁగి సర్వవిద్యలను నేర్చితి వంట యసత్య మంచు మాం
ద్యావశ మా భవన్ముఖమె తప్పక చెప్పకచెప్పు నెప్పుడున్
నీ విఁక వ్రాఁతలోనఁ గడునేర్పరి వంట యబద్ధ మంచు నో
దేవర ! మూఁగసైగలను దెల్పెడు నీదగు వక్రహస్తమే. 1

ఉ. నీదగు విఘ్నసంఘటన, నీమతిమాంద్యము, నీచభావమున్
నీదువికారరూపమును, నీదుఃశక్తిని, దుర్జనత్వముం,
దాఁ దిలకించి మెట్టెఁడను నవ్వుఁ గళానిధి నవ్వకున్నె లం
బోదర ! యాత్మశిక్షణము యోగ్యము కాని విరోధ మొప్పునే ? 2

మ. వరవీరోజ్జ్వలరూపుఁడున్ భయదసర్పాలంకృతుండున్, గజా
సురసంహారుఁడు నౌ మహేశుని జటాజూటంబున న్సర్వదా
తిరుగంజాలు కళానిధిన్ దఱిసి సాధింపన్ వశంబే ? మహో
దరుఁడా ! మూషికసాది ! నాగముఖుఁడా ! తత్త్వాంశు వర్జింపుమా! 3

ఉ. శూలము గొడ్డలిం గలుగుశూరుఁడ నే నని విఱ్ఱవీఁగుచుం
దూలకు మోయి ! భీరుకునిదోర్యుగమందలి కార్ముకాస్త్రశ
స్త్రాళి స్వకీయహాని కగుఁ దత్తశిమూషిక, మీవు మాదధీ
శాలివి, గుజ్జుమూర్తివి, చాలును వేయకు దంభవేషముల్. 4

ఉ అమ్ముని బాదరాయణుఁ డనూంకృతి వాపెను, కుంభజుండు క్రౌ
ర్యమ్మును మాపెఁ జంద్రుఁ డుదరంబుఁ బగల్చె విభీషణుండు మూ
ర్ధమ్మును మొత్తె, భార్గవుఁడు దంతము నూడ నడంచె మాయురే !
కుమ్మరవాఁడు కూడ వెలకుం దెగనమ్మెను ని న్వినాయకా ! 5

చ. ఘనత నటించి నీవు వెడఁగా ! యొకపాత్రము చేతఁబూని పెం
జనవున మున్నవోయి ప్రతిసద్మమునం దొలిపూజ లొంది రాఁ
గనె విను మాదిదేవుఁడవు కావు సుమా నిను విఘ్నభీతిచే
ననయము మున్న కొల్చి వెనకయ్య యటంచు హసింతు మెంచువా ! 6

మ. నవరత్నాంచితసింహపీఠికను మాన్యప్రక్రియ న్నిల్పుచున్
నవరాత్రంబులు పూజసల్పియు మహానైవేద్యముల్ గొల్పి నీ
దు వికారస్థితి కోపలేక తుది భక్తుల్ గూడ ని న్నేమహా
ర్ణవమందో, నదినో, నదంబుననో, మున్గం ద్రోతు రుద్వేగులై. 7

చ. సలలితబిల్వపత్త్రముల సాపడఁగాఁ జను బుద్ధిమాంద్య మన్
పలుకును వింటి, నేఁడు గజవక్త్రుఁడ! నిన్గని నీవు కోరుపూ
జలు గనునంత నానుడి నిజం బని నమ్మితిఁ గాకయున్న నీ
కిల నల బిల్వపత్త్రముల వే లొకో? పూవులచాలు చాలదో? 8

ఉ. ఆదిమభిక్షుకుం డయిన యాతనిపుత్త్రుఁడ వౌటఁ బేదవై
పేదల కెక్కు డాఁకలి భువిం దగు నంటకుఁ దిండిపోతవై
యేదియొ కార్య మీజగతి నేకడ నైనను మున్నుమున్న లం
బోదర! బొజ్జ నీడ్చుకొని పోయెద వక్కడకున్ హుటాహుటిన్. 9

శా. ఏదేవుండును స్వీకరింపనిది యై హేయార్చనాద్రవ్య మౌ
నాదూర్వాంకురవార మీవు కొని భిక్షాన్నార్తి నీతండ్రి స
మ్మోదమ్మొప్పఁగ నెక్కు నెద్దుకయి మోపుం గట్టి కొంపోవుటే
నీదారిద్ర్యము నీదు కక్కుఱితికిన్ నిక్కమ్ము సాక్ష్యమ్ముగన్. 10

చ. పగ లొగిఁ బిండివంటలను భక్తు లిడం దిని తిండిపోత! తృ
ప్తి గొనక రేయివేళఁ బృథివీస్థలి గన్నము వేసి భక్ష్యముల్
దగఁ గొని తెచ్చి యిచ్చుటకుఁ దత్తడిపేరునఁ గొక్కుఁ బెంచుటే
యగు నిజ, మట్లు గాక యెవఁ డైనను దేవుఁడు కొక్కు నెక్కునే? 11

చ. మును పొకపిండిబొమ్మ వయి పొల్చుటచేతను బూర్వవాసనల్
నిను విడనాడకుండుటను నీ కొకదంతము మాత్ర ముండుటన్
విను మిటు పిండివంటపయిఁ బ్రీతిని జూపెద, వీరహస్యమున్
జను లెఱుఁగంగలే రనుచు స్వప్నమునందును నెంచఁబోకుమా! 12

మ. పులితోలున్ మొలఁ జుట్టి బిచ్చమును రేపున్ మాపుఁ దా నెత్తి యే
కలిమో త్రాగి గడించె నీకుపిత బంగా ర్వెండికొండల్, మహా
చలముల్ గూడ హరించిపోవుఁ జుమ, నిచ్చల్ మెక్కి కూర్చుండుచోఁ
దెలివిం బూనుము, భుక్తికై బ్రదుకుబుద్ధి న్మాను కుక్షింభరా! 13

శా. దుర్మార్గుఁడవు గాన నీకు నెపుడున్ దూరంబుగా నుండుటే
ధర్మం బైనను భాగ్యదాతలు భవన్మాతాపితల్ మా కటం
చోర్మిం గొల్చెద, మంతె కాని, నిను మే మొక్కింత ప్రేమింప, మీ
మర్మంబుం దలపోసి సిగ్గుపడుమా, మారాటమున్ మానుమా! 14

———

# శాసనపద్యమంజరి.

## 1.

శ. స. ౧౦౪౬.

ఇది గుంటూరుజిల్లా నర్సారావుపేటతాలూకాలోని నాదెండ్లగ్రామములో నొకపొలములోఁ బడియున్న భిన్నమయిన యొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది.
(A. R. 395 of 1915.)

శా. శ్రీమద్ధర్మపరాయణులు బుధజనాశీర్వాదవంతులు దయా
ధాములు సర్వజనానురక్తు లఘవిధ్వస్తాత్ము లుద్యద్యశో
రామారాములు వైశ్యవంశులు[1] గుబేరప్రాభవులు గోమినీ
భామాధీశపదాబ్జభక్తులు జగత్ప్రఖ్యాతతేజోధికులు. ౧

ఉ. లాలితవిత్తదాన్వయలలాముఁడు పుణ్యయశోధనుఁడు మొ
క్కోలకులోత్తముఁడు పెనుంగొండవిభుఁడు ప్రభుఁడు సత్యవా
క్శీలుఁడు ధారుణిం గొసనిసెట్టికిం బ్రోలమకును సుతుఁడు ల
క్ష్మీలలనేశ్వరస్మరణసేముషి గోమనయును ముదంబుతోను. ౨

మ. ధరణీశోత్తము డైనశ్రీశకనృపాబ్దంబులు రసోదన్వదం
బరచంద్రస్థితసంఖ్య మాఘసితశుంభత్పంచమిం బార్వతీ
శ్వరు విశ్వేశ్వరు భక్తితో నిలిపి విశ్వస్తుత్యులై దేవమం
దిర మెత్తించిరి వంశవర్ధనులు (నాడి)ండ్లం జిరస్థాయిగాను. 3

1. వంశ్యులు- అని యుండవలెను.

## 2.

### శ. స. ౧౦౫౪.

ఇది గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకాలోని తూబాడుగ్రామములో వినాయకుని యాలయము గర్భగుడిసమీపమున నిల్పఁబడిన నాగశిలమీఁద చెక్కఁబడి యున్నది. (A. R. 441 of 1915.)

క. శ్రీసహితుండు దూంబటితిసు
శాసనుం డనియంకభీము చక్రము లీలా
వాసుండు సతుర్థ[1] కులగిరి
కేసరి గావండు జగజ్జిగీషుండు పేర్మిన్. ౧

చ. అడపయు నందలంబు వివిధాతపవారణకాహళావలిం
బడియము నాడిగాంగల న్రిపాలకచిహ్నలు బుద్ధవర్మచేం
బడసినవాడు నాయకసభామణి సి(ద్దప)నాయకాంకుం డి
ప్పుడమిం దదీయవీరభటపుఙ్గవుమనుమం డుదాత్తసంప్పదను. ౨

క. సేవనియు సింగనయు జగ
దేవండుం (జోడ్ల)చుం[2] జూడ దీఠక మండ
ప్త్మావలయేశ్వరుపన్పునం
బావని రఘునాథు చేతం బనివడినక్రియను. 3

శా. తన్నగ్గించుచు నెట్టిమూడణ్ణు బుధాధారుండు వస్పంగ న
మన్నే(ట)ంగనయంబుల న్రిపులకు న్నాప్పెట్టి మోడించ్చి పే
ర్కొన్న న్నణ్ణనగంధవారణసమాఖ్యుం జేసి తూంబత్తిపై
నెన్న న్వృత్తిగ నాతుకూరు దయతో నిచ్చె న్నిజస్వామియును. ౪

చ. శకసమసంఖ్య వారినిధిసాయకఖేందు మితంబుగాంగ గా
త్త్రికసితపక్షతేరసముం దీవ్రకరాము[3]నం దఖండదీ

1. చతుర్థ-అని యుండవలెను.
2. ఈయక్షరములు స్పష్టముగా లేవు.
3. దీవ్రకరాహను-అని యుండనోపు.

వకమును సీతి[1]ఖండువులు ఛాతిగ వ్రిత్తియు (చ)ంద్రసూర్యతా
రకముగ నిత్యవాద్యములు రాగముం గూడంగ నిచ్చె శూలికిని. ౫

చ. కర ముచితంబుతో నగరగాం డ్దుగం జనగాద్యయెక్క శు
స్థిరముగు నాదివారమున చిందమలాడిన నెట్టమ్డణ్ణాడిం
బరగిన యట్టి కాపనకుం బంకజలోచన (మ)ండమాంబకుం
దిరముగం బుట్టెం గాపం డవధీరితపావనినాం బ్రసిద్ధుండై. ౬

ఉ. శ్రీవెలనాంటి గోంకన్రిప శేఖరు శ్రీకరుసిద్ధిబేతవి
ద్రావణరావణాంతకపరాక్రము విక్రమచక్రి భూరితే
జోవిభవాభిరాముం డగు చోడన చక్రముం గొల్చి తత్ప్రసా
దావహలీలం దాల్చిన మహాత్ముణ్ణు గాపండు ధర్మశీలుడై. ౭

క. చిరముగం దూబజుత మహే
శ్వరునిం బ్రతిష్టించి రజతశైలము నా భా
సురముగ గుడి యెత్తించెను
గురుమతియై కాపనాయకుం డతిభక్తిని. ౮

---

### 3.

శ. స. ౧౦౬౮.

ఇది గుంటూరుమండలములో తెనాలితాలూకా వలివేరుగ్రామములో స్వయంభ్వేశ్వరస్వామి దేవాలయము నెదుట నొకఱాతిమీఁద చెక్కఁబడినది. (A. R. 676 of 1920.)

శా. శ్రీరమ్య(ండ)గు గుండ్యబోయునికి సంసిద్ధంబుగా నువ్వారను
శ్రీరామానిభదామమాంబికకు సత్సేవ్యుండు భవ్యుండు వా
ల్వారం దా నుదయించె బోయు(౧)డెటెయుండాగు ప్తజుం డాయనను
శూరత్వంబున దానశక్తినిం బ్రభను శుద్ధాత్మికను దీరికను. ౧

---

1. దీపకమునశీతి-అని యుండనోపు.

ఉ. పెట్టె నఖండదీపములు వేర్కాలతావులనెల్లం దన్నుం ౦
బట్టిన యాశ్రితులు[1] బుధులు[2] బాధులం జేకొని ప్రోచె వైరులను
మెట్టి ధరిత్రియెల్ల నిరమిత్రము సేయుగం బూనెం బేర్మితో
దట్టుండు గోంకభూపతికిం దామనపుత్రుండు సచ్చరిత్రమె యని.[3] ౨

క. జలధిరసఖేందుశకసమ
ములుగా నెఱియంను మకరమున సంక్రాంతిని
వలివేరి[4]భండారికి ని
శ్చలమతి దీపంబు నిలిపెం జంద్రార్కముగాను. 3

---

## 4.

### శ. స. ౧౦౬౬.

ఇది కృష్ణాజిల్లా దీవితాలూకా గంటసాలగ్రామములో జలాధీశ్వరస్వామి యాలయము నెదుట నున్న యొకపాలఱాతిమీఁద చెక్కఁబడినది. (A. R. 848 of 1917·)

చ. (మతలుకటం)పగా శకనసుంబులు దక్షరసాంబ రేంమన
మ్మితముగ నుత్తరాయణనిమిత్తమునం దతిభక్తిం బావ్వతీ
హితునకు ఘంటశాలజలధీశ్వరదేవర కాదిమూర్తికిం గా
నతసురచక్రవర్తికి మనఃప్రభవారికిం జంద్రమౌళికిన్. ౧

చ. ధ......... వర్ధనసుధాకరుం డెఱ్ఱమసె......
.........వనజాయతాక్షియనంగాం దగు......పుత్రుండై
తనకును దల్లిదండ్రుల......వుగాం బెనుంగొండశాసనుం
డ......గోటకొమ్మన గుణాఢ్యుం......త్రయుఁ. ౨

---

1. ఛందస్సుచే యాశ్రితుల్ అని ప్రథమాంతముగాఁ జదువవలెను. కాని యన్వయము కుదరదు.

2. బుధుల-అని యుండవలెను.

3. మైన్-అని యుండవలెను.

4. వలివేర్-అని యుండవలెను.

క. ఆపురహారునకు వలపల
డాపల శాశ్వతములై పెసగడరంగా
దీపింపంగ వేంగినకుల
దీపకుండై రెం డఖండదీపము లిచ్చెన్. 3

క. ఈగిరిశుదక్షిణోత్తర
భాగముల నహర్నిశములుం బాయక వెలుంగును
శ్రీగుణమణభూషణ...
రాగముతోం (గో)రి ధవ,.. ౪

---

## 5.

శ. స. ౧౦౬౬.

ఇది కృష్ణామండలము దీవితాలూకా గంటసాలలో జలధీశ్వరస్వామియాలయము లో నొకపాలరాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 848 of 1917.)

చ. ......దింపంగా శకసమంబులు ద్వక్షరసాంబరేందున
మ్మితముగ నుత్తరాయణనిమిత్తమున(ం) దతిభక్తిం బార్వతీ
హితునకు ఘంట్టశాలజల(ధీశ్వ)రదేవర కాదిమూర్తికిన్ కా
నతసురచక్రవర్తికి మనఃప్రభ వారికిం జంద్రమౌళికిన్. ౧౦

చ. ధనద(కులాబ్ధి)వర్ధనసుధాకరుం డెట్టమసెట్టికి...
వనజాయతాక్షి[1] యనంగా[2] దగు (పమ)...సుపుత్రుండై
తనకును దల్లిదండ్రుల(కుధర్మ్మ)వుగాం బెరుంగొండశాసనం
...............కొమ్మనగుణాఢ్య......డిత్రయిన్. ౧

క. ఆపురహారునకు(వల)పల
డాపల శాశ్వతములై పెసంగడరంగ్గా

---

1. వనజదళాయతాక్షి-అని యుండవలెను.
2. ఇచట వకారగకారములకు మైత్రికల్పింపఁబడినది, దీనిసాధుత్వము చింత్యము.

దీపింపంగ వేంగినకుల
దీపకుండై రెండు...దీపము లిచ్చెన్. 3

క. ఈగిరిశుదక్షిణోత్తర
భాగముల నహస్రకళములుం బాయక వెలుంగను
శ్రీగుణవణిభూష(ణుండ)ను
రాగముతోం గోరి ధర్మకర...... ౪

---

## 6.

### శ. స. ౧౦౮3.

ఇది శాసనపద్యమంజరి ప్రథమభాగములోని 46 వ శాసనము చివరభాగము. ఈశాసనము గుంటూరుమండలము నరసారావుపేటతాలూకా తిమ్మాపురము గ్రామము వీథిలో నొకనాగస్తంభమమీఁద చెక్కఁబడినది. (A. R. 443 of 1915.)

క. పరమపరుండైన గోంకీ
స్వరునిం బ్రతిష్ఠించి ధర్మకపరుండై లక్ష్మీ
పరుండై సాక్షమసరణయ
ధరదానము భూసురులకు దత్తము సేసెను. ౧౭

క. పరిమల............
పరగినపంచమహాశబ్ద[1] ప్రణవంబులతోం
గరమొప్ప ధూపఘుమెము
నరనయ గోంకీశ్వరునికి(శ్య)ము యిచ్చెను. ౧౮

క. యపడిల[2] దూబవాడం
గ్రమమున షణ్డీస్వరమునం గడుధన్యముగా
నమరం గోంకీస్వరునికి
విమలంబగు దీపవర్తి వెలయంగం బెట్టెను. ౧౯

---

1. పంచమహాశబ్ద-అన్నచో గణము తప్పినది.
2. ప్రాసము తప్పినది.

క. గుడియును జెఱువును వనమును
   నడరిన నల్లిండ్లుం గ్రితియు న(ల?)పెన్నిధియునుం[1]
   గొడుకులను సప్తసన్తతి
   నొడంగూడంగ నిలిపి సరసం డొప్పెం గీర్తిని. ౧౦

---

## 7.

శ. స. ౧౦౯౧.

పశ్చిమగోదావరీమండలములో పాలకొల్లుగ్రామమందు శ్రీరామేశ్వరస్వామి యాలయప్రాకారములోపల నొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. V. 162.

క. శ్రీరమణీయుండు సుజనా
   ధారుండు విబుధనుతగుణనిధానుండు విజయ
   శ్రీరమ్యమూర్తి గేతమ
   గారాపుందనూజుం డభయకరుండు వొగడ.[2] ౧

క. వెలనాంటికిం దొడ వనంగా
   వెలసినకుఱుంగడలు గలుగు నీరుండు నిజదో
   ర్బ్బలములను[3] బలిమియుం బాడియుం
   గలవాం డధికారపదవి గలవాండు మహిని. ౨

తరు. శకమహీపాలకసంవత్సరములు
   శశినిధివియదిందుసంఖ్యగాం గీర్తి
   సుకరుండు రాజేంద్రచోడనియిష్ట
   సుభటుండు వెంగ్గడయ[4] సుతుండు సూర్యార్క్షుం
   డకలంక్షుం డై నతశ్రీరారామదేవుం
   డగుశంబునకు భక్తుండై శనిభవని

---

1. పెన్నిధియుఁ-అని యుండవలెను.
2. గణము తప్పినది, కరుండువొగడంగఁ-అని-యుండనోపు.
3. ర్బ్బలమును-అని యుండవలెను.
4. వెంగ్గయ-అని యుండనోపు.

ప్రకటింప్ప న్మిష్టసప్తక మిచ్చె మొట్ట
పటితికాంపులకునుం బరగుసానులకు.

---

8.

శ. స. ౧౪౯౧, ౧౪౯3.

పై స్తంభముమీఁదనే చెక్కఁబడి యున్నది.

* * * * * *

శ్లో. శ్రీశాకేశ్వరవత్సరే విధునిధివ్యోమేందుసంఖ్యాన్వితే
కార్తిక్యాం రిపురాజభీకరశరస్సోయు న్నరేంద్రాగ్రణీః
శ్రీరారామనివాసినే భగవతే సెర్వాఁయ[1] సర్వాత్మనే
ప్రాదా దాశశితారకం గుణనిధి ర్దీపా వఖండ్గా ముదా.

క. శ్రీయుతవత్సు శ్రీవరకవి[2]
గాయకనిధి సుంద్దరాంబికసుతుండు(ను)[3]
శ్రీయుక్తుం డనంగ నెగడిన
రాయపనాయకునికాన్త రాజాస్య మహిని.

సీ. గుణనిధవియదింద్దుగణశకాబ్దంబు
లమరంగ్గ నుత్తరాయణనిమిత్త
మగుపుణ్యదినమున నబ్జాస్య నాచినా
యకునకుం జిన్నమాంబకుం దనూజ
ప్రోలమ గణికావిభూషణి భక్తిం ద
న్నేలినహరున కర్డెందుమాని[4]
కహిభూషణునకు శ్రీరారా మవరపుర
పతికి నఖండదీపంబు నిలిపె

---

1. శర్వాఁయ-అని యుండవలెను.
2. వత్సుండు వరకవి-అని యుండనోపు.
3. గణము తప్పినది.
4. కర్ధేందుమౌళి-అని యుండనోపు.

దీని జేకొని నడపంగ్గంబూనె నిందు
వెలసి యెప్పుడుం దమసానివృత్తింగా జే(ను)[1]
కంటనకు న్రగజుడు జక్కనఘనుండు
దరతరంబులు నాచంద్రతారకముగా.

---

## 9.

శ. స. ౧౦౭౦. (!)

ఇది గంజాముమండలము, పర్లాకిమిడితాలూకా ముఖలింగములో ముఖలింగేశ్వర స్వామియాలయములో, ఆస్థానమండపము, ఎడమవరుస మూడవస్తంభముమీద దక్షిణమువైపున చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 1075.)

సీ. శ్రీకరశుభకరశా(కా)[1]బ్ధములు వియ
    న్నారుతవ్యోమసోమస్తుతముగ
సితతరైకాదశి నుతభౌమదినమునం
    (గాని)[2] మాసంబునం గంసరిపుండు
(పా)లమున్నీరిలోం (బ)వ్వడించిన (తి)థిం
    బితృదేవతల కతిప్రీతిగాంగ
విశ్వేశుఁడగు మధుకేశ్వరదేవర
    (కా)చంద్రతారక మగుచు న(మ్మి)
దివ్యమగు నఖణ్డదీపంబు వెట్టె జు
ట్టేను కట్టానుంగ్గు[3] సాననికుండు
ధీయుతుండ్డు గాపినాయకుకూరిమి
తమ్ముం డెటి...యన్వితుదమ్మఁనుతుండై.[4]

---

1. వృత్తింగాను-అని యుండనోపు.
2. కానిశబ్దము శూన్య మనునర్థమందుఁ బ్రయోగింపఁబడిన దని తోఁచుచున్నది.
3. కట్టనుంగ్గు-అని యుండవలెను.
4. నుతుండు- అని యుండవలయును.

## 10.

### శ. స. ౧౦౭౧.

ఇది రాజమహేంద్రవరములోని చిత్రవస్తుప్రదర్శనశాలలోని గిడ్డంగిలోఁ బడియున్న ఱాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 40 of 1912.)

స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౦౭౧ ణ్డగు నేంటి సూర్య్యగ్రహణనిమిత్తమున శ్రీమన్మహామండలిక బొద్దనకొడుకు నారాయణదేవనిప్రధాని దత్యపెగ్గడ సోమనపట్టిసమున వీరభద్రేశ్వరమహాదేవరకు నఖండదీపమునకు నిచ్చినమోదాలు ౫౫ వీనిం జేకొని జన్నిబోయినియడపున అప్పన బోయినికొడుకు సూర్య్యబోయుండు తనపుత్రానుపౌత్రిక (ము) ఆచంద్రార్క్కము నిత్యమానెణ్డు నెయి వోయంగలవాణ్డు

సీ. భీమాపురము డాకరేమియు(న) మాడాలు<br>
గుడిపూండి యునుం బాలుకొలన వీర<br>
భద్రేశ్వరంబున భావపట్టునం దాంబ్ర<br>
పురిం బి( )పురమునం బరంగు దూబ<br>
ఘంటశాలాపురిం గొతరంబునను నే<br>
లీశ్వరంబునను వేగీశ్వరమున<br>
విజయవాటిక నుండవిల్లిని వేలుపూరం<br>
గరమొప్ప గొంటూరం గడలిపల్లి<br>
కనకవలయములును ఘనలోహపరదండ<br>
ములు నఖండదీపములునుం బెట్టి<br>
మ(ఱ)లం బెక్కుగుడ్లుం జెఱువులు గొంటూర<br>
నిలిపె మం(త్రి)మం(తి)ం(ష)భుజుండు.[1] ౧

శా. భారద్వాజపవిత్రగోత్రుం(డు) జగత్ప్రఖ్యాతిగాం బెట్టం బు<br>
ణ్యార(ం)బ్భుం డొరిగాండివల్లభుండు దత్తామాత్యసోముండు దా<br>
క్షారామప్రముఖోల్లసత్ప్రకటపంచారామతీర్థంబులన్<br>
సారాఖండదశాప్తదీపకము లాచంద్రార్క్కతారంబుగాను. ౨

1. ఈపాదము స్పష్టముగాలేదు.

## 11.

### శ. స. ౧౦౭౮.

ఇది బెజవాడలో మల్లేశ్వరస్వామి యాలయము నుత్తరద్వారమున నున్న మంటప ములో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 323 of 1919.)

సీ. శరగిరిగగనేందుసమ్మితసకరాజ
వత్సరంబులు బెజవాడ(ఏ)లు
నయనిధి బొద్దననారాయణుని ధనా
ధ్యక్షి నాగార్జునుం డతని అత్త
గంటమ నిజకులకమలినీకలహంస
గుణగణాలంకృత గోరి నిల్పె
మల్లేశ్వరునకు సామజదైత[1]చర్మాంబ
రున కద్రికన్యావరునకు లలిత
ఖండశశిధరున కఖండద్వీప[2]జ్వాల
(ఒ)నరి యొప్పి లీలం దనరి వెలుంగ
నచ్చు లిచ్చి కొ(ల్వ) నవితరభక్తి నా
చంద్రతారముగం బ్రశస్తముగను. ౧

---

## 12.

### శ. స. ౧౦౭౯.

ఇది గుంటూరుమండలము, నరసారావుపేటతాలూకా నాదెండ్లగ్రామములో మూలస్థానేశ్వరస్వామి యాలయములో ముఖమండపము కుడిప్రక్కరెక్కతలుపుమీఁద చెక్కఁబడి యున్నది. (A. R. 330 of 1919.)

క. శ్రీరమణీరమణీయా
కారమహోదారధర్మగా[3]పురవర్తికులని

---

1. దైత్య- అని యుండవలెను.
2. దీప- అని యుండవలెను.
3. గౌరవ- అని యుండవలెను,

స్తార యసం బరగు బుద్దన
సూరబుధాధార ప్రియవచోరమ్య మహిని. ౧

క. బాలేందు శేఖరునకుం గ
పాలికి శూలికి లస్తత్పద్ధికి ద్రిజగ
త్పాలి(తుం?) డగు నాదిండ్ల[1]
మూలస్థానుం డగు శంభుమూర్తికికిని[2] ౨

చ. అమితగుణాభిరామసుగుణాభరణాభరణాభిరామదా
మమవరపుత్రి సూరమ రమారమ(ణీని)యశ్రీ...దా
నమహి(మ)......మెయి[3] నెగడి నాదిండ్ల[4]...శశిమాళికి...
...............ముద మొప్ప(ంగ) నిల్పె(ం) బొల్పుగాను. 3

స్వస్తిశకవర్షంబులు ౧౦౭౫ అగు నేంటి...సంక్రాంతినిమిత్య
మున........నాదిండ్లమూలస్థానమహాదేవరకు అఖండవర్తిదీపమున
(కుం) బెట్టిన బిసుమగద్యలు వంద్రెండు.

---

## 13.

శ. స. ౧౦౭౮.

ఇది గుంటూరుమండలములో తెనాలితాలూకా పెరవలిగ్రామములో మల్లేశ్వర
స్వామిగుడి ప్రాకారములోపల నున్న యొక్క శాశిస్తంభముమీఁద నున్నది. (A. R, 664
of 1920.)

క. శ్రీరమణుఁడు శౌర్యగుణో
దారుండు గొంకవిభుమామ దర్పితరిపుసం
హారుండు ధీరుఁ డనందగు
మారయ పండండు కీర్తిమండనుఁడు మహిని. ౧

---

1. ఇచట గణము తప్పినది.
2. ఒకగణము లోపించినది.
3. మై- అని యుండవలెను.
4. నాదిడ- అని చదువవలయును గాఁబోలు.

క. అనందగు దండేశుప్రియాం
గన గొమ్మమ విబుధమిత్రగణపరివారం
బున కెల్లను బ్రహ్లాదయానం
దనకారి యనంగ నెగడె ధారుణిమిందను. ౨

క. ఘనుండు నిశుబ్రమాని కొమ్మయ
కును లీలావతియు ధైర్యగుణవతి యని పెం
పున నెగడిన మల్లాంబిక
కును సుత యనంగ బరగి[1] ధైర్యగుణసంస్తుతితోను. 3

సీ. వననిధివేష్టితావనిలోనం గలయగ్ర
హారంబులకు మణిహారలీల
మానైన పెరువలిమాధవదేవర
కెత్తించె గుడి భక్తి మె(సం)గం గొమ్మ
మాంబిక తత్సూనుం డరు(చోడ)దండేశుం
డక్షైవునకు[2] నివేద్యమున కర్తి
తో రాజితం బగు నేరడ్లచెఱ్వు నా
గ్నేయ...కు నంగడు నాయితముగం
బరగం(బాద)...ఖ్యనిరువుట్టి భూమి ర
వీందుతారకముగ నిచ్చెం దైశ
తాగ్రజన్మసమితియనుమతంబున శకా
బ్దము విభాద్రిదిగ్మితమున వెలయ. ౪

వ. గడ్వ మడి బ్రేపావ (ద) క్షీణంబునం బుట్టెండు భూమి దానిం బూజారిమాధవభట్లు దేవరకు గొసవి నివేద్యంబున కిచ్చిరి.

---

1. యనంబరగి- అని యుండవలెను.

2. దద్దేవునకు-అని యుండవలెను.

## 14.

శ. స. ౧౧౯౮.

ఇది గుంటూరుమండలము, గుంటూరుతాలూకా పాములపాడులో మల్లికార్జునస్వామి యాలయమునకెదుట నందిస్తంభమువీఁద చెక్కఁబడినది. (A. R. 124 of 1917.)

ఉ. శ్రీమహిలాభిరాముండు విశేషితకీర్తుఁడు గొమ్మ డర్థిఁ జిం
త్తామణి దల్లిదండ్రులకు ధర్మఁవుగా శివధర్మయుక్తుండై
పాములపాట నొప్పంగం గపర్దికి సజ్జనసంస్తుతంబుగా
ధీమణి వెట్టె నాత్మకుల దీపకమైన యఖణ్డదీపమును. ౧

ఉ. చారుతరాబ్ధినన్దఖ(ని)శాకరసంఖ్య శకాబ్దము ల్సనను
ధీరుండు గేతనాత్మజుండు ధీనిధి పాములపాటం గొమ్మం డి
ద్ధారుణి నామృగాంకరవితారకమై చనం బెట్టెం బెంపున
న్నేసవు యుత్తరాయణనిమిత్తమునందు శశాంకమౌళికిని. ౨

---

## 15.

శ. స. ౧౧౯౮.

ఇది గుంటూరుమండలములోని పాములపాడుగ్రామములోని మల్లికార్జునస్వామి యాలయము నెదుట నందినాగస్తంభమువీఁద చెక్కఁబడియున్నది. (A. R. 123 of 1917.)

ఉ. శ్రీజననాలయుండు బుధసేవ్యుండు వేముండు సగుణుండు మా
తాజనకద్వయంబునకు ధర్మఁవుగా శశిమౌళిధర్మిఁవై
రాజితచంద్రమౌళికిం దిరంబుగం బాములపాటం బెట్టె స
త్పూజితమై మహిన్నెగడం బొల్చుచున్న యఖణ్డదీపమును. ౧

ఉ. వారక యానిశాకరదివాకరమై చనంగా శకాబ్దములు
ధారుణి వార్ధినన్దదివితారకనాథమితంబుగా మహిని
గౌరత నుత్తరాయణము గారమై మెఱగాంక్ష పుత్రుండు
తారితదోషపుంజము విచారపరుణ్డు ధరాతలంబునను. ౨

---

## 16.

### శ. స. ౧౦౯౪.

ఇది గుంటూరుమండలము పాములపాడుగ్రామములో మల్లికార్జునస్వామి యాలయమునెదుట నందినాగస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 122 of 1917.)

ఉ. పాములపాటిమండ్డనకుం బంకరుహాసన యేసుమాంబకుం
గామనిభుండు గొమ్మన సుఖస్థితిం బుట్టి నిజాన్వవాయసు
త్రాముంను దల్లిదండ్రులకు ధర్మ్మువుగాం దనవృత్తిపై గ్రహ
గ్రామణిం బోల దీపక్క మఖండ్డితమై మహిం బర్వ్వఁయొప్పంగాను. ౧

క. సరధి[1]నిధిఖేంసుసక[2]వ
త్సరసంఖ్యలం గార్త్తిక(ము)న దవలిమపూర్న్నఁ
స్థిరగురుదినమునం గొమ్మన
యురుతరదీపంబు శివున కొప్పంగ నిల్పెను. ౨

---

## 17.

### శ. స. ౧౦౯౪.

ఇది గుంటూరుమండలము పాములపాడులో మల్లికార్జునస్వామి యాలయమునెదుట నందినాగస్తంభముమీఁద చెక్కఁబడినది. (A. R. 120 of 1917.)

ఉ. కామనిభుండ్డు భీమనకుం గామవసాన్ని[3]ం బుట్టి బంధుచిం
త్తామణి యైనకొండ్డాం డుచిత(ం)బుగం బాములపాట సజ్జన
స్తోమనుతిం బ్రదీపకము ధూర్జ్జటి కెత్తె నఖండ్డవర్తిఁ యు
ద్దామయశఃప్రకాశి దమతల్లికిం దండ్రుకి[4] ధర్మ్మువేర్పడను. ౧

---

1. శరధి- అని యుండవలెను.
2. శక- అని యుండవలెను.
3. సానికిం- అని యుండవలెను.
4. దండ్రికి- అని యుండవలెను.

క. జలధినవాంబరశశిసం
ఖ్యలసకు[1] నేండ్లు[2] గార్తికము పున్నమను
జ్వలగురుదినమునం గొణ్డా
డలఘుంపు దీపంబు నిల్పె హారునకు వేడ్కను.                    ౨

---

## 18.

శ. స. ౧౦౯౪.

ఇది గుంటూరుమండలములో పాములపాడుగ్రామమందు మల్లికార్జునస్వామి యాలయము నెదుట సందినాగ స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 121 of 1917.)

చ. విరచితకీర్తిలోలుం డగువెన్నపరడ్డికిం బ్రోలసానికి
న్వరసుతుండైన బొల్లన ధ్రువంబుగం బాములపాటం బార్వతీ
శ్వరున కఖణ్డదీపకము సంద్రుండు సూర్యుండుం గలునంతాకా
దరణ వెలుంగ్గం బెట్టెం దనతల్లికి దండ్రికి ధర్మ్మ వేడ్కడను. ౧

క. గతినిధిఖేందుశకాబ్ద
ప్రతతిం గార్తికము శుక్లపంచాదశి గో
పతిదినమున బొల్ల[3]
ణ్ణతులితదీపంబు నిల్పె హారునకు వేడ్కను.                    ౨

---

## 19.

శ. స. ౧౧౧ .

ఇది పశ్చిమగోదావరిమండలములో, ఏలూరుతాలూకా తడికలపూఁడిలో గాంగేయేశ్వరస్వామియాలయము కళ్యాణమండపములో నొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 202.)

సీ. శ్రీశకవత్సరశ్రీశధరా(తళ)
శశిధరమితము(గాం)చైత్ర(బ)హుళ

---

1. శకు- అని యుండవలెను.
2. ఇచట గణము తప్పినది.
3. గణము తప్పినది.

(ప)త్రుశ్రీతీయ్యయు మేషసంక్రాంతినిమిత్తము(నం) పేరబలంజ్య
ధర్మైక నిర(తుం)డు దాచ(నై)తమసెట్టి కబ్జాతనేత్రి గేతమాంబికకు
నుం బ్రీతితనూజుండు మహితగుణాఢ్యుండు మల్లిసెట్టి
భక్తిబె(ట్టె) నాండుం బల్లిహ(హస)వకు నఖండదీప మాదరముగనే
యిరువ(ది)ను మొదవులుం బ్రసిద్ధిగాంగ.

ఈపద్యమందు తప్పులు మెండుగా నున్నవి.

---

## 20.

### శ. స. ౧౧౧౨.

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరులో వసీదు స్తంభముమీఁద చెక్కఁ బడినది. (South Indian Inscriptions Vol. V. No. 184.)

క. తరణిశిఖశకసమఁబు(ల
స)రసి[1] సోమేశ్వరునకు సంధ్యదీప[2]
లిరుసంధ్యలం జనం గ్గాటయ
వరపుత్రుం డమాత్యయత్తి(వర)ంగం బెట్టెను.

---

## 21.

### శ. స. ౧౧౨౧.

ఇది పశ్చిమగోదావరీమండలమున ఏలూరువసీదులో నొక స్తంభముమీఁద చెక్కఁ బడి యున్నది. (South Indian Inscriptions Vol. V. No. 189.)

చ. గురుమతి మంత్రి శ్రీధరునకుం గ్గొసనాంబకు నందనుండు సు
స్థితుండగు[3] భీమశౌరి సరసీపురి(నొ)ప్పిన సోమనాథదే
వరకు నఖణ్డదీపము ధ్రువంబుగ నేర్పఁడంబెట్టె రోహిణీ
శ్వరకరకైరవాప్తశశిసంఖ్యశకాబ్దము లువ్విఁడం బవ్వఁడంగాను.

---

1. సరసీ- అని యుండనోపు.
2. సంధ్యాదీపం- అని యుండవలెను.
3. స్థిరుండగు- అని యుండవలెను.

## 22.

### శ. స. ౧౧౧౮. (?)

ఇది పశ్చిమగోదావరీమండలములోని ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 186.)

సీ. శ్రీశుభశకదరదిశవస్సరములు[1]
వేదత్రి(లో)చనరుంద్ర[2]సక్య[3]
వెలయంగ వైశఖ విమలసప్తమియును
సోమవాసరమున సుస్తిరముంగ
కొలని కేశవదే(వు)కొలికి[4] సుభటండు(ఎ)న[5]
పోతి కేతనల[6]ప్రీతితమ్ముం
డిహలోకమున సుఖ వింతియ[7]సాలు వొ
మ్మని తల్లిదండ్రిని సత్లం[8]దలంచి
మదనసద్రిశుండు (కా)వన దివియప్రోలం[9]
డమరపురమున కర్తితో నరుగుచుండి
కొలనిసోమేస్వరునకును సలలితముంగా
సంధ్యదీపంబు వెటించ్చె సస్వతముంగ.
వరనాలుగు సిదెడసెట్టగోత్రవిలసద్దిరుద్రసఖ్యల సురచితముగసరసీపు
(అసంపూర్ణము.)

---

1. ధరాధీశవత్సరములు- అని యుండవలెను.
2. రుంద్రశబ్దమిచ్చటకుకుదరదు. ఒకటి యనునర్థమిచ్చు 'వేఁటో' కళబ్ద ముండవలయును.
3. సంఖ్య- అని యుండవలెను.
4. కలికి- అని యుండనోపు.
5. భటుండెన ,,
6. కేతనలకు- ,,
7. మింతియ- ,,
8. సల్ల- అని యుండవలయునేమో.
9. ఈపాదమందు ఛందోభంగము కలిగినది.

## 23.

### శ. స. ౧౧౧౮.

ఇది పశ్చిమగోదావరీమండలమందు పాలకొల్లుగ్రామములో శ్రీరామేశ్వరస్వామియాలయములో నొకరాతిస్తంభముమీఁద చెక్కఁబడినది. (South Indian Inscriptions Vol. V. No. 173)

క. మనుశివ(వత్సర)సంఖ్యం బయో[1]
జిని శ్రీసోమేశ్వరునకు శ్రీదుగ్గికిం చే
కొని రెణ్డుసంధ్యదీపము
లొనరంగ భణ్డారుపుకొమరం డొగిం బెట్టె దగను.

---

## 24.

### శ. స. ౧౧౨౩.

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది- (South Indian Inscriptions Vol. V. No. 185)

చ. పురకర కైరవాప్తశశిభూరిశకాబ్దము లొప్ప శాంజ్ఞికిని
సరసిపురంబులో నిలిపె సంద్దియ[2]దీపము వెన్నిసెట్టికిం
దారుణియ ఘంట్టసాలపురి దారమకును[3]ఫలమొద్ద వీకిని
వరసుత మైనవాసమ ధ్రువంబుగ నాశశితారకంబుగాను.

ఈసంధ్య దీపము సేకొని కన్నమపణ్డితులు నామనయు రెణ్డు సంధ్యల నడపంగ్గలవారు.

---

1. గణము తప్పినది- వత్సరశబ్దమునకు బదులుగా మిత యని యుండిన సరిపోవును.
2. సంద్దియ- అని యుండవలెను.
3. దారమకున్- అని చదువవలెను.

## 25.

శ. స. ౧౧౨3.

ఇది పశ్చిమగోదావరీమండలము ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడినది- (South Indian Inscriptions Vol. V. No. 179)

చ. పరగంగమ్మ[1] వైశ్యనిధి భట్టిపురేసుఁడు ప్రోలిసెట్టి కం
బురుహదళాక్షి ప్రోలమసు[2] పుత్రుఁడు యాయ్తమసెట్టి పెట్టె శ్రీ
సరసిపురంబు క్రిష్ణునకు సంధ్దియ[3] దీపము శాశ్వతంబుగాం
బురకర కైరవాప్తశశిభూ౽శకద్బము[4] లుర్విఁ బవర్వఁగాను.

దీని సేకొని కన్నమపండితు నమనపండి(తు)లు నడపంగ్గలవరు.

## 26.

శ. స. ౧౧౨౮.

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- (South Indian Inscriptions Vol. V. No. 183)

చ. చిరముగ ఘంటసాల మొలసెట్లపుగోత్రము వెన్నిసెట్టికిని
సరసిజనేత్రి దారమకు సత్సుత వాసమ వెట్టెం బద్మినీ
పురమున సోమనాథున కపూర్వముగా నియసంధ్యదీప మా
సరసిజగర్భవక్త్ర కరచంద్రశశాంకశకాబ్దసంఖ్యలను.

## 27.

శ. స. ౧౧3౧.

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- (South Indian Inscriptions Vol. V. No. 177)

సీ. శశిరామరుద్రశకసమములం గేశవ
మం(డ్డ)లేశ్వరుబంటు మహిమ వెలయ

---

1 ఇంకొకగకార ముండవలయును.

2. 'సు'కు బదులుగా 'కు' ఉండిన బాగుగానుండును.

3. సంద్దియ- అని యుండనోపు. ఈపదము సంధ్యాశబ్దభవ మని గ్రహించునది.

4. శకాబ్దము- అని యుండవలెను.

చం(ది)రు[1]దేవణ్డు దండ్డెమాంబికకును
శ్రీయుతు డ్డెబ్బమనాయకునికిం
గారికి[2]పుత్రుణ్డు గొమరుగాం దనభార్య్యా
ముప్పమకును ధర్మ్ముగా నొప్పచుణ్డ
సంద్ధియ[3]దీపంబు శాశ్వతంబుగం బెట్టెం
గొలనిసోమేశున కెలమి వెలుంగం
చెలువుగాంగ దీనిం జేకొని కన్నన
పండితుండు నడపుచుణ్డువారు
బెడంగుగా నాచంద్ర[4]
తారకముగ నెల్లవారుం బొగడ.

---

## 28.

శ. స. ౧౧౩౧. (?)

ఇది గంజాముమండలము శ్రీకాకుళముతాలూకా శ్రీకూర్మములో కూర్మేశ్వర స్వామియాలయము ఉగ్రాణపుగది కుడిప్రక్క స్తంభముమీఁద చెక్కఁబడి యున్నది.
(South Indian Inscriptions Vol. V. No. 1256)

సీ. గగణగుణాత్మేంద్దుగణనశకాబ్దము
లు[5] సనం చైత్ర[6]సితషష్టిశశిదినమున
నఖిలసురాసురేంద్రానర్ఘ్య(ము)కుటాగ్ర
సద్రత్నరంజ్జిత(చ)రణుం డైన

---

1. చందిరు అన్నచో ఛందోభంగ మయినది- సరియైనపేరు తెలియదు.
2. గూరిమి- అని యుండనోపు.
3. సంద్దియ- ,, ,, ఇది సంధ్యాశబ్దభవము.
4. ఈపాదములోఁ గొంతభాగము లుప్త మయినది.
5 ల్- అని యుండవలయును.
6. సనంజైత్ర- అని యుండవలయును.

